

# శ్రీ గురు గీతా

వ్యాఖ్యాత :

పండిత శ్రీశివచరణముగారు

(శ్రీనిర్విశేషానందగిరి స్వామి)


ప్రకాశకులు :

శ్రీవ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము-పోస్టు,(వయా) ఏర్పేడు

చిత్తూరు (జిల్లా), (ఆం.ప్ర). పిన్ :517 621

ఫోన్ :68528

1957 సం॥ మొదటికూర్పు 2000 ప్రతులు
1971 సం॥ రెండవకూర్పు 2000 ప్రతులు
1988 సం॥ మూడవకూర్పు 2000 ప్రతులు
1995 సం॥ నాల్గవ కూర్పు 2000 ప్రతులు
2001 సం॥ ఐదవ కూర్పు 1000 ప్రతులు
2003 సం॥ ఆరవ కూర్పు 2000 ప్రతులు

వెల : రూ. 60.00



*ప్రకాశకులు :*

శ్రీ వ్యాసాశ్రమము వారు

*వలయువారు :*

మేనేజరు, శ్రీవ్యాసాశ్రమము,

వ్యాసాశ్రమము పోస్టు, (వయా) ఏర్పేడు,

చిత్తూరు జిల్లా, (ఆంధ్రప్రదేశ్), పిన్: 617 621

ఫోన్ నెం: 08578-68528,

*ముద్రణ :*

శ్రీ పారాశర్య ప్రెస్,

శ్రీ వ్యాసాశ్రమం-ఏర్పేడు.

## విషయసూచిక





లేదు. అందుచే దీనికి పదచ్ఛేద టీకా తాత్పర్యములు విపులముగా వ్రాసినచో ముముక్షుజనుల కెంతగనో యుపకార ముండునని తలంచి తిరుగా వ్యాఖ్యానము చేయబడినది.

ఇక నీగ్రంథమును వ్రాయు కారణ మేమనగా, మాకు పరమ మిత్రులును, నిరాడంబర జీవులును, కేవల భక్తిజ్ఞానవైరాగ్య సముపేతులు నగు శ్రీసాధు బుచ్చిలింగముగారు 'నాకు శ్రీగురుగీతా శాస్త్రమును నాంధ్రీకరింప జేయ వలయునని సంకల్పము గలిగిన' దని నాతో తెలిపిరి. తదుపరి "శ్రీసద్గురు స్వాములవారి యనుమతి లేక ఇట్టి కార్యములను జేయఁజాలము. సకల శుభములకు శ్రీసద్గురు దేవుని యనుగ్రహమే పరమకారణ"మని తలంచి నేనును వారును శ్రీవారిని ప్రార్థించితిమి. శ్రీసద్గురుస్వాములవారును మాకు నిట్టి పవిత్ర సంకల్పముండియే యున్నదని బిడ్డలగు మాయొక్క ప్రార్థన లంగీకరించి మమ్మనుగ్రహించి యీ పవిత్రకార్యములో ప్రవేశింపఁజేసి కృతార్థులనుగ జేసిరి.

నేను శ్రీ సద్గురు స్వాములవారిని గురించి తెలియపరచవలసిన విషయ మేమియు లేదు. గగనమధ్యమున భాస్కరుడు భాస్వద్దీప్తులతో ప్రకాశించుచుండగా నెఱిగింపవలసిన విషయమేమి యున్నది? అట్లే సర్వదయామయుడై శ్రీ హరిహర స్వరూపుడై అజ్ఞాన తమఃపటల భాస్కరుడై అఖండ విజ్ఞానమయూఖములతో సర్వలోకహితార్థమై శ్రీ సద్గురు మలయాళమహర్షి సత్తములు విరాజిల్లుచున్నారు. ఈవిషయ మంతయు లోకవిదిత మనుటయు పునరుక్తి యగుచున్నది. అవాఙ్మానసగోచర పరబ్రహ్మ స్వరూపులగు శ్రీగురుదేవుని నిర్ణయింప వేదములే సమర్థములు గావనిన, తదితరుల విషయమును జెప్పవలయునా? అయినను వారి వారి యాత్మశుద్ధికై ఆనందప్రాప్తికై శ్రీగురుస్తుతిని జేయుచున్నారు, నమస్కరించుచున్నారు, ధ్యానించుచున్నారు. అంతమాత్రమేకాని శ్రీగురు స్వరూపమును దెలియుట పూర్తియగుట లేదు. శ్రీగురుదేవుని అపారకరుణచే నాతత్త్వము తానైనప్పుడే విజ్ఞాన ముదయించి సర్వసంశయము లుడుగుచున్నవి. కావున నిట్టి శ్రీగురుతత్త్వమునే యీ గీతాశాస్త్రము ప్రతిపాదించుచున్నది.

మఱియు శ్రీసాధు బుచ్చిలింగముగారు శ్రీ సద్గురుస్వాములకడ నుపదేశము గ్రహించి శిష్యులై శ్రీవ్యాసాశ్రమములో కొంతకాలముండి ఆశ్రమసేవను జేసినవారు. ఇకను కోలారు జిల్లా ముడియనూరు సీతారామ ఆరోగ్యాశ్రమ నిర్మాతలు వేదాంత బోధకులు నగు శ్రీ శ్యామయ్యగారికిని సేవ జేసి వారిద్వారా వేదాంతశ్రవణము గావించి పునీతులై మనన నిదిధ్యాసములను గావించిన ధన్యాత్ములు.

ఇంతయేల! శ్రీసద్గురు కృపాకటాక్షముచేతనే సకలము సిద్ధించుచున్నది. వేరుగా జెప్ప నవసరము లేదు. త్రిమూర్తులును శ్రీసద్గురు దేవుని కటాక్షమునకై నిరంతరము నిరీక్షించుచుండగా తదితరుల విషయమును జెప్పుట పిష్టపేషణ మగును. శ్రీసద్గురు స్వాములవారి నేమని గొనియాడగలము! ఈ భౌతిక జీవనమును, కేవలాత్మజ్ఞానప్రాప్తిని, పరాపరవిద్యలను శ్రీ సద్గురు పరమాత్మ దేవులే ప్రత్యక్షముగ నిచ్చుచున్నారు. కావున శ్రీసద్గురుమూర్తి యొక్క కృపాసార మపారము, సర్వజనోద్ధరణదక్షము.

**బ్రహ్మాత్మగం ప్రణవబోధవిచారశీలం**
**నిత్యాత్మతత్త్వమునిసేవ్యమఖండభావమ్ ।**
**ప్రజ్ఞాన నేత్రదమనుత్తమభక్తరాశేః**
**మల్యాళమౌనివరమాత్మని చిన్తయేఽహమ్ ॥**

**శ్రీసద్గురుచరణారవిన్దార్పణమస్తు**
**ఓం శాంతిః శాంతిః శాంతిః**

ఇట్లు
శ్రీ సద్గురు పాదకమల రజోరేణువు,

**శివచరణము ,**
సాహిత్య శిరోమణి, సాహిత్య సుధాకరః.

శ్రీ గురుశ్శరణమ్

## చతుర్థముద్రణ

**గురుభక్తి ప్రపూర్ణాయ గురుతత్త్వార్థ వేదినే ।**
**నమశ్శ్రీగురుదేవాయ గురుబోధానుసారిణే ॥**

పరిశుద్ధ జ్ఞానస్వరూపులగు ఆత్మసోదరీ సోదరులారా!

లోకమున ప్రతిప్రాణియు "సుఖం మే భూయాత్-దుఃఖం మే న స్యాత్" 'నాకు సుఖము కావాలి. దుఃఖ మక్కఱ లేద'ని కోరుకొనును. కాని యేది దుఃఖమో, యేది సుఖమో, దేనివలన దుఃఖము తొలగి సుఖము లభించునో ఆ మార్గమును గుర్తించుట లేదు. జనన మరణ రూపమగు సంసారమే దుఃఖములలోకెల్ల మహా దుఃఖమని శాస్త్రములు వర్ణించుచున్నవి. ఇట్టి మహాదుఃఖము తొలగవలయు నన్న అద్వైతాత్మజ్ఞాన మావశ్యకము.

అట్టి ఆత్మజ్ఞానము శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులగు సద్గురువు ద్వారానే లభ్యమగును. కాన శ్రుతి 'తద్విజ్ఞానార్థం స గురుమే వాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం' ఆత్మతత్త్వజిజ్ఞాసగల సాధకుడు సమిత్పాణియై శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన అనగా సకల శాస్త్రజ్ఞానముతో బాటు ఆత్మానుభవము గల సద్గురువునే ఆశ్రయింపవలయునని నొక్కి చెప్పుచున్నది. శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడైన సద్గురువుయొక్క అనుగ్రహముచే దప్ప ఆత్మజ్ఞాన ప్రాప్తి మఱియే ఉపాయాం తరముచేతను సిద్ధింపదు. ఆత్మజ్ఞానము గలుగనిదే ఆత్యంతిక దుఃఖనివృత్తి, నిత్యనిరతిశయానంద ప్రాప్తిరూప మోక్షము సిద్ధింపదు.

**తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥**

అని శ్రీ భగవద్గీతగూడ నీ విషయమునే ఉద్ఘోషించుచున్నది. కాన సద్గురు శరణాగతియే మోక్షమునకు మూలమని తేలినది. గురుపరాఙ్ముఖులకు ముక్తి దుర్లభము.

**తాపసా అపి నో ముక్తా గురుతత్త్వాత్పరాఙ్ముఖాః ।"** మఱియు
**"దుర్లభా చిత్తవిశ్రాన్తిః వినా గురుకృపాం పరామ్ ॥**

గుర్వనుగ్రహము లేనిదే చిత్తవిశ్రాన్తి అనగా సంకల్ప రాహిత్యము, ఆత్మశాన్తి లభించుట దుర్లభమని చెప్పబడినది. ఈ విధముగా విశేషించి ఆధ్యాత్మిక మార్గమున గురువుయొక్క ఆశ్రయ మత్యావశ్యకమని శ్రుతిస్మృతులు వేనోళ్ళ ఉద్ఘోషించుచున్నవి. అట్టి సద్గురువుయొక్క మహిమనుగుఱించి ఈ 'గురుగీత' విపులముగా బోధించుచున్నది. గురుశిష్యుల లక్షణములు, గురుకృపామహిమ, గురుభక్తి ప్రభావము మొదలగు విషయములు ఈ గురుగీతయందు విపులముగా వర్ణింపబడినవి. గురుభక్తులు అవశ్యము పఠింపదగిన గ్రంథమిది.

ఇయ్యది స్కాందపురాణాంతర్గతము. పరమేశ్వరుడు పార్వతీ దేవికి గురుతత్త్వ ప్రభావమును, గురుభక్తి విధానమును గూర్చి యిందు విపులముగా బోధించెను. సామాన్యజనులు సయితము గురుమహిమను దెలుసుకొనుటకు వీలుగా శ్రీగురుదేవులు అనుగ్రహించి గురుగీతను పదవిభాగ ప్రతిపదార్థ తాత్పర్యములతో శ్రీ పండిత శివచరణంగారి ద్వారా వ్రాయించి ప్రకటించిరి. 1957 సం॥న ప్రథమ ముద్రణయు 1971 సం॥న ద్వితీయ ముద్రణయు, 1988 సం॥న తృతీయ ముద్రణయు గావింపబడినది. కాని త్వరలోనే ఆ ప్రతులు సమాప్తముకాగా చాలాకాలము నుంచి భక్తులు గురుగీతకై నిరీక్షించుచున్నారు. శ్రీగురుదేవుని దివ్యానుగ్రహముతో తదమోఘ సంకల్పముతో నేటికి చతుర్థ సంస్కరణమును భక్తుల కందిచ్చు సదవకాశము లభించినది. గురుభక్తులు దీనిని భక్తితో పఠించి గురుమహిమను గ్రహించి, గురుకృపను పొందుటకై ప్రయత్నించి, నిజగురుభక్తులై గుర్వనుగ్రహప్రాప్తిచే నిత్యనిరతిశయ బ్రహ్మానందము నను భవింతురుగాక!

**"గురోః ప్రసాదాదన్యత్ర నాస్తి సుఖం మహీతలే"**

యువచైత్ర శుద్ధ ఏకాదశి, ఓమ్ జయ్‌గురుదేవ్
11-04-1995. **శ్రీ విద్యానన్దగిరిస్వామి**

# ఐదవముద్రణ పీఠిక

ఆధ్యాత్మిక సంప్రదాయంలో గల గురుస్థానం చాలా ముఖ్యమైనది. "వేదస్యాధ్యయనం సర్వం గుర్వధ్యయన పూర్వకం" అన్నట్లు అనాదినుండి వేదోపనిషదాదుల పఠనమంతయు గురుపరంపర ననుసరించియే జరుగుచుండెడిది. "ఆచార్యవాన్ పురుషో వేద" అని వేదవచనము. ఆచార్యుడు గల పురుషుడే ఆత్మతత్త్వము నెరుంగగలడని భావం.

అట్టి గురువుయొక్క మహిమను చెప్పు గ్రంథాలలో గురుగీతదే ప్రథమ స్థానం. పార్వతిని ఉద్దేశించి శివుడు గురువుయొక్క గొప్పతనమును ఈ గ్రంథమున వర్ణించియున్నాడు.

శ్రీ మలయాళసద్గురు శిష్యులలో ముఖ్యులైన శ్రీ శివచరణముగారు ఈ గీతకు వ్యాఖ్యానం రచించారు. వివేకచూడామణి, శంకరవిజయాది గ్రంథములకు కూడా వీరు రచించిన వ్యాఖ్యలు శ్రీవ్యాసాశ్రమ ప్రచురణలలో ప్రసిద్ధాలు.

ఈ గురుగీత 1957, 1971, 1988, 1995 సం॥లలో ప్రథమ, ద్వితీయ, తృతీయ, చతుర్థ ముద్రణ లందుకొన్నది. సముచితమైన సవరణలతో ఇప్పుడు ఈ పంచమ ముద్రణ ప్రకటించడమైనది. ఎప్పటిలాగానే భక్తులు ఈ గ్రంథాన్ని ఆదరించి శ్రీ సద్గురు కృపకు పాత్రులు కాగలరని విశ్వసిస్తున్నాము.

శ్రీవ్యాసాశ్రమము,
10-06-2001.

ఇట్లు
ప్రకాశకులు

ఓమ్

శ్రీ దక్షిణామూర్తిపరబ్రహ్మణే నమః

# శ్రీ దక్షిణామూర్తిస్తోత్రమ్

**మందస్మిత స్ఫురితముగ్ధముఖారవిందం**
**కందర్పకోటిశతసుందరదివ్యమూర్తిమ్ ।**
**ఆతామ్రకోమలజటాఘటితేందురేఖం**
**ఆలోకయే వటతటీనిలయం దయాళుమ్ ॥** 1

శ్రీ దక్షిణామూర్తి ధ్యానము॥ సుప్రసన్నుడై భక్తుల సంసారార్తిని బాపి రక్షింప, సంతోషమును గలుగజేయ, వారియొక్క అజ్ఞానతమమును దూరీకరింప, దరహాసచంద్రికలతో నొప్పుచు చిరునవ్వు మొగము గలవాడును, సర్వదా ప్రకాశించు మనోహరమగు వదనకమలముతో నొప్పువాడును, పరమశాంతియుత ఆనందజనక ముఖము గలవాడును, నూరుకోట్ల మన్మథులవలె దేదీప్యమానమగు దివ్యాకారమును ధరించినవాడును, అనంతమగు తేజోనిధియు, అంతట నెఱ్ఱనయిన జడలయందు మిగుల కోమలమగు చంద్రరేఖను జేర్చి ధరించిన వాడును అనగా వీతరాగులయిన, జటాధారులయిన మహామునీశ్వరులకు జ్ఞాన చంద్రికల నొసంగ, అమృతత్త్వమును గలుగజేయు, జటాఘటితేందురేఖను ధరించిన వాడును, పరమదయాళువై సనకాది మహర్షుల నుద్ధరింప సమకట్టి వైరాగ్యతేజోమూర్తియై వటవృక్షముక్రింద నాసీనుడై జ్ఞానతేజోమూర్తియై యున్న శ్రీదక్షిణామూర్తిని సాక్షాత్కరించుచున్నాను; ధ్యానించుచున్నాను.

**వటవిటపిసమీపే భూమిభాగే నిషణ్ణం**
**సకలమునిజనానాం జ్ఞానదాతారమారాత్ ।**
**త్రిభువనగురుమీశం దక్షిణామూర్తిదేవం**
**జననమరణదుఃఖచ్ఛేదదక్షం నమామి ॥** 2

మహావటవృక్షము క్రింద భూభాగముననే గూర్చున్న వాడును, తన నాశ్రయించిన సనకాది మహామునులకు సమీపములో నుండి జీవబ్రహ్మైక్య జ్ఞానము నొసంగువాడును, మూడు లోకములకును గురువైనవాడును, స్మరించినంత మాత్రమున సకల ప్రాణికోట్లయొక్క జనన మరణరూప సంసారదుఃఖముల నన్నింటిని పూర్తిగా ఛేదింప సమర్థు డయినవాడు నయిన శ్రీదక్షిణామూర్తి దేవుని నమస్కరించుచున్నాను.

**చిత్రం వటతరోర్మూలే వృద్ధాః శిష్యా గురుర్యువా ।**
**గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్నసంశయాః ॥ 3**

వృద్ధులయిన సనకాది మహర్షులు శిష్యులు, గురువగు శ్రీదక్షిణామూర్తి యువకుడు, శ్రీగురుదేవుడు మౌనమును ధరించి జ్ఞానముద్రయగు చిన్ముద్రను ధరించియున్నాడు. మౌనమే వ్యాఖ్యానరూపముగ నున్నది. అనగా జీవబ్రహ్మాభేద రహస్యమును తెలుపుచున్నది. జీవబ్రహ్మాభేదమునందు సంశయనివృత్తికై చనుదెంచిన సనకాది మహర్షు లయిన శిష్యులు సర్వసంశయములును నశించినవారై ఏకతత్త్వమున నున్న వారయిరి. ఇట్లు సర్వవిలక్షణములగు మౌన,చిన్ముద్రా, సర్వసంశయచ్ఛేదాది ధర్మములచే మిగుల ఆశ్చర్యమును గలుగజేయుచు మహావిరక్తుడై సర్వదృశ్య రహితుడై సాక్షాచ్ఛివ స్వరూపుడై వటవృక్షము నాశ్రయించి ఆసీనుడై యున్న శ్రీదక్షిణామూర్తిని నేను నిరంతరము ధ్యానించుచున్నాను.

**మౌనవ్యాఖ్యాప్రకటితపరబ్రహ్మతత్త్వం యువానం**
**వర్షిష్ఠాంతే వసదృషిగణై రావృతం బ్రహ్మనిష్ఠైః ।**
**ఆచార్యేంద్రం కరకలితచిన్ముద్రమానందమూర్తిం**
**స్వాత్మారామం ముదితవదనం దక్షిణామూర్తిమీడే ॥ 4**

తాను చిన్నవాడై, వృద్ధులును బ్రహ్మనిష్ఠులును అగు శిష్యభూతులైన ఋషుల సంఘముచేత పరివేష్టింపబడి వారికి మౌనమాత్రముచేతనే పరబ్రహ్మ తత్త్వము నుపదేశించు చున్నవాడును, దక్షిణహస్తమునందు తర్జన్యంగుష్ఠసంయోగ

రూపమైన చిన్ముద్రను ధరించినవాడును, ఆనందమూర్తియు, స్వాత్మానందము ననుభవించువాడును, ప్రసన్నమయిన ముఖము గలవాడును, ఆచార్యులలో శ్రేష్ఠుడును అగు దక్షిణామూర్తిని స్తోత్రము చేయుచున్నాను.

**విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాన్తర్గతం**
**పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా ।**
**యస్సాక్షాత్కురుతే ప్రబోధసమయే స్వాత్మానమేవాద్వయం**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 5**

ఆకాశాది పంచభూతాత్మకమును, స్థావరజంగమాత్మకమును అగు ఈ ప్రపంచ మంతయు అద్దమునందు ప్రతిబింబించిన పట్టణమువలె ఆత్మయందే కనబడుచుండును. మరల మాయచేత ఈ ప్రపంచము వెలుపల నున్నదానివలె గనబడును. నిద్రయందు సంస్కారాది సహవాసముచేత కల్పింపబడిన స్వప్న ప్రపంచమువలె ప్రపంచము సైతము కల్పింపబడినది గాన వాస్తవము కాదు. గురూపదేశముచేత జ్ఞానోత్పత్తి కలిగిన సమయమునందు మరల భేదము లేని ఆత్మనుమాత్రమే తెలిసికొని తత్సుఖ మనుభవించుచున్నాడు. అట్టి గురుస్వరూపుడగు శ్రీదక్షిణామూర్తికి నా నమస్కారము అగుగాక !

**బీజస్యాన్తరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః**
**మాయాకల్పితదేశకాలకలనావైచిత్ర్యచిత్రీకృతమ్ ।**
**మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యస్స్వేచ్ఛయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 6**

ఈ ప్రపంచము ఉత్పత్తికంటె ముందు, బీజమునందు అంకురము, పల్లవము, పత్రము, పుష్పము మున్నగు వానివలె భేదమేమియు లేక నిర్వికల్పముగ నుండెను. పిమ్మట మాయచేత కల్పింపబడిన దేశకాలాదుల సంబంధము వలన నానావిధ నామరూపాది భేదములతో గనబడుచున్నది. ఐంద్రజాలికుడును యోగసిద్ధి గలవాడును స్వేచ్ఛగా స్వసంకల్పమాత్రముచేతనే నామరూపాదికము గల క్రొత్తక్రొత్త వస్తువులను సృజించినటుల పరమాత్మయు స్వసంకల్ప మాత్రము

చేతనే ఈ ప్రపంచమును విజృంభింప జేయుచున్నాడు. అట్టి పరమాత్మ స్వరూపు డయినను భక్తులకు జ్ఞానోపదేశమును చేయుటకుగాను దక్షిణామూర్తియై అవతరించి జ్ఞానోపదేశముచేత గురుమూర్తి యైనవానికి నా నమస్కారము చెందుగాక!

**యస్యైవ స్ఫురణం సదాత్మకమసత్కల్పార్థగం భాసతే**
**సాక్షాత్తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్ ।**
**యత్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిర్భవాంభోనిధౌ**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 7**

ఏ పరమేశ్వరుని సద్రూప మయిన చైతన్యమే అసద్రూపములగు నాకాశాది భూతములవలె ప్రకాశించుచున్నదో, ఎవడు తన భక్తులకు "తత్త్వమసి" మున్నగు మహావాక్యములచేత అపరోక్షముగా తత్త్వము నుపదేశించుచున్నాడో, ఎవని సాక్షాత్స్వరూపము నెఱింగినవానికి జనన మరణ రూపమగు సంసారయాత్ర కలుగదో అట్టి భక్తులకు జ్ఞానము నుపదేశించుటకు గురుమూర్తిగా అవతరించిన దక్షిణామూర్తికి నమస్కారము.

**నానాచ్ఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం**
**జ్ఞానం యస్య తు చక్షురాదికరణద్వారా బహిస్స్పందతే ।**
**జానామీతి యమేవ భాన్తమనుభాత్యేతత్సమస్తం జగత్**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 8**

చిన్న చిన్న రంధ్రము లనేకములు గల ఒక కుండయందుంచిన దీపము యొక్క కాంతివలె నేత్రములు, చెవులు, ముక్కు మున్నగు అనేకేంద్రియములు గల ఈదేహమునందు చైతన్యస్వరూపుడగు ఏపరమాత్మయొక్క చైతన్యశక్తి, అంతట నిండి నేత్రములు మున్నగు వానినుండి బయట వ్యాపించుచున్నదో, 'తెలియుచున్నాను' అను జ్ఞానమునకు ఎవడు విషయమో, అట్టి ప్రకాశస్వరూపుని అనుసరించియే యీ ప్రపంచమంతయు ప్రకాశిత మగుచున్నదో అట్టి ప్రకాశస్వరూపుడైన జ్ఞానము నుపదేశించుటకుగాను గురుమూర్తియై అవతరించిన

దక్షిణామూర్తికి నా నమస్కారమగుగాక!

**దేహం ప్రాణమపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః**
**స్త్రీబాలాంధజడోపమా స్త్వహమితి భ్రాన్తా భృశం వాదినః ।**
**మాయాశక్తివిలాసకల్పితమహావ్యామోహసంహారిణే**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 9**

అహం శబ్దవాచ్యుడగు పరమాత్మను కొందఱు దేహమనియు, కొందఱు ప్రాణమనియు, కొందఱు క్షణిక విజ్ఞాన మనియు, కొందఱు శూన్యమనియు, కొందఱు మనస్సనియు పలువిధములుగా పలుకుచున్నారు. వీరందఱు భ్రాంతిని పొందిరి. వీరలు స్త్రీలతోను, బాలురతోను, జడులతోను సమానులు. అట్టి మాయావిలాస మోహితులయి అజ్ఞానాంధకారమున బడియున్నవారి యజ్ఞానమును సంహరించు వాడును, గురుమూర్తియు నగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**రాహుగ్రస్తదివాకరేందుసదృశో మాయాసమాచ్ఛాదనాత్**
**సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్సుషుప్తః పుమాన్ ।**
**ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 10**

సుషుప్తియందు విశేషవిజ్ఞానమునకు సాధనము లయిన నేత్రము, శ్రోత్రము మున్నగు నింద్రియములు తమ తమ వ్యాపారములు మాని ఉపసంహృతము లయినప్పుడు పరమాత్మ కేవలము మాయావృతుడై సత్తామాత్రముచేత స్ఫురించుచుండును. రాహువుచేత గ్రహింపబడిన సూర్యునివలెను చంద్రునివలెను మనకు గనబడడు. అట్టి సుషుప్తి ననుభవించినవాడు మేల్కొన్నప్పుడు "ఇదివఱకు నిద్రను అనుభవించితిని; ఇప్పుడు మేల్కొన్నాడను." అనియెడు ప్రత్యభిజ్ఞాన మతనికి కలుగుటవలన అతడు సుషుప్తియందును ఉన్నాడనియే మనము తలంపవలయును. అట్టి జాగ్రదాద్యవస్థ లందవికారియై, నిత్యుడై యున్నవాడును గురుమూర్తియు నగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి**
**వ్యావృత్తాస్వనువర్తమానమహమిత్యంతః స్ఫురంతం సదా ।**
**స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో భద్రయా ముద్రయా**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 11**

బాల్య కౌమార యౌవన వృద్ధావస్థలయందును, జాగ్రత్స్వప్న సుషుప్తి మూర్ఛాద్యవస్థలందును, దర్శనస్పర్శనాద్యవస్థలయందును, ఈసకలావస్థల యందును నేననెడి ఏ జ్ఞానస్వరూపచైతన్య మెప్పుడును ఒకేవిధముగ ప్రకాశించు చున్నదో అట్టి చైతన్యమే నేనను విషయము నెవడు చిన్ముద్రచేత తెలుపుచున్నాడో అట్టి గురుమూర్తి యగు శ్రీదక్షిణామూర్తికి నానమస్కారమగుగాక!

**విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః**
**శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనాభేదతః ।**
**స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయాపరిభ్రామితః**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 12**

సర్వప్రాణులకు ప్రత్యక్షముగ గనబడుచున్న ఈ జీవుడు తాను యథార్థమునకు బ్రహ్మస్వరూపు డయినను మలినసత్త్వ ప్రధానమగు అవిద్యచేత ఆవరింపబడినవాడై స్వప్నమునందుగాని జాగ్రదవస్థయందుగాని, కొన్ని కార్యములనియు, కొన్ని కారణములనియు; కొందఱు యజమానులనియు; కొందఱు సేవకులనియు; గురువులనియు, శిష్యులనియు; పుత్రులనియు, తండ్రులనియు నానావిధ భేదము గలిగినట్లు చూచుచున్నాడు. పరమార్థమునకు ఇవి అన్నియు అసత్యములే. ఆ జీవుడే పరమాత్మ. తానట్టి పరమాత్మస్వరూపుడై భక్తులకు జ్ఞానోపదేశముకొఱకు గురుమూర్తిగా నవతరించిన శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**భూరంభాంస్యనలోఽనిలోఽంబరమహర్నాథో హిమాంశుః పుమాన్**
**ఇత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।**

**నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్పరస్మాద్విభో:**
**తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥ 13**

భూమి, జలములు, అగ్ని, వాయువు, ఆకాశము, సూర్యుడు, చంద్రుడు, జీవుడు-అనెడి చరాచరాత్మక మగు ప్రపంచమే ఎవనియొక్క ఎనిమిది రూపము లుగా ప్రకాశించుచున్నదో, విమర్శించి చూచువారలకు ఏయాత్మకంటె భిన్నమగు వస్తువు గనంబడదో, భక్తులకు జ్ఞానోపదేశార్థము గురువుగా నవతరించిన అట్టి శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మింస్తవే**
**తేనాస్య శ్రవణాత్తదర్థమననాద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।**
**సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వత:**
**సిద్ధ్యేత్తత్పునరష్టధా పరిణతం చైశ్వర్యమవ్యాహతమ్ ॥ 14**

ఈ దక్షిణామూర్తి స్తోత్రమునందు ఈ ప్రపంచ మంతయు ఆత్మయే యని స్పష్టీకరింబడియున్నది. కావున ఇట్టి స్తవమును వినుటవలనను, ఆయర్థమును విచారించుటవలనను, కీర్తించుటవలనను సర్వాత్మభావము అను గొప్ప యైశ్వర్యము గల ఈశ్వరత్వమును తాను స్వయముగ పొందును. మరల మాయా పరిణామరూపము లగు అణిమాద్యష్టైశ్వర్యములనుగూడ నిరాఘాటముగ పొందును.

**శ్రీమద్గురో! నిఖిలవేదశిరోనిగూఢ-**
**బ్రహ్మాత్మబోధసుఖసాంద్రతనో! మహాత్మన్ !**
**శ్రీకాంతవాక్పతిముఖాఖిలదేవసంఘాన్!**
**స్వాత్మావబోధక! పరేశ! నమో నమస్తే ॥ 15**

ప్రకాశమాన స్వరూపుడ వగు ఓ నా గురుస్వామీ ! సకల ఉపనిషత్తుల యందు నిగూఢతత్త్వమగు బ్రహ్మస్వరూపమగు ఆత్మజ్ఞానముచేత గలిగిన అత్యధిక సుఖస్వరూపా! మహాత్మా! విష్ణుదేవ, బ్రహ్మదేవ మొదలగు సకల దేవతలకును

తమయొక్క ఆత్మస్వరూపమును బోధించు మహానుభావా! పరమేశ్వరా! మీ కొఱకు నమస్కారము. నమస్కారము.

**ఓం నమః ప్రణవార్థాయ శుద్ధజ్ఞానైకమూర్తయే ।**
**నిర్మలాయ ప్రశాంతాయ దక్షిణామూర్తయే నమః ॥ 16**

ప్రణవార్థ స్వరూపుడును, కేవల శుద్ధజ్ఞానమూర్తియు, నిర్మలుడును, ప్రశాంతుడు నగు శ్రీదక్షిణామూర్తికి నమస్కారము.

**గురవే సర్వలోకానాం భిషజే భవరోగిణామ్ ।**
**నిధయే సర్వవిద్యానాం దక్షిణామూర్తయే నమః ॥ 17**

సర్వలోకములకును గురు వయినవాడును, సంసారరోగగ్రస్తులకు చికిత్సకు డయినవాడును, సర్వవిద్యలకు నిధి యయినవాడు నగు శ్రీదక్షిణామూర్తికొఱకు నమస్కారము.

**ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।**
**వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥ 18**

ఈశ్వరుడు, గురువు, ఆత్మ యను త్రిమూర్తులుగ విభజింపబడినవాడును, ఆకాశమువలె సర్వవ్యాపక మైనట్టి దేహము గలవాడు నగు శ్రీదక్షిణామూర్తి కొఱకు నమస్కారము.

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య శ్రీమచ్ఛంకరాచార్యవిరచిత

శ్రీ దక్షిణామూర్తిస్తోత్రం సంపూర్ణమ్

ఓమ్ తత్ సత్

ఓమ్

శ్రీగణేశ శారదా సద్గురు మంగళమూర్తిభ్యోనమః

# అథ కరన్యాస హృదయాదిన్యాసాః

యం బ్రహ్మ వేదాంతవిదో వదంతి
పరం ప్రధానం పురుషం తథాఽన్యే ।
విశ్వోద్గతేః కారణమీశ్వరం వా
తస్మై నమో విఘ్ననివారణాయ ॥

ఓం అస్య శ్రీగురుగీతామాలామంత్రస్య భగవాన్ సదాశివ ఋషిః । విరాట్ ఛందః । శ్రీగురుపరమాత్మా దేవతా। హం బీజం । సః శక్తిః సోఽహం కీలకం । శ్రీ గురుకృపా ప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః ॥

## అథ కరన్యాసః

ఓం హం సాం సూర్యాత్మనే అంగుష్ఠాభ్యాం నమః ।
ఓం హం సీం సోమాత్మనే తర్జనీభ్యాం నమః ।
ఓం హం సూం నిరంజనాత్మనే మధ్యమాభ్యాం నమః ।
ఓం హం సైం నిరాభాసాత్మనే అనామికాభ్యాం నమః ।
ఓం హం సౌం అతనుసూక్ష్మాత్మనే కనిష్ఠికాభ్యాం నమః ।
ఓం హం సః అవ్యక్తాత్మనే కరతలకరపృష్ఠాభ్యాం నమః ॥

ఇతి కరన్యాసః

## అథ హృదయాదిన్యాసః

ఓం హం సాం సూర్యాత్మనే హృదయాయ నమః ।
ఓం హం సీం సోమాత్మనే శిరసే స్వాహా ।

**ఓం హం సూం నిరంజనాత్మనే శిఖాయై వషట్ ।**
**ఓం హం సైం నిరాభాసాత్మనే కవచాయ హుమ్ ।**
**ఓం హం సౌం అతనుసూక్ష్మాత్మనే నేత్రత్రయాయ వౌషట్ ।**
**ఓం హం సః అవ్యక్తాత్మనే అస్త్రాయ ఫట్ ।**
**ఓం భూర్భువస్సువరోమితి దిగ్బన్ధః ॥**

ఇతి హృదయాదిన్యాసః.

## అథ ధ్యానమ్

**హంసాభ్యాం పరివృత్తపత్రకమలైర్దివ్యైర్జగత్కారణం**
**విశ్వోత్కీర్ణమనేకదేహనిలయం స్వచ్ఛన్దమానన్దకమ్ ।**
**ఆద్యన్తైకమఖండచిద్ఘనరసం పూర్ణం హ్యానన్తం శుభం**
**ప్రత్యక్షాక్షరవిగ్రహం గురుపదం ధ్యాయేద్విభుం శాశ్వతమ్ ॥** 1

"హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్ పునః ।
హంస హంసేతి యన్మన్త్రం జీవో జపతి సర్వదా॥"

అనురీతిగా హకారసకారములచేత వ్యాప్తములగు దళములు గల దివ్య కమలములతో గూడుకొన్నదియు, అనగా మూలాధారాది షట్చక్రములందు హంస రూపమై దేదీప్యమానమై ప్రకాశించునదియు, మఱియు హంసలచేత జీవాత్మ పరమాత్మల రూపముగ నంతటను వ్యాపించి సకల జగత్తునకు కారణ మైనదియు, ప్రపంచ మంతయు నమర్చబడినట్లు వ్యాప్తమై పరిపూర్ణ మైనదియు, సకల దేహముల నాధారముగా గలదియు అనగా సకల ప్రాణుల యందుండు నదియు, మిగుల స్వచ్ఛమై బ్రహ్మానందమును గలిగించునదియు, ఆద్యన్తములందు నేకస్వరూపమై, అఖండమై, కేవల చిదేకరసమై, ఘనమయి నదియు, పరిపూర్ణ మయినదియు, నాశరహిత మైనదియు, సర్వమంగళస్వరూప మైనదియు, ప్రత్యక్ష మయిన నశించనట్టి స్వరూపము గల సకలవర్ణములతో అకారాది క్షకారాన్తము వరకుగల అక్షరములతో కూడుకొన్న యాకారము గలదియు, సహస్రార మందున్నట్టియు, సర్వతః వ్యాపించి నట్టియు, శాశ్వత మయిన శ్రీగురుపాదార విందములను లేక

శ్రీగురుస్థాన మనబడు పరబ్రహ్మస్వరూపమును ధ్యానించ వలయును.

**విశ్వవ్యాపినమాదిదేవమమలం నిత్యం పరం నిష్కలం**
**నిత్యోద్బుద్ధసహస్రపత్రకమలే లుప్తాక్షరే మంటపే ।**
**నిత్యానందమయం సుఖైకనిలయం నిత్యం శివం స్వప్రభం**
**ధ్యాయేద్ధంసవరం పరాత్పరతరం స్వచ్ఛన్దసర్వాగమమ్ ॥** 2

సమస్త ప్రపంచమున వ్యాపించినవాడును, ఆదిదేవుడును, నిత్యుడును, బుద్ధ్యాదులకు పరుడై మహాశ్రేష్ఠు డయినవాడును, ప్రాణశ్రద్ధాది షోడశకళలు లేనివాడును, అఖండస్వరూపుడును, నెల్లప్పుడును వికసించిన అత్యంత ప్రకాశ వంతమగు సహస్రదళ పద్మము గల యే యక్షరము లేకున్నదియు, కేవలము పరమాత్మస్వరూప మయినదియు నగు సహస్రార మండపమందు నిత్యానంద స్వరూపుడును, కేవలసుఖరూపుడును, శాశ్వతుడును, శివుడును, మంగళ స్వరూపియు, స్వయంప్రకాశమానుడును నిర్మలుడునై సర్వవేద స్వరూపుడును, కేవల జ్ఞానస్వరూపియు, పరముకంటే (విష్ణ్వాది లోకజాతముకంటె) పరమైన వాడును, హంసకంటె విలక్షణుడై పరహంస మయిన పరమాత్మను అనగా పరమాత్మ స్వరూపుడగు శ్రీసద్గురుమూర్తిని ధ్యానించ వలయును. ఈ ప్రకారము గురుభక్తులు శ్రీగురుదేవుని ధ్యానించవలయును.

**ఊర్ధ్వామ్నాయగురోఃపదం త్రిభువనోంకారాఖ్యసింహాసనం**
**సిద్ధాచారసమస్తవేదపఠితం షట్చక్రసంచారిణమ్ ।**
**అద్వైతస్ఫురదగ్ని మేకమమలం పూర్ణం ప్రభాశోభితం**
**శాన్తం శ్రీగురుపంకజం భజ మనశ్చైతన్యచంద్రోదయమ్ ॥** 3

ఊర్ధ్వామ్నాయము లనగా శ్రేష్ఠములగు వేదములు ఉపనిషత్తులని యర్థము. వానియందు ప్రతిపాదింపబడిన గురువునకు పరబ్రహ్మమునకు స్థానమయి నదియు, మూడులోకములందు ఓంకార మనెడు సింహాసనము గలదియు త్రిభువనములందును ప్రణవసింహాసనారూఢమై ప్రకాశించునదియు, సిద్ధుల యొక్క ఆచారములగు (అనుష్ఠానము లగు) వేదములందు పఠింప బడినదియు,

(1) మూలాధార, (2) స్వాధిష్ఠాన, (3) మణిపూరక, (4) అనాహత, (5) విశుద్ధ, (6) ఆగ్నేయములను షట్చక్రములందు హంసరూపమై సంచరించు నదియు, అద్వైతమను ప్రకాశించుచున్న అగ్నిగలదియు, జ్ఞానాగ్నిరూప మైనదియు, అగ్నిమండలమందు వ్యాపించినదియు; ఏకమై, నిర్మలమై, పరిపూర్ణమై కాంతులతో ప్రకాశించునదియు, స్వయంప్రకాశమాన మైనదియు, చైతన్యమను చంద్రోదయము గలదియు, యోగశాస్త్రములలో జ్ఞానోదయమును చంద్రోదయముగను సూర్యోదయముగను వర్ణించుచున్నట్లు లేక షట్చక్రము లందును చంద్రకాంతితో హంస సంచరించు చుండుననియు జెప్పుచున్నట్లు జ్ఞానరూపమై, చైతన్య ప్రకాశముతో గూడినదియు, పరమశాంతిధామ మైనదియు, నిర్వికారమై, నిష్కళంకమై, నిరంజనమై, నిర్గుణమై, అఖండానందరూపమై యున్నదియు నగు శ్రీ గురుదేవుని స్థానమయిన సహస్రారమునే లేక శ్రీగురుపాదారవిందమునే ఓ మనసా ! నిరంతరము సేవింపుము, ధ్యానించుము. అచ్చోటనే లయమై శ్రీగురుస్వరూప మగుము. చైతన్యాత్మక జ్ఞానాత్మక శ్రీగురుపాదారవిందమువలన చంద్రోదయము వలె పరమశాంతిని పొందెదవు. అనగా పైన జెప్పిన రీతిగ శ్రీగురుపాదారవిందమును హృదయమున సర్వదా ధ్యానించుచుండవలయును. అందుచే పరమశాంతి లభ్యమగునని తాత్పర్యము.

**నమామి సద్గురుం శాన్తం ప్రత్యక్షం శివరూపిణమ్ ।**
**శిరసా యోగపీఠస్థం ముక్తికామార్థసిద్ధిదమ్ ॥ 4**

ప్రత్యక్షమగు సర్వదా మంగళస్వరూపుడై సకల శుభముల నొసంగువాడగుటచే శివస్వరూపు డయినవాడును, సహస్రారమం దోంకారమను యోగపీఠము నధిష్ఠించినవాడును, జీవబ్రహ్మైక్య యోగపీఠస్థుడును, ముక్తి కాములగు ముముక్షువులకు పరమప్రయోజన మగు నిర్వికల్పాఖండ జ్ఞానముయొక్క సిద్ధి నొసంగువాడును, పరమశాంత స్వరూపుడు నయిన శ్రీసద్గురుదేవుని నమస్కరించుచున్నాను.

**ప్రాతశ్శిరసి శుక్లాబ్జం ద్వినేత్రం ద్విభుజం గురుమ్ ।**
**వరాభయకరం శాంతం స్మరేత్తన్నామపూర్వకమ్ ॥ 5**

శిరస్సునందు తెల్లదామర పుష్పము గలవాడును అనగా ధవళ పుండరీకమువలె సహస్రారకమలము వికసించినందుచే, బ్రహ్మరంధ్రము తెరువబడినందుచే పరిశుద్ధమగు జ్ఞానతేజస్సుతో నొప్పువాడును, రెండుకన్నులు గలవాడును, అనగా జ్ఞానవిజ్ఞాన నేత్రములు గలవాడును, రెండుచేతులు గలవాడును, అనగా ధర్మమును మోక్షమును రెంటిని బోధించువాడును, భక్తులగు శ్రేష్ఠులకు మృత్యుభయము బాపి జ్ఞానతత్త్వమును బోధించి అభయప్రదానమును "సంసార దుఃఖములచే భయపడకు" డని అభయహస్తము నిచ్చువాడును, పరమశాంత స్వరూపుడు నయిన శ్రీసద్గురు మూర్తిని బ్రహ్మముహూర్తముననే శ్రీగురునామమగు గురుమన్త్రోచ్చారణ పూర్వకముగా గురుమన్త్రమును జపించుచు స్మరించవలయును. తదేకనిష్ఠులై ధ్యానించవలయును.

అవ: మఱియు నిక ధ్యానప్రకారమును జెప్పుచున్నారు.

**ప్రసన్నవదనాక్షం చ సర్వదేవస్వరూపిణమ్ ।**
**తత్పాదోదకజా ధారా నిపతన్తీ స్వమూర్ధని ॥ 6**

నిర్మలములగు వదనము, నేత్రములు గలవాడును, ప్రసన్నుడును, సర్వదేవమయుడు నగు శ్రీగురుదేవుని స్మరించుచు, శ్రీగురుదేవుని పాదోదకధార తనయొక్క శిరస్సునందు పడునట్లు చేయవలెను. అనగా తన శిరమున శ్రీగురుదేవుని పాదతీర్థమును ధారగా పోసుకొనవలయును.

అవ: దానిచే గలుగు ప్రయోజనమును జెప్పబోవుచున్నారు.

**తయా సంక్షాళయేద్దేహే హ్యన్తర్బాహ్యగతం మలమ్ ।**
**తత్క్షణాద్విరజో భూత్వా జాయతే స్ఫటికోపమః ॥ 7**

తన మూర్ధస్థానమున నున్న శ్రీ గురుపాద జలధారచేత బాహ్యాభ్యన్తరముల మాలిన్యమును కడిగివేయవలయును. అందుచే సకలేన్ద్రియములును మాలిన్య రహితములై, పరిశుభ్రములై, పవిత్రములై శాంతి నొందుచున్నవి. మనస్సున్ను సకలపాపములు నశించి వృత్తిశూన్య మగుచున్నది. అందుచే శ్రీగురుదేవునియొక్క పరమభక్తుడు సకలపాప నిర్ముక్తుడై, నిస్సంకల్పుడై, పరిశుద్ధుడై స్ఫటికముతో

సమానముగ ప్రకాశించుచున్నాడు. స్ఫటిక మనుటచే నీ విషయమును గ్రహించ వలయును: స్ఫటికము దాసానిపుష్పముయొక్క సంపర్కముచే నెఱ్ఱనిరంగు గలదివలె నుండును. ఆ పుష్పమును తీసివేయగా యథాప్రకారముగ స్వచ్ఛమై వెలుగుచున్నది. అట్లే తనయొక్క ఆత్మ రజోగుణముచే రక్తమై యుండెను. ఇప్పుడు శ్రీగురుపాదోదకముచే కడుగబడి పరిశుద్ధ మాయెను. అందుచే తాను పరి శుద్ధాత్ముడై, నిర్మలజ్ఞాన తేజస్సుతో ప్రకాశించుచున్నాడు.

**తీర్థాని దక్షిణే పాదే వేదాన్తాన్ముఖమాశ్రితాః ।**
**పూజయేదర్చితం తన్తు తదభిధ్యానపూర్వకమ్ ॥ 8**

శ్రీగురువుయొక్క కుడిపాదమునందు సమస్త తీర్థము లాశ్రయించి యున్నవి. సకల వేదములును శ్రీగురుదేవుని ముఖారవిందము నాశ్రయించి యున్నవి. అనగా శ్రీగురుదేవుని పాదము సోకినంతమాత్రమున సకలతీర్థముల స్నానపుణ్యము భక్తులకు గలుగుచున్నది. అంతమాత్రమే గాదు. శ్రీగురుదేవుడు పాదమిడగానే సకల తీర్థము లుత్పన్నము లగుచున్నవి. వారియొక్క వాక్యము లన్నియు వేదస్వరూపములై యున్నవి. అట్టి సమస్తమును తీర్థముగా జేయునట్టియు, పరమపవిత్రుడై, సకల వేదస్వరూపుడై జ్ఞానమూర్తియైన శ్రీగురుపరమాత్మను నిరంతరము యథార్థమగు శ్రీగురుస్వరూపమును స్తుతించుచు ధ్యానించుచు పూజించవలయును, సేవించవలయను, స్మరించవలయును, తదేకత్వము నొందవలయును.

**సహస్రదళపంకజే సకలశీతరశ్మిప్రభం**
**వరాభయకరామ్బుజం విమలగంధపుష్పామ్బరమ్ ।**
**ప్రసన్న వదనేక్షణం సకలదేవతారూపిణం**
**స్మరేచ్ఛిరసి హంసగం తదభిధానపూర్వం గురుమ్ ॥ 9**

నిరన్తరము సహస్రారమందు శీతధాముడై, పరమశాంతిస్వరూపుడై పరిశుద్ధమగు చంద్రకాంతితో ప్రకాశించువాడును, సకల కలిదోషములు నశించి బ్రహ్మరన్ధ్రము నిరావరణమై యున్నందుచే మిక్కిలి విరాజిల్లువాడును, అమృతస్వరూపుడును, పరమభక్తుల కొఱకు అభయహస్త కమలమును ధరించిన

వాడును, నిర్మల గంధపుష్పములను ధరించువాడును అనగా పరిశుద్ధములగు గంధపుష్పమువలె పరిశుద్ధాన్తఃకరణుడై జ్ఞానమాధుర్యముతో నొప్పువాడును, పరిశుద్ధ ముఖపద్మ నయన పద్మములను ధరంచినవాడును, సుప్రసన్నుడును, సకల దేవస్వరూపుడును, శిరస్సునందు హంసరూపుడై పరమాత్మరూపుడై విహరించు వాడును, వృత్తిరహితుడును, పరబ్రహ్మస్వరూపియు నగు శ్రీగురుదేవుని శ్రీగురు మన్త్ర పూర్వకముగ స్మరించవలయును. సతతము సర్వమన్త్ర శ్రేష్ఠమగు 'గురు' అను ద్వ్యక్షరమన్త్రమును జపించుచు శ్రీగురువును పైన దెల్పిన విధముగ ధ్యానించుచు తరించవలయును.

ఇతి ధ్యానమ్.

## అథ మానసపూజా

మానసోపచారై : శ్రీగురుం పూజయిత్వా

**1 .వం అబాత్మనే రసతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః ।**

అబాత్మకం స్నానం సమర్పయామి ॥

**2. లం పృథివ్యాత్మనే గంధతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః ।**

పృథివ్యాత్మకం గన్ధం సమర్పయామి ॥

**3. హం ఆకాశాత్మనే శబ్దతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః**

ఆకాశాత్మకం పుష్పం సమర్పమామి ॥

**4. యం వాయ్వాత్మనే స్పర్శతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః**

వాయ్వాత్మకం ధూపం సమర్పయామి ॥

**5. రం తేజ ఆత్మనే రూపతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః**

తేజ ఆత్మకం దీపం సమర్పయామి ॥

**6. ఠం అమృతాత్మనే అమృతతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః**

అమృతాత్మకం నైవేద్యం సమర్పయామి ॥

**7. సం సర్వాత్మనే సర్వతన్మాత్రా ప్రకృత్యానందాత్మనే**
**శ్రీగురుదేవాయ నమః**

సర్వాత్మకాన్ సర్వోపచారాన్ సమర్పయామి

ఇతి మానసపూజా

**అథ శ్రీ గురుమాలామన్త్రః**

**"ఓం నమశ్శ్రీగురుదేవాయ పరమపురుషాయ సర్వదేవతా-**

**వశీకరాయ సర్వారిష్టవినాశాయ సర్వమన్త్రచ్ఛేదనాయ**

**త్రైలోక్యం వశమానయ స్వాహా ॥"**

**ఓం శ్రీ సద్గురుచరణారవిన్దాభ్యాం నమః**

**ఓమ్ తత్ సత్.**

---



శ్రీసద్గురుచరణారవిందాభ్యాం నమః
శ్రీగణేశ శారదా సద్గురు మంగళమూర్తిభ్యో నమః
ఓం నమో భగవతే వేదవ్యాసాయ

# శ్రీ గు రు గీ తా

## అథ ప్రథమోఽధ్యాయః

అవ: శ్రీ గురుదేవుని పరబ్రహ్మస్వరూపునిగా నిర్ణయించుచు, గ్రంథాదియందు నమస్కారాత్మక మంగళము నాచరించుచున్నారు.

**అచింత్యావ్యక్తరూపాయ నిర్గుణాయ గుణాత్మనే ।**
**సమస్తజగదాధారమూర్తయే బ్రహ్మణే నమః ॥** **1**

అచింత్యావ్యక్తరూపాయ - నిర్గుణాయ - గుణాత్మనే - సమస్తజగదాధారమూర్తయే - బ్రహ్మణే - నమః

అచింత్యావ్యక్తరూపాయ - అచింత్య = చిత్తముచే చింతించ నలవికానట్టియు, అవ్యక్త = ప్రకటము గానట్టియు. రూపాయ = రూపము గల, నిర్గుణాయ = గుణాతీతుడైన, గుణాత్మనే = గుణస్వరూపుడైన, సమస్త.......మూర్తయే - సమస్తజగత్ = సర్వలోకమునకు, ఆధారమూర్తయే = ఆధారస్వరూపుడైన, బ్రహ్మణే = పరబ్రహ్మస్వరూపుడగు పరమాత్మకు (శ్రీసద్గురుదేవునకు), నమః = నమస్కారము.

పరబ్రహ్మస్వరూపుడగు గురుమూర్తియొక్క స్వరూప మెట్టిదనగా అచింత్యము = అంతఃకరణచతుష్టయమునకు నతీత మగుటచే నూహింపను, చింతింపను సాధ్యము గానిదియు, అవ్యక్తము = స్థూలరూపముగా ప్రకటము గానిదియు, ఇంద్రియము లకు గోచరింపని దగుటచే మహాసూక్ష్మాతిసూక్ష్మ మైనదియు, నిర్గుణము = సత్త్వరజస్తమో గుణములకు ప్రకృతిరహిత

మైనదగుటవలన నతీత మైనదియు, సచ్చిదానందాది గుణములతో గూడినదియు, సమస్తలోకమునకు నాధారమై యధిష్ఠాన మైనదియు నగు పరబ్రహ్మస్వరూపమును ధరించిన గురుదేవుని కొరకు నమస్కారము.

మొదట ఇట్లు శ్రీ గురుదేవుని పరబ్రహ్మస్వరూప మని తెలిపి ఆ పరమాత్మ స్వరూప గురుమూర్తికి నమస్కరించుటచే నిచట నమస్కారాత్మక మంగళము నాచరించబడినట్లైనది.

ఋషయ ఊచుః

**సూత! సూత! మహాప్రాజ్ఞ ! నిగమాగమపారగ ।**
**గురుస్వరూపమస్మాకం బ్రూహి సర్వమలాపహమ్ ॥ 2**

సూత - సూత - మహాప్రాజ్ఞ - నిగమాగమపారగ - గురుస్వరూపం - అస్మాకం - బ్రూహి - సర్వమలాపహం.

మహాప్రాజ్ఞ! = గొప్పదగు ధీశ క్తిగలవాడా!, నిగమాగమపారగ - నిగమ = వేదములయొక్కయు, ఆగమ = ఆగమములయొక్కయు, పార = అంతమును, గ = పొందినవాడా (తెలిసికొన్నవాడా)!, సూత!సూత! = ఓ సూతమహర్షీ ! అస్మాకం = మాకు, సర్వమలాపహం - సర్వమల = సమస్తమాలిన్యమును, ఆపహం = పోగొట్టునట్టి, గురుస్వరూపం= శ్రీగురుదేవుని స్వరూపమునుగూర్చి, బ్రూహి = చెప్పుమా.

మహాధీమంతుడవగు నో సూతమహర్షీ ! వేదములను, ఆగమములను పూర్తిగా తెలిసికొనిన ఓ సూతఋషివరేణ్యా ! సమస్త మాయామాలిన్యములను నిశ్శేషముగ నపహరించునట్టి గురుస్వరూపమును మాకొఱకు జెప్పుమా ! అని శౌనకాది మహర్షులు సకల పురాణప్రవక్త యగు శ్రీ సూతమహర్షిని గడు నాదరముతో నడిగిరి.

**యస్య శ్రవణమాత్రేణ దేహీ దుఃఖాద్విముచ్యతే ।**
**యేన మార్గేణ మునయః సర్వజ్ఞత్వం ప్రపేదిరే ॥ 3**
**యత్ప్రాప్య న పునర్యాతి నరస్సంసారబన్ధనమ్ ।**
**తథావిధం పరం తత్త్వం వక్తవ్యమధునా త్వయా ॥ 4**

యస్య - శ్రవణమాత్రేణ - దేహీ - దుఃఖాత్ - విముచ్యతే - యేన - మార్గేణ - మునయః - సర్వజ్ఞత్వం - ప్రపేదిరే - యత్ - ప్రాప్య - న - పునః - యాతి - నరః - సంసారబన్ధనం - తథావిధం - పరం - తత్త్వం - వక్తవ్యం - అధునా - త్వయా.

యస్య = ఏ గురుస్వరూపముయొక్క, శ్రవణమాత్రేణ = వినినంత మాత్రముచేతనే, దేహీ = జీవుడు, దుఃఖాత్ = దుఃఖమునుండి, విముచ్యతే = విడువబడుచున్నాడో, యేన మార్గేణ = ఏ గురుతత్త్వ మార్గముచేత, మునయః = మహర్షులు, సర్వజ్ఞత్వం = సర్వజ్ఞత్వమును, ప్రపేదిరే = పొందిరో, యత్ = దేనిని, ప్రాప్య = పొంది, నరః = మనుజుడు, పునః = మరల, సంసారబన్ధనం = సంసారపాశమును, న యాతి = పొందడో, తథావిధం = అటువంటి, పరం= శ్రేష్ఠమైన, తత్త్వం = గురుతత్త్వము, అధునా = ఇప్పుడు, త్వయా = నీచేత, వక్తవ్యం= చెప్పదగినది.

ఏ గురుస్వరూపమును శ్రవణము చేసినంత మాత్రముచేతనే, సమస్త ప్రాణులు దుఃఖమునుండి విముక్తిని బడయుచున్నవో, ఏ మార్గముచేత మునులు సర్వజ్ఞత్వమును బడసిరో, జీవుడును బ్రహ్మత్వము నొందుచున్నాడో, దేనిని పొందిన నరుడు సంసారబంధమున మరల చిక్కుకొనడో- అటువంటి శ్రేష్ఠమగు గురుతత్త్వము నిప్పుడు మాకెఱింగింపవలయును.

**గుహ్యాత్ గుహ్యతమం సారం గురుగీతా విశేషతః ।**
**త్వత్ప్రసాదాచ్చ శ్రోతవ్యా తత్సర్వం బ్రూహి సూత! నః ॥ 5**

గుహ్యాత్ - గుహ్యతమం - సారం - గురుగీతా - విశేషతః - త్వత్ ప్రసాదాత్ - చ - శ్రోతవ్యా - తత్ - సర్వం - బ్రూహి - సూత - నః.

గుహ్యాత్ = రహస్యముకంటె, గుహ్యతమం = మిక్కిలి రహస్య మయినదియు, సారం = సారమయి నదియు నగు, గురుగీతా = గురుగీత, త్వత్ప్రసాదాత్ = మీయనుగ్రహమువలన, శ్రోతవ్యా = వినదగినది, తత్ = ఆ, సర్వం = సమస్తమును, నః - మాకు, విశేషతః = విశేషముగా, హే సూత = ఓ సూతమహర్షీ ! బ్రూహి = చెప్పుమా.

వేదాన్తశాస్త్రములలోని రహస్యములకన్నను మిగుల రహస్య మయినదియు, సారవత్తర మయినదియు నగు గురుగీతను మీ యనుగ్రహమువలన విశేషముగా వినవలయునని ప్రార్థించుచున్నారము. కాన నో సూతమహర్షీ ! మీరలద్దానిని పరిపూర్ణముగ మాకు సెలవిండు.

**ఇతి సంప్రార్థితస్సూతో మునిసంఘైర్ముహుర్ముహుః ।**
**కుతూహలేన మహతా ప్రోవాచ మధురం వచః ॥ 6**

ఇతి - సంప్రార్థితః - సూతః - మునిసంఘైః- ముహుః - ముహుః - కుతూహలేన - మహతా - ప్రోవాచ - మధురం - వచః.

ఇతి = పైజెప్పిన విధముగా, మునిసంఘైః = శౌనకాది మహామునులచే, ముహుర్ముహుః=మాటిమాటికి, సంప్రార్థితః = మిక్కిలి ప్రార్థింపబడినవాడై, సూతః = సూతమహర్షి, మహతా = గొప్పదగు, కుతూహలేన = సంతోషముతో, మధురం = మనోహర మయిన, వచః = వాక్యమును, ప్రోవాచ = పలికెను.

పైన తెలిపిన ప్రకారము సూతమహాముని శౌనకాది ఋషివర్యులచే ననేక పర్యాయములు ప్రార్థితుడై, మిగుల నుత్సాహముతో వారలను గాంచి మధుర ములగు నుడువుల బలుక మొదలిడెను.

సూత ఉవాచ = సూతుడు పలికెను-

**శృణుధ్వం మునయస్సర్వే శ్రద్ధయా పరయా ముదా ।**
**వదామి భవరోగఘ్నం గీతాం మాతృస్వరూపిణీమ్ ॥ 7**

శృణుధ్వం - మునయః - సర్వే - శ్రద్ధయా - పరమా - ముదా - వదామి - భవరోగఘ్నం - గీతాం - మాతృస్వరూపిణీమ్.

హే మునయః = ఓ మునీశ్వరులారా!, సర్వే = మీరందఱు, పరయా = శ్రేష్ఠమగు, శ్రద్ధయా = శ్రద్ధతో, ముదా = సంతోషముతో, శృణుధ్వం = వినుండు, మాతృస్వరూపిణీం = జననీస్వరూపిణియు, భవరోగఘ్నం - భవరోగ = సంసారమను మహావ్యాధిని, ఘ్నం = నశింపజేయు నదియు నగు, గీతాం = గురుగీతను, వదామి = చెప్పుచున్నాను.

మాతృస్వరూపిణియు, అనాది మాయామయ సంసారమను గొప్పదగు రోగమును ధ్వంసము చేయునదియు నగు గురుగీతను నేను చెప్పుచున్నాను. కనుక నోమునీశ్వరులారా ! మీరందఱు పరమశ్రద్ధతో మిక్కిలి సంతోషముతో నాలింపుడు.

**పురా కైలాసశిఖరే సిద్ధగన్ధర్వసేవితే ।**
**తత్ర కల్పలతా పుష్పమన్దిరేఽత్యంతసుందరే ॥ 8**

పురా - కైలాసశిఖరే - సిద్ధగన్ధర్వసేవితే - తత్ర - కల్పలతా పుష్పమన్దిరే - అత్యంతసున్దరే.

పురా = పూర్వకాలమందు, సిద్ధగన్ధర్వసేవితే = సిద్ధగన్ధర్వులచే సేవింపబడుచున్న, తత్ర = ఆ ప్రసిద్ధమగు, కైలాసశిఖరే = కైలాసపర్వతముయొక్క పైభాగమందు, అత్యంతసున్దరే= మిక్కిలి మనోహరమగు, కల్పలతాపుష్పమన్దిరే - కల్పలతా = కల్పలతలయొక్క, పుష్ప = పుష్పములయొక్క, మన్దిరే = మందిరమునందు.

పూర్వము సిద్ధగంధర్వులచే నాశ్రయింపబడిన కైలాసశిఖరమందు నానావిధపుష్పములచే కూడుకొన్న కల్పలతామందిరము మిగుల మనోజ్ఞమై యుండెను. అచ్చోట,

**వ్యాఘ్రాజినే సమాసీనం శుకాదిమునివందితమ్ ।**
**బోధయన్తం పరం తత్త్వం మధ్యే మునిగణం క్వచిత్ ॥ 9**

వ్యాఘ్రాజినే - సమాసీనం - శుకాదిమునివన్దితమ్ - బోధయంతం - పరం - తత్త్వం - మధ్యే - మునిగణం - క్వచిత్ ॥

మధ్యేమునిగణం = మునులయొక్క మధ్యలో, వ్యాఘ్రాజినే = వ్యాఘ్రాసనమునందు, సమాసీనం = కూర్చున్నట్టియు, శుకాదిమునివన్దితమ్ = శుకాదిమహర్షులచే నమస్కరింపబడు చున్నట్టియు, పరం తత్త్వం = శ్రేష్ఠమగు తత్త్వమును, బోధయంతం = బోధించుచున్నట్టియు, క్వచిత్ = ఒకానొక సమయమున.

మహర్షులయొక్క మధ్యలో వ్యాఘ్రాసనమున గూర్చున్నట్టియు, శుకాది మహామునులచే నమస్కార పూర్వకముగా స్తోత్రము చేయబడుచున్నట్టియు, నా మునిసమూహమునకు పరమతత్త్వమును బోధించు చున్నట్టియు నొకానొక సమయమునందు,

**ప్రణమ్రవదనా శశ్వన్నమస్కుర్వన్తమాదరాత్ ।**
**దృష్ట్వా విస్మయమాపన్నా పార్వతీ పరిపృచ్ఛతి ॥ 10**

ప్రణమ్రవదనా - శశ్వత్ - నమః - కుర్వన్తం - ఆదరాత్ - దృష్ట్వా - విస్మయం - ఆపన్నా - పార్వతీ - పరిపృచ్ఛతి.

శశ్వత్ = ఎల్లప్పుడును, నమస్కుర్వన్తం = నమస్కారమును చేయుచున్న మహేశ్వరుని, దృష్ట్వా = చూచి, విస్మయం = ఆశ్చర్యమును, ఆపన్నా = పొందినదై, పార్వతీ = పార్వతీదేవి, ఆదరాత్ = ఆదరమువలన, ప్రణమ్రవదనా = వంగిన ముఖము గలదై, పరిపృచ్ఛతి = అడుగుచున్నది.

చేరువన నున్న మహర్షివర్యులను సర్వదా నమస్కరించు చున్నట్టి మహేశ్వరుని గాంచి మిగుల నాశ్చర్యమును బొందినదై నమ్రముఖి యగు (వినయముతో గూడుకొనిన) పార్వతీదేవి పరమప్రీతితో ప్రశ్నించుచున్నది.

పార్వత్యువాచ = పార్వతీదేవి నుడివెను.

**ఓం నమో దేవ! దేవేశ! పరాత్పర! జగద్గురో! ।**
**త్వాం నమస్కుర్వతే భక్త్యా సురాసురనరాస్సదా ॥ 11**

ఓం - నమః - దేవ - దేవేశ - పరాత్పర - జగద్గురో - త్వాం - నమః - కుర్వతే - భక్త్యా - సురాసురనరాః - సదా.

దేవ = ఓ ప్రకాశస్వరూపా ! దేవేశ = దేవాధిపా ! పరాత్పర = పరమగు విద్యకన్నను పరమైనవాడా (ఓ సర్వశ్రేష్ఠా)!, జగద్గురో! = ఓ లోకప్రభో!, త్వాం = నిన్నుగూర్చి, సురాసురనరాః= దేవతలు, అసురులు, నరులు, సదా = ఎల్లప్పుడు, భక్త్యా = భక్తితో, నమః = నమస్కారమును, కుర్వతే = చేయుచున్నారు. (మొదట ఓం అనునది మంగళవాచకమని తెలియవలయును,)

ప్రణవస్వరూపా ! ప్రకాశమానుడ వగు నో దేవా ! ఓ దేవేశా ! పరాప్రకృతికన్న విలక్షణుడవగు నోపరాత్పరా ! (పరమనబడు విష్ణ్వాది లోకములకును పరమైనవాడా!)సర్వలోకగురో ! మిమ్ములను దేవతలు, అసురులు, నరులు నెల్లప్పుడును పరమభక్తితో నమస్కరించుచున్నారు.

**విధివిష్ణుమహేన్ద్రాద్యైర్వన్ద్యః ఖలు సదా భవాన్ ।**
**నమస్కరోషి కస్మై త్వం నమస్కారాశ్రయః కిల ॥ 12**

విధివిష్ణుమహేన్ద్రాద్యైః - వన్ద్యః - ఖలు - సదా - భవాన్ - నమః - కరోషి - కస్మై -

త్వం - నమస్కారాశ్రయః - కిల.

సదా = ఎల్లప్పుడు, భవాన్ = నీవు, విధివిష్ణుమహేన్ద్రాద్యైః = బ్రహ్మవిష్ణుమహేన్ద్రాదులచే, వన్ద్యః ఖలు = స్తుతింప దగినవాడవు గదా, త్వం = నీవు, నమస్కారాశ్రయః కిల = సమస్తదేవతల నమస్కారములకు స్థానమైన వాడవు గదా, కస్మై = ఎవనికొఱకు, నమస్కరోషి = నమస్కరించుచున్నావు?

ఓ మహేశా ! మీరు బ్రహ్మ విష్ణు మహేన్ద్రాదులచే నెల్లప్పుడు స్తుతింప దగినవారు. సకల దేవతల నమస్కారములకు తగినవారు గదా ? కావున మీరెవరికొరకు నమస్కరించుచున్నారు?

**దృష్ట్వైతత్కర్మ విపులమాశ్చర్యం ప్రతిభాతి మే ।**
**కిమేతన్న విజానేఽహం కృపయా వద మే ప్రభో ॥ 13**

దృష్ట్వా - ఏతత్ - కర్మ - విపులం - ఆశ్చర్యం - ప్రతిభాతి - మే - కిం - ఏతత్ - న - విజానే - అహం - కృపయా - వద - మే - ప్రభో.

ఏతత్ = ఈ నమస్కారరూపమగు, కర్మ = కర్మను, దృష్ట్వా = చూచి, మే = నాకు, విపులం = అధికమగు, ఆశ్చర్యం = విస్మయము, ప్రతిభాతి = తోచుచున్నది. ఏతత్ = ఈ నమస్కారకారణము, కిం = ఏమి, అహం = నేను, విజానే = తెలియకున్నాను, హే ప్రభో = ఓ స్వామి ! కృపయా = దయతో, మే = నాకు, వద = చెప్పుడు.

తమ నమస్కారరూప కర్మనుగాంచి నాకు మిగుల నాశ్చర్యము గలుగు చున్నది. ఇట్టి ప్రణామమునకు కారణం బేమిటని నే నెఱుంగజాలకున్నాను. కావున నో స్వామీ ! పరమదయతో నీ విషయము నాకు జెప్పుడు.

**భగవన్ ! సర్వధర్మజ్ఞ ! వ్రతానాం వ్రతనాయకమ్ ।**
**బ్రూహి మే కృపయా శమ్భో ! గురుమాహాత్మ్యముత్తమమ్ ॥ 14**

భగవన్ -సర్వధర్మజ్ఞ - వ్రతానాం - వ్రతనాయకం - బ్రూహి - మే - కృపయా - శమ్భో - గురుమాహాత్మ్యం - ఉత్తమమ్.

భగవన్ = ఓ పూజ్యుడా ! సర్వధర్మజ్ఞ = సమస్తధర్మముల నెఱింగినవాడా ! వ్రతానాం= వ్రతములలో, వ్రతనాయకం = శ్రేష్ఠవ్రత మయిన, ఉత్తమం = ఉత్తమ మయిన,

గురుమాహాత్మ్యం= శ్రీసద్గురు మాహాత్మ్యమును, హే శమ్భో = సర్వమంగళస్థానమగు నో యీశ్వరా ! కృపయా = దయతో, మే = నాకొఱకు, బ్రూహి = నుడువుడు.

ఓ పూజ్యుడా ! సకల ధర్మతత్త్వములను దెలిసిన మహాత్మా! వ్రతము లన్నిటిలో ముఖ్యవ్రతమగు నత్యుత్తమ శ్రీ సద్గురు మాహాత్మ్య వ్రతమును నో మంగళస్వరూపా! నాకు పరమదయతో నానతిండు.

**కేన మార్గేణ భో స్వామిన్‌దేహీ బ్రహ్మమయో భవేత్ ।**
**తత్కృపాం కురు మే స్వామిన్‌నమామి చరణౌ తవ ॥ 15**

కేన - మార్గేణ - భో - స్వామిన్ - దేహీ - బ్రహ్మమయః - భవేత్ - తత్కృపాం - కురు - మే - స్వామిన్- నమామి - చరణౌ - తవ.

భో స్వామిన్ = ఓ స్వామీ ! కేన మార్గేణ = ఏమార్గముచేత, దేహీ = జీవుడు, బ్రహ్మమయః = బ్రహ్మస్వరూపుడుగా, భవేత్ = అగునో, తత్కృపాం - తత్ = ఆ విషయమునందు, కృపాం = దయను, స్వామిన్ = స్వామీ!, మే = నాకొఱకు, కురు = చేయుమా, తవ చరణౌ = నీయొక్క పాదములను, నమామి = నమస్కరించుచున్నాను.

ఓ స్వామీ ! యే మార్గము నవలంబించి ఆత్మ బ్రహ్మస్వరూపము నొందునో, ఆ మార్గమును నాకు కడుంగడు దయతో బోధింపుడు. ఓ స్వామీ ! తమ చరణకమలములకు ప్రణమిల్లుచున్నాను.

**ఇతి సంప్రార్థితశ్శశ్వన్మహాదేవో మహేశ్వరః ।**
**ఆనందభరితస్స్వాన్తే పార్వతీమిదమబ్రవీత్ ॥ 16**

ఇతి - సంప్రార్థితః - శశ్వత్ - మహాదేవః - మహేశ్వరః - ఆనందభరితః - స్వాన్తే - పార్వతీం - ఇదం - అబ్రవీత్.

ఇతి = ఈ ప్రకారముగ, శశ్వత్ = అనేకపర్యాయములు, సంప్రార్థితః = బాగుగా ప్రార్థింపబడినవాడై, మహేశ్వరః = లోకప్రభువగు, మహాదేవః = ఈశ్వరుడు, స్వాన్తే = మనస్సునందు, ఆనందభరితః = ఆనందముతో పరిపూర్ణుడై, పార్వతీం = పార్వతీదేవినిగూర్చి, ఇదం = ఈ చెప్పబోవు వాక్యమును, అబ్రవీత్ = పలికెను.

పై బేర్కొనిన తీరుగ ననేకవిధములుగ ముమ్మాటికిని బ్రార్థింపబడినవాడై

సర్వలోకప్రభువగు నమ్మహాదేవుడు తనమనంబున నమన్దానందభరితుడై పార్వతీదేవితో నీ చెప్పబోవు వాక్యమును బలికెను.

శ్రీ మహాదేవ ఉవాచ = శ్రీ మహాదేవుడు చెప్పెను-

**న వక్తవ్యమిదం దేవి రహస్యాతిరహస్యకమ్ ।**
**న కస్యాపి పురా ప్రోక్తం త్వద్భక్త్యర్థం వదామి తత్ ॥ 17**

న - ;ం - ఇదం - దేవి - రహస్యాతిరహస్యకం - న - కస్య - అపి - పురా - ప్రోక్తం - ం - వదామి - తత్.

హే దేవి = ఓ మహాదేవి ! రహస్యాతి రహస్యకం - రహస్య = సకల రహస్యములలో, అతిరహస్యం = మిక్కిలి రహస్య మయిన, ఇదం = ఈతత్త్వము, న వక్తవ్యం = ఎవరికిని చెప్పదగినది కాదు, పురా = ముందు, కస్యాపి = ఎవరికిని, న ప్రోక్తం = చెప్పబడినది కాదు, తత్ = ఆ నిగూఢతత్త్వమును, త్వద్భక్త్యర్థం = (నాయందున్న) నీయొక్క భక్తికొఱకు, వదామి = వచించుచున్నాను.

ఓ మహాదేవీ ! నీ విపుడు ప్రశ్నించిన విషయము రహస్యముల నన్నింటిలోను మిగుల నిగూఢమైనది. కావున నిది యెవరికిని వచింపదగదు. మఱియు దీని నిదివర కెవఱికిని జెప్పియుండ లేదు. అయినను నిట్టి నిగూఢతత్త్వమును నీ యత్యంత భక్తి నుద్దేశించి పలుక నారంభించుచున్నవాడును.

**మమ రూపాఽసి దేవి! త్వమత స్తత్కథయామి తే ।**
**లోకోపకారకః ప్రశ్నో న కేనాపి కృతః పురా ॥ 18**

మమ - రూపా - అసి - దేవి - త్వం - అతః - తత్ - కథయామి - తే - లోకోపకారకః - ప్రశ్నః - న - కేన - అపి - కృతః - పురా.

హే దేవి = ఓ దేవి ! త్వం = నీవు, మమ = నాయొక్క, రూపా = స్వరూపము గలదానివిగా, అసి = అగుచున్నావు. అతః = ఈ కారణమువలన, తత్ = ఆ రహస్యార్థమును, తే = నీకొఱకు, కథయామి = వచించుచున్నాను, అయం = ఇది, లోకోపకారకః = సకలలోకమునకు నుపకారముఁ జేయునట్టి, ప్రశ్నః = ప్రశ్నము, కేనాపి = ఎట్టి ధీమంతునిచేతను, పురా = ముందు, న కృతః = చేయబడలేదు, (నీ యొక్కదానిచేతనే అడుగబడినదని యర్థము).

సకల ప్రకాశస్వరూపిణివగు నో మహాదేవి ! నీవు ప్రశ్నించినది సమస్త లోకమునకు మహోపకారమును గలుగజేయునది. ఇకను నది ముందెవ్వరిచేతను నడుగబడి యుండలేదు.

అవ: శ్రీ సద్గురుత త్త్వమే మహోత్కృష్ట మనియు, నట్టి మహాజ్ఞానికే సకలార్థములు భాసించుననియు దెలుపుచున్నారు.

**యస్య దేవే పరా భక్తిః యథా దేవే తథా గురౌ ।**
**తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశంతే మహాత్మనః ॥ 19**

యస్య - దేవే - పరా - భక్తిః - యథా - దేవే - తథా - గురౌ - తస్య - ఏతే - కథితాః - హి - అర్థాః - ప్రకాశంతే - మహాత్మనః.

యస్య = ఏ మహాపురుషునకు, దేవే = తనకిష్టమగు దైవమునందు, యథా = ఎట్లు, పరా = మహోత్కృష్టమగు, భక్తిః = భక్తి(గలదో), తథా = అట్లే, దేవే = పరమాత్మ స్వరూపుడగు, గురౌ = శ్రీ సద్గురుదేవునియందు (పరమభక్తి గలదో), తస్య = ఆ పరమభక్తుడగు, మహాత్మనః = మహానుభావునకు, ఏతే = ఈ, కథితాః = వేదాంతశాస్త్రములలో చెప్పబడిన, అర్థాః = అర్థములు, హి = నిశ్చయముగా, ప్రకాశంతే = అవగాహనము లగుచున్నవి.

ఏ ధన్యాత్మునకు తనకిష్టదైవమందు పరమ ప్రేమరూప పరాభక్తి గలదో, అటువంటి (తన దైవమందున్నట్టి) మహోత్కృష్టమగు నా పరాభక్తి తన శ్రీ గురుదేవునియందును నిరన్తరము నిరంతరాయముగా నుంటున్నదో, అట్టి మహాత్మునకు వేదాంత శాస్త్రములలో దెలుపబడిన మహానిగూఢములగు జ్ఞానబోధ లన్నియును సులభముగ నవగాహనములై స్పష్టముగ సందేహ రహితముగ భాసించుచున్నవి. ఇది నిశ్చయము.

అవ: శ్రీ గురుదేవునకును సాక్షాదీశ్వరునికి నేలాంటి భేదము లేదనియు, గురువే యీశ్వరుడు, ఈశ్వరుడే శ్రీగురుదేవు డనియు స్పష్టపరచుచున్నారు.

**యో గురుస్స శివః ప్రోక్తో యశ్శివస్స గురుస్స్మృతః ।**
**వికల్పం యస్తు కుర్వీత స నరో గురుతల్పగః ॥ 20**

యః - గురుః - సః - శివః - ప్రోక్తః - యః - శివః - సః - గురుః - స్మృతః -

వికల్పం - యః - తు - కుర్వీత - సః - నరః - గురుతల్పగః.

గురుః = అజ్ఞానాంధకారమును నిరోధించునట్టి మహాత్ముడు, యః = ఎవడో, సః = అట్టి గురుదేవుడే, శివః = మంగళస్వరూపుడగు సాక్షాచ్ఛివుడని, ప్రోక్తః = చెప్పబడెను, శివః = శుభంకరుడగు నీశ్వరుడు, యః = ఏదేవుడో, సః = ఆ మహాదేవుడే, గురుః = హృత్తాపహారియగు పరమగురువని, స్మృతః = స్మరింపబడెను, యస్తు = ఏ అవివేకి అయితే, వికల్పం = విరుద్ధభావమును, కుర్వీత = చేయునో, సః నరః = అట్టి మూఢమానవుడు, గురుతల్పగః భవతి = గురుతల్పమును (శయ్యను) పొందిన వాడగుచున్నాడు.

గురువనగా భక్తుల హృత్తాపములను బాపి, అజ్ఞానతమమును నశింపజేయువాడు, ఆ శ్రీ గురుదేవుడు సర్వదా మంగళస్వరూపియగు శివుడే. కావున నట్టి శివుడే సర్వశుభప్రదుడగు శ్రీ గురుమూర్తియై యున్నాడని చెప్పిరి, ఈ ప్రకారము గాక దేశికేన్ద్రస్వామి వేరు, శివుడు వేరు అని యే జ్ఞానహీనుడు విరుద్ధముగా దలపెట్టునో, అట్టి పాషండుడు గురుతల్పగతు డగువాని గతిని తప్పక పొందును.

అవ: శ్రీగురు పరమత్వము

**దుర్లభం త్రిషు లోకేషు తచ్ఛృణుష్వ వదామ్యహమ్ ।**
**గురుబ్రహ్మ వినా నాన్యః సత్యం సత్యం వరాననే! ॥ 21**

దుర్లభం - త్రిషు - లోకేషు - తత్ - శృణుష్వ - వదామి - అహమ్ - గురుబ్రహ్మ - వినా - న - అన్యః - సత్యం - సత్యం - వరాననే.

వరాననే = ఓ పార్వతీదేవి ! త్రిషు లోకేషు = ముల్లోకములందు, యత్ = ఏది, దుర్లభం = దుర్లభ మయినదో, తత్ = దానిని, అహం = నేను, వదామి = చెప్పుచున్నాను, శృణుష్వ = వినుము, గురుబ్రహ్మ = శ్రీగురుదేవుడను పరబ్రహ్మమును, వినా = వదలి, అన్యః = మఱియొక పదార్థము, న = లేదు, (ఇది) సత్యం = సత్యము, సత్యం = పరమసత్యము (అగుచున్నది.)

ఓ పార్వతీదేవీ ! త్రిభువనములందును దుర్లభమగు పరమసత్యమును దెలుపుచున్నాను వినుము. శ్రీగురుదేవుడను బ్రహ్మమే పరబ్రహ్మము. అట్టి శ్రీ గురుపరబ్రహ్మమును వదలి మఱియొక పదార్థము లేదు. అంతయు నా

గురుపరబ్రహ్మస్వరూపమే. ఇదియే సత్యము. పరమ సత్యము.

అవ: గురుభక్తి ప్రభావము

**వేదశాస్త్రపురాణాని చేతిహాసాదికాని చ ।**
**మన్త్రయన్త్రాదివిద్యాశ్చ మోహనోచ్చాటనాదికమ్ ॥ 22**
**శైవశాక్తాగమాదీని హ్యన్యే చ బహవో మతాః ।**
**అపభ్రంశాస్సమస్తానాం జీవానాం భ్రాన్తచేతసామ్ ॥ 23**

వేదశాస్త్రపురాణని - చ - ఇతిహాసాదికాని - చ - మన్త్రయన్త్రాదివిద్యాః - చ - మోహనోచ్చాటనాదికం - శైవశాక్తాగమాదీని - హి - అన్యే - చ - బహవః - మతాః - అపభ్రంశాః = సమస్తానాం - జీవానాం - భ్రాన్తచేతసాం.

వేదశాస్త్రపురాణాని చ = వేదములు, శాస్త్రములు, పురాణములును, ఇతిహాసాదికాని చ = ఇతిహాసము మొదలయి నవియును, మన్త్రయన్త్రాది విద్యాః చ = మన్త్రము, యన్త్రము, తన్త్రము మొదలగు విద్యలును, మోహనోచ్చాటనాదికం = మోహనము, ఉచ్చాటనము, వశీకరణము మొదలయి నవియును, శైవశాక్తాగమాదీని = శైవ, శాక్త, ఆగమాదులును, అన్యే = ఇతరములయిన, బహవః = అనేకము లయిన, మతాశ్చ = సాంఖ్యయోగాది మతములును (ఇవన్నియు), భ్రాన్తచేతసాం = గురుభక్తిలేక భ్రమజెందిన మనస్సుగల, సమస్తానాం జీవానాం = సర్వప్రాణులకును, అపభ్రంశాః = దుష్టములుగ (ప్రయోజనము లేనివిగ) జెప్పబడినవి.

ఋగాది చతుర్వేదములును, శిక్షావ్యాకరణాది షట్చాస్త్రములును, పద్మస్కాందాది అష్టాదశ పురాణములును, భాగవత భారతాది ఇతిహాసాదులును, మన్త్ర యన్త్ర తన్త్రాది విద్యలును, (1) మోహన, (2) ఉచ్చాటన, (3) వశీకరణ, (4) మోహన (మూర్ఛన), (5) స్తంభన, (6) మారణములను షట్క్రియలును, శైవ శాక్తాగమాదులును, మఱియు నితరములగు సాంఖ్యయోగాది మతములును- ఇవన్నియు శ్రీగురుదేవునియందు భక్తి లేక, గురుతత్త్వము నెఱుంగని, భ్రాంతమతి గల జనులందఱికిని అపభ్రంశము లగుచున్నవి. అనగా విరుద్ధార్థము నిచ్చుచు దుష్టములై వారికి తత్త్వమును తెలియుటను ప్రయోజనమును గలుగజేయని వగుచున్నవి. శ్రీగురుభక్తి లేనివారికి సమస్తశాస్త్రార్థములును వ్యర్థములని భావము.

అవ: గురుతత్త్వము నెఱుంగమిచే గలుగు ననర్థములు.

**జపస్తపో వ్రతం తీర్థం యజ్ఞో దానం తథైవ చ ।**
**గురుతత్త్వమవిజ్ఞాయ సర్వం వ్యర్థం భవేత్ప్రియే ॥ 24**

జపః - తపః - వ్రతం - తీర్థం - యజ్ఞః - దానం - తథా - ఏవ - చ - గురుతత్త్వం - అవిజ్ఞాయ - సర్వం - వ్యర్థం - భవేత్ - ప్రియే.

గురుతత్త్వం = శ్రీ గురువుయొక్క యథార్థస్వరూపమును, అవిజ్ఞాయ = తెలిసికొనక, జపః = జపము, తపః = తపస్సు, వ్రతం = వ్రతము, తీర్థం = తీర్థము, యజ్ఞః = యజ్ఞము, తథైవ = అట్లే, దానం చ = దానమును, హేప్రియే = ప్రియయగు గౌరీ ! సర్వం = ఈ సమస్తము, వ్యర్థం = వ్యర్థముగా, భవేత్ = తప్పక అగును.

పంచాక్షరాష్టాక్షరాది మన్త్రములను వేలకొలది జపించుటయు, మహా కఠినము లగు కృచ్ఛ్రచాంద్రాయణాది తపము లాచరించుటయు, ఏకాదశ్యాది వ్రతములను సలుపుటయు, శ్రీ కాశీరామేశ్వరాది పుణ్యతీర్థములందు గ్రుంకు లిడుటయు, అనేక క్రతువులను జేయుటయు, భూదాన గోదానాది షోడశ దానము లను చేయుటయు, ప్రియమగు నో పార్వతీదేవీ! ఇవన్నియు శ్రీగురుదేవుని యందు భక్తి గలిగి శ్రీగురుతత్త్వమును (గురువే సాక్షాత్తుగా పరమాత్మ యని శ్రీగురుదేవుని యథార్థస్వరూపమును) తెలిసికొనక పోయినచో వ్యర్థములే యగుచున్నవి. అవి యేవియు శోకనాశ ఆనందప్రాప్తుల నొసంగజాలవు. అంతమాత్రమే గాక గురుభక్తి లేకుండినచో నవి పుణ్యమునుగూడ గలుగజేయజాలవు.

అవ: శ్రీ గురుస్వరూప విజ్ఞానముచే గలుగు మహా ప్రయోజనమును నిరూపించు చున్నారు.

**గురుబుద్ధ్యాఽఽత్మనో నాన్యత్ సత్యం సత్యం వరాననే! ।**
**తల్లాభార్థం ప్రయత్నస్తు కర్తవ్యశ్చ మనీషిభిః ॥ 25**

గురుబుద్ధ్యా - ఆత్మనః - న - అన్యత్ - సత్యం - సత్యం - వరాననే - తల్లాభార్థం - ప్రయత్నః - తు - కర్తవ్యః - చ - మనీషిభిః.

గురుబుద్ధ్యా = శ్రీగురుతత్త్వ జ్ఞానముచే, ఆత్మనః = ఆత్మకంటె, అన్యత్ =

వేఱొకటి, న = లేదు, (అనుజ్ఞానము గలుగుచున్నది.) వరాననే = ఓ భవానీ ! (ఇది), సత్యం సత్యం = సత్యము, సత్యము, కిం చ = మఱియు, మనీషిభిః = వివేకవంతులచేత, తల్లాభార్థం = ఆ గురుస్వరూప విజ్ఞానప్రాప్తికొఱకు, ప్రయత్నః తు = సుదృఢతర యత్న మయితే, కర్తవ్యః = చేయందగినది.

శ్రీగురుమూర్తి సాక్షాత్పర బ్రహ్మస్వరూపము, వేరుగాదు- అను విజ్ఞానము చేతనే, ఆత్మకన్న విభిన్నమగు మఱియొకటి లేదు; అంతయు నాత్మస్వరూపమే అను అఖండజ్ఞానము గలుగుచున్నది. ఓభవానీదేవీ ! ఇది సత్యము; పరమసత్యము. కావున నాత్మానాత్మ వివేకము గలవారందఱు శ్రీ దేశికస్వామియందు పరమోత్కృష్టభక్తి గలిగి శ్రీగురుపరమాత్మప్రాప్తికై నిరన్తరము దృఢతర ప్రయత్నము గావింపవలయును.

అవ: గురుశబ్దార్థమును తెలియపరచుచున్నారు.

**గూఢావిద్యా జగన్మాయా దేహశ్చాజ్ఞానసంభవః ।**
**విజ్ఞానం యత్ప్రసాదేన గురుశబ్దేన కథ్యతే ॥ 26**

గూఢావిద్యా - జగత్ - మాయా - దేహః - చ - అజ్ఞానసంభవః - విజ్ఞానం - యత్ప్రసాదేన - గురుశబ్దేన - కథ్యతే.

యత్ప్రసాదేన = ఏ శ్రీగురుదేవుని యనుగ్రహముచేత, గూఢావిద్యా = సూక్ష్మరూపమగు పరాప్రకృతి, జగత్ = ప్రపంచము, మాయా = మాయ, (మూడుకాలములలోను లేనిది) లేక, జగన్మాయా = జగత్కారణమగు మాయ, గూఢావిద్యా = అవ్యక్తము, మూలావిద్య, దేహః చ = దేహముగూడ, అజ్ఞానసంభవః = స్వరూపజ్ఞానము లేకపోవుటవలన (మాయా కార్యమగు నవిద్యవలన) ఉత్పత్తిగలది అను, విజ్ఞానం = ఇట్టి విశేషజ్ఞానము గలుగుచున్నదో, సః = ఆ మహనీయుడే, గురుశబ్దేన = గురుశబ్దముచేత, కథ్యతే = చెప్పబడుచున్నాడు.

గూఢావిద్య యనగా అవ్యక్తమై సూక్ష్మరూపముగ నుండునది పరాప్రకృతి యని చెప్పబడుచున్నది. గూఢావిద్య యగు మాయయే జగత్తు. మాయచేత జగత్తు గలుగుచున్నది. దేహమో అజ్ఞానముచే గలుగుచున్నది. అట్టి పరాప్రకృతిచేతనే సమస్తము నిలిచియున్నది.

జగత్తన మిథ్యాభూతవస్తువు. మాయ యనగా, యా మా, సా మాయా, అను వ్యుత్పత్తిచే త్రికాలములయందు నేది లేదో, అదియే మాయ. అతాత్త్విక జ్ఞానముచే నున్నటుల తోచుచున్నది. మఱియు తన్ను తాను తెలిసికొనుటను స్వరూపజ్ఞానము లేనందుచేతనే శరీరధారణప్రాప్తి కలుగుచున్నది. అనగా దేహసంభవము అజ్ఞానసంభవముచేతనే గలుగుచున్నది, ఈ రూపమగు విశేషజ్ఞానము మఱియు నపరోక్షజ్ఞాన మేగురుదేవునిచే జనించుచున్నదో, అట్టి మహనీయాత్ముడే గురువని చెప్పబడుచున్నాడు.

మఱియు మూలావిద్య = జగత్తునకు కారణమగు మాయ. దేహమునకు కారణము అవిద్య. ఇట్లు చెప్పుటచే జగత్తునకు సాక్షియగు నీశ్వరుడు మాయోపాధికుడనియు, దేహమునకు సాక్షియగు జీవు డవిద్యోపాధికు డనియు, ఉపాధుల దూరీకరించినచో జీవేశ్వరు లొక్కటియే, భేదము లేదు, ఒకే చైతన్యము అను అపరోక్షజ్ఞానము శ్రీ గురుకృపచే గలుగుచున్నది.

అవ: గురుమహత్త్వము

**యదంఘ్రికమలద్వన్ద్వం ద్వన్ద్వతాపనివారకమ్ ।**
**తారకం భవసిన్ధోశ్చ తం గురుం ప్రణమామ్యహమ్ ॥ 27**

యదంఘ్రికమలద్వన్ద్వం - ద్వన్ద్వతాపనివారకం - తారకం - భవసింధోః - చ - తం - గురుం - ప్రణమామి - అహమ్.

యదంఘ్రికమలద్వన్ద్వం - యత్ = ఏ దేశికేన్ద్రస్వామియొక్క, అంఘ్రికమల = చరణారవిందములయొక్క, ద్వన్ద్వం = రెండు, ద్వన్ద్వతాపనివారకం - ద్వన్ద్వ = సుఖదుఃఖ శీతోష్ణాది ద్వన్ద్వములయొక్కయు, తాప = ఆధ్యాత్మికాది తాపములయొక్కయు, నివారకం = నాశకముగ, (సత్ = అయినదై) భవసింధోః = సంసారసాగరమునుండి, తారకం చ = తరింపజేయునదిగను, (అగుచున్నదో) తం గురుం = అట్టి శ్రీగురుమూర్తిని, అహం ప్రణమామి = నేను నమస్కరించుచున్నాను.

ఏ శ్రీగురుదేవుని పాదకమలద్వన్ద్వముయొక్క సంస్మరణము శీతోష్ణ, సుఖదుఃఖాది ద్వన్ద్వములను; ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు తాపత్రయమును రహిత మొనరించు చున్నదో, మఱియు ననాదిగా జననమరణ

రూప మహాదుఃఖమును గలిగించునట్టి మహాసంసార సాగరమునుండి సులభముగ జీవుని తరింపజేయుచున్నదో, అట్టి మహామహుడగు శ్రీ గురుదేవుని నేను నిరంతరము ప్రణమిల్లుచున్నాను, స్మరించుచున్నాను.

అవ: గురుసేవా ఫలము:

**దేహీ బ్రహ్మ భవేద్యస్మాత్ త్వత్కృపార్థం వదామి తత్ ।**
**సర్వపాపవిశుద్ధాత్మా శ్రీగురోః పాదసేవనాత్ ॥ 28**

దేహీ - బ్రహ్మ - భవేత్ - యస్మాత్ - త్వత్కృపార్థం - వదామి - తత్ - సర్వపావవిశుద్ధాత్మా - శ్రీగురోః - పాదసేవనాత్.

యస్మాత్ = ఏ, శ్రీగురోః పాదసేవనాత్ = శ్రీ గురుమూర్తియొక్క చరణసేవవలన, దేహీ = జీవుడు, సర్వపాపవిశుద్ధాత్మా - సర్వపాప = సమస్తపాపములనుండి, విశుద్ధాత్మా = నిర్మలాత్ముడై, బ్రహ్మ = పరబ్రహ్మముగా, భవేత్ = అగునో, తత్ = ఆ రహస్యమగు పాదసేవనమును, త్వత్కృపార్థం = నీయందలి దయ నుద్దేశించి, వదామి = చెప్పుచున్నాను.

శ్రీ గురుదేవుని శుశ్రూషావిధిచే జీవుడు సకల బంధనిర్ముక్తుడై పరబ్రహ్మస్వరూపు డగుచున్నాడను పరమరహస్యమును దెలుపుచు నీశ్వరుడు పార్వతీదేవికి శ్రీ గురుపాద సంసేవనమువలన గలుగు పరమప్రయోజనమును నిరూపించుచున్నాడు. ఓ కాత్యాయనీ! సర్వదా శ్రీ గురుపదముల నాశ్రయించి పాదశుశ్రూషను గావించుటచే నరుడు సకల పాపములును నశించి పరిశుద్ధాత్ముడై క్రమముగా బ్రహ్మత్వమును పొందుచున్నాడు. ఈ రహస్యమును నీకు చెప్పుచున్నాను. ఇచ్చట పాదసేవ యనగా శ్రీ గురుదేవు డెట్టి వైరాగ్యాది తత్త్వ మార్గమునందు పదమిడెనో, తానును నట్టి మార్గములో ప్రవర్తించుట యని యర్థము, కేవలపాద శుశ్రూషమాత్రము గాదు. అట్టివాడు తప్పక గురులక్ష్యము జెందును.

అవ: గురుపాదతీర్థప్రభావము:

**సర్వతీర్థావగాహస్య సంప్రాప్నోతి ఫలం నరః ।**
**గురోః పాదోదకం పీత్వా శేషం శిరసి ధారయన్ ॥ 29**

సర్వతీర్థావగాహస్య - సంప్రాప్నోతి - ఫలం - నరః - గురోః - పాదోదకం పీత్వా - శేషం - శిరసి - ధారయన్.

గురోః = దేశికస్వామియొక్క, పాదోదకం = పాదతీర్థమును, పీత్వా = తీసికొని (త్రాగి), శేషం = మిగిలినట్టి తీర్థమును, శిరసి = శిరస్సునందు, ధారయన్ = ధరించుచున్న, నరః = గురుభక్తుడు, సర్వతీర్థావగాహస్య - సర్వతీర్థ = సమస్తమహాపుణ్య తీర్థములలోని, అవగాహస్య = స్నానముయొక్క, ఫలం = ప్రయోజనమును, సంప్రాప్నోతి = బాగుగా పొందుచున్నాడు.

శ్రీగురుదేవుని పాదతీర్థమును కడుభక్తితో మొదట లోపలికి పుచ్చుకొని మిగిలిన తీర్థమును శిరమున జల్లుకొనవలయునను విధిని బోధించుచు తత్ప్రయోజనమును దెలుపుచున్నారు. శ్రీగురుదేవుని పాదతీర్థమును లోపలికి సేవించి, తదుపరి శేషమయిన తీర్థమును శిరస్సున ధరించుచున్న గురుభక్తుడు సకల తీర్థములలో విధిప్రకారము స్నాన మాచరించిన నా తీర్థమును పుచ్చుకొనిన నెట్టి ఫలమును పొందుచున్నాడో అట్టి పరమప్రయోజనమును బడయుచున్నాడు.

అవ: ఇకను పాదతీర్థప్రయోజనమును క్రమముగా జెప్పుచున్నారు.

**శోషణం పాపపఙ్కస్య దీపనం జ్ఞానతేజసః ।**
**గురోః పాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకమ్ ॥ 30**

శోషణం - పాపపంకస్య - దీపనం - జ్ఞానతేజసః - గురోః - పాదోదకం - సమ్యక్ - సంసారార్ణవతారకం.

గురోః పాదోదకం = శ్రీగురుపాదతీర్థము, సమ్యక్ = లెస్సగా, పాపపంకస్య = పాపమను బురదను, శోషణం = ఎండింపజేయునదిగను, జ్ఞానతేజసః = ఆత్మజ్ఞానమను తేజస్సును, దీపనం = వృద్ధిపరచునదిగను, సంసారార్ణవతారకం = సంసారమను సముద్రమునుండి తరింపజేయు నదిగను, భవతి = అగుచున్నది.

శ్రీగురుదేవుని పాదతీర్థసేవనము మొదట లోపల ప్రవేశించి హృదయములోని పంకమువంటి సమస్త పాపమాలిన్యములను కడిగి శుద్ధము చేయుచున్నది. అనగా నన్తఃకరణశుద్ధిని గలిగించుచున్నది. తరువాత నాత్మను నావరించి యున్నట్టి అజ్ఞానావరణమును దూరముచేసి ప్రకాశరూపమగు నాత్మజ్ఞానము

నభివృద్ధిపరచుచున్నది. మరియు భవసాగరమునుండి జీవుని తరింపజేయుచున్నది. ఈ ప్రకారము శ్రీ గురువర్యుని పాదతీర్థ సంసేవనము నిష్కామకర్మయోగాది త్రితయయోగములచే గలుగు త్రివిధప్రయోజనములను క్రమముగా గలిగించుచున్నది. నిశ్శేషముగా మలవిక్షేప ఆవరణములను త్రివిధదోషములను బోగొట్టుచున్నదని భావము.

అవ: శ్రీగురుపాదోదక ప్రభావము:

**అజ్ఞానమూలహరణం జన్మకర్మనివారకమ్ ।**
**జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం గురోః పాదోదకం పిబేత్ ॥ 31**

అజ్ఞానమూలహరణం - జన్మకర్మనివారకం - జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం - గురోః - పాదోదకం - పిబేత్.

అజ్ఞానమూలహరణం = అవిద్యయొక్క మూలమును ఛేదించునట్టియు, జన్మకర్మనివారకం = జన్మలను కర్మలను నివారించునదియు, జ్ఞానవైరాగ్యసిద్ధ్యర్థం = జ్ఞానవైరాగ్యసిద్ధియే ప్రయోజనముగా గలదియు (జ్ఞానవైరాగ్యములు గలుగుటకొఱకై) గురోః పాదోదకం = శ్రీగురుదేవుని పాదతీర్థమును, పిబేత్ = త్రాగవలయును.

మఱియు శ్రీగురుమూర్తి పాదతీర్థము జ్ఞానవైరాగ్యములను గలిగించి సమస్త జన్మకర్మలను తత్కారణమగు అజ్ఞానమును సమూలముగా నశింపజేయు చున్నదని తెలుపుచున్నారు. శ్రీగురుదేవుని పాదతీర్థమును సేవించుచున్న పరమభక్తునకు నాత్మానాత్మ వివేకజ్ఞానము గలుగుచున్నది. తరువాత సర్వదృశ్య విషయములందు విరక్తి జనించుచున్నది.ఆ సర్వవిషయ ప్రవృత్తులను నిరోధించుట వలన జ్ఞానము గలిగి సకలజన్మములకు హేతుభూతమగు కర్మలు నాశము లగుచున్నవి. పిదప ఆత్మజ్ఞానజ్యోతిచే సర్వదృశ్యకర్మలకు కారణమగు మూలా జ్ఞానము సమూలముగ దగ్ధమగుచున్నది.

అవ: గురుభక్తుని విధిని జెప్పుచున్నారు.

**గురుపాదోదకం పానం గురోరుచ్ఛిష్టభోజనమ్ ।**
**గురుమూర్తేస్సదా ధ్యానం గురోర్నామ సదా జపః ॥ 32**

గురుపాదోదకం - పానం - గురోః - ఉచ్ఛిష్టభోజనం - గురుమూర్తేః - సదా - ధ్యానం - గురోః నామ - సదా - జపః.

సదా = ఎల్లప్పుడు, గురుపాదోదకం = శ్రీగురుపాదతీర్థము, పానం = జలపానముగను, గురోః = గురువర్యునియొక్క, ఉచ్ఛిష్టభోజనం - ఉచ్ఛిష్ట = భుజించిన శేషమే, భోజనం = భోజనముగను, సదా = సర్వకాల సర్వావస్థలయందును, గురుమూర్తేః = శ్రీగురుదేవుని ఆకారముయొక్క, ధ్యానం = నిరంతర చింతనరూప ధ్యానమును, సదా = సర్వదా, గురోః = గురుమూర్తియొక్క, నామ = నామము (శ్రీగురునామాష్టోత్తర స్తోత్రాదులు), జపః = జపముగను (అగుచున్నవి).

సర్వవిధముల నాశ్రయించిన పరమభక్తునకు గురుపాదతీర్థము జలపాన మగుచున్నది. భుక్తాన్న శేషము భోజన మగుచున్నది, నిరంతరము పవిత్రమగు గురువరమూర్తిని ధ్యానించడమే ధ్యాన మగుచున్నది. సర్వకాల సర్వావస్థల యందును 'గురు' అను రెండక్షరములను అష్టోత్తర స్తోత్రాదులను స్మరించడమే జప మగుచున్నది.

అనగా నిరంతరము శ్రీగురుదేవుని మనోవాక్కాయములచే నమ్మిన పరమభక్తుడు గురుపాదతీర్థమునే పానము జేయవలయును. గురూచ్ఛిష్టమునే భుజింపవలయును. గురువు యొక్కమూర్తినే ధ్యానము చేయవలయును. గురు అను పరమమంత్రమునే జపించవలయు ననియు భావము.

గురుపాదతీర్థ మనగా శ్రీగురుదేవుడు సర్వతీర్థముల కరిగియు, తపో ధ్యానాదులను జేసియు పరమతత్త్వమును బొందిన వాడాయెను. అట్టి మహా పురుషుని దివ్యపాద తీర్థము నందరు తీసికొనగోరుచున్నారు. అట్టి పవిత్రతను, నట్టి యోగ్యతను సంపాదించుటే గురుపాదతీర్థ సంసేవన మగును. తీర్థమును పుచ్చుకొనుటమాత్రము గాదు. గురూచ్ఛిష్టభోజన మనగా పరబ్రహ్మమూర్తి యగు గురువరుండు పరబ్రహ్మమును బొంది ఏ యఖండానంద రసామృతమును పానము జేసెనో దానినే తాననుభవించుట. అదియే భుక్తాన్నభోజన మగును. కేవల మవశిష్టభోజనము గాదు. గురుమూర్తిధ్యాన మనగా స్థూలమగు నాకారధ్యానము మాత్రము గాదు; గురువరుడు దేనిని ధ్యానించి లక్ష్యమును జేరెనో

అద్దానిని లక్ష్యములో నుంచుకొనుటయే ధ్యానమగును. గురునామజప మనగా 'గురు' అను అక్షరద్వయ మంత్రమును మాత్రము జపించుట గాదు; గురుదేవు డిచ్చిన మంత్రమును దీక్ష వహించి జపించి, మంత్రార్థ స్వరూపు డగుటయే యగును.

"గురుమూర్తేస్సదా ధ్యానం గురుస్తోత్రం సదా జపేత్" అని పాఠాన్తరము. దీని యర్థము సులభము.

ఇకను" గురోర్నామ సదా జపేత్" అనియు కడపటిపాద మింటున్నది. అయితే పానం, భోజనం, ధ్యానం, కుర్యాత్ అని అన్వయమును చెప్పు కొనవలయును. రెంటికిని తాత్పర్యము పైన తెలిపినదే.

అవ: శివుడే గురువు, గురువే శివుడు అని ముందు నిరూపించియున్నారు.

**స్వదేశికస్యైవ చ నామకీర్తనం భవేదనంతస్య శివస్య కీర్తనమ్ ।**
**స్వదేశికస్యైవ చ నామచింతనం భవేదనంతస్య శివస్య చిన్తనమ్ ॥ 33**

స్వదేశికస్య - ఏవ - చ - నామకీర్తనం - భవేత్ - అనన్తస్య - శివస్య - కీర్తనం - స్వదేశికస్య - ఏవ - చ - నామచింతనం - భవేత్ - అన న్తస్య - శివస్య - చిన్తనమ్.

స్వదేశికస్య - స్వ = తనయొక్క, దేశికస్య = గురుదేవునియొక్క, నామకీర్తనమేవ = పవిత్రనామధేయమును కీర్తించడమే, అనన్తస్య = నాశరహితు డగు, శివస్య = పరమేశ్వరునియొక్క, కీర్తనం = కీర్తనము, భవేత్ = అగును, స్వదేశికస్య = తన గురుదేవునియొక్క, నామచింతనమేవ = నామమంత్రార్థమును ధ్యానించడమే, అనన్తస్య = అపరిచ్ఛిన్నుడైన, శివస్య = మహేశ్వరునియొక్క, చింతనం = ధ్యానము, భవేత్ = అగును.

శ్రీదేశికేంద్రస్వామియొక్క నామమంత్రములను సర్వదా కీర్తించడము నాశరహితుడైన పరమశివుని కీర్తన మగును. అట్లు శ్రీగురుస్వామియొక్క నామమంత్రార్థములను చింతించడమే అపరిచ్ఛిన్నుడగు మహేశుని ధ్యాన మగును. ఇట్లు శివగురువుల కేకత్వమును తెలిపియున్నారు.

అవ: గురుపాదరజోపరాగరేణు మాహాత్మ్యము

**యత్పాదామ్బుజరేణుర్వై కోఽపి సంసారవారిధౌ ।**
**సేతుబంధాయతే నాథం దేశికం తముపాస్మహే ॥ 34**

యత్పాదామ్బుజరేణుః - వై - కః - అపి - సంసారవారిధౌ - సేతుబంధాయతే - నాథం - దైశికం - తం - ఉపాస్మహే.

కః పి = ఒకానొక, యత్పాదామ్బుజరేణుః = పాదకమలముయొక్క పరాగము, వై = నిశ్చయముగ, సంసారవారిధౌ = భవసాగరమందు, సేతుబంధాయతే = వంతెనవలె నాచరించుచున్నదో, తం = అట్టి, నాథం = రక్షకుడగు, దైశికం = దేశికేంద్రుని, ఉపాస్మహే = ఉపాసించుచున్నారము.

శ్రీగురుదేవునియొక్క పాదపరాగరేణు వొకటయ్యు అనన్తమగు మహా భయంకర సంసారసముద్రమును తరించుటకు సేతుబంధ మగుచున్నది. కావున నట్టి పరమరక్షకుడగు శ్రీగురుదేవుని మేము నిరంతరము ఉపాసించుచున్నారము. శ్రీగురుదేవపాదకమల రజోరేణువుయొక్క ప్రభావ మిట్టిదని తెలియవలెను.

అవ: గుర్వనుగ్రహ ప్రభావము.

**యదనుగ్రహమాత్రేణ శోకమోహౌ వినశ్యతః ।**
**తస్మై శ్రీదేశికేంద్రాయ నమోఽస్తు పరమాత్మనే ॥ 35**

యదనుగ్రహమాత్రేణ - శోకమోహౌ - వినశ్యతః - తస్మై - శ్రీ దేశికేంద్రాయ - నమః - అస్తు - పరమాత్మనే.

యదనుగ్రహమాత్రేణ = ఏ గురుమూర్తియొక్క యనుగ్రహమాత్రముచే, శోకమోహౌ = శోకమోహములు, వినశ్యతః = పూర్తిగా నశించుచున్నవో, తస్మై = అటువంటి, పరమాత్మనే = పరమాత్మస్వరూపుడగు, శ్రీదేశికేంద్రాయ = శ్రీగురువరునికొఱకు, నమః = ప్రణామము, అస్తు = అగుగాక !

సకలానర్థములకు కారణములగు శోకమోహములు నశించునట్టి హేతువును తెలుపుచున్నారు. ఏ దేశికేంద్రస్వామియొక్క కటాక్షప్రసరణ మాత్రము చేతనే శోకమోహములు పూర్తిగా నశించి జీవేశ్వరైకత్వజ్ఞానము కలుగుచున్నదో అటువంటి పరమాత్మ యగు శ్రీ సద్గురుమూర్తికి నా నమస్కారము.

అవ: శ్రీగురుదేవునినుండి పరమకారుణ్యమును బడసినచో గలుగు మహా ప్రయోజనమును నుడువుచున్నారు.

**యస్మాదనుగ్రహం లబ్ధ్వా మహదజ్ఞానముత్సృజేత్ ।**
**తస్మై శ్రీదేశికేంద్రాయ నమశ్చాభీష్టసిద్ధయే ॥ 36**

యస్మాత్ - అనుగ్రహం - లబ్ధ్వా - మహత్ - అజ్ఞానం - ఉత్సృజేత్ - తస్మై - శ్రీదేశికేంద్రాయ - నమః - చ - అభీష్టసిద్ధయే.

యస్మాత్ = ఏ గురుదేవునినుండి, అనుగ్రహం = పరమకారుణ్యమును, లబ్ధ్వా = పొంది, మహత్ = గొప్పదగు, అజ్ఞానం = అజ్ఞానమును, ఉత్సృజేత్ = విడుచునో, తస్మై = అటువంటి, శ్రీదేశికేంద్రాయ = శ్రీగురుదేవునికొరకు, అభీష్టసిద్ధయే చ = ఇష్టార్థముల సిద్ధికొరకు, నమః = నమస్కారము.

ఏ శ్రీగురుదేవునినుండి పరమకారణమును బడసి అవ్యాజాపార కరుణకు పాత్రుడైన భక్తుడు సకలానర్థకారి యగు మూలాజ్ఞానమునుండి విడివడి అఖండ జ్ఞానియై సకలాభీష్టములను పొందుచున్నాడో, అట్టి శ్రీదేశికేంద్రస్వామికొరకు నేను నమస్కరించెదను.

అవ: గురువే కాశీశ్వరుడు.

**కాశీక్షేత్రం నివాసశ్చ జాహ్నవీ చరణోదకమ్ ।**
**గురుర్విశ్వేశ్వరస్సాక్షాత్ తారకం బ్రహ్మ నిశ్చయః ॥ 37**

కాశీక్షేత్రం - నివాసః - చ - జాహ్నవీ - చరణోదకమ్ - గురుః - విశ్వేశ్వరః - సాక్షాత్ - తారకం - బ్రహ్మనిశ్చయః.

నివాసః = నివాసస్థలమే, కాశీక్షేత్రం = కాశీక్షేత్రము, చరణోదకమ్ = పాదతీర్థము, జాహ్నవీ = గంగానది అగుచున్నది, గురుః = గురుదేవుడే, సాక్షాత్ విశ్వేశ్వరః = సాక్షాద్విశ్వేశ్వరుడగును, బ్రహ్మనిశ్చయః = పరబ్రహ్మవిషయక నిశ్చయజ్ఞానమే, తారకం = ప్రణవతారకమగును.

శ్రీగురుదేవుడు సాక్షాదీశ్వరుడను విషయమును సంపూర్ణసాదృశ్యముతో తెలుపుచు, శిష్యునియొక్క జీవితము సర్వము శ్రీగురుదేవుని సన్నిధానముననే

పూర్తియగు చున్నదను విషయమును దేటబరచుచున్నారు. శ్రీ గురుదేవునియొక్క నివాసస్థలమే కాశీక్షేత్ర మగుచున్నది. శ్రీగురుదేవుని పాదతీర్థ సేవనమే గంగాతీర్థపాన మగుచున్నది. శ్రీ గురుదేవుడే ప్రత్యక్షమగు కాశిలో నివసించుచున్న విశ్వేశ్వరుడు. శ్రీ గురుదేవునికడ శ్రవణమననాదులను జేసి నిశ్చయముగా కలిగిన బ్రహ్మజ్ఞానమే విశ్వేశ్వరు డుపదేశించు ప్రణవతారకము.

అనగా పవిత్రమగు వారణాసీనివాసము, పునీతమగు గంగాతీర్థస్నానము, శ్రీ విశ్వేశ్వరుని దర్శనము, తారకమంత్రోపదేశము- ఇవన్నియు శ్రీ గురుదేవుని సన్నిధానముననే లభించుచున్న వనియు, కాశీనివాసాదులచే గలుగు పరమ ప్రయోజనము గలుగుచున్న దనియు భావము.

అయినను పురాణములలో శ్రీశివుడు మరణకాలమున సకల జీవులకు ప్రణవతారకము నుపదేశించు చున్నాడని మాత్రము గలదు. దానిచే జీవులు ముక్తులగు చున్నారనియు తెలిపెదరు. కాని ఇచ్చోట జ్ఞానమూర్తియగు శ్రీ గురుదేవుడే సాక్షాత్తుగా గానుపించుచున్నాడు. మరియెచ్చోటనో గాక ఇచ్చటనే బ్రహ్మతత్త్వజ్ఞానము నుపదేశించి జీవుని బ్రహ్మత్వము నొందించి, జననమరణ రహితమగు శాశ్వతానందము ననుభవింప జేయుచున్నాడు. ఇట్టి పరమభక్తుని జీవితమే ధన్యము. ఇట్టి తత్త్వము కాశీక్షేత్రాదులచే సిద్ధించదని తెలియవలెను. ఈ ప్రకారము శ్రీ గురుదేవుని యఖండవిజ్ఞాన మహిమను ప్రత్యక్షముగా నెరుంగవలయును.

ఇంతవరకు సూక్ష్మముగా గురుశుశ్రూషా విధానమును దెలిపిరి. వాని ప్రయోజనమును కూడా నిరూపించిరి. అయినను వేదాంతశాస్త్రములలో గురుశుశ్రూష నాలుగు విధములుగా నున్నది. (1) స్థానశుశ్రూష, (2) అంగశుశ్రూష, (3) భావశుశ్రూష, (4) ఆత్మశుశ్రూష.

1. స్థానశుశ్రూష యనగా- శ్రీగురుదేవుని ఆశ్రమమునుగాని, గృహారామ ములను గాని పరిశుద్ధము చేయుచు భద్రముగా నిరీక్షించు చుండుటయే కాదు; శ్రీగురుదేవుడు ఏ యే దేశముల కరిగి భక్తులకు జ్ఞానబోధ జేసి పవిత్రులనుగా జేయుచున్నాడో, అట్లు తాజేయుట స్థానశుశ్రూష యగును.

2. అంగశుశ్రూష యనగా- దేహమునుమాత్రము సేవించుట, రక్షించుటయు మాత్రము కాదు; శ్రీగురుమూర్తి ఏ యే తపముల నాచరించి ధ్యానాదులచే శరీరమును పవిత్రముగా శుద్ధముగా జేసుకొనెనో, తానట్లు తన శరీరమును తపోధ్యానాదులచే తేజోవంతముగను, నిర్మలముగను జేసికొనుట యగును.

3. భావశుశ్రూష యనగా - గురుడే తల్లి, తండ్రి, సమస్తము నాయనయే యని భావించుట మాత్రము కాదు; శ్రీదేశికేంద్రస్వామి ఎట్టి నిర్గుణ పరబ్రహ్మ తత్త్వమును నిరంతరము భావించుచుండెనో, అట్లు తాను భావించుటయే యగును.

4. ఆత్మశుశ్రూష యనగా- గురువున కిష్టములగు పదార్థములను నడుగక మునుపే తెచ్చి యిచ్చుట మాత్రము కాదు; గురుదేవు డెట్టి స్వస్వరూపస్థితిలో నిలిచి పరబ్రహ్మస్వరూపుడై యున్నాడో తానట్లు స్వస్వరూపమును మరువక సదా సర్వాత్మభావముతో పరబ్రహ్మస్వరూపుడై యుండుట యగును. ఈ విషయము నంతయు నిట సంగ్రహముగా పై శ్లోకములలో దెలిపిరి.

అవ: శ్రీగురుదేవుని విష్ణుస్వరూపునిగా తెలుపుచున్నారు.

**గురుసేవా గయా ప్రోక్తా దేహస్స్యాదక్షయో వటః ।**
**తత్పాదం విష్ణుపాదం స్యాత్ తత్ర దత్తమనస్తతమ్ ॥ 38**

గురుసేవా - గయా - ప్రోక్తా - దేహః - స్యాత్ - అక్షయః - వటః - తత్పాదం - విష్ణుపాదం - స్యాత్ - తత్ర - దత్తమనః - తతం.

గురుసేవా = దేశికేంద్రస్వామియొక్క సేవయే, గయా = గయాక్షేత్రముగ, ప్రోక్తా = చెప్పబడినది, దేహః = శ్రీగురుదేవుని దేహము, అక్షయః = నాశరహితమగు, వటః = వటవృక్షము, స్యాత్ = అగును, తత్పాదం = శ్రీగురుపాదమే, విష్ణుపాదం = విష్ణుపాదముగా, స్యాత్ = అగును, తత్ర = అట్టి గురుదేవుని పాదమునందు, దత్తమనః = సమర్పింపబడిన మనస్సే, తతం = వ్యాపకస్వరూపము గల దగుచున్నది.

భక్తిశ్రద్ధలతో జేయబడు శ్రీగురుదేవుని సేవయే గయాక్షేత్ర మగును. శ్రీగురుమూర్తియొక్క శరీరమే నాశరహితమగు వటవృక్షమని తెలియవలెను.

అచ్చటనున్న విష్ణుపాద మగును. ఆ శ్రీసద్గురుస్వామియొక్క పాదమునం దర్పింపబడిన మనస్సే వ్యాపకస్వరూప మగును. అనగా శ్రీగురుపాద ధ్యానముచే చిత్తము సర్వవ్యాపక చిత్స్వరూపము నొందుచున్నది. గయాక్షేత్రమున అక్షయవట వృక్షమును దర్శించి విష్ణుపాదములను సేవించినచో నెట్టి పరమ ప్రయోజనము లభించుచున్నదో, అట్టి ఫలమును శ్రీ గురుదేవుని సేవించి, శ్రీగురుమూర్తిని ధ్యానించి, తత్పాదముల నాశ్రయించిన బొందుచున్నాడు. అంతమాత్రమే గాదు, తన మనస్సు బ్రహ్మములో లీనమై బ్రహ్మస్వరూపమే యగుచున్నది.

అవ: శిష్యధర్మములు.

**గురుమూర్తిం స్మరేన్నిత్యం గురోర్నామ సదా జపేత్।**
**గురోరాజ్ఞాం ప్రకుర్వీత గురోరన్యన్న భావయేత్॥ 39**

గురుమూర్తిం - స్మరేత్ - నిత్యం - గురోః - నామ - సదా - జపేత్ - గురోః - ఆజ్ఞాం - ప్రకుర్వీత - గురోః - అన్యత్ - న - భావయేత్.

నిత్యం = ఎల్లప్పుడును, గురుమూర్తిం = శ్రీగురుదేవుని రూపమును, స్మరేత్ = స్మరించవలయును, గురోః = శ్రీ సద్గురునియొక్క, నామ = నామమును, సదా =ఎల్లప్పుడు, జపేత్ = జపించవలయును, గురోః = గురుదేవునియొక్క, ఆజ్ఞాం = ఆజ్ఞను, ప్రకుర్వీత = చేయవలయును, గురోః = గురుబ్రహ్మముకన్నను, అన్యత్ = ఇతరమగు దృశ్యపదార్థమును, న భావయేత్ = భావించవలదు.

గురుస్వరూపమును సర్వదా పరబ్రహ్మనుగా స్మరించవలయును. శ్రీసద్గురుదేవుని వాచకమగు 'గురు ' అను ద్వ్యక్షర మంత్రమును సర్వదా జపించవలయును. ఎల్లప్పుడును దేశికవరేణ్యునియొక్క శాసనము నాచరణలో నుంచవలయును. గురుబ్రహ్మముకన్న నితరమగు దృశ్యపదార్థ మేదియు భావింప దగదు. ఈ ప్రకారము గురుమూర్తి స్మరణము, గురుమంత్రజపము, గురుశాసన ప్రకారము ప్రవర్తించుట, గురుపరబ్రహ్మమును భావించుట- ఇవన్నియు శిష్యుని పరమధర్మములని తెలియవలెను.

అవ: బ్రహ్మజ్ఞానము కలుగు నుపాయమును దెలుపుచున్నారు.

**గురువక్త్రే స్థితం బ్రహ్మ ప్రాప్యతే తత్ప్రసాదతః ।**
**గురోర్ధ్యానం సదా కుర్యాత్ పురుషం స్వైరిణీ యథా ॥ 40**

గురువక్త్రే - స్థితం - బ్రహ్మ - ప్రాప్యతే - తత్ప్రసాదతః - గురోః - ధ్యానం - సదా - కుర్యాత్ - పురుషం - స్వైరిణీ - యథా.

గురువక్త్రే = గురుముఖమునందు, స్థితం = ఉంటున్న, బ్రహ్మ = బ్రహ్మజ్ఞానము (వేదము), తత్ప్రసాదతః = ఆ గురుదేవుని అనుగ్రహమువలన, ప్రాప్యతే = పొందబడుచున్నది (కావున), స్వైరిణీ = వ్యభిచారిణి, పురుషం యథా = పరపురుషునివలె, గురోః = గురుమూర్తియొక్క, ధ్యానం = చింతనమును, సదా = ఎల్లప్పుడు, కుర్యాత్ = చేయవలెను.

శ్రీగురుదేవుని ముఖకమలమున సర్వదా (వేదములు) నిర్ఘోషమగు బ్రహ్మజ్ఞాన ముంటున్నది. ఆ గురుదేవుని యపారమగు ననుగ్రహముచేతనే యట్టిది ప్రాప్త మగును. సకల వేదార్థములు గోచరించును. కావున గురువరుని కటాక్షవీక్షణ ప్రసారమునకై, స్వేచ్ఛావిహారిణి యగు వ్యభిచారిణి నిరంతరము పరపురుషుని చింతించు నటుల, గురుభక్తుడును శ్రీగురుదేవ స్వరూపమును అనవచ్ఛిన్న ప్రవాహమువలె విచ్ఛేదరహిత భావనచే ధ్యానించవలయును.

అవః శ్రీ గురు శరణము.

**స్వాశ్రమం చ స్వజాతిం చ స్వకీర్తిం పుష్టివర్ధనమ్ ।**
**ఏతత్సర్వం పరిత్యజ్య గురుమేవ సమాశ్రయేత్ ॥ 41**

స్వాశ్రమం - చ - స్వజాతిం - చ - స్వకీర్తిం - పుష్టివర్ధనం - ఏతత్ - సర్వం - పరిత్యజ్య - గురుం - ఏవ - సమాశ్రయేత్.

స్వాశ్రమం = తనయొక్క ఆశ్రమమును, స్వజాతిం = తన జాతిని, స్వకీర్తిం చ = తనకీర్తినిగూడ, పుష్టివర్ధనం చ = తనను పోషించు ఐశ్వర్యాదికమును, ఏతత్ సర్వం = ఈ సమస్తమును, పరిత్యజ్య = వదలి, గురుమేవ = గురువునే, సమాశ్రయేత్ = ఆశ్రయించవలయును.

తా నేయాశ్రమములో నున్నవాడైనను ఆ ఆశ్రమాభిమానమును వదలి, తాను బ్రాహ్మణాదిజాతికి జెందిన వాడైనను కులాభిమానమును దూరీకరించి,

అట్లు కీర్తిప్రతిష్ఠలను, బృహదైశ్వర్యాదికమును లెక్కింపక, సంసార దుఃఖతప్తుడై, దేహేన్ద్రియాద్యభిమానమునుగూడ విసర్జించి, కడుదీనుడై, అనన్యశరణుడై, ఎందుండినను శ్రీసద్గురుదేవునే (వారి జాతిమత భేదములను గూడ వివక్షింపక) పరమార్తితో నాశ్రయించవలెను.

అవ: గుర్వారాధనము

**అనన్యాశ్చిన్తయన్తో యే సులభం పరమం సుఖమ్ ।**
**తస్మాత్సర్వప్రయత్నేన గురోరారాధనం కురు ॥ 42**

అనన్యాః - చిన్తయన్తః - యే - సులభం - పరమం - సుఖం - తస్మాత్ - సర్వప్రయత్నేన- గురోః - ఆరాధనం - కురు.

యే = ఏ భక్తులు, అనన్యాః = వేరుశరణ్యము లేనివారలై, చిన్తయన్తః = శ్రీసద్గురుమూర్తినే ధ్యానించువారలుగ నగుచున్నారో అట్టి పరమభక్తులు, పరమం = ఉత్కృష్టమగు, సుఖం = సుఖమును, సులభం = అనాయాసముగా (పొందుచున్నారు), తస్మాత్ = అందువలన, సర్వప్రయత్నేన = అన్ని ప్రయత్నములచే, గురోః = శ్రీగురుదేవునియొక్క, ఆరాధనం = సేవను, కురు = చేయుము.

శ్రీగురుదేవునియందలి యనన్యభక్తి ప్రభావమును తెలుపుచు శ్రీ గురుదేవుని యారాధనము నుద్బోధించుచున్నారు. ఏభక్తు లితరచింత లేనివారలై శ్రీగురుదేవునే శరణుబొంది శ్రీగురుపరబ్రహ్మమునే నిత్యము ధ్యానించుచున్నారో, అట్టి పరమభక్తులు అనన్తమగు పరబ్రహ్మసుఖము ననాయాసముగ బొందుచున్నారు, అందువలన సర్వవిధముల ప్రయత్నించి శ్రీసద్గురుమూర్తినే ఓ గౌరీదేవీ ! నీవారాధింపుము. నిత్యసుఖము చేకూరును.

అవ: శ్రీ సద్గురు భక్తివిషయమై ప్రమాణమును దెలుపుచున్నారు.

**గురువక్త్రే స్థితా విద్యా గురుభక్త్యా చ లభ్య తే ।**
**త్రైలోక్యే స్ఫుటవక్తారో దేవర్షిపితృమానవాః ॥ 43**

గురువక్త్రే - స్థితా - విద్యా - గురుభక్త్యా - చ - లభ్యతే - త్రైలోక్యే - స్ఫుటవక్తారః - దేవర్షిపితృమానవాః.

గురువక్త్రే = శ్రీ దేశికవర్యునియొక్క ముఖారవిందమునందు, స్థితా = ఉంటున్న, విద్యా = సరస్వతి (బ్రహ్మవిద్య), గురుభక్త్యా = శ్రీగురుభక్తిచేతనే, లభ్యతే = పొందబడుచున్నది. ( ఈ ప్రకారముగ), త్రైలోక్యే చ = మూడు లోకములందును, దేవర్షి పితృ మానవాః = దేవఋషులు, పితృదేవతలు, మానవులు, స్ఫుటవక్తారః = స్పష్టముగ జెప్పువా రగుచున్నారు.

శ్రీ గురుముఖారవిందమున నున్న సరస్వతి (బ్రహ్మవిద్య) వారియం దమితమగు గురుభక్తిచేతనే పొందబడుచున్నది, వేఱొకదానిచేత గాదు అని ఈ మూడులోకములలోను దేవర్షులు, పితృదేవతలు, మానవులు స్పష్టముగ వచించుచున్నారు.

అవ: 'గురు' అను నక్షరద్వయముయొక్క యర్థమును ప్రత్యేకముగ తెలుపుచు గురువే పరబ్రహ్మమను విషయమును నిరూపించుచున్నారు.

**గుకారశ్చాన్ధకారో హి రుకారస్తేజ ఉచ్యతే ।**
**అజ్ఞానగ్రాసకం బ్రహ్మ గురురేవ న సంశయః ॥ 44**

గుకారః - చ - అన్ధకారః - హి - రుకారః - తేజః - ఉచ్యతే - అజ్ఞానగ్రాసకం - బ్రహ్మ - గురుః - ఏవ - న - సంశయః.

గుకారః = గు అను అక్షరము, హి = నిశ్చయముగా, అన్ధకారః = అజ్ఞానమను తిమిరము (చీకటి), రుకారః = రు అను నక్షరము, తేజః = జ్ఞానమను ప్రకాశము, (ఇతి = అని), ఉచ్యతే = చెప్పబడుచున్నది, తస్మాత్ = (అందువలన), గురుః = గురువు, అజ్ఞానగ్రాసకం= అజ్ఞానమును మ్రింగునట్టి,బ్రహ్మఏవ = పరబ్రహ్మమే, సంశయః = సందేహము, న = లేదు.

గుకారము = అజ్ఞానాంధకార వాచకము, రుకారము = జ్ఞానతేజోవాచకము, కావున గుకారమునకు = స్వస్వరూపమును తెలియజేయని ఆవరణరూపమయిన అజ్ఞానమును అన్ధకారమని యర్థము. రుకారమునకు = తద్విరోధియగు జ్ఞానప్రకాశమని యర్థము. ఇట్లు వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. ప్రకాశాన్ధకారములు పరస్పరవిరుద్ధము లగుటచే ప్రకాశము మహాతమస్సు నైనను క్షణములో నాశమొనరించు చున్నది. ఆ ప్రకారము జ్ఞానతేజస్సు ప్రసరించగనే సకలా జ్ఞానాన్ధ కారము పటాపంచ లగుచున్నది. కాన గురువనగా అజ్ఞానతిమిర భంజకుడగు

జ్ఞానతేజోరూపుడు అను నర్థము సిద్ధించినది. కావున అజ్ఞానమును నిశ్శేషముగా గ్రసించునది (మింగునది) యగు పరబ్రహ్మమే గురువు. సందియము లేదు, ఈ విధముగా శ్రీ గురుదేవుడు సాక్షాత్పరబ్రహ్మ మగుచున్నాడు. గురువు, పరబ్రహ్మమున్ను వేరు వేరు గాదు. గురువే బ్రహ్మము, బ్రహ్మమే గురువు.

అవ: గురు శబ్దార్థమును స్పష్టపరచుచున్నారు.

**గుకారశ్చాంధకారస్తు రుకార స్తన్నిరోధకృత్ ।**
**అంధకారవినాశిత్వాద్గురురిత్యభిధీయతే ॥ 45**

గుకారః - చ - అంధకారః - తు - రుకారః - తన్నిరోధకృత్ - అంధకారవినాశిత్వాత్- గురుః - ఇతి - అభిధీయతే.

అన్ధకారస్తు = తిమిర మయితే, గుకారః = గుకారము (గుకారముచే జెప్పబడుచున్నది), తన్నిరోధకృత్ చ = ఆ అన్ధకారమును నిరోధించునట్టి ప్రకాశముగూడ, రుకారః = రుకారము (రుకారముచే వచింపబడుచున్నది), అన్ధకారవినాశిత్వాత్ = అజ్ఞాన తమస్సునకు నాశకు డగుటవలన, గురుః ఇతి = గురువని, అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

గుకారము తమస్సు, రుకారము దానిని నశింపజేయు ప్రకాశము, అనగా అజ్ఞాన తమస్సును దెగటార్చు జ్ఞాన ప్రకాశము అని గురుశబ్దార్థము. గురువు అజ్ఞానాన్ధకారమును పూర్తిగా నశింపజేయుచున్న వాడగుటవలన 'గురు' అను రెండక్షరములచే జెప్పబడుచున్నాడు.'గురు' అను దివ్యమంత్రము సకలాజ్ఞానావరణ ధ్వంసకమై యున్నదని యర్థము. సిద్ధార్థ మేమనగా ప్రకాశస్వరూపమగు గురుపరబ్రహ్మము, భాస్కరుడు దట్టమగు చీకటిని పోగొట్టునట్లు, సకలాజ్ఞానమును సమూలముగ నశింప జేయుచున్నాడు కాన అజ్ఞానాన్ధకారమునకు జ్ఞానభాస్కరుడని భావము.

పాఠాన్తరశ్లోకము:-

**గుకారో భవరోగస్స్యాత్ రుకారస్తన్నిరోధకృత్ ।**
**భవరోగహరత్వాచ్చ గురురిత్యభిధీయతే ॥**

'గు' అనగా భవరోగము, 'రు' అనగా తన్నాశకము. భవరోగమును

నశింపజేయువాడు గురువని తెలియవలెను.

అవ: గురుశబ్దార్థమును ప్రకారాన్తరముగా నిరూపించుచున్నారు.

**గుకారశ్చ గుణాతీతో రూపాతీతో రుకారకః ।**
**గుణరూపవిహీనత్వాద్గురురిత్యభిధీయతే ॥ 46**

గుకారః - చ - గుణాతీతః - రూపాతీతః - గుణరూపవిహీనత్వాత్ - గురుః - ఇతి - అభిధీయతే.

గుకారః = గు అను నక్షరము, గుణాతీతః = త్రిగుణాతీతము (గుణత్రయము నతిక్రమించిన వానిని తెలుపునది), రుకారకశ్చ = రుకారముగూడ, రూపాతీతః = రూపాతీతము (రూపాతీతుని బోధించునది), గుణరూపవిహీనత్వాత్ = గుణములు, రూపము, లేనివా డగుటవలన, గురుః ఇతి = గురుడని, అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

గుకారమునకు మూడుగుణముల నతిక్రమించిన వాడనియు, రుకారము నకు రూపరహిత డనియు నర్థము. ఇట్లు గురుశబ్దము గుణాతీ తత్వమును, రూపాతీత్వమును బోధించుచున్నందుచే త్రిగుణముల నతిక్రమించి, రూప రహితుడైన మహానుభావుడు (త్రిగుణాతీత రూపాతీతమగు నఖండజ్ఞానము గల మహాత్ముడు) శ్రీగురుదేవుడని వేదాంతశాస్త్రములు నిర్ణయించుచున్నవి. గుణాతీతము, రూపాతీతము పరబ్రహ్మము గనుక గురువు పరబ్రహ్మమే అని నిర్ణీత మాయెను.

అవ: గురుస్వరూపము మాయాభ్రాన్త్యాది సకలానర్థ ధ్వంసక పర బ్రహ్మ తత్త్వమను నర్థమును విశదీకరించుచున్నారు.

**గుకారః ప్రథమో వర్ణః మాయాదిగుణభాసకః ।**
**రుకారోఽస్తి పరం బ్రహ్మ మాయాభ్రాన్తివిమోచకమ్ ॥ 47**

గుకారః - ప్రథమః - వర్ణః - మాయాదిగుణభాసకః - రుకారః - అస్తి - పరం - బ్రహ్మ - మాయాభ్రాన్తివిమోచకం.

ప్రథమః వర్ణః = మొదటి అక్షరమగు, గుకారః = గుకారము, మాయాదిగుణభాసకః- మాయాది = మాయ, అవిద్య, భ్రాన్తి మొదలయిన వానియొక్క, గుణ = త్రిగుణములను,

అనృతాది గుణములను, భాసకః = తెలియజేయునదిగ (ఉన్నది), రుకారః = రుకారము, మాయాభ్రాన్తివిమోచకం = మాయాభ్రాన్తులను దూరీకరించునట్టి, పరం బ్రహ్మ = పరబ్రహ్మమై, అస్తి = ఉంటున్నది.

'గురు' అను శబ్దములో మొదటిదగు గుకారము ('గు' అను నక్షరము) మాయ, అవిద్య, భ్రాన్తి- వీనిని, వీని గుణములు సత్త్వరజస్తమములను; శోక, మోహ, అనృత, జడ, దుఃఖాదులను బోధించుచున్నది. అనగా, మాయాభ్రాన్త్యాది సంఘాతవాచకము గుకారము. రుకారమో విరుద్ధమై, మాయాభ్రాన్తులను నశింపజేయు పరబ్రహ్మమై యున్నది. అనగా మాయాభ్రాన్తి సమూలధ్వంసక పరబ్రహ్మవాచకము రుకారము. ఈ ప్రకారము గురువనగా దేహేంద్రియాది సంఘాతరూప అవిద్యను, మాయను, వాని శోకమోహాది గుణములను నశింపజేయు పరబ్రహ్మమని యర్థము.

అవ: గురురూప మహత్త్వము:

**ఏవం గురుపదం శ్రేష్ఠం దేవానామపి దుర్లభమ్ ।**
**హాహాహూహూగణైశ్చైవ గన్ధర్వాద్యైశ్చ పూజితమ్ ॥ 48**

ఏవం - గురుపదం - శ్రేష్ఠం - దేవానాం - అపి - దుర్లభం -హాహాహూహూగణైః- చ - ఏవ - గన్ధర్వాద్యైః - చ - పూజితం.

ఏవం = పైన జెప్పిన రీతిగ, గురుపదం = గురుతత్త్వము (గురుపాదము), శ్రేష్ఠం = శ్రేష్ఠము, దేవానాం అపి = దేవతలకును, దుర్లభం = దుర్లభము, హాహాహూహూగణైః చ = హాహా అను హూహూ అను దేవతలచేతను, గన్ధర్వాద్యైః చ = గన్ధర్వాదులచేతను, పూజితం ఏవ = పూజింపబడు చున్నదిగానే యగుచున్నది.

ముందు శ్లోకములలో గురుతత్త్వమును విపులముగా విశదీకరించుచు గురువన పరబ్రహ్మమే యని స్పష్టముగ దెలిపిరి. ఈ శ్లోకమున నట్టి గురుస్వరూపము మిగుల దుర్లభమని తేటపరచుచున్నారు. గురుస్వరూపము, పరబ్రహ్మతత్త్వము నొకటే. గురువే శివుడనియు దేవుడనియు బ్రహ్మ మనియును జెప్పబడుచున్నాడు. ఇట్టి గురుస్థానము (గురుతత్త్వము, గురుస్వరూపము) పరమశ్రేష్ఠము. దేవతలకును మిక్కిలి దుర్లభము. హాహాగణము, హూహూగణము,

గన్ధర్వులు మొదలగు దేవతలందఱును దానినే పూజించుచున్నారు. మఱియు సురలందఱు శివస్వరూప శ్రీగురుదేవుని పాదారవిందమును నిత్యమును గొలుచుచున్నారని భావము.

అవ: శ్రీ గురుస్వరూపమును వర్ణించి శిష్యుని కర్తవ్యధర్మమును నివేదించు చున్నారు.

**ధ్రువం తేషాం చ సర్వేషాం నాస్తి తత్త్వం గురోః పరమ్ ।**
**గురోరారాధనం కుర్యాత్ స్వజీవత్వం నివేదయేత్ ॥ 49**

ధ్రువం - తేషాం - చ - సర్వేషాం - న - అస్తి - తత్త్వం - గురోః - పరం - గురోః - ఆరాధనం - కుర్యాత్ - స్వజీవత్వం - నివేదయేత్.

తేషాం సర్వేషాం చ = జనులందఱికిని, గురోః = శ్రీగురుదేవునికన్నను, పరం = వేరయిన, తత్త్వం = యథార్థవస్తువు, నాస్తి = లేదు, ధ్రువం = ఇది నిశ్చయము, గురోః = దేశికేన్ద్రస్వామియొక్క, ఆరాధనం = ఆరాధనమును (సేవను, పూజను) కుర్యాత్ = చేయువలయును, స్వజీవత్వం = జీవత్వముతోగూడను (తనను), నివేదయేత్ = అర్పించవలయును (తన బ్రతుకు నంతయును నివేదించవలయును).

మోక్షకాములగు సర్వజనులకును శ్రీ గురుదేవునికంటె విభిన్నమగు తత్త్వముగాని, యథార్థపదార్థము గాని లేదు. శ్రీ గురుస్వరూపమే మిగుల నుత్కృష్ట మయినది. దానికన్న నుత్కృష్టమగునది మఱియొకటి గానుపించుట లేదు, కావున గురుభక్తు లందఱు శ్రీ గురుపరబ్రహ్మము నెల్లప్పుడు నుపాసించవలయును. మఱియు తన బ్రతుకుతో సహ తనయొక్క జీవత్వమునుగూడ (తాను జీవుడను బుద్ధినిగూడ) గురుదేవుని కర్పించవలయును.

అనగా దేహేంద్రియాదులను సమస్తమును శ్రీగురువునకు సమర్పించ వలయును. ముఖ్యభావ మేమనగా దృశ్యపదార్థములందున్న అభిమానమును వీడి దాసానుదాసుడై శ్రీ సద్గురుమూర్తి నన్నివిధముల సేవించుచు తుదకు తన జీవత్వబుద్ధినిగూడ దూరీకరించి గురుస్వరూప మాత్రుడై యుండవలయును.

అవ: శిష్యుడు శ్రీగురుదేవుని భావమును కనుగొని సకలము నిచ్చుచుండ వలయునని తెలుపుచున్నారు.

**ఆసనం శయనం వస్త్రం వాహనం భూషణాదికమ్ ।**
**సాధకేన ప్రదాతవ్యం గురుసంతోషకారణమ్ ॥ 50**

ఆసనం - శయనం - వస్త్రం - వాహనం - భూషణాదికం - సాధకేన - ప్రదాతవ్యం - గురుసంతోషకారణం.

ఆసనం = దర్భాద్యాసనము, శయనం = శయ్య, వస్త్రం = వస్త్రము, వాహనం = వాహనము, భూషణాదికం = భూషణాదులు, గురుసంతోషకారణం = గురువుయొక్క సంతోషమునకు హేతువగునది(ఇదంతయు), సాధకేన = సాధకుడగు ముముక్షువుచేత, ప్రదాతవ్యం = ఇవ్వదగినది.

గురుభక్తుని సేవాప్రకార మిచ్చోట విశదీకరించుచు వాని భక్త్యతిశయమును జూపుచున్నారు. గురుభక్తులు శ్రీ గురుదేవునకు దర్భాద్యాసనములను, పరుండుటకు మెత్తని కంబళ్యాదులను, వస్త్రములను, శకటాది వాహనములను, పుష్పమాలాద్యలంకారములను సమర్పించి పూజించుచున్నారు. ఇంకను విశేషముగా నేనుగుపై అంబారి కట్టి యూరేగించుచున్నారు. ఇట్లనేక కార్యములను చేయుచున్నారు.

మరియు శ్రీ సద్గురుమూర్తికి సంతోషకారణములగు వస్తువులను దెచ్చి యిచ్చుచున్నారు. గురుసంతోష హేతుకములగు సత్కార్యములను జేయుచున్నారు. ఈ ప్రకారము పరమభక్తుడు శ్రీగురుదేవు నన్నివిధముల నారాధించునని భావము. ఇందుచే పై జెప్పిన వన్నియు నశక్తుడగు శిష్యుడు తప్పక తెచ్చి ఇయ్యవలయునని భావము కాదు. గురుదేవులు వానితో సంతృప్తు డగుననియు నర్థము కాదు. శ్రీగురుదేవులు శిష్యుని సత్ప్రవర్తనచేతను, జ్ఞానతత్త్వముచేతను మాత్రమే సంతోషపడునని యెరుంగవలయును. పైన దెలిపిన వన్నియు భక్తులు పరమభక్తితో జేయు కార్యములని మాత్రము గ్రహించవలెను.

అవ: శ్రీగురుదేవుని త్రికరణశుద్ధిగా నెల్లప్పుడు నుపాసించవలయునని తెలుపుచున్నారు.

**కర్మణా మనసా వాచా సర్వదాఽఽరాధయేద్గురుమ్ ।**
**దీర్ఘదండం నమస్కృత్య నిర్లజ్జో గురుసన్నిధౌ ॥ 51**

కర్మణా - మనసా - వాచా - సర్వదా - ఆరాధయేత్ - గురుం - దీర్ఘదండం - నమస్కృత్య - నిర్లజ్జః - గురుసన్నిధౌ.

గురుం = శ్రీగురుదేవుని, కర్మణా = కర్మచేతను, మనసా = మనసుచేతను, వాచా = వాక్కుచేతను, సర్వదా = అన్ని వేళలయందును, ఆరాధయేత్ = ఆరాధించవలయును, దీర్ఘదండం = దండమువలె దీర్ఘముగా, నమస్కృత్య = నమస్కరించి, గురుసన్నిధౌ = గురుదేవుని సమీపములో, నిర్లజ్జః = అభిమానము, సంకోచము లేనివాడై యుండవలెను.

శ్రీసద్గురుదేవుని సన్నిధానమున శిష్యు డొకించుకయు నభిమాన సంకోచభావములు లేనివాడై దీర్ఘముగా సాష్టాంగదండ ప్రణామ మాచరించి, శ్రీగురుదేవుని యాజ్ఞకై సమీపమున నిలచి యెదరుచూచుచుండవలెను. మరియు, శ్రీగురుదేవు డాజ్ఞాపించిన కర్మలను జేయుటచేతను, గురుదేవుడు వచించిన వేదాధ్యయనాది పఠనముచేతను, శ్రీగురుదేవునికడ శ్రవణము చేసి దానిని మననము చేయుటచేతను పరిపూతుడై, మనోవాక్కాయముల మూడింటి నేకము చేసి, గురువు నెల్లప్పుడు నారాధించవలయును.

అవ: శిష్యుడు తనయొక్క సర్వస్వమును శ్రీగురుదేవులకు సమర్పింప వలయునని నుడువుచున్నారు.

**శరీరమింద్రియం ప్రాణమర్థస్వజనబాన్ధవాన్ ।**
**ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యో నివేదయేత్ ॥ 52**

శరీరం - ఇంద్రియం - ప్రాణం - అర్థస్వజనబాన్ధవాన్ - ఆత్మదారాదికం - సర్వం - సద్గురుభ్యః - నివేదయేత్.

శరీరం - దేహమును, ఇంద్రియం =ఇంద్రియములను, ప్రాణం = ప్రాణమును, అర్థస్వజనబాన్ధవాన్ = ధనమును స్వజనమును (భృత్యాదులను) బంధువులను, ఆత్మదారాదికం = తన భార్య మొదలుగా గలవారిని, సర్వం = సమస్తమును (వీనియందలి యభిమానమును వదలి), సద్గురుభ్యః = శ్రీగురుదేవులకొరకు, నివేదయేత్ = అర్పించవలెను. వీరందరిని శ్రీగురుదైవ కార్యములలో ప్రకర్తింప జేయవలయునని యర్థము.

పై దెలిపిన శరీరేంద్రియాదులయందలి యభిమానమును వీడి శ్రీగురు దేవునకు తను, ధన, మనముల సమర్పించి దారపుత్రాదులను కూడా శ్రీ

సద్గురుదేవుడు తెల్పిన పరతత్త్వమార్గములో ప్రవర్తింపజేసి సకలరక్షకుడగు గురుదేవునే శరణు పొందవలయును.

అవ: శ్రీగురు సర్వాత్మకత్వము.

**గురురేకో జగత్సర్వం బ్రహ్మ విష్ణు శివాత్మకమ్ ।**
**గురోః పరతరం నాస్తి తస్మాత్సంపూజయేద్గురుమ్ ॥ 53**

గురుః - ఏకః - జగత్ - సర్వం - బ్రహ్మవిష్ణుశివాత్మకం - గురోః - పరతరం - న - అస్తి - తస్మాత్ - సంపూజయేత్ - గురుం.

బ్రహ్మ విష్ణు శివాత్మకం = బ్రహ్మ విష్ణు శివ స్వరూపమగు, సర్వం జగత్ = లోకమంతయు, ఏకః గురుః = గురువొక్కడే, గురోః = గురువుకంటె, పరతరం = శ్రేష్ఠమైనది, నాస్తి = మరియొకటి లేదు, తస్మాత్ = అందువలన, గురుం = శ్రీదేశికవరుని, సంపూజయేత్ = మిక్కిలి పూజించవలయును.

~~ఈ~~ జగత్తంతయు బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపమై యున్నది. అట్టి జగత్తును గురుపరబ్రహ్మ స్వరూపమయ్యే యుంటున్నది. గురువుకన్నను శ్రేష్ఠమగు నితరమగు పదార్థ మెద్దియు లేదు. అందువలన శిష్యుడు గురుమూర్తిని సర్వదాన పూజనము గావింపవలయును. ఇట్లు గురువు సకలాత్మస్వరూపకుడు.

అవ: శ్రీగురుమూర్తి పదాంబుజము సకలోపనిషత్ప్రతిపాద్యమని చెప్పుచున్నారు.

**సర్వశ్రుతిశిరోరత్నవిరాజితపదాంబుజమ్ ।**
**వేదాంతార్థప్రవక్తారం తస్మాత్సంపూజయేద్గురుమ్ ॥ 54**

సర్వశ్రుతిశిరోరత్నవిరాజితపదాంబుజం - వేదాంతార్థ ప్రవక్తారం - తస్మాత్ - సంపూజయేత్ - గురుం.

సర్వ ........పదాంబుజం - సర్వశ్రుతిశిరః = సకలోపనిషత్తు లనెడు, రత్న = రత్నములచే, విరాజిత = ప్రకాశింపజేయబడిన, పదాంబుజం = పాదపద్మములు కలవాడును, వేదాంతార్థప్రవక్తారం = వేదాంతార్థములను ప్రవచించువాడును నగు, గురుం = శ్రీగురుమూర్తిని, తస్మాత్ = జ్ఞానరూపు డగుటవలన, సంపూజయేత్ = ఆరాధించవలయును.

శ్రీగురుదేవుని పాదకమలములు సకలవేదసారములగు నుపనిషత్తులను

రత్నములచే నలంకరింపబడి ప్రకాశించుచున్నవి. శ్రీగురుపరబ్రహ్మము సకలోప నిషత్సార విజ్ఞానస్వరూపమని యర్థము. మరియు నా గురుదేవుడు ముముక్షు జనులకు సర్వవేదాంతార్థములను విశదపరచువాడు. అట్టి విజ్ఞాన బోధకుడగు శ్రీ సద్గురుమూర్తిని సర్వదా యుపాసించవలయును.

అవ: శ్రీ గురు మహిమ:

**యస్య స్మరణమాత్రేణ జ్ఞానముత్పద్యతే స్వయమ్ ।**
**స ఏవ సర్వసంపత్తిః తస్మాత్సంపూజయేద్గురుమ్ ॥ 55**

యస్య - స్మరణమాత్రేణ - జ్ఞానం - ఉత్పద్యతే - స్వయం - సః - ఏవ - సర్వసమ్పత్తిః- తస్మాత్ - సంపూజయేత్ - గురుం.

యస్య = ఏ శ్రీగురువరునియొక్క, స్మరణమాత్రేణ = స్మరించినంత మాత్రముచేతనే, స్వయం = స్వయముగా, జ్ఞానం = తత్త్వజ్ఞానము (స్వయంప్రబోధము), ఉత్పద్యతే = కలుగుచున్నదో, స ఏవ = ఆగురుమూర్తియే, సర్వసమ్పత్తిః = సర్వసమృద్ధి, తస్మాత్ = అందువలన, గురుం = అట్టి దేశికేన్ద్రుని, సంపూజయేత్ = బాగుగా నుపాసించవలయును.

మానసమున శ్రీ గురుమూర్తిని చింతించి నంతమాత్రమున స్వయముగ నాత్మజ్ఞాన (స్వయంప్రబోధరూప అఖండవిజ్ఞాన) ముత్పన్న మగుచున్నది. శ్రీ గురుదేవుడే శిష్యునకు సర్వసమృద్ధిగ నున్నాడు. గురువే సకలజ్ఞాన వైరాగ్యాది సమృద్ధిగను, మాతృపిత్రాది సమ్పత్తిగను నిట్లు శిష్యుని సర్వస్వము గురుదేవుడై యున్నాడు. కాన నట్టి శ్రీదేశికవరుని నిరన్తరము నుపాసించవలయును. కాయేన, మనసా, వాచా విశ్వసించి యారాధించవలయును.

అవ: దేహాభిమాన త్యాగ కారణము:

**కృమికోటిభిరావిష్టం దుర్గన్ధమలమూత్రకమ్ ।**
**శ్లేష్మరక్తత్వచామాంసై ర్నద్ధం చైతద్వరాననే! ॥ 56**

కృమికోటిభిః - ఆవిష్టం - దుర్గన్ధమలమూత్రకం - శ్లేష్మరక్తత్వచామాంసైః -నద్ధం - చ - ఏతత్ - వరాననే.

హేవరాననే = ఓ గౌరీ, ఏతత్ = ఈ దేహము, కృమికోటిభిః = అనేక

సూక్ష్మకీటకములచేత (నులి పురుగులచేత), ఆవిష్టం = కూడుకొనియున్నది, దుర్గంధమల మూత్రకం = దుర్వాసనగల మలమూత్రములు గలది, శ్లేష్మరక్తత్వచామాంసైః = శ్లేష్మ రక్త చర్మ మాంసములచేత, నద్ధం చ = కప్పబడినదిగను నగుచున్నది.

బ్రహ్మజ్ఞానోత్పత్తికై వైరాగ్యము పరమకారణము గనుకను, ఎంత దుర్గంధయుత మైనను, అశాశ్వత మయినను దేహమునందలి యభిమానము వీడుట కష్టము గనుకను, దేహాభిమానమును త్యజించి వైరాగ్యము గలిగి యుండుమని యీశ్వరుడు బోధించుచున్నాడు. ఓ దేవి ! ఈ దేహము అనేక క్రిమికీటకాదులచే నిండియున్నది. మఱియు నిందులో సదా దుర్గంధయుక్తములగు మలమూత్రాదులు నిండియున్నవి. మఱియు, నిది యంతటను చర్మముతో కప్పబడి శ్లేష్మ కఫ పిత్తాదులకు నిలయ మైనది. కావున నో గౌరీ ! సర్వదా దీనియందు నభిమాన ముంచదగదు.

పాఠాన్తరశ్లోకము:-

**కృమిర క్తమలమూత్రాదిదుర్గంధకులదూషితమ్ ।**
**అనిత్యం దుఃఖనిలయం దేహం విద్ధి వరాననే ॥**

ఓ పార్వతీ! క్రిములు, రక్తము, మలమూత్రములు, దుర్వాసనా సమూహము- వీనిచే దూషితమై, దుఃఖాలయమైన దేహము శాశ్వతము గాదని తెలియుము.

అవ: ఈ శ్లోకమునుండి శ్రీగురుదేవుని స్తుతించుచున్నారు.

**సంసారవృక్షమారూఢాః పతన్తి నరకార్ణవే ।**
**యస్తానుద్ధరతే సర్వాంస్తస్మై శ్రీగురవే నమః ॥** 57

సంసారవృక్షం - ఆరూఢాః - పతన్తి - నరకార్ణవే - యః - తాన్ - ఉద్ధరతే - సర్వాన్ - తస్మై - శ్రీగురవే - నమః.

యే = ఏ మూఢజనులు, సంసారవృక్షం = సంసారమను వృక్షమును, ఆరూఢాః = ఎక్కినవారై, నరకార్ణవే = అజ్ఞానరూప నరకమను సముద్రములో, పతన్తి = పడిపోవుచున్నారో, తాన్= ఆ పాపసాగరమున మునుంగునట్టి, సర్వాన్ = అందఱిని, యః = ఏ గురుదేవుడు,

ఉద్ధరతే = రక్షించుచున్నాడో, తస్మై = అటువంటి, శ్రీగురవే = శ్రీగురుమూర్తికొఱకు, నమః = నమస్కారము.

జనులు మాయామోహముచే నేమియు దెలియనివారై జననమరణ దుఃఖాత్మకమగు సంసారమను మహావిషవృక్షము నెక్కి కేవల పాపమయ అజ్ఞాన నరకసముద్రములో బడి మునింగిపోవుచున్నారు. సకల దుఃఖముల ననుభవించు చున్నారు. మహోన్నతమగు ననేక దేహములను ధరించుట, నానావిధాభి మానములతో గూడి ప్రవర్తించుట, తిరుగా నాశరీరములను విడచుట-యను చక్రభ్రమణరూప సంసారమను మహావిషవృక్షము నెక్కినవా రగుటచే ప్రబల విషయాభిలాష యను విషమెక్కి మూర్ఛితులై(ఆత్మవిస్మృతియను మూర్ఛ గలవారై) తత్త్వమార్గము తెలియక పడిపోవుచున్నారని యర్థము. అట్టి దీనులందరినీ గురుదేవుడు బ్రహ్మజ్ఞానోపదేశమను నౌషధముచే విషయ కామనా విషమును పోగొట్టి ఆత్మస్మృతిని గలిగించి అజ్ఞాన నరకసముద్రమునుండి యుద్ధరించు చున్నాడు. కాన మహాత్ముడగు నట్టి శ్రీగురుమూర్తికి నమస్కారము.

అవ: శ్రీగురుధ్యానమును జేయుచున్నారు.

**గురుర్బ్రహ్మ గురుర్విష్ణుర్గురుర్దేవో మహేశ్వరః ।**
**గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥ 58**

గురుః - బ్రహ్మ - గురుః - విష్ణుః - గురుః - దేవః - మహేశ్వరః - గురుః - సాక్షాత్ - పరబ్రహ్మ - తస్మై - శ్రీగురవే - నమః.

గురుః = శ్రీసద్గురువు, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, గురుః = శ్రీగురుమూర్తి, విష్ణువు = విష్ణువు, గురుః = శ్రీగురుదేవుడు, దేవః = దేవుడగు, మహేశ్వరః = ఈశ్వరుడు, గురుః = శ్రీగురువర్యుడు, సాక్షాత్ పరబ్రహ్మ = ప్రత్యక్షమయిన పరబ్రహ్మము, తస్మై = అటువంటి, శ్రీగురవే = శ్రీదేశికేన్ద్రస్వామికొఱకు, నమః = ప్రణామము.

చతుర్వేదసారములగు మహా వాక్యములయొక్క లక్ష్యార్థమును బోధించు నట్టివా డగుటచే శ్రీ గురువరుండు చతుర్ముఖములతో చతుర్వేదముల నుప దేశించు బ్రహ్మదేవుడై యున్నాడు. జ్ఞానబోధలనుజేసి అజ్ఞానములో పడనీయకుండ సర్వులను రక్షంచుచున్నవా డగుటచే శ్రీగురుమూర్తి సర్వులను రక్షించునట్టి విష్ణువై

యుంటున్నాడు. శరణు జొచ్చినవారి సకలాజ్ఞానావరణములను హరింప జేయుచున్నవా డగుటచే శ్రీగురుదేవుడు సకల జగములను లయ మొనరించు దేవుడగు మహేశుడై యొప్పుచున్నాడు. ఇంత యేల, త్రిగుణాతీతమగు బ్రహ్మతత్త్వ మగుటచే శ్రీగురువు సాక్షాత్పరబ్రహ్మమై ప్రకాశించుచున్నాడు. అట్టి శ్రీగురుదేవుని కొఱకు నా నమస్కారము.

అవ: శ్రీ గురుదేవుడే జ్ఞాననేత్రము నొసంగువాడని చెప్పుచున్నారు.

**అజ్ఞానతిమిరాన్ధస్య జ్ఞానాఞ్జనశలాకయా ।**
**చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ 59**

అజ్ఞానతిమిరాన్ధస్య - జ్ఞానాంజనశలాకయా - చక్షుః - ఉన్మీలితం - యేన - తస్మై - శ్రీగురవే - నమః.

- అజ్ఞాన = అజ్ఞాన మనెడు (అవిద్య యనెడు), తిమిర = నేత్రరోగముచే (చీకటిచే), అన్ధస్య = కన్నులు గనుపించని వానియొక్క, చక్షుః = అవివేక నేత్రము, జ్ఞానాంజనశలాకయా - జ్ఞాన = స్వరూపజ్ఞాన మనెడు, అంజన = కాటుకయొక్క, శలాకయా = సూక్ష్మతూలికచేత (సన్ననిదగు కాటుకవేయు పుల్లచేత), యేన = ఏ శ్రీగురుస్వామిచేత, ఉన్మీలితం = తెరువబడెనో వివేకదృష్టి గలదిగా జేయబడెనో, తస్మై = అట్టి, శ్రీగురవే = శ్రీ గురువరునికొఱకు, నమః = వందనము.

నేత్రచికిత్స చేయువాడు కామలావ్యాధిచే కండ్లు కనపడని వానియొక్క నయనములకు కాటుక పుల్లతో కాటుకను వేసి నేత్రరోగమును పూర్తిగా బోగొట్టి దృష్టి గలవానినిగా జేయుచున్నాడు. మఱియు గాఢాన్ధకారములో నేత్రములు గానుపించక యుండినప్పుడు కాటుకను ధరించినచో నయనములచే సకల పదార్థములను గ్రహించు శక్తి గలవా డగుచున్నాడు. ఆ ప్రకారము శ్రీ గురువర్యుడు అజ్ఞానాన్ధకారముచే లేక అజ్ఞాన నేత్రరోగముచే నాత్మతత్త్వము దెలియని వానియొక్క అవివేక నేత్రమును బ్రహ్మజ్ఞానమను నంజనముచే తెరచునట్లు చేయుచున్నాడు. వాని యవివేక దృష్టిని పూర్తిగా నశింపజేసి జ్ఞానదృష్టి నొసగి రక్షించుచున్నాడు. అట్టి పరమకరుణా మూర్తియగు శ్రీ సద్గురుదేవునకు వందన మొనరించుచున్నాను.

అవ: గురువు - మహావాక్యార్థబోధ:

**అఖండమండలాకారం వ్యాప్తం యేన చరాచరమ్ ।**
**తత్పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ 60**

అఖండమండలాకారం - వ్యాప్తం - యేన - చరాచరమ్ - తత్పదం - దర్శితం - యేన - తస్మై - శ్రీగురవే - నమః.

అఖండమండలాకారం = ఖండముగాక వర్తులాకారమైన అఖండ బ్రహ్మాణ్డరూపమైన, చరాచరమ్ = స్థావరజంగమాత్మకమగు ప్రపంచము, యేన = ఏ పరమాత్మచేత, వ్యాప్తం = వ్యాపింపబడినదో, తత్ = అది (సర్వజగదుపాధిక చైతన్య స్వరూపుడగు నీశ్వరుడు), తత్పదం = తత్పదము (తత్పదార్థము) అని, యేన = ఏ శ్రీగురుదేవునిచేత, దర్శితం = చూపింపబడెనో, తస్మై = అట్టి, శ్రీగురవే = శ్రీదేశికేంద్రస్వామికొఱకు, నమః = నమస్కారము.

'తత్త్వమసి' అను మహావాక్యముయొక్క యర్థము నిక్కడ శ్రీ గురుపర బ్రహ్మ స్వరూపమే యని వేరువేరు పదములతో విమర్శించి తెలుపుచున్నారు. ఈ శ్లోకమున 'తత్' అను పదముయొక్క యర్థమును చెప్పుచున్నారు. చైతన్యస్వరూపు డగు జగదుపాధిక పరమాత్మచే చరాచరమగు బ్రహ్మాండ మంతయు వ్యాపించియున్నది. అదియే తత్పదముయొక్క యర్థ మగును. అనగా మాయోపాధికుడు ఈశ్వరు డనునది తత్పదముయొక్క వాచ్యార్థము. అట్టి తత్పదవాచ్యార్థమును విమర్శించి లక్ష్యార్థమగు చైతన్య పరబ్రహ్మము ఏ గురుదేవునిచేత బోధింపబడెనో అట్టి శ్రీ గురుమూర్తికి వందన మాచరించుచున్నాను.

అవ: త్వంపదముయొక్క యర్థమును వివరించుచున్నారు.

**స్థావరం జంగమం వ్యాప్తం యత్కించిత్సచరాచరమ్ ।**
**త్వం పదం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ 61**

స్థావరం - జంగమం - వ్యాప్తం - యత్ - కిం - చిత్ - సచరాచరం - త్వంపదం - దర్శితం - యేన - తస్మై - శ్రీగురవే - నమః.

స్థావరం = సంచరించని పర్వతాది రూపమైన, జంగమం - మనుష్య పశు పక్ష్యాది రూపమైన, సచరాచరం = ఇట్లు చరాచరములతో గూడుకొన్న, యత్కించిత్ = ఏ కొంచెముకూడ

(సమస్తప్రపంచము), వ్యాప్తం = ఏ యంతరాత్మచే వ్యాపింపబడినదో, తత్ = అది (శరీరేన్ద్రియోపాధిక చైతన్యస్వరూపుడగు జీవుడు), త్వంపదం = త్వంపదము (త్వం అను పదముయొక్క అర్థము) అని, యేన = పరబ్రహ్మస్వరూపు డగు నేగురుమూర్తిచే, దర్శితం = ఉపదేశింపబడెనో, తస్మై = అట్టి, శ్రీగురవే = గురుమూర్తికొరకు, నమః = నమస్కారము.

స్థావరజంగ మాత్మకమగు సమస్త జగత్తు చైతన్యస్వరూపు డగు, శరీరేన్ద్రియాది సంఘాతరూప అవిద్యోపాధికు డగు నంతరాత్మచే వ్యాపించియున్నది. అదియే త్వంపదముయొక్క యర్థమగును. అనగా అవిద్యోపాధికుడు జీవుడనునది త్వంపదముయొక్క యర్థము. అట్టి త్వంపద వాచ్యార్థమును విమర్శించి లక్ష్యార్థమగు చైతన్యస్వరూపము ఏ గురుమూర్తిచే నుపదేశింపబడెనో, అట్టి శ్రీగురుమూర్తికొఱకు నా నమస్కారము.

అవ: జీవేశ్వరైక్యమును దెలుపునట్టి అసిపదముయొక్క యర్థమును నిరూపించుచున్నారు.

**చిన్మయవ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరమ్ ।**
**అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥ 62**

చిన్మయవ్యాపితం - సర్వం - త్రైలోక్యం - సచరాచరం - అసిత్వం - దర్శితం - యేన - తస్మై - శ్రీగురవే - నమః.

సచరాచరం = చరాచరములతో కూడిన, సర్వం త్రైలోక్యం = సమస్తత్రిలోకములు, చిన్మయవ్యాపితం = ఏ చిద్రూప పరబ్రహ్మముచే వ్యాపింపబడి యున్నదో, తత్ = అది ( కేవల చైతన్య స్వరూప మగు జీవేశ్వరైక్యము), అసిత్వం = అసిపదముయొక్క అర్థము అని, యేన = పరమాత్మస్వరూపు డగు ఏ శ్రీగురువరునిచే, దర్శితం = తెలుపబడెనో, తస్మై = అట్టి, శ్రీగురవే = శ్రీదేశికవరునికొఱకు, నమః = ప్రణామము.

సర్వలోకములు కేవల చైతన్యముచేతనే వ్యాపింపబడియున్నవి. లోకము లన్నియు దృశ్యము. అట్టి దృశ్యము కల్పితము. అవశిష్ట మైనది కేవల చైతన్య పరబ్రహ్మమే. జీవుని ఉపాధి అవిద్య, ఈశ్వరునియొక్క యుపాధి మాయ, ఈ రెండింటిచేతనే సమస్తదృశ్యము నేర్పడుచున్నది. మిథ్యాభూతమగు దృశ్యమును దూరీకరించిన సిద్ధించునది కేవలచైతన్యమే. అదియే జీవేశ్వరైక్యము. ఇట్టి

జీవేశ్వరాభేద తత్త్వము కరుణామయుడగు నేగురుదేవునిచేత చూపింపబడెనో, జ్ఞానము గలుగజేయబడెనో అట్టి గురుస్వామికి నా నమస్కారము.

అవ: అధికారియగు ముముక్షు వతిశీఘ్రములో ముక్తు డగుచున్నాడని తెలుపుచున్నారు.

**నిమిషాన్నిమిషార్ధాద్వా యద్వాక్యాద్వై విముచ్యతే ।**
**స్వాత్మానం శివమాలోక్య తస్మై శ్రీగురవే నమః ॥ 63**

నిమిషాత్ - నిమిషార్ధాత్ - వా - యద్వాక్యాత్ - వై - విముచ్యతే - స్వాత్మానం - శివం - ఆలోక్య - తస్మై - శ్రీగురవే - నమః.

నిమిషార్ధాత్ = నిమిషముకాలముయొక్క సగములోగాని, నిమిషాద్వా = నిమిషకాలములోగాని, యద్వాక్యాత్ వై = ఏ గురుదేవునియొక్క వాక్యమువల్లనే, స్వాత్మానం = తనను, శివం = శివునిగా, ఆలోక్య = తెలిసికొని, విముచ్యతే = సంసారబన్ధమునుండి విడువబడు చున్నాడో, తస్మై = అట్టి మహామహిమ సంపన్ను డగు, శ్రీగురవే = శ్రీగురుదేవునికొరకు, నమః = నమస్కారము.

మిక్కిలి మనఃపరిపక్వము గలిగిన యధికారి యగు ముముక్షువు సకల కర్మబంధములు నశించినవా డగుటచే అర్ధనిమేషకాలములో గాని, లేక ఇకను నంతకన్న కొంచెము తగ్గియున్న యధికారి యగు సాధకుడు ఒకనిమేషకాలములో గాని శ్రీ సద్గురుదేవునియొక్క స్వస్వరూప సాక్షాత్కార బోధకవాక్య శ్రవణమువల్లనే జీవుని శివునిగా దెలిసికొని, అనగా ఆత్మను పరమాత్మనుగా నిర్ణయించుకొని సకలాజ్ఞానావరణము దొలంగి సంసారబన్ధమునుండి ముక్తు డగుచున్నాడు. అట్టి యఖండ విజ్ఞానఖని యగు శ్రీ సద్గురుమూర్తికొరకు నేను నమస్కరించుచున్నాను.

ఇచ్చట నతిశీఘ్రములో ముక్తుడగు చున్నాడను విషయమును తెలిపిరి. ఇట్లనేకచోట్ల వేదాంతశాస్త్రములయందు కలదు. నిష్కామకర్మయోగముచేతను, ధ్యానాది యోగములచేతను, ఆత్మానాత్మ విచారణచేతను సకలకల్మషములు నశించి, చిత్తైకాగ్ర్యము గలిగి కేవల మావరణ లేశముమాత్రము మిగిలినట్టి యధికారి పురుషుడు; వత్తి, తైలము మొదలగు పరికరము లన్నియు సంపూర్ణముగా నుండినప్పుడు జ్యోతి వెలుగుటకు కాలము పట్టనట్లు, శ్రీ గురుదేవుని

మహావాక్యశ్రవణముచేతనే ఆత్మజ్ఞానజ్యోతిని ప్రకాశింప జేయుటకు సమయము నపేక్షింపడు. ఫలములు, పుష్పములు పరిపక్వ మగునప్పుడు తొడిమనుండి విడిపోవుచున్నవి. వెంటనే పడిపోవుచున్నవి. అప్పుడు లెక్కించినచో నొకనిమేషమైన నుండునా? అట్లే పరిపక్వ శుద్ధజీవుడును శ్రీ సద్గురు దేవుని కృపాకటాక్షాతిశయముచే నొకించుకయు సమయము నపేక్షింపకయే మహావాక్య శ్రవణమాత్రముచేతనే ముక్తు డగుచున్నాడు. ఇట్లు అధికారిజన విషయమై చెప్పబడినదని తెలియవలెను.

అవ: శ్రీగురుదేవునియందు పరబ్రహ్మ లక్షితలక్షణము లన్నియును సంపూర్ణముగ నున్నవని నిరూపించుచున్నారు.

**చైతన్యం శాశ్వతం శాన్తం వ్యోమాతీతం నిరంజనమ్ ।**
**నాదబిందుకళాతీతం తస్మై శ్రీగురవే నమః ॥ 64**

చైతన్యం - శాశ్వతం - శాన్తం - వ్యోమాతీతం - నిరంజనం - నాదబిందుకళాతీతం - తస్మై - శ్రీగురవే - నమః.

(ఏ గురు పరబ్రహ్మము) చైతన్యం = ప్రకాశస్వరూపమై జ్ఞానరూపముగను, శాశ్వతం = సర్వకాల సర్వావస్థలయందు నాశరహితముగను, శాన్తం = సకలవృత్తి రహితముగను, వ్యోమాతీతం = గగనము నతిక్రమించి నదిగను, నిరంజనం = మాయామాలిన్యము లేనిదిగను, నాదబిందుకళాతీతం - నాద = దశవిధనాదములు, బిందు = బుద్ధి, కళా = చిత్కళలు - వీనికంటె, అతీతం = విలక్షణ మైనదిగను నున్నదో, తస్మై = అట్టి, శ్రీగురవే = శ్రీదేశికవరునికొఱకు, నమః = ప్రణామము.

శ్రీగురుపరబ్రహ్మము ప్రకాశస్వరూపము, జ్ఞాన రూపము, త్రికాలముల యందును నాశరహితము, సర్వవృత్తు లుపశమించుటచే పరమశాంతిరూపము, ఆకాశాతీతమని తెలిపి నందుచే పంచభూతములకును విలక్షణము, మాయా మాలిన్య రహితము, సర్వదా పరిశుద్ధము, దశవిధ నాదములకు బుద్ధికి దానియందు ప్రతిఫలించిన ఆత్మయొక్క ప్రకాశరూప చిత్కళలకును (జ్యోతినీలపీతాది కాంతులు) విభిన్నము, నాదబిందు కళలను జూచుచు సాక్షియై యుండునది. అట్టి పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ సద్గురుదేవునకు నిరన్తరము నేను సాష్టాంగముగా ప్రణమిల్లువాడను.

అవ: ఆ శ్రీగురుపరబ్రహ్మస్వరూపము సర్వవ్యాపకమని బోధించుచున్నారు.

**నిర్గుణం నిర్మలం శాన్తం జంగమం స్థిరమేవ చ ।**
**వ్యాప్తం యేన జగత్సర్వం తస్మై శ్రీగురవే నమః ॥ 65**

నిర్గుణం - నిర్మలం - శాన్తం - జంగమం - స్థిరం - ఏవ - చ - వ్యాప్తం - యేన - జగత్ - సర్వం - తస్మై - శ్రీగురవే - నమః.

జంగమం = చరమైన (సంచరణశీల మనుష్యాదులతో గూడిన), స్థిరం చ = అచరమైన (సంచరణరహిత పర్వతాదులతో గూడుకొన్న), సర్వం జగత్ = సమస్తలోకము, యేన = ఏ గురుపరబ్రహ్మ స్వరూపముచేత, వ్యాప్తం ఏవ = వ్యాపించబడియే యున్నదో, నిర్గుణం = గుణాతీతముగను, నిర్మలం = సకల మాయామాలిన్యరహితమై పరిశుద్ధముగను, శాన్తం = పరమశాన్తిస్వరూపముగను (యే గురుస్వరూప మున్నదో), తస్మై శ్రీగురవే = అట్టి శ్రీ గురుమూర్తికి, నమః = నమస్కారము.

ఈ చరాచరాత్మకమగు జగమంతయు నేగురుపరమాత్మస్వరూపముచే వ్యాపింపబడి యున్నదో, అనగా నేగురుస్వరూపము సర్వవ్యాపకమో, గుణాతీత మయినదో, సర్వకలుషరహితమై పరిశుద్ధమో, సర్వవృత్త్యుపశమరూపమై పరమశాంతిస్వరూపమో, అట్టి సర్వవిద్యాత్మక సర్వాన్తర్యామియగు శ్రీగురుపర మాత్మకొఱకు సతతము వందన మాచరించు చున్నాడను. గురుతత్త్వము శివము, శాంతము.

అవ: శ్రీగురుదేవుడే పరమభక్తునకు సర్వమునై పరమశరణ్యమై యున్నాడను దేటపరచుచున్నారు.

**స పితా స చ మే మాతా స బన్ధుస్స చ దేవతా ।**
**సంసారమోహనాశాయ తస్మై శ్రీగురవే నమః ॥ 66**

సః - పితా - సః - చ - మే - మాతా - సః - బన్ధుః - సః - చ - దేవతా - సంసార మోహనాశాయ - తస్మై - శ్రీగురవే - నమః.

సః - ఆ గురువే, పితా = తండ్రి, సః = ఆ దేశికుడే, మే = నాకు, మాతా చ = తల్లిగను నగుచున్నాడు. సః = ఆ గురువరుడే, బన్ధుః = చుట్టము, సః = ఆ శ్రీగురుదేవుడే, దేవతా చ = ఇష్టదైవముగను నగుచున్నాడు, సంసారమోహనాశాయ = సంసారభ్రాంతిని

నశింపజేయునట్టి, తస్మై = అటువంటి, శ్రీగురవే = శ్రీగురుదేవునికొరకు, సంసార మోహనాశాయ= సంసారమునందలి వ్యామోహ వినాశమునకై, నమః = నమస్కారము.

శ్రీ గురుదేవుడే రక్షించునట్టి తండ్రి, యన్నివిధముల పరమప్రేమతో పోషించుచున్నట్టి తల్లి, హితాహితముల విచారించు బన్ధువు, సమస్త జ్ఞానసంపద నొసగు నిష్టదైవముగను నున్నాడు. మఱియు నవిద్యచే జనించు సకలభ్రాంతి నాశకుడై కేవల పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ గురుమూర్తిని సంసారమునందున్న వ్యామోహము పూర్తిగా నశించుటకై నేను త్రికరణశుద్ధిగా నమస్కరించుచున్నాను.

పాఠాంతరశ్లోకము:-

**త్వం పితా త్వం చ మే మాతా త్వం బన్ధుస్త్వం చ దేవతా ।**
**సంసారప్రీతిభంగాయ తస్మై శ్రీగురవే నమః ॥**

దీనియర్థము పైన తెలుపబడినదే. మీరను సంబోధనమాత్రము విశేషముగ నున్నది. ఇందుచే శిష్యునియొక్క భక్తిప్రపత్తులు తెలుపబడెను.

అవ: పరబ్రహ్మస్వరూపుడగు శ్రీగురుమూర్తియొక్క స్వరూపలక్షణముచేతనే సర్వజగత్తు నాధారము జెందియుంటున్నదని తెలుపుచున్నారు.

**యత్సత్త్వేన జగత్సత్త్వం యత్ప్రకాశేన భాతి తత్ ।**
**యదానందేన నందన్తి తస్మై శ్రీగురవే నమః ॥** 67

యత్సత్త్వేన - జగత్సత్త్వం - యత్ప్రకాశేన - భాతి - తత్ - యదానందేన - నన్దన్తి - తస్మైః - శ్రీగురువే - నమః.

యత్సత్త్వేన = ఏగురుపరబ్రహ్మముయొక్క సత్తచేత, జగత్సత్త్వం - జగత్ = ప్రపంచముయొక్క, సత్త్వం = ఉండుట (సంభవించుచున్నదో), తత్ = ఆ సర్వజగత్తు, యత్ప్రకాశేన = ఏ గురుపరమాత్మయొక్క ప్రకాశముచేత, భాతి = భాసించుచున్నదో, యదానందేన - యత్ = ఏ గురుబ్రహ్మముయొక్క, ఆనందేన = ఆనందముచేత, నన్దన్తి = ఆనందించుచున్నారో, తస్మై = అటువంటి (సచ్చిదానంద స్వరూపుడగు), శ్రీగురవే = శ్రీ గురుపరమాత్మకొఱకు, నమః = వందనము.

[యత్సత్త్వే తత్సత్త్వం = ఏది యుండిన నదుంటున్నదో, కారణ ముండిన

కార్యముంటున్నది. యదభావే తదభావః = ఏది లేకుండిన నది లేకపోవుచున్నదో అను న్యాయము ననుసరించి] శ్రీ గురుపరబ్రహ్మముయొక్క సత్తామాత్రముచేతనే సర్వజగత్తు నిలచియున్నది. లేనిచో దాని యభావమే గలుగును. కార్యమునుబట్టియే కారణ మూహింప నగును. కార్యరూప సమస్తప్రపంచ ముంటున్నది గనుకనే కారణమగు పరమాత్మ "అయం ప్రపంచః సకర్తృకః కార్యరూపత్వాత్" అను ననుమాన ప్రమాణముచే సిద్ధించుచున్నది. కావున నిట్లు శ్రీగురుపరబ్రహ్మము సకల ప్రపంచమున కాధారమై కారణరూపమున నున్నదను విషయము నిరూపిత మాయెను.

అట్లే శ్రీగురుపరబ్రహ్మము ప్రకాశించుచున్నది గనుకనే సర్వజగత్తును భాసించుచున్నదను విషయమును దెలుపుచున్నారు. "యద్భానే తద్భానం, యదభానే తదభానం = ఏది ప్రకాశించినచో నది ప్రకాశించునో, ఏది భాసింపక పోయిన నది భాసింపజాలదో" అను న్యాయము ననుసరించి సర్వదా ప్రకాశరూపమగు శ్రీ గురుబ్రహ్మస్వరూపము భాసించుచున్నది గనుకనే "తస్య భాసా సర్వమిదం విభాతి" అను నుపనిషత్ప్రమాణము చెప్పినట్లు సర్వప్రపంచము భాసవంత మగుచున్నది.

మఱియు నా గురుస్వరూప పరబ్రహ్మముయొక్క ఆనందముచేతనే సకలజీవులు నానందించుచున్నారు. ఇందుచే బ్రహ్మ మానందస్వరూపము, జీవుడును నానందస్వరూపుడే యని జీవబ్రహ్మైక్యము స్ఫుటీకరింపబడెను. ముఖ్యభావము - శ్రీగురుబ్రహ్మముయొక్క స్వరూపలక్షణము సచ్చిదానందములు. వాని ననుసరించి సర్వలోకము సత్తా గలదై, జ్ఞానము గలిగి ప్రకాశవంతమై, ఆనందయుక్తమై యున్నదను విషయమును స్పష్టపరచిరి. అట్టి సచ్చిదానంద స్వరూపుడగు శ్రీగురుపరమాత్మకొఱకు నట్టి యఖండ విజ్ఞానానుభూతికై సర్వదా వందన మిడుచున్నాను. (శ్రీగురుస్వరూపము సత్తు, చిత్తు, ఆనందము.)

అవ: గురువు - సర్వాధిష్ఠాత

**యస్మిన్ స్థితమిదం సర్వం భాతి యద్భానరూపతః ।**
**యత్ప్రీత్యా ప్రియం పుత్రాది తస్మై శ్రీగురవే నమః ॥** 68

యస్మిన్ - స్థితం - ఇదం - సర్వం - భాతి - యద్భానరూపతః - యత్ప్రీత్యా - ప్రియం - పుత్రాది - తస్మై - శ్రీగురవే - నమః.

యస్మిన్ = ఏ శ్రీ గురుస్వరూప పరబ్రహ్మమందు, ఇదం సర్వం = ఈ విశ్వమంతయు, స్థితం = ఉన్నదై, యద్భానరూపతః - యత్ = పరమాత్మస్వరూప శ్రీగురువుయొక్క, భానరూపతః = ఏ స్వయం ప్రకాశ స్వరూపమువలన, భాతి = ప్రకాశించుచున్నదో, యత్ప్రీత్యా - యత్ = సర్వాధిక ప్రియమైన ఏ శ్రీగురుపరమాత్మయొక్క, ప్రీత్యా = పరమప్రేమస్వరూపముచేత, పుత్రాది = కుమారులు మనుమలు మొదలయినవారు, ప్రియం = ప్రియ మగుచున్నారో, తస్మై = సర్వాధార స్వయంప్రకాశమాన పరమప్రేమ స్వరూప శ్రీగురుబ్రహ్మముకొఱకు, నమః = (అట్టి సాక్షాత్కార జ్ఞానముకొఱకు) నమస్కారము.

మఱియు నాగురుపరబ్రహ్మస్వరూపము సర్వవ్యాపకము, సర్వాధారము, స్వయంప్రకాశము, సర్వాధిష్ఠానము, సర్వాధికప్రియమును నై యున్నదను విషయమును తెలుపుచున్నారు. బ్రహ్మస్వరూపుడగు శ్రీ గురుదేవుని స్వరూపము నందు "సర్వభూతాని చాత్మని = తనయందు సకలభూతము లున్నవి." అను నుపనిషత్ప్రమాణము రీతిగా సకలవిశ్వము నుంటున్నది. ఆ గురుస్వరూప బ్రహ్మము నిఖిలాధారమని యర్థము. బ్రహ్మము లేకుండినచో నీ ప్రపంచము నిలువదు. ఇట్లు ఆ గురుబ్రహ్మమునం దీజగత్తు స్థితమైనది గనుకనే స్వయం ప్రకాశమాన గురుపరమాత్మయొక్క ప్రకాశస్వరూపముచేత సర్వదా ప్రకాశించు చున్నది. చైతన్యమే లేకుండిన సర్వము జడ మగును. ఆ పరబ్రహ్మస్వరూపముచేతనే సర్వము చైతన్యవంత మగుచున్నది. ఈ ప్రకార మాశ్రీగురుబ్రహ్మస్వరూపము సర్వాధిష్ఠానముగ నున్నదని సిద్ధార్థము.

భానరూపమగు నధిష్ఠానముగ సర్వదా భాసించుచున్నది. అందుచే సర్వ లోకములును భాసించుచున్నవి. మఱియు నా గురుపరబ్రహ్మవస్తువు సకల పదార్థముల కన్నను పరమప్రేమ స్వరూపమై సర్వప్రియ తమముగ నున్నది. "నాన్యత్ ప్రియతరం వస్తు" అను నుపనిషద్వాక్యము పై విషయమునే దృఢీకరించు చున్నది. బాహ్యములగు దృశ్యజాలములకంటెను (ప్రపంచము భార్యాపుత్రాదుల) తన దేహము ప్రియ మగును. ఆ శరీరముకంటెను సకలేన్ద్రియములు, ప్రాణములు, మనోబుద్ధ్యాదులు, ఒకదానికన్న నొకటి ప్రియతరములు. ప్రియతమ మాత్మ

యొక్కటియే. దానికంటె ప్రియతమ వస్తువు మఱియొకటి లేదు. అదియే సర్వాతిప్రియము. అట్లగుటచేతనే (శ్రీ గురుబ్రహ్మస్వరూపము సర్వాధికప్రియతమ మగుటచేతనే) సకల ప్రపంచమేగాక దారపుత్రాదులును తనకు ప్రియు లగుచున్నారు. 'ఆత్మనః కామాయ ప్రియం' అను నుపనిషత్తున్ను తనస్వరూప మందఱిలో నున్నందుచేతనే (ఆత్మ యున్నందుచేతనే) అందఱిని ప్రేమించు చున్నారు. అనగా తనను తానే ప్రేమించుకొనుచున్నాడు. కాన తాను (ఆత్మ) మిగుల ప్రియతమము. అందువల్లనే సర్వము ప్రియముగ భాసించుచున్నదని తెలుపుచున్నది.

ఈ శ్లోకమున బ్రహ్మముయొక్క "అస్తి, భాతి, ప్రియం" అను లక్షణముల ననుసరించి పై జెప్పిన యర్థమును దెలిపిరి. అట్టి పరబ్రహ్మస్వరూపుడగు శ్రీగురుదేవుని నేను సతతము సర్వవ్యాపక, సర్వాధిష్ఠాన, సర్వాధార, స్వయంప్రకాశ, పరమప్రేమస్వరూపమగు నాత్మసాక్షాత్కార విజ్ఞానమునకై వందన మాచరించు చున్నాను. స్మరించుచున్నాను. ధ్యానించుచున్నాను. సర్వము శ్రీగురుదేవుడే.

అవ: శ్రీసద్గురుబోధ తత్త్వము:

**యేనేదం దర్శితం తత్త్వం చిత్తచైత్యాదికం తథా ।**
**జాగ్రత్స్వప్నసుషుప్త్యాది తస్మై శ్రీగురవే నమః ॥ 69**

యేన - ఇదం - దర్శితం - తత్త్వం - చిత్తచైత్యాదికం - తథా - జాగ్రత్స్వప్న సుషుప్త్యాది- తస్మై - శ్రీగురవే - నమః.

యేన = ఏ శ్రీసద్గురుమూర్తిచేత, చిత్తచైత్యాదికం - చిత్త = మనస్సుయొక్క, చైత్య = చైత్యము, ఆదికం =ఆదిగా గల వ్యాపారము గలిగినట్టి, ఇదం తత్త్వం = ఈ పరమతత్త్వము (పరమాత్మశక్తిచేతనే మనస్సు చైతన్యము గలదై సకల వ్యాపారములందును ప్రవర్తించుచున్నది. అట్లే సకలేన్ద్రియము లుంటున్న వను యథార్థతత్త్వము), దర్శితం = బోధింపబడెనో, తథా = చిత్తమువలె, జాగ్రత్స్వప్నసుషుప్త్యాది = జాగ్రదాద్యవస్థలు గల ప్రపంచమున్ను (చైతన్యవంత మగుచున్నది, సర్వవ్యాపార ప్రవర్తనశీల మగుచున్న దను తత్త్వము), దర్శితం = ఉపదేశింపబడెనో, తస్మై =అట్టి పరమాత్మ స్వరూపుడగు శ్రీగురుమూర్తికొఱకు, నమః = నమస్కారము.

మఱియొక యర్థము:- యే = ఏ శ్రీగురువరునిచే, చిత్తచైత్యాదికం - చిత్త = మనస్సు, చైత్య = సంకల్పవికల్పములు, ఆదికం = మొదలుగా గల, ఇదం తత్త్వం = ఈ తత్త్వములు, జాగ్రత్స్వప్న సుషుప్త్యాది = జాగ్రదాది త్రివిధావస్థలు, దర్శితం = తెలుపబడెనో, తస్మై = పరమాత్మ స్వరూపుడగు సకల తత్త్వబోధక శ్రీ గురువరునికొఱకు, నమః = నమస్కారము.

శ్రీ సద్గురువరునియొక్క బోధతత్త్వ మిట్టిదని తెలుపుచు సర్వసాక్షియగు చేతనాస్వరూప పరబ్రహ్మమూర్తి గురుమూర్తి యను విషయమును ప్రతిపాదించు చున్నారు. చిత్తము జడము అయినను పరమాత్మయొక్క సన్నిధానముచే చైతన్యవంతమై సంకల్పవికల్పాత్మక వ్యాపారములందు ప్రవర్తించుచున్నది; సర్వమును గ్రహించుచున్నది. బుద్ధియు నటులే చేతనావంతమై నిశ్చయాత్మ వ్యాపార ప్రవృత్తియై సకలమును తెలియుచున్నది. ఇట్లు సకలేంద్రియ ములు జడము లయినను చైతన్యాత్మక పరమాత్మశక్తిచేత చైతన్యవంతములై సకల ప్రవృత్తి ప్రవర్తనశీలము లగుచున్నవి.

ఆ విధముగానే జాగ్రదాది త్రివిధావస్థలు గల సర్వలోకము పరబ్రహ్మ చైతన్యమువల్లనే జడమయినను చేతనాశక్తి గలదై, తత్తద్వ్యాపారవంత మగుచున్నది. అనగా జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు మూడును ప్రాణులకు పరమాత్మశక్తిచేతనే గలుగుచున్నవి. ఆ యవస్థలు పరమాత్మచైతన్యము నాశ్రయించి యున్నవి. ఆ పరమాత్మ మూడగు నవస్థలలోను స్వయంప్రకాశమై వానినిగూడ ప్రకాశ వంతములుగ జేయుచున్నాడు. అదే యర్థము "జాగ్రత్స్వప్న సుషుప్త్యాది ప్రపంచం యత్ప్రకాశతే" అను కైవల్యోపనిషద్వాక్యము తెలుపుచున్నది.

ముఖ్యతాత్పర్యము - ఆ గురుపరమాత్మ, సూర్యుడు తనయొక్క ప్రకాశశక్తిచే సకల చరాచరము నాయావ్యాపారములను జేసికొనుచుండగా సమస్తమునకు సాక్షియై యున్నటుల, తనయొక్క చైతన్యశక్తిచే నీ దేహేన్ద్రియాదులు సకల వ్యాపారములందు ప్రవర్తించగా, ప్రపంచ మంతయు నట్లే ప్రవర్తిల్లగా సర్వమును సాక్షియై తటస్థుడై యున్నాడు. అట్టి శ్రీగురు పరమాత్మకొఱకు సర్వాత్మరూప విజ్ఞానమునకై నేను ప్రణామముల నాచరించుచున్నాను.

రెండవ తాత్పర్యము: ఏ గురుదేవుడు పంచీకరణశాస్త్రము ననుసరించి

చిత్తము, మనస్సు, బుద్ధి, అహంకారము, వానియొక్క సంకల్పవికల్పములు మొదలగు వ్యాపారములు, జాగ్రదాద్యవస్థలు - ఈ ప్రకారముగ స్థూల సూక్ష్మ కారణాత్మక తత్త్వముల నన్నిటిని విశదపరచెనో; మఱియు సర్వసాక్షియగు పరమాత్మ స్వరూపమును బోధించెనో, అట్టి శ్రీగురుమూర్తికొఱకు పరమాత్మ యథార్థ స్వరూపవిజ్ఞానమునకై నిరంతరము వందన మాచరించుచున్నాను.

పాఠాన్తరశ్లోకము:-

**యేన చేతయతా హీదం చిత్తం చేతయతే నరః ।**
**జాగ్రత్ స్వప్నసుషుప్త్యాది తస్మై శ్రీగురవే నమః ॥**

సర్వమును దెలియుచు, సర్వమును చైతన్యవంతముగ జేయుచున్న పరమాత్మశక్తిచేత మనుజుడు చిత్తమును దెలియుచున్నాడు. జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను దెలియుచున్నాడు. లేక అట్టి పరబ్రహ్మముచే చిత్తము చేతనాత్మకమై తత్తద్వ్యాపారములందు ప్రవర్తించుచున్నదని తెలియుచున్నది. ఆ ప్రకారముగ నరుడు జాగ్రదాద్యవస్థలనుగూర్చి ప్రవర్తించుచున్నాడు, జాగ్రదాద్యవస్థలను పొందుచున్నాడు, తెలియుచున్నాడు.

ముఖ్యతాత్పర్యము - సమస్తము పరబ్రహ్మముచే శక్తివంతమై ప్రవర్తిల్లు చున్నది. జ్ఞానాత్మక మగుచున్నది. అట్టి శ్రీగురుపరబ్రహ్మముకొఱకు చైతన్యాత్మక స్వస్వరూప జ్ఞానప్రాప్తికై నేనన్ని విధములుగ నెల్లప్పుడును సాష్టాంగ నమస్కారమును జేయువాడను.

అవ: శ్రీగురుపరబ్రహ్మస్వరూపము సకలాత్మక మని చెప్పుచు, నద్వితీయాఖండజ్ఞాన స్వరూపమును ప్రతిపాదించుచున్నారు.

**యస్య జ్ఞానమిదం విశ్వం న దృశ్యం భిన్నభేదతః ।**
**సదైకరూపరూపాయ తస్మై శ్రీగురవే నమః ॥** **70**

యస్య - జ్ఞానం - ఇదం - విశ్వం - న - దృశ్యం - భిన్నభేదతః - సదా - ఏకరూపరూపాయ - తస్మై - శ్రీ గురవే - నమః.

ఇదం విశ్వం = ఈ సర్వజగత్తు, యస్య = ఏ గురుపరబ్రహ్మముయొక్క, జ్ఞానం = జ్ఞానస్వరూపమో, భిన్నభేదతః - భిన్న = భేదింపబడిన, భేదతః = జీవబ్రహ్మల భేదమువలన (జగత్తు వేరు బ్రహ్మము వేరను భేదము నశించుటవలన), సదా = ఎప్పుడును, ఏకరూపరూపాయ - ఏకరూప = మార్పు చెందని యొకేరూపముగల (అద్వితీయమైన), రూపాయ = స్వరూపము గల, తస్మై = అద్వితీయ పరబ్రహ్మ స్వరూపియగు, శ్రీగురవే = శ్రీ గురుదేవునికొఱకు, నమః = నమస్కారము (లేక), ఏకరూప = ఒకేరూపమైన పరబ్రహ్మముయొక్క, రూపాయ = స్వరూపము గల, తస్మై = శ్రీ గురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

సకల విశ్వము శ్రీగురుభగవంతునియొక్క విభూతియయ్యు అంతయు నాయనయొక్క విజ్ఞాన స్వరూపమే. అంతయు తానై యున్నాడు. విశ్వమన దృశ్యము. అది మిథ్యాభూత వస్తువు. అంతయు వ్యాపించియున్నది. తనయొక్క స్వరూపమే, జ్ఞానరూపమే. చైతన్యాత్మకమే. ఇట్లు వచించుట వ్యవహారముకొఱకే యని తెలియవలెను. కేవల చైతన్యాత్మక పరబ్రహ్మమే అద్వితీయము, అఖండము, అపరిచ్ఛిన్నము, సచ్చిదానందము. అజ్ఞానవశముచే భాసించుచున్నదానిని లయ మొనరించుటకై అంతయు బ్రహ్మము మొదలగు తత్త్వార్థములను దెలిపిరి.

కాని విచారించినచో నదియు యథార్థతత్త్వము గాదు. మఱియొకటి వేరుగా గాని కలిసిగాని యున్నచో పై జెప్పిన వ్యవహారములు సమంజసము లగును. వేఱొకటి లేనేలేదు. వస్తువే లేనప్పుడు ఇదమిత్థమని యెట్లు నిర్ణయించగలము? అది భేదముగా నున్నది. అభేదముగా నున్నది. ఇదంతయు నతిప్రసక్తముగనే భాసిల్లుచున్నది. జగత్తునకును బ్రహ్మమునకు నేమి సంబంధమని వాదించువారు పై విషయమును గమనించుకొనవలయు. జీవబ్రహ్మభేద ప్రతిపాదక మహా వాక్యార్థముల తత్త్వమును గూడ నిట్లే తెలియవలెను. వ్యాధి గలవానికి నౌషధము లను తెలిపిరి. ఔషధసేవనము రోగమును మాత్రము నశింప జేయు చున్నది. అంతమాత్రమే. ఆరోగ్యము స్వతస్సిద్ధముగానే యున్నది. కాని వ్యవహారములో నౌషధము వ్యాధిని పోగొట్టి ఆరోగ్యమును గలుగజేసినదని తెలిపెదరు.

సుఖము (స్వాస్థ్యము) గానుండుట సహజమే. రోగాదులు ప్రతి బంధకములు. ఆప్రకారము సకల వేదాంతశాస్త్రములు, మహావాక్య తత్త్వార్థములు

మూలాజ్ఞాన నాశమునకై యేర్పడినవి. దీనిచే సత్తామాత్ర పరబ్రహ్మ వస్త్వావరణ భంజకత్వము గలిగినది. కాని యున్న వస్తు వున్నట్లే యున్నది. అది అద్వితీయము, యథార్థము. జీవుడు, జగత్తు, మాయ, అవిద్య - ఇదంతయు కల్పితము. జీవుడను పదార్థ మున్నగదా అభేద మని చెప్పుట? జగత్తున్న గదా వేరుగాదని జెప్పుట? ఈ తత్త్వము నంతరమున నిడుకొనియే వేదాంతశాస్త్రము "అది మనోవాగతీతము. దానిని వేదములు తెలియజాలవు. ఉపనిషత్తులు, గురువులు మార్గదర్శకులే. బోధనామాత్రమే యేర్పడినవి". అని తెలుపుచున్నది. దృశ్యము భాసించుచుండిన యథార్థముగా పై జెప్పిన భావన లన్నియు గావలసినవే. ఈ దేహము భాసించు చున్నంతవరకు తమోనాశమునకై దీపప్రకాశము వాంఛిత మగునట్లు స్వస్వరూపజ్ఞాన ముండియే తీరవలయును. ఆ దృశ్యమే లేనప్పుడిక జెప్పవలసిన దేమి యున్నది? మా శ్రీగురుదేవుని వాక్యమును వినుడు.

**"దృక్స్వరూపే స్థిరం కుర్యాత్ అదృశ్యం దృశ్య మేవ హి"**

ఆత్మస్వరూప స్థిరత్వము గలిగిన దృశ్యమెక్కడిది? ప్రకాశమున చీకటి యుండునా ! యథార్థ మిది. ఉపనిషద్వాక్యము-

**"న నిరోధో న చోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।**
**న ముముక్షుర్న వై ముక్త ఇత్యేషా పరమార్థతా" ॥**

జననమరణములు, బంధమోక్షములు లేవు. ముముక్షువులు, ముక్తులును లేరు. ఇదియే పరమార్థము, అద్వితీయాఖండ పరబ్రహ్మము. ఇట్టి తత్త్వమును యస్య జ్ఞానమిదం విశ్వం" అను వాక్యముచే సూచించిరి. జగత్తునకు, పరబ్రహ్మమునకు, జీవునకు, నీశ్వరునకు భాసించుచున్న భేదము భిన్న మగుట వలన దృశ్యమే లేదు. కేవల సత్తామాత్ర చైతన్యమే ఎల్లప్పుడును నపరిణామియై యద్వితీయమై యొకేరూపమున నున్న స్వరూపము గల పరబ్రహ్మముయొక్క మూర్తి యయిన శ్రీగురుమూర్తికొఱకు నట్టి యద్వితీయా ఖండానందప్రాప్తికై నేను నిత్యము నమస్కరించుచున్నాను.

అవ: శ్రీ గురువే తత్త్వము:

**యస్య జ్ఞాతం మతం తస్య మతం యస్య న వేద సః ।**
**అనన్యభావభావాయ తస్మై శ్రీగురవే నమః ॥ 71**

యస్య - జ్ఞాతం - మతం - తస్య - మతం - యస్య - న - వేద - సః - అనన్యభావభావాయ - తస్మై - శ్రీగురవే - నమః.

యస్య = ఏ పరమాత్మకు, జ్ఞాతం = తెలియబడినది (జ్ఞాన విషయమైన సమస్తము), తస్య = ఆ పరమాత్మకు, మతం = ఇష్టమో (స్వసంకల్పమహిమచే గల్పింపబడిన దగుచున్నదో), సః = ఆ పరమాత్మయే, యస్య మతం = ఏ పరమాత్మయొక్క సంకల్పవిషయమైన సర్వవిశ్వ మున్నదో, తత్ = ఆసంకల్పిత నామరూపాత్మక జగత్తును, వేద = తెలిసికొనకపోయెను (తనకంటెను వేఱుగా దెలిసికొనకపోయెనని యర్థము), అనన్యభావభావాయ - అనన్యభావ = ఇతర పదార్థములు లేని అద్వితీయమైన, భావాయ = పదార్థమైన (పరమాత్మ స్వరూపుడైన),తస్మై = అటువంటి జ్ఞానాత్మక అద్వితీయాత్మక తత్త్వస్వరూపుడైన, శ్రీగురవే = శ్రీగురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడు జీవజడాత్మక సమస్త విశ్వమును కల్పించి తనచే కల్పితమయిన, యిష్టమయిన సకలమును దెలియకపోయెను అను నాశ్చర్యార్థమును, విరుద్ధార్థమును ప్రతిపాదించుచు, తనకన్న వేరగు దృశ్యమే లేదను విషయమును, అఖండాద్వితీయ పరిపూర్ణ తత్త్వమును స్పష్టపరచుచున్నారు. "సోఽమన్యత స ఐక్షత" అను నుపనిషద్వాక్యరీతిగా భగవంతుడు తాను విహరింప తలంచెను. చూచెను. సమస్తమును తనరూపముగానే సంకల్పించెను. అనేక విధములుగా జేసికొనెను. అందులో తానే విహరించుచు జీవజడాత్మక ప్రపంచ మును తెలిసికొనెను. జీవుడు సుషుప్తినుండి మేల్కాంచినప్పుడు సమస్తనామ రూపాత్మక జగత్తును స్మరించుచున్నాడు. తిరుగా సుషుప్తిలో సమస్తమును మరచి జ్ఞప్తిరూపుడై యున్నాడు. అన్తఃకరణము లేమిచే నేమియు తెలియుట లేదు. ఆ విధముగానే పరమాత్మయు సంకల్పముయొక్క బలిమిచే నంతయు సృష్టించి తెలియుచున్నాడు. విహరించుచున్నాడు. సంకల్పము ఉపశమించినప్పుడు దృశ్యము లేనందుచే తానై యున్నాడు. మఱియొక వస్తువు లేదు. తెలియకుండు టదియే. ఇట్లు సృష్టి స్థితి లయములు పరమాత్మచే గలుగుచున్నవని తెలియవలెను.

మఱియొక భావ మేమనగా పరమాత్మ సమస్తమును సృష్టించి జ్ఞానవిషయ

మును జేసికొని (తెలిసికొని) అంతయు తనరూపముగానే యాయెను.అప్పుడు సకలచరాచర ప్రపంచము తనకన్న భిన్నము గానందుచే, తనయొక్క స్వరూప మఖండముగా నున్నందుచే సకలమును తనయొక్క రూపమునుగా దెలియుచు, తనకంటె వేరగు వస్తువును తెలియకపోయెను. "సర్వమాత్మమయం జగత్" అన్నట్లు, "అన్తః పూర్ణ ః బహిః పూర్ణః రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ" అన్నట్లును ఆ పరమాత్మ అఖండపరిపూర్ణ స్వరూపుడు. ఇట్లగుటచే నా పరమాత్మ ఇతరవస్తు రహితస్వరూపముతో ప్రకాశించుచున్నాడు. అట్టి అఖండాద్వితీయ పరిపూర్ణ పరమాత్మ స్వరూపుడగు శ్రీగురుదేవునకు నట్టి యద్వితీయ తత్త్వసాక్షాత్కారమునకై నేను నిత్యము ప్రణమిల్లుచున్నాడను.

పాఠాన్తరశ్లోకము:-

**యదజ్ఞానాన్మతం భూయాన్న మతం యస్య వేదనాత్ ।**
**తద్బ్రహ్మ దర్శితం యేన తస్మై శ్రీగురవే నమః ॥**

ఏ పరబ్రహ్మస్వరూపజ్ఞానము లేకపోవుటచే నీ విశ్వమంతయు నభీష్టమై యుండెనో, ఆ పరబ్రహ్మవిజ్ఞానమువలన నాదృశ్య మంతయు నిష్టము గాకపోయెనో, కానుపించకనే పోయెనో, అట్టి యద్వితీయ పరిపూర్ణ పరబ్రహ్మము ఏతత్స్వరూప గురువర్యునిచే నుపదేశింపబడెనో, అట్టి పరమకృపాళు పరమగురువరునకు నాత్మజ్ఞానసిద్ధికై నేను నిరంతరము ప్రార్థనాపూర్వకముగా నమస్కరించుచున్నాను.

అవ: ముందు శ్లోకమున తెలిపిన సర్వాత్మకత్వస్వరూపమును శ్రీగురుదేవునకు నీ శ్లోకమున ప్రకారాన్తరముగ ప్రతిపాదించుచున్నారు.

**యస్మై కారణరూపాయ కార్యరూపేణ భాతి యత్ ।**
**కార్యకారణరూపాయ తస్మై శ్రీగురవే నమః ॥** **72**

యస్మై - కారణరూపాయ - కార్యరూపేణ - భాతి - యత్ - కార్యకారణరూపాయ- తస్మై - శ్రీగురవే - నమః.

కారణరూపాయ = కారణస్వరూపుడగు, యస్మై = ఏ పరమాత్మకొఱకు, యత్ = ఏ విశ్వము, కార్యరూపేణ = కార్యరూపముతో, భాతి = ప్రకాశించుచున్నదో, (పరమాత్మ

తనయొక్క భోగమునకై తానే సర్వజగత్తుగ నాయెను), కార్యకారణరూపాయ = కార్యకారణ స్వరూపుడైన, తస్మై =అట్టి పరమాత్మస్వరూపు డయిన, శ్రీగురవే = శ్రీ సద్గురువుకొఱకు, నమః = నమస్కారము.

సకల జగత్తునకు నాధారభూతుడై మూలకారణముగ భగవంతు డున్నాడు. ఆ పరమాత్మయే, తననే, తనయొక్క విహారమునకై నామరూప జీవజడాత్మక ప్రపంచమును సృష్టించెను. కాన ఆ విశ్వమంతయు భగవంతుని నాధారముగ జేసికొని ప్రకాశించుచున్నది. ఆ యర్థమునే "స దేవ సోమ్యేదమగ్ర ఆసీత్, సతోఽ సదజాయత" అను నుపనిషద్వచనములు తెలుపుచున్నవి. ఘటమునకు మృత్తికకును, పటమునకు తన్తువులకును, స్వర్ణాభరణములకును- మొదలగు వానికివలె జగద్బ్రహ్మలకు కార్యకారణభావము తెలియవలెను. అట్టి కార్యకారణ రూప పరమాత్మస్వరూపుడగు శ్రీగురువర్యుని సర్వాత్మభావ విజ్ఞానమునకై నేను మిక్కిలి వందన మాచరించు చున్నాను. ఈ ప్రకారము జగద్బ్రహ్మలకును, జీవేశ్వరులకును అనన్యభావము, ఏకత్వము నిరూపిత మాయెను.

అవ: "ఏకం రూపం బహుధా యః కరోతి" అను నట్టి వేదాన్తసారమగు కఠోపనిషద్వాక్య వివరణము నీ శ్లోకమున దెలుపుచున్నారు.

**నానారూపమిదం విశ్వం న కేనాప్యస్తి భిన్నతా ।**
**కార్యకారణరూపాయ తస్మై శ్రీగురవే నమః ॥ 73**

నానారూపం - ఇదం - విశ్వం - న - కేన - అపి - అస్తి - భిన్నతా - కార్యకారణరూపాయ- తస్మై - శ్రీగురవే - నమః.

ఇదం విశ్వం - ఈ ప్రపంచము, నానారూపం = నామరూపాద్యాత్మకమై యనేక విధములుగ నున్నది (భగవంతునియొక్క విభూతిరూపమై యున్నది), అస్య = ఇట్టి ప్రపంచమునకు, కేనాపి = ఏకారణముచేతను, భిన్నతా = పరమాత్మకంటె వేరగుట, నాస్తి = లేదు, అట్లు, కార్యకారణరూపాయ = కార్యకారణస్వరూపుడైన, తస్మై = భగవత్స్వరూపుడైన, శ్రీగురవే = శ్రీగురుదేవునికొరకు, నమః = నమస్కారము.

ఈ ప్రపంచము నానావిధములై యున్నది. అదంతయు విచారించిన పరమేశ్వరుని విభూతియై యున్నది. అనగా పరమేశ్వరుని స్వరూపమే నానాస్వరూప

ములుగా నుంటున్నది. జగత్తునకు, పరమాత్మకును నే కారణము చేతను భేదము వచింప సాధ్యము గాదు. జగత్తు పరమాత్మకన్న, ఖడ్గాదులు లోహముకంటె భిన్నము కానట్లు, వేరుగాదు. కారణము లోహము, కార్యము ఖడ్గాదులు. అట్లు కార్యకారణ స్వరూపుడైన పరమాత్మస్వరూపుడైన శ్రీగురుదేవునికొరకు నేకత్వజ్ఞానసిద్ధికై నేను నమస్కరించుచున్నాను.

విచారించినచో నిచ్చట కార్యకారణత్వమును జీవబ్రహ్మభేద నిరూపణకై ప్రతిపాదించినను ఆ కార్యకారణభావము మాయావిద్యోపాధులచే వ్యవహరింప బడుచున్నది. అట్లే విశ్వమంతయు నుపాధివశముచే భిన్నముగా గాన బడుచున్నది. ఉపాధి నిత్యము గాదు; కల్పితము. చంద్రుడు ఒకడైనను ననేకఘటాద్యుపాధులచే నానావిధములుగా భాసించు చున్నాడు గదా. ఆ యుపాధి దొలంగిన చంద్రు డొక్కడే యగునట్లు, ఉపాధిత్వము దూరీకృతమైనచో నొకే తత్త్వస్వరూపమగు పరబ్రహ్మ మున్నది

**కార్యోపాధిరయం జీవః కారణోపాధిరీశ్వరః ।**
**కార్యకారణతాం హిత్వా పూర్ణబోధోఽవశిష్యతే॥**

ఇదియే పరిపూర్ణబోధ.

అవ: ఈ శ్లోకమున శ్రీగురుదేవుడు విజ్ఞానభూషణు డనియు, భుక్తిని ముక్తినిగూడ నొసంగు వాడనియు జెప్పుచున్నారు.

**జ్ఞానశక్తిసమారూఢతత్త్వమాలావిభూషిణే ।**
**భుక్తిముక్తిప్రదాత్రే చ తస్మై శ్రీగురవే నమః ॥ 74**

జ్ఞానశక్తిసమారూఢతత్త్వమాలావిభూషిణే - భుక్తిముక్తిప్రదాత్రే - చ తస్మై - శ్రీగురవే - నమః.

జ్ఞాన...........విభూషిణే - జ్ఞానశక్తి = స్వస్వరూప జ్ఞానసామర్థ్యమును, సమారూఢ = పొందినవాడును, తత్త్వ = వేదాన్తతత్త్వార్థములనెడి, మాలా = పుష్పమాలికయే, విభూషిణే = అభరణముగా గలవాడును, భుక్తిముక్తిప్రదాత్రే చ = భుక్తిముక్తులనుగూడ నొసగునట్టి, తస్మై =కేవల విజ్ఞానస్వరూపు డగు, శ్రీగురవే = శ్రీగురుదేవునికొరకు, నమః = నమస్కారము.

శ్రీ గురుదేవుడు సర్వదా సకలదృశ్య రహితుడై, స్వస్వరూపజ్ఞాన సుస్థిరత్వముచే నొప్పుచున్నాడు. మఱియు నాదేవుడుబహువిధవేదాన్త తత్త్వార్థము లను పుష్పమాలికలచే నలంకృతు డగుచున్నాడు. కుసుమమాల కొంతకాలమే ప్రకాశించుచున్నది; వాడిపోవుచున్నది. పుష్పరస మంతయునుగూడ క్షణములో పోవుచున్నది. పరిమళముగూడ క్రమముగ నశించిపోవుచున్నది. ఈ వేదాన్తార్థ తత్త్వమాల యట్లుగాక సర్వదా ప్రకాశమానమై నవనవార్థ పరిమళోపేతమై అనవచ్ఛిన్న జ్ఞానామృతాఖండ మకరందభరిత మగుచు నలరారుచున్నది. మాలిక పుష్పములచే గూర్చబడుచున్నది.

వేదాన్తార్థము లనగా ఉపనిషదర్థములు. అవియే పుష్పములుగ నెంచవలెను. రత్నమాలికైనచో వేదాన్తార్థములను రత్నములుగ పోల్చవలయును. రత్నములలో లావణ్య మనునది మెరయునట్లు వేదాన్తార్థ రత్నములలో జ్ఞానతత్త్వమను తేజస్సు సర్వదా యుంటున్నది. అట్టి నిరంతర ప్రకాశమాన జ్ఞానతత్త్వమాలా విభూషితు డును, శిష్యులకు పరమదయతో భుక్తిని ముక్తిని రెంటినిగూడ నిచ్చువాడును, కరుణాసాగరుడగు శ్రీసద్గురుదేవునికొరకు వేదాన్తతత్త్వ జ్ఞానసిద్ధికై ఎల్లప్పుడును వినమ్రుడనై సాష్టాంగముగ ప్రణామ మొనర్చుచున్నాను.

అవ: శ్రీ గురుదేవుడు కట్టెలను మహాగ్నివలె సకలకర్మబన్ధములను దహింపజేయు చున్నాడను విషయమును వివరించుచున్నారు.

**అనేకజన్మసంప్రాప్తకర్మబన్ధవిదాహినే ।**
**జ్ఞానానలప్రభావేన తస్మై శ్రీగురవే నమః ॥ 75**

అనేకజన్మసంప్రాప్తకర్మబన్ధవిదాహినే - జ్ఞానానలప్రభావేన - తస్మై - శ్రీగురవే - నమః.

జ్ఞానానలప్రభావేన - జ్ఞానానల = స్వస్వరూప తత్త్వజ్ఞాన మనెడు అగ్నియొక్క, ప్రభావేన = మహిమచేత, అనేక .......విదాహినే - అనేకజన్మ = నానాజన్మములనుండి, సంప్రాప్త = వచ్చుచున్న, కర్మబన్ధ = సకల కర్మబన్ధములను, విదాహినే = నిశ్శేషముగ దహింప జేయునట్టి, తస్మై = జ్ఞానాగ్నిచే ప్రజ్వరిల్లునట్టి, శ్రీగురవే = శ్రీగురుమూర్తికొరకు, నమః = నమస్కారము.

అనేక జన్మ కర్మబన్ధములని ప్రయోగించుటచే మహాగ్నివంటి విశేష జ్ఞానముతో శ్రీగురుదేవు డొప్పుచున్నాడని తెలియవలెను. స్వస్వరూప జ్ఞానమహిమచే సకలకర్మలను నిశ్శేషముగ నశింపజేసికొని మహాజ్ఞాన సంపన్నుడై యుంటున్నాడు కాన,తనయొక్క జ్ఞానాగ్ని ప్రజ్వలన సామర్థ్యముచే శరణుపొందిన శిష్యులయొక్క అనేక జన్మముల నుంచి వెనువెంటనే వచ్చుచున్నట్టియు, పచ్చివియు, కొద్దిగ నెండినవియు, బాగుగా నెండినవియు నయిన, అట్లే పూర్తిగా నాశోన్ముఖములు గానివియు, నాశోన్ముఖము లగుచున్నవియు, నాశోన్ముఖము లయినవియు నగు ప్రారబ్ధసంచి తాగామికర్మలను పెద్దపెద్ద కట్టెలనుగూడ, నా యా యధికారులకు దగినట్లు తత్త్వోపదేశము జేసి మహాజ్ఞానాగ్నిచే భస్మము జేయుచున్నాడు. అట్లు సకలకర్మ పాశములను దహించునట్టి శ్రీ గురుదేవునికొఱకు నాయొక్క సర్వ కర్మ బన్ధములు దగ్ధములై జ్ఞానోదయమునకై నేననన్యశరణుడనై నమస్కరించు చున్నాను.

మఱియు అగ్ని మహాపవిత్ర మయినది. మాలిన్యము లేనిది. సర్వదా శుద్ధమయినది. జ్ఞానముగూడ పవిత్రము, మాయామాలిన్య రహితము, శుద్ధము. గురువట్టి జ్ఞానము గలవాడు కావున శిష్యులను నట్లే చేయుచున్నాడు.

అవ: శ్రీగురుదేవుని పాదతీర్థ మహిమను వచించుచున్నారు.

**శోషణం భవసిన్ధోశ్చ దీపనం క్షరసమ్పదామ్ ।**
**గురోః పాదోదకం యస్య తస్మై శ్రీ గురవే నమః ॥ 76**

శోషణం - భవసిన్ధోః - చ - దీపనం - క్షరసమ్పదామ్ - గురోః - పాదోదకం - యస్య - తస్మై - శ్రీ గురవే - నమః.

యస్య గురోః = ఏ గురుదేవునియొక్క, పాదోదకం = పాదతీర్థము, భవసిన్ధోః = సంసారసాగరమును, శోషణం = ఎండింపజేయునదిగను, క్షరసమ్పదామ్ = వినశ్వరములగు (నశించునట్టి) సమ్పత్తులకు, దీపనం = అభివర్ధకముగను నగుచున్నదో, తస్మై = అట్టి మహామహిమ సమ్పన్నుడగు, శ్రీగురవే నమః = శ్రీగురుమూర్తికై నమస్కారము.

జల మనునది సముద్రమునకు బాధకము గాదు, మరేమనగా నభివృద్ధిని

జేయుచున్నది. శ్రీ గురుదేవునియొక్క పాదతీర్థ మట్లు గాదు. అపారమగు సంసార మహా సముద్రమును మహాబడబాగ్నివలె పానము జేసి, యెండునట్లు చేయుచున్నది. శ్రీ గురుపాదతీర్థము క్షణములో సకల సంసారదుఃఖముల నాశమొనరించి జ్ఞానము గలిగించుచున్నదని యర్థము. ఇకను నశ్వరములగు సకలైశ్వర్యములను గావించుచున్నది. అనగా భక్తితో శ్రీ గురుదేవుని పూజించి పాదతీర్థమును సేవించిన వారికి నక్షయమగు సమ్పత్తులు గలుగుచున్నవి. కామ్యములను నొసగునదని యర్థము.

శ్రీగురుపాద తీర్థమందు శోషకత్వము, వర్ధకత్వము అను పరస్పర విరుద్ధ ధర్మములను రెంటిని నిరూపించి సంసారశోషకముగను, సమ్పదభివర్ధకముగ నున్నదని విరోధమును పరిహరించిరి. కాన సకలాశ్చర్య కర్మధర్మములకు శ్రీగురుదేవుడు నిలయముగ నున్నాడు. జలము బాహ్యమలమునుమాత్రము పోగొట్టును. లోపల ప్రవేశించినచో దాహశాంతిని గలిగించును. శ్రీగురుదేవుని పాదతీర్థము లోపల ప్రవేశించి అన్తఃకరణములోని సకలపాపములను కడిగి శుద్ధము జేసి, సకల తాపత్రయదాహమును నిశ్శేషముగా శమింపజేయుచున్నది. మఱియు సంసారదుఃఖ భంజకజ్ఞానమును కలిగించుచున్నది. ఈ విధముగా శ్రీ గురుపాద తీర్థజ్ఞాన సమ్పాదకమై శాశ్వతానంద రూపముక్తిని గలిగించుచున్నది. ఇదియే సంసారశోషకత్వము. అట్టి సకలదుఃఖ నాశకుడై ముక్తి నొసంగునట్టి శ్రీగురుదేవుని కొఱకు నా యజ్ఞాననివృత్తికై సంసారదుఃఖ నాశమునకై నిత్యము నమస్కరించు చున్నాను.

అవ: శ్రీగురు సర్వాధిక్యము.

**న గురోరధికం తత్త్వం న గురోరధికం తపః ।**
**న గురోరధికం జ్ఞానం తస్మై శ్రీగురవే నమః ॥ 77**

న - గురోః - అధికం - తత్త్వం - న - గురోః - అధికం - తపః - న - గురోః - అధికం - జ్ఞానం - తస్మై - శ్రీ గురవే - నమః.

గురోః = గురువుకంటె, అధికం = ఉత్తమమయిన, తత్త్వం = యథార్థమయిన వస్తువు,

న = మఱియొకటి లేదు, గురోః = గురువరునికంటె, అధికం = శ్రేష్ఠమైన, తపః = ధ్యానము (వ్రతాదులు), న = వేరుగా లేదు, గురోః శ్రీగురుబ్రహ్మముకంటెను, జ్ఞానం = ఆత్మజ్ఞానము, న = భిన్నముగ లేదు, తస్మై = సత్యజ్ఞాన ధ్యానరూపు డయిన, శ్రీగురవే = శ్రీగురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

శ్రీ గురుదేవునికంటెను ఉత్తమమయిన తత్త్వము లేదు. శ్రేష్ఠమయిన తపస్సు లేదు. ఉత్కృష్టమగు నాత్మజ్ఞానము లేదు. పరబ్రహ్మస్వరూపు డగు శ్రీగురుదేవుడే తత్త్వము, యథార్థమగు వస్తువు. శ్రీగురువే బ్రహ్మము; వేరెద్దియు లేదు. బ్రహ్మము జ్ఞానస్వరూపము గలది. కావున నీ గురువును జ్ఞానరూపి యగుచున్నాడు. బ్రహ్మము సత్యము, జ్ఞానము- అన్నట్లు శ్రీగురుపరబ్రహ్మమును సత్యము, జ్ఞానము. ఈ విషయమునే తత్త్వం, జ్ఞానం అను పదములచే తెలిపిరి. శ్రీ గురుస్వరూపమును యథార్థముగా దెలిసికొనుటయే యథార్థమగు నాత్మజ్ఞాన మగును. మఱియు నీగురుమూర్తియే తపస్సు, ధ్యానము. శ్రీగురుమూర్తిని గురించియే ధ్యానించుట, నమస్కరించుట, సేవించుట సకలము జరుగుచున్నది. కనుక నభేదముతో శ్రీగురుమూర్తియే ధ్యానమని వచించిరి. శ్రీగురువు ధ్యేయమూర్తి కాబట్టి శ్రీగురువును ధ్యానించడమే ధ్యానము; వేరు ధ్యానము లేదు. ఇట్లు తపో ధ్యాన తత్త్వ జ్ఞానరూపు డయిన శ్రీగురుదేవుని నేను తపో జ్ఞాన ధ్యాన సిద్ధికై నిరంతరము వందన మాచరించుచున్నాను. ఇచ్చట శ్రీగురుదేవునియొక్క సర్వోత్కృష్టత స్వరూపతత్త్వమును జెప్పిరి.

అవ: మఱియు శిష్యుడు శ్రీగురుమూర్తియొక్క యుత్కర్షను దెలుపుచున్నాడు.

**మన్నాథశ్శ్రీజగన్నాథో మద్గురుశ్శ్రీజగద్గురుః ।**
**మమాఽఽత్మా సర్వభూతాత్మా తస్మై శ్రీగురవే నమః ॥ 78**

మన్నాథః - శ్రీ జగన్నాథః - మద్గురుః - శ్రీజగద్గురుః - మమ - ఆత్మా - సర్వభూతాత్మా- తస్మై - శ్రీగురవే - నమః.

మన్నాథః = నాకు రక్షకుడగు శ్రీగురుదేవుడే, శ్రీజగన్నాథః = మంగళస్వరూపుడైన సర్వలోకరక్షకుడు, మద్గురుః = నా గురుదేవుడే, శ్రీజగద్గురుః = జ్ఞానసమృద్ధి గల లోకగురువు, మమ ఆత్మా = నాలో వెలుంగు నాత్మయే, సర్వభూతాత్మా = సర్వభూతములలోని ఆత్మ,

(అదియే గురుస్వరూపము), తస్మై = సర్వమంగళస్వరూప జ్ఞానసమ్పన్న సర్వభూతాన్తర్వర్తియగు, శ్రీగురవే = శ్రీగురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

నాకు రక్షకుడైన మంగళమూర్తి యగు శ్రీగురుమూర్తియే సర్వలోకరక్షకుడు, మంగళస్వరూపుడై శుభముల నొసంగువాడు. జ్ఞానస్వరూపు డగు మా గురుదేవుడే అఖండవిజ్ఞాన తేజస్సమ్పన్ను డగు సర్వలోకగురువు. నాలో నున్న యాత్మయే సర్వభూతములలోను నున్నది. అదియే శ్రీగురుస్వరూపము, స్వస్వరూపము నదియే. భేదము లేదు. అన్నిటిలో నొకే ఆత్మ యున్నది. అదియే పరబ్రహ్మము. ఆ పరబ్రహ్మమే తానను జ్ఞానమే ఆత్మజ్ఞానము. అన్నిటిలో నొకే యాత్మ యున్నదని

**"అహమాత్మా గుడాకేశ! సర్వభూతాశయస్థితః, ।**
**ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున! తిష్ఠతి" ॥**

అను శ్రీ భగవద్గీతా వాక్యములు తెలుపుచున్నవి. అట్టి సర్వమంగళ జ్ఞానస్వరూప సర్వవ్యాపక శ్రీ గురుదేవునకు నా ఆత్మజ్ఞానోదయమునకై నేను నమస్కరించుచున్నాను.

అవ: మఱియు, శ్రీగురుదేవుని యుత్కర్షమునే తెలుపుచున్నారు.

**గురురాదిరనాదిశ్చ గురుః పరమదైవతమ్ ।**
**గురుమంత్రసమో నాస్తి తస్మై శ్రీగురవే నమః ॥ 79**

గురుః - అదిః - అనాదిః - చ - గురుః - పరమదైవతం - గురుమంత్రసమః - న - అస్తి - తస్మై - శ్రీగురవే - నమః.

గురుః = శ్రీగురుదేవుడు, ఆదిః = మూలకారణుడు (మొదటివాడు), అనాదిః చ = తనకు ఆదికారణములు లేనివాడును (ముందువాడు లేనివాడును) అగుచున్నాడు, గురుః = గురుదైవము, పరమదైవతం = పరమ ప్రియమైన దైవము, గురుమంత్రసమః - గురు = గురు అను ద్వ్యక్షరమంత్రమునకు, సమః = సమానమగు మంత్రము, నాస్తి = లేదు, తస్మై = సర్వాది సర్వాధిక ప్రియతమ మంత్రరూపుడైన, శ్రీ గురవే = శ్రీగురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

శ్రీ గురుపరమాత్మ సకల జగత్తునకు నాదికారణుడు. ప్రధానపురుషుడగు నా గురుమూర్తికి మరియొక్క కారణమగు వస్తువు లేదు. 'పూర్వేషామపి గురుః'

అను శ్రీపతంజలి మహర్షి సూత్రానుసారము సర్వులకును నాయనయే మొదటివాడు. ఆయనకంటె మొదటివాడు మరియొకడు లేడు. మహాప్రియతము డగు శ్రీగురువరుడే సర్వులకును పరమదైవతము. సకలార్థముల నొసగు నుత్కృష్టదైవము. అంతకన్న వేరగు దైవము ముల్లోకములలోను లేదు. సప్తకోటి మహామన్త్రములు కలవు కాని, యవి యన్నియు చిత్తభ్రమణ కారణములు. గురు అను ద్వ్యక్షరమహామంత్రము సకల భ్రమనాశక మగుటచే దానికి సమమగు మరియొక మంత్రము లేదు. (1) గురు- అనునది మంత్రము; దీనిని మననముచేసినచో నది క్షణములో సంసారమునుండి రక్షించుచున్నది. (2) మంత్రార్థము- పరమదైవమగు గురుదైవమే, (3) మంత్రచైతన్యము- అఖండజ్ఞాన స్వరూపము, ఇట్లు (1) మంత్రము, (2) మంత్రార్థము, (3) చైతన్యము అను మూడును బాగుగా దెలియపరచిరి. ఇదే విషయమును "తజ్జపః తదర్థభావనమ్" అను పతంజలియొక్క సూత్రము తెలుపుచున్నది. సర్వకారణ సర్వోత్కృష్ట ప్రియతమ దైవమగు శ్రీ గురుదేవునికొరకు సకలానాత్మ బన్ధవిచ్ఛేదమునకై నేను నమస్కరించుచున్నాను.

అవ: శ్రీగురుదేవునియొక్క రక్షణసామర్థ్యమును ప్రకటీకరించుచున్నారు.

**ఏక ఏవ పరో బన్ధుర్విషమే సముపస్థితే ।**
**గురుస్సకలధర్మాత్మా తస్మై శ్రీగురవే నమః ॥ 80**

ఏకః - ఏవ - పరః - బన్ధుః - విషమే - సముస్థితే - గురుః - సకలధర్మాత్మా - తస్మై - శ్రీగురవే - నమః.

విషమే = మహాసంకటకరమైన విపత్తు, సముపస్థితే సతి = వచ్చి పడిన దగుచుండగా, సకలధర్మాత్మా = సమస్తధర్మ స్వరూపుడగు, గురుః ఏకః ఏవ = గురువొక్కడే, పరః బన్ధుః = శ్రేష్ఠుడైన బంధువు (ఆప్తుడు), (ఆ సమయమున చుట్టమేమియు జేయజాలడు), తస్మై = సర్వాపద్రక్షకుడగు సకల ధర్మస్వరూపుడైన, శ్రీగురవే = శ్రీగురుదేవునికొరకు, నమః = నమస్కారము.

శ్రీ గురుమూర్తి సకల ధర్మాత్ముడు. అనగా అంధకారబన్ధుర కూపము వంటి మిక్కిలి యగాధమగు నజ్ఞానగర్తమున పడుచున్న దీనజనులను పడనీయ

కుండ సంరక్షించునట్టి జ్ఞానమును, పరమధర్మము నుపదేశించువాడు, పాపపఙ్కిల మును శుద్ధజ్ఞానజలముచే కడుగునట్లు చేయువాడు. అట్టి పరమ దయామయుడగు శ్రీగురుదేవుడు ఆత్మజ్ఞానము లేక స్వరూప విస్మృతిని జెంది, సంసారసాగరములో మునింగి నానావిధ మహాదుఃఖముల ననుభవించుటను దుర్ఘట భయంకర విపత్తునందు సకల జీవులను పరమదయతో సకలానర్థ నాశకమగు నాత్మబోధచే రక్షించుచున్నాడు. కనుక గురు వొక్కడే విపద్దశయందు రక్షించునట్టి శ్రేష్ఠుడగు బంధు వగుచున్నాడు.

బంధువులు దారిద్ర్య మనుభవించు నప్పుడు, వ్యాధి వచ్చి బాధించునప్పుడు మొదలగు నాపత్తులందు, సద్గుణవంతు డైనచో యథాశక్తి రక్షించుచున్నారు. జ్ఞానరాహిత్యమను దారిద్ర్యమందుగాని, అనాదిగా వెంబడించుచున్న భవరోగమునందుగాని బన్ధు వెంత సద్గుణవంతు డైనను నేమియు జేయజాలడు. మరెవ్వరును సహాయము జేయజాలరు. వేదాంతశాస్త్రమున ఆప్తుడని చెప్పబడుచున్న శ్రీగురుదేవుడే జ్ఞానమను ధనమును, ఔషధమును నిచ్చి కాపాడుచున్నాడు. అట్టి పరమాత్మస్వరూపుడగు శ్రీగురుదేవునకు నమస్కారము.

అవ: శ్రీగురుపరబ్రహ్మముయొక్క బహిర న్తర్వ్యాపకత్వమును ప్రకారాన్తరముచే స్పష్టపరచుచున్నారు.

**గురుమధ్యే స్థితం విశ్వం విశ్వమధ్యే స్థితో గురుః ।**
**గురుర్విశ్వం న చాన్యోఽస్తి తస్మై శ్రీగురవే నమః ॥ 81**

గురుమధ్యే - స్థితం - విశ్వం - విశ్వమధ్యే - స్థితః - గురుః - గురుః - విశ్వం - న - చ - అన్యః - అస్తి - తస్మై - శ్రీగురవే - నమః.

విశ్వం = సర్వజగత్తు, గురుమధ్యే = శ్రీగురుపరబ్రహ్మ మధ్యమందు, స్థితం = ఉంటున్నది, విశ్వమధ్యే = అట్టి ప్రపంచమధ్యయందు, గురుః = శ్రీ గురుబ్రహ్మము, స్థితం = ఉంటున్నది, విశ్వం చ = సమస్తజగమున్ను, గురుః = గురుస్వరూపమే, అన్యః = మఱియొక పదార్థము, నాస్తి = లేదు, తస్మై = సకలాత్మక పరబ్రహ్మస్వరూపు డగు, శ్రీగురవే = శ్రీ గురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

"సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని" అను నుపనిషదర్థమును

మనస్సున నిడుకొని చెప్పుచున్నారు. శ్రీ గురుపరబ్రహ్మమందు సకలవిశ్వము ఉంటున్నది. సకల జగమునకు శ్రీ గురుబ్రహ్మ మాధారమై యుంటున్నదని యర్థము. అట్టి బ్రహ్మచైతన్యమును నాధారము చేసికొనియున్న ప్రపంచమందు శ్రీ గురుపరబ్రహ్మ మున్నది. బ్రహ్మమున కాధారముగా జగమున్నదని యర్థము.

బ్రహ్మమునకు జగము, జగమునకు బ్రహ్మము నాధారముగా నుంటున్న దని వచించుట పరస్పర విరుద్ధముగా నుంటున్నది. ఇట్లు చెప్పుట శాస్త్రములలో అన్యోన్యాశ్రయ దోషమందురు. దానియొక్క పరిహారము: విశ్వమనిన విచారణదశలో నుండుట లేదు. త్రాటియందు సర్పమువలె పరబ్రహ్మమందు జగత్తు కల్పితము. మూడుకాలములలో నుండునది రజ్జు వగుచున్నది. సర్పముమాత్రము జ్ఞానముయొక్క లేమిచే భాసిల్లుచున్నది. అట్లే త్రికాలములలో నుండునది పరబ్రహ్మమేను; వేరు వస్తువు లేదు. విశ్వమను వస్తువే లేదు. అజ్ఞానజనబోధ కొరకు నట్లు చెప్పబడినది. పరబ్రహ్మముకన్న అన్యవస్తువు లేకపోవుటచే నా పరబ్రహ్మమే ఆశ్రయముగను, ఆశ్రయిగను నుంటున్నది. ఇట్లు చెప్పుటచే కేవల చైతన్యపరబ్రహ్మమే సిద్ధించినది. జగత్తనునదియే కల్పితము. దానియందు మఱియొక యథార్థవస్తు వెట్లుండును? అదియే సరియయినది. కల్పిత వస్తువునుగూర్చి యనేకవిధములుగ వచించుట శాస్త్రపరిపాటియై యున్నది. ఈ రహస్యము ననుసరించియే యుపనిషత్తులు జగత్తునుగూర్చి యనేకవిధములుగా జెప్పుచున్నవి. ఇదియే పరమతత్త్వము. ఇంతకును సిద్ధించినట్టి యర్థమేమనగా నంతయు పరబ్రహ్మమే. అదియే గురుస్వరూపము. కావున విశ్వమే గురు స్వరూపము, శ్రీగురువే విశ్వస్వరూపము. రెండును నొకటియే, వేరుగాదు.

మఱియు కొంచెమాలోచించిన భావనార్థమై యట్లు వచించిరి. అదెట్లనగా, మొదట తనయొక్క అంతరాత్మయే అన్ని భూతములలో నుండునట్లు భావనచే అందరియొక్క హృదయములలోను తన ఆత్మస్వరూపమే సర్వసాక్షియై యుంటున్నదని జ్ఞానముదయించు చున్నది. అప్పుడందఱిలోను తానొక్కడే యుంటున్నాడు. "సర్వభూతేషు చాత్మానం" అను వాక్యమునకు నిదియే యర్థము. "మయి ప్రోతమిదం సర్వం సూత్రే మణిగణా ఇవ" అను భగవద్గీతావాక్యము

నావిషయమునే తెలుపుచున్నది. తరువాత నంతరాత్మయొక్క సర్వసాక్షిత్వ రూపవిజ్ఞానము నతిక్రమించి సర్వజగత్తు తనలోనే యున్నట్లు గోచరించును. ఇదియే భగవంతుని యుదరములో లోకము లన్నియు నున్నవని తెలిపెడు తత్త్వము. అనగా సర్వవ్యాపకమగు పరబ్రహ్మమే తానను నఖండజ్ఞానము గలుగుచున్నది. "సర్వభూతాని చాత్మని" అను వచనమును నా విషయమునే చెప్పుచున్నది. ఇందువల్లనే ఈశ్వరుడు సకలము కల్పించి తానే యందులో నున్నాడు అని యుపనిషత్తు చెప్పుచున్నది. ఈశ్వరుడు ప్రపంచమున కాధారము. తానందులో నన్తరాత్మయై యున్నందున తనకు ప్రపంచ మాధారము.

ముఖ్యతాత్పర్య మేమనగా నంతయు పరబ్రహ్మమే. ఈ విషయము తెలుపుటకయ్యే శ్లోకార్థము నట్లు తెలిపిరి. "మత్తః పరతరం నాన్యత్ కించిదస్తి ధనంజయ" అను భగవద్గీతావాక్యము నద్దానినే తెలుపుచున్నది. కాన గురుపరబ్రహ్మమే విశ్వము. ఇతర మెద్దియును లేదు. అట్టి సర్వవ్యాపకాద్వితీయ పరబ్రహ్మ స్వరూపుడైన శ్రీపరమాత్మకొఱకు సర్వాంతర్యామి సర్వవ్యాపక జ్ఞానసిద్ధికై నేను మ్రొక్కుచున్నాను.

అవ: పరమదయానిధి యగు శ్రీగురుదేవు డజ్ఞానజనులకు తత్త్వమార్గోపదేశికు డను విషయము నిచ్చట నిరూపించుచున్నారు.

**భవారణ్యప్రవిష్టస్య దిఙ్మోహభ్రాన్తచేతసః ।**
**యేన సందర్శితః పన్థాః తస్మై శ్రీగురవే నమః ॥ 82**

భవారణ్యప్రవిష్టస్య - దిఙ్మోహభ్రాన్తచేతసః - యేన - సందర్శితః - పన్థాః - తస్మై - శ్రీగురవే - నమః.

భవారణ్యప్రవిష్టస్య = సంసారమను ఘోరాటవిలో ప్రవేశించినవాడు గనుకనే, దిఙ్మోహభ్రాన్తచేతసః - దిఙ్మోహ = దిక్కు తెలియకపోవుటచేత, భ్రాన్త = భ్రమించిన, చేతసః మనస్సుగల దీనజనునకు, యేన = ఆప్పుడగు ఏ గురువుచేత. పన్థాః = మార్గము, సందర్శితః= చూపింపబడెనో, తస్మై = అట్టి తత్త్వమార్గప్రదర్శకుడగు, శ్రీగురవే = దయామయుడగు శ్రీ గురుదేవునికొరకు, నమః = నమస్కారము.

మహాభయంకరమగు సంసారార ణ్యములో ప్రవేశించియున్నాడు గనుక,

తన గన్తవ్యమార్గమును తెలియక మిగుల భ్రాన్తిని జెందిన దీనునకు స్వస్వరూప జ్ఞానమను మార్గము నుపదేశించి, లక్ష్యమగు పరబ్రహ్మమును జెందునటుల జేయు పరమకారుణికుడైన, అందరకు తత్త్వమార్గ ప్రదర్శకుడైన, స్వయంప్రకాశక బ్రహ్మస్వరూపుడైన శ్రీ గురుదేవునికొరకు తత్త్వమార్గము నెరుంగుటకై నేను కేలుమోడ్చి మ్రొక్కుచున్నాను.

వేదాన్తశాస్త్రములో నజ్ఞానముచే గలుగు సంసారమును మహాభయంకర మగు నటవీప్రదేశముగా వర్ణించుచున్నారు. అరణ్యప్రదేశము నిమ్నోన్నతమై, పాషాణాది కఠినవస్తువులతో గూడినదై త్రాసమును గలుగజేయుచున్నది. సంసారారణ్యముగూడ సుఖదుఃఖములను, నెచ్చుతగ్గులు గలదై కాఠిన్యాది స్వభావములను కఠినతమ పదార్థములతో గూడినదై, మృదుత్వగుణమను మన్ను గలదై, దుర్గుణములను పెనుముండ్లతో నొప్పుచున్నదై దుష్ప్రవేశమై చూచుచున్నంత మాత్రమున దిగ్భ్రమ చెందించునదై యున్నది. అట్టి దుర్గమ ఘోరారణ్యమువంటి అపారసంసారములో జిక్కుకొనెను.

ఇచ్చోట నీరీతిగ కథ వర్ణింపదగును: ఒకానొక బాటసారి స్వగ్రామమును వదలి పై దెల్పినట్టి అరణ్యములో చిక్కుకొనెను. వానికి దారి తెలియక పోయెను. దిక్కులు గూడ తెలియ నందుచే మిక్కిలి భ్రమజెందిన వాడాయెను. అచ్చోట నతడు వ్యాఘ్రభల్లూకాది మృగములయొక్క ఆరావములను విని భయంకరచిత్తుడై, క్షుత్పిపాసాదులచేత పీడితుడై ఏడ్వసాగెను. సూర్యుడస్తమించు సమయము దాపురించినందున అక్కడ నున్న చెంచువారిని మార్గము నడిగెను. అడవిలోనే సంచరించు నట్టివారు వీని గ్రామముయొక్క మార్గము నెట్లు చెప్పగలరు? వేరు గతి లేనివాడై, మహాదుఃఖ సముద్రములో మునిగి తేలుచున్నవాడై దైవమే శరణ్యమనియు, చావు నిక్కమనియు తలంచుచుండెను. జననమరణరూప సంసారపతితజనుల స్థితియు నీలాగున నుండునని తెలియవలెను. ఇంతలో స్వగ్రామస్థుడగు నొక పెద్దమనిషి (ఆప్తుడు) ఆ మార్గముననే వచ్చెను. తనయొక్క గ్రామమునుండి వచ్చినట్టి యాప్తుని గాంచి, వానికి గలిగిన సంతోషమునకు మేర యున్నదా?

అట్లే మహాఘోర సంసార విపినములో ప్రవేశించి, కామక్రోధాది విజృంభణ మను క్రూరమృగారావమును సహించనివారై, తాము పొందదగిన లక్ష్యమును తెలియనివారై, స్వస్వరూపజ్ఞానము లేక భ్రాంతచిత్తు లగుచున్నారు. మఱియు మహాభీల, తాపత్రయ దుఃఖములను క్షుత్పిపాసాదులచే బాధితులగు చున్నారు. శాంతి నొందజాలక సంసారార్తిచే జ్ఞానము లేక పరితపించుచు, శోకము నొందు చున్నారు. తాము వచ్చిన మార్గమునే తెలియక పోదురు. అనంతదుఖము లనుభవించు చుందురు. అస్తమయకాలమువలె మృత్యుకాల మాసన్న మగుచునే యున్నది. ఈ కాలమునకు నియతి లేదు. అందుచే నేడ్చుచున్నారు. అప్పుడు ఎవరెవరినో కనబడినవారి నందరిని గురువులనుగ జేసికొందురు. వారును తత్త్వమార్గమును దెలిసినవారు గానందుచే ప్రయోజనమును బడయక పోదురు. దైవమునే చింతించుచుందురు.

ఇట్లుండగా దామాచరించిన పూర్వజన్మ సుకృత విశేషముచే పథికునకు నాప్తుడు లభించినట్లు మహాప్తుడు, దయానిధి, శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడు నగు శ్రీ గురుదేవుని దర్శనమును జేయుచున్నారు. అప్పుడు వారికి నమందానందము గలుగుచున్నది. పైన దెల్పిన పథికుడును, పెద్దమనిషియు స్వగ్రామమును జేరిరి. ఆ పెద్దమనిషి తానువచ్చిన మార్గమును మరచు నట్టివాడు గాడు. అట్లే శ్రీగురుదేవుడును స్వస్వరూపజ్ఞానము గలవాడు గనుకనే అనాయాసముగ శిష్యులకు తత్త్వమార్గ ముపదేశించి, తాము వచ్చినట్టియు, తిరుగ పొందదగి నట్టియు నగు పరమలక్ష్యమగు బ్రహ్మము నొందించు చున్నాడు. వారును స్వస్వరూప జ్ఞాన సాక్షాత్కారము గల్గి పరమానందభరితులై శాశ్వతసుఖములను అనుభవించు చున్నారు. ఇదంతయు శ్రీ గురుదేవునియొక్క అనుగ్రహమే. అట్టి అనుగ్రహమూర్తి యగు శ్రీగురుదేవునికొరకు నట్టి విజ్ఞానప్రాప్తికై నిరంతరము నేను నమస్కరించు చున్నాను. పై జెప్పిన విషయ మంతయు శ్రీపరమగురువుయొక్కయు, అనన్యశరణ్యులగు పరమభక్తితో నొప్పుచున్న శిష్యులయొక్కయు తత్త్వమని గ్రహింపవలెను.

అవ: అజ్ఞానాగ్నిచే మిక్కిలి తపించు నరులకు తాపమును పోగొట్టి పరమశాంతిని

శ్రీగురుదేవుడు కలుగజేయుచున్నాడను విషయమును నిట దేటపరచుచున్నారు.

**తాపత్రయాగ్ని తప్తానామశాంతప్రాణినాం ముదే ।**
**గురురేవ పరా గంగా తస్మై శ్రీగురవే నమః ॥ 83**

తాపత్రయాగ్నితప్తానాం - అశాంతప్రాణినాం - ముదే - గురుః - ఏవ - పరా - గంగా - తస్మై - శ్రీగురవే - నమః.

తాపత్రయాగ్నితప్తానాం - తాపత్రయ = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములను మూడగు తాపములనెడి, అగ్ని = అగ్నిచే, తప్తానాం = తపించు నట్టివారు గనుకనే, అశాంతప్రాణినాం - అశాంత = శాంతిలేని, ప్రాణినాం = జనులయొక్క, ముదే = సంతోషముకొరకు (తాపశాంతిరూప ఆనందముకొరకు) గురురేవ = ప్రసన్నుడగు శ్రీ గురుదేవుడే, పరా గంగా = ఉత్కృష్టమగు నది (గంగానది), తస్మై = అట్టి ప్రశాంత స్వరూపుడగు, శ్రీగురవే = శ్రీ గురుదేవునికొరకు, నమః = వందనము.

ఆత్మజ్ఞానము లేక అగ్నివంటి తాపత్రయముచే జనులు పరతపించు చున్నారు. తాపత్రయము (1) ఆధ్యాత్మికతాపము - ఆధ్యాత్మికములన దేహేంద్రియములు; వానికి గలుగు వ్యాధి - వాత కఫ పిత్తాదిదోషములు. (2) ఆధిభౌతికతాపము - భూతములవలన గలుగునవి. సర్ప, వృశ్చికాదులచేతను, వ్యాఘ్రాదులచేతను జనించు భయము; వానివలన గలుగు కష్టములు. (3) ఆధిదైవికము - హఠాత్తుగా సంభవించునవి. వృక్షమునుండి పడుట, పిడుగుపడుట, అగ్నిచే దహింపబడుట మొదలైనవి.

ఈ మూడింటి ననుసరించి వేదాన్తములో త్రివిధదుఃఖములను దెలుపు చున్నారు. (1) ఆధ్యాత్మికదుఃఖము -ఇంద్రియములు, వాని వృత్తులు, తద్విషయములు - అను దృశ్యముచే గలుగు దుఃఖము. (2)ఆధిభౌతికదుఃఖము- పంచభూతాత్మక దృశ్యదుఃఖము (తత్త్వములు). (3) ఆధిదైవికదుఃఖము - ఇంద్రియములకు నధిష్ఠానదేవతలు, తద్రూపదృశ్యముచే గలుగు దుఃఖము. పై జెప్పిన తాపములు దుఃఖములు అజ్ఞానముచేతను, రాగద్వేషాది ప్రవృత్తులచేతను గలుగుచున్నవి. అందుచే జనులు శాంతిని పొందకుంటున్నారు. అట్టివారికి గురుదేవుడు మహాపవిత్రమగు గంగానదిగ నున్నాడు.

అనగా, గంగానదిలో స్నానము చేసిన సమస్త తాపములు పోవుచున్నవి. అట్లు శ్రీగురుదేవుడను గంగానదిలో స్నానము చేయుడ మనగా జ్ఞానస్వరూపుడగు శ్రీగురుదేవు డుపదేశించిన తత్త్వజ్ఞానమను గంగానదిలో మనన నిదిధ్యాసములను స్నాన మాచరించుట యగును. ఇట్లు పరమభక్తులకు జ్ఞానోపదేశముచే పరమశాంతిని శ్రీగురుదేవు డొసంగుచున్నాడు. పైన దెలుపబడిన దుఃఖత్రయమను దృశ్యమును గూడ నశింపజేసి పరమ తత్త్వోపదేశముచే విజ్ఞానదృష్టిని గలిగించుచున్నాడు. ఇచ్చట అగ్ని యనగా, దావాగ్నియు గ్రహింప నగును. అజ్ఞానారణ్యములో తాపత్రయ దావాగ్నిచే దహింపబడు జీవులకు జ్ఞానమను నఖండవృష్టిని వర్షించి పరమశాంతిని గలిగించుచున్నాడు.

గురుదేవుని మహాపవిత్రమగు గంగానది యని తెలిపిరి. గంగానది ఏ ప్రకారముగా నెవరు స్నాన మాచరించినను నపవిత్రము గాక పాపాత్ములనుగూడ పవిత్రులనుగ జేయుచున్నదో అట్లే తమ్ము నాశ్రయించిన వారి నందరిని, జాతిమతభేదము లేక పాపాత్ములనుగూడ పునీతులనుగ జేయుచున్నాడు. అట్టి సర్వతాప శాంతిహరుడగు పరమానందరూప శ్రీ గురుదేవునికొరకు పరమశాంతికై సర్వదా ప్రణమిల్లువాడను.

అవ: శ్రీ గురుదేవుడు సకలాజ్ఞాన కాలసర్పదష్ట సర్వజన విషయ విషసర్వస్వహరు డనియు, జ్ఞానస్వరూపుడనియు, సర్వలోకపూజ్యుడనియు తెలుపుచున్నారు.

**అజ్ఞానేనాహినా గ్రస్తాః ప్రాణినస్తాన్ చికిత్సకః ।**
**విద్యాస్వరూపో భగవాం స్తస్మై శ్రీగురవే నమః ॥ 84**

అజ్ఞానేన - అహినా - గ్రస్తాః - ప్రాణినః - తాన్ - చికిత్సకః - విద్యాస్వరూపః - భగవాన్ - తస్మై - శ్రీ గురవే - నమః.

భగవాన్ = సర్వలోకపూజ్యుడైన శ్రీగురుదేవుడు, యే ప్రాణినః = ఏజీవులు, అజ్ఞానేన = అజ్ఞానమను, అహినా = కాలసర్పముచే, గ్రస్తాః = కఱవబడుచున్నారో, తాన్ = వారి నందఱిని, చికిత్సకః = చికిత్సచేయువాడు కనుకనే, విద్యాస్వరూపః = జ్ఞానస్వరూపు డగుచున్నాడు, తస్మై = అజ్ఞానకాలసర్ప సర్వవిషహారి యగు, శ్రీగురవే = శ్రీగురుమూర్తికొఱకు, నమః = నమస్కారము.

లోకములో జనులు నానాజన్మములనుండి అజ్ఞానమను మహాకాల సర్పముచే కఱవబడుచున్నారు. ఏమియు దెలియనివా రగుచున్నారు. మోహములో పడిపోవుచున్నారు. మరణించను మరణించుచున్నారు. ఇది ప్రతిజన్మములోను జరుగుచున్నది. అజ్ఞానమును, మహాకాలసర్పమునుగ వర్ణించిరి. సర్పమునకు విషము స్వభావము. అది ద న్తములలో నుంటున్నది. ఆ మహాఫణి కఱచినప్పుడు వెంటనే చికిత్స చేయవలయును. లేనిచో ప్రమాదము తప్పక సంభవించును.

అట్లే అజ్ఞానమను నురగమునకు కామక్రోధాదులను దన్తములలో విషయాసక్తి యను విషమున్నది. జనులు విషమువంటి విషయాసక్తిచే నాక్రాన్త హృదయు లగుచున్నారు. తొందరలోనే చికిత్స చేసికొనవలెను. విషయాసక్తివిషము మహాతీవ్ర మయినది. మనుజుని తెలియకనే భ్రాన్తిలో పడవేయుచున్నది. చూడుడు, విషమెక్కిన వాడేమియు తెలియక విపరీతముగ దలంచుచు పిచ్చివానివలె మాట్లాడుచున్నాడు. అట్లే విషయదోష దూషితుడును సత్యమును దెలియక అశుచి, అనాత్మపదార్థములను శుచి, ఆత్మస్వరూపములనుగా తలంచుచు జ్ఞానము లేని మాటలనే వచించును. శీఘ్రముగా చికిత్స జేసికొనకుండిన అజ్ఞానతమములో పడి, మానవజన్మమును వ్యర్థముగ జేసికొనుచున్నాడు. మరణమునుగూడ పొందుచున్నాడు;

అట్టి విషయవిషాక్తజనులను, భ్రాన్తియను మూర్ఛను జెందినవారైనను, ఆత్మజ్ఞానమను మహౌషధము నిచ్చి విషయదోషములను మాయామోహమును పోగొట్టి స్వస్థులనుగా జేయుచున్నాడు. పరబ్రహ్మరూపులనుగా జేయుచున్నాడు. అట్టి జ్ఞానస్వరూపుడు గనుకనే లోకపూజ్యు డగుచున్నాడు. సర్వులచే నాశ్రయింపదగి యున్నాడు. కావున సర్వవిషయ విషదోషనివారణ మహావైద్యుడైన, సర్వాధారుడయిన శ్రీగురుపరమాత్మకొఱకు నా విషయదోష నాశనమునకై స్వస్వరూపస్థితి గల్గి బ్రహ్మజ్ఞానోదయమునకై నే ప్రణమిల్లువాడను.

పాఠాన్తరశ్లోకము:-

**అజ్ఞానసర్పదష్టానాం ప్రాణినాం కశ్చికిత్సకః ।**
**సమ్యగ్జ్ఞానమహామన్త్ర వేదినం సద్గురుం వినా ॥**

అజ్ఞానసర్పముచే బాగుగా కాటు వేయబడిన వారి మహావిష విషయ దోషములను పూర్తిగా నశింపజేయుటకు సమ్యగ్దర్శన మహామన్త్రవేది యగు సద్గురువు తప్ప మఱియొకడు లేడు. ఆతడే సర్వదీనజన రక్షకుడు.

అవ: ఈ శ్లోకముతో శ్రీగురుదేవుని స్తుతి పూర్తియగుచున్నది.

**హేతవే జగతామేవ సంసారార్ణవసేతవే ।**
**ప్రభవే సర్వవిద్యానాం శంభవే గురవే నమః ॥ 85**

హేతవే - జగతాం - ఏవ - సంసారార్ణవసేతవే - ప్రభవే - సర్వవిద్యానాం - శంభవే - గురవే - నమః.

జగతాం = సర్వలోకములకు, హేతవే ఏవ = కారణముగనే యున్నవాడును, సంసారార్ణవసేతవే = సంసారమను సముద్రమునకు వారధిగను, సర్వ విద్యానాం = సమస్త విద్యలకు, ప్రభవే = ఉత్పత్తిస్థానముగను (రాజైనవాడును), శంభవే = సర్వశుభంకరుడగు, శంకరుడగనున్న, గురవే = శ్రీ గురుమూర్తికొఱకు, నమః = నమస్కారము.

"57 శ్లో॥ 'సంసారవృక్షమారూఢాః" అని మొదలుకొని, 85శ్లో॥ 'హేతవే జగతామేవ' అను శ్లోకమువరకు గల శ్లోకములు శ్రీ గురుదేవుని స్తోత్రమని తెలియవలెను. శ్రీ గురుభక్తులు స్తోత్రమును జేసికొనవచ్చును."

ఆ గురుపరమాత్మ సర్వలోకములకును కారణముగానే యున్నాడు. 'ఏవ' అనునది మఱియొక దానిని దూరీకరించి నిశ్చయమును తెలుపుచున్నది. కాన "ఏవ = కారణముగానే భగవంతు డున్నాడు, మఱియొక విధముగ లే" డను నర్థము సిద్ధించుచున్నది.

అదేమనగా వేదాంతములో ఆరంభవాదము, పరిణామవాదము, వివర్త వాదము అను త్రివిధవాదము లుంటున్నవి.

(1) ఆరంభవాదము - పిత, పుత్రునకు కారణభూతుడు. పుత్రోత్పత్తికి తండ్రి ఆరంభకుడుగ నున్నా డనునది. ఇది జన్యజనక భావముతో గూడినది. ఆ ప్రకారము సకల జగత్తునకు నీశ్వరుడు ఆరంభకుడై జనకుడుగా నున్నా డనినచో, నప్పుడు రెండువస్తువు లుండవలయును. కనుక నది సరికాదు.

(2) పరిణామవాదము - పాలు పరిణమించి పెరుగైనది. ఇచ్చట ఒకే వస్తువయినను మార్పుచెందుట యను ధర్మమున్నది. ఆవిధముగనే బ్రహ్మమే జగత్తుగా మారినదని వచించినచో, నపరిణామి యగు పరమాత్మకు పరిణామిత్వము చెప్పవలసివచ్చును. కనుక అదియును సరిగాదు. మఱేమనిన,

(3) వివర్తవాదము సరిపోవుచున్నది. త్రాడును గాంచి సర్పభ్రాన్తి గలిగినది. సర్పభ్రమకు త్రాడు కారణము. అట్లే జగత్తునకు పరమాత్మ కారణుడు. అజ్ఞానముచే జగత్తు తోచుచున్నది. కావున 'హేతవే ఏవ = కారణభూతుడే' అని అర్థము చేయవలయును. 'ఏవ' కారమునకు నంతటి ప్రయోజన మున్నదని తెలియవలెను.

సంసారమను సముద్రమును దాటుటకు సేతువుగా శ్రీగురుపరమాత్మ యున్నాడు. వారధి యుండిన సముద్రమును సులభముగ దాటవచ్చును. చిన్నలును, పెద్దలును, నేజాతివారైనను సేతువు నాశ్రయించి దాటవచ్చును. ఆ తీరున జ్ఞానస్వరూపుడగు శ్రీగురుదేవుని నాశ్రయించినచో నెవరైనను శ్రీ గురుతత్త్వోపదేశ సేతువుద్వారా సంసార సముద్రమును తరించి పరమశాంతితీరము చేరవచ్చును.

సముద్రము మహాభయంకర మైనది. తిమితిమింగలాదులు, మొసళ్లు మొదలయిన వందులో నున్నవి. ఆ ప్రకార మాసంసార సాగరములోను రాగ ద్వేషాది తిమింగలాదులు, విషయప్రవృత్తులను మకరములు నుంటున్నవి. అయినను శ్రీ గురుదేవుని యనుగ్రహముచే తత్త్వోపదేశమను దృఢమగు వారధిమీద నందఱును దాటుచున్నారు. నిత్యసుఖమును పొందుచున్నారు.

సమస్త విద్యలకును నుత్పత్తిస్థానముగా శ్రీగురుదేవు డున్నాడు. వాక్పతిగ నున్నాడు.విద్యాస్వరూపుడగు శ్రీగురుదేవుని యనుగ్రహమువల్లనే సకలవిద్యలు వచ్చుచున్నవి. ఇకను సర్వపాపములను అజ్ఞానమును హరించి మంగళ స్వరూపుడగు నీశ్వరునివలె సర్వశుభప్రదుడై యున్నాడు. అట్టి విజ్ఞానాత్మక సర్వశుభంకరుడగు శ్రీ గురుదేవునికొఱకు నఖండ మంగళస్వరూప పరబ్రహ్మప్రాప్తికై నేను నిరంతరము నమస్కరించుచున్నాను, ధ్యానించుచున్నాను.

అవ: శ్రీగురుదేవుని విషయములో శిష్యుని యాచరణవిధిని దెలుపుచున్నారు.

**ధ్యానమూలం గురోర్మూర్తిః పూజామూలం గురోః పదమ్ ।**
**మన్త్రమూలం గురోర్వాక్యం ముక్తిమూలం గురోః కృపా ॥ 86**

ధ్యానమూలం - గురోః - మూర్తిః - పూజామూలం - గురోః - పదమ్ - మన్త్రమూలం- గురోః - వాక్యం - ముక్తిమూలం - గురోః - కృపా.

గురోః = శ్రీ గురుదేవునియొక్క, మూర్తిః = ఆకారము (స్వరూపము), ధ్యానమూలం = ధ్యానించుటకు కారణము (ధ్యేయము), గురోః = గురుమూర్తియొక్క, పదమ్ = పాదము (స్థానము), పూజామూలం = అర్చనకు హేతువు, గురోః = శ్రీ గురువరునియొక్క, వాక్యం = వచనము (తత్త్వోపదేశము), మన్త్రమూలం = మన్త్రమునకు కారణము (జపము), మననమునకు బీజము, గురోః = శ్రీగురు పరమాత్మయొక్క, కృపా = దయ, ముక్తిమూలం = మోక్షమునకు కారణము (సంపాదించదగినది.)

శ్రీగురుమూర్తియొక్క దేహమే ధ్యానమునకు హేతువు. శ్రీ గురుదేవుని విగ్రహమును నానావిధ దివ్యతేజస్సులతో గూడిన దానినిగను, మహాపవిత్రవంతము గను, నప్రాకృతగుణ విశిష్టముగను భావించవలయును. శ్రీ గురువరుని పాదపద్మములను సర్వదా పూజించవలయును. మనస్సులోను నానావిధాలంకారములతో, పుష్పమాలికతో గూడినట్లును పూజించి హృదయ పీఠమున నధిష్ఠించి యున్నట్లు స్మరించవలయును.

శ్రీగురుదేవుని వాక్యమే మన్త్రమునకు కారణము. శ్రీగురువర్యుని వాక్కునుండి వచ్చునవి యన్నియు మంత్రములు. వానిని మరువక స్మరించు చుండవలయును. అట్లాచరించు చుండవలయును. శ్రీగురుదేవుని కృపాకటాక్షమే మోక్ష మొసంగుచున్నది. శ్రీగురుదేవుని కృప లేకుండిన నేదియు సిద్ధించదు. శ్రీగురుదేవుని యనుగ్రహమే శిష్యునకు మోక్షము. అంతకన్న వేఱొకటి లేదు. సర్వదా శ్రీ గురువుదగ్గరనే యుండుట, నమృతవాక్యములను పానము చేయుట, వారి యపారదయకు పాత్రు డగుట - యిదంతయు శిష్యుని కమితానందముగ నుండును.

మఱియొక యర్థము: శ్రీ గురుస్వరూప మెద్దియో ఆ పరబ్రహ్మస్వరూపమే

ధ్యానింపదగిన ధ్యేయము. శ్రీగురుస్థాన మేదియో ఆ లక్ష్యమగు పరబ్రహ్మమే పూజింపదగినది. మహాపూజ్య మయినది. శ్రీగురుదేవుని తత్త్వోపదేశమే మహామన్త్రము; మననము చేయదగినది; సంరక్షించుచున్నది. అపారమగు శ్రీ గురుదేవుని యనుగ్రహమే మోక్షము. అనుగ్రహ ముండినచో నేలాంటి ప్రతిబంధము లుండవు. శ్రీగురుదయయే వానినెల్ల నశింపజేసి మోక్షమును గలిగించును,

అవ: శ్రీ గురుదేవుని పాదతీర్థములోని బిందువుయొక్క పవిత్రతను మహిమను నిరూపించుచున్నారు.

**సప్తసాగరపర్యన్తతీర్థస్నానఫలం తు యత్ ।**
**గురోః పాదోదబిందోశ్చ సహస్రాంశే న తత్ఫలమ్ ॥ 87**

సప్తసాగరపర్యన్తతీర్థస్నానఫలం - తు - యత్ - గురోః - పాదోదబిందోః - చ - సహస్రాంశేన - తత్ - ఫలమ్.

సప్త.......ఫలం - సప్తసాగర = దధిక్షీరాది సప్తసాగరముల వరకుగల, తీర్థ = సకల పుణ్యతీర్థములయందలి, స్నానఫలం - స్నాన = స్నానము చేయుటచే గలుగు, ఫలం = ఫలమేదియో, తత్ ఫలం చ = ఆ మహాఫలముకూడ, గురోః = శ్రీగురోః = శ్రీ గురుపరమాత్మయొక్క, పాదోదబిందోః - పాదోద = పవిత్రపాదతీర్థములోని, బిందోః = బొట్టుయొక్క. సహస్రాంశేన = వెయ్యవపాలుతో (భాగముతో) తుల్యం = సమానమైనది, (మఱియు, సహస్రాంశే = వెయ్యవదగు భాగముతో, న = సరిపోవునది గాదు.)

అగ్నికణ మెంతచిన్నదైనను దూదిరాశిని క్షణములో దగ్ధము చేయుచున్నది గదా. అట్లే పాదతీర్థ బిందుసేవనముచే గలుగు జ్ఞానాగ్నికణము తగిలినంత మాత్రమున సకలపాప తూలరాశులను క్షణములో దహించుచున్నది.

ఔషధ మెంత కొంచెమైనను సారవత్తర మయినందుచే మహాదీర్ఘకాల వ్యాధిని పోగొట్టి యారోగ్యమును గలిగించు విధమున జ్ఞానౌషధ మెంత చిన్నదైనను, అజ్ఞాన మహావ్యాధి పెద్దదయినను, పూర్తిగా దానిని హరణ మొనర్చి స్వస్వరూపజ్ఞాన ఆరోగ్యము నుదయింప జేయుచున్నది. కనుక దాని మహత్తును వినుడు.

దధి, క్షీర, ఇక్షు, అమృత - మొదలగు సప్తసముద్రము లుంటున్నవి.

వానివరకును బహుళములగు నానావిధ పుణ్యతీర్థము లెన్నియో గలవు. చిన్నవి గలవు; పెద్దవి గలవు. ఆ సప్తసాగరములలోను, ఆ సర్వపుణ్య తీర్థములలోను శాస్త్రములో జెప్పిన రీతిగ మహాసంకల్ప దానాదిపూర్వకముగ పుణ్యకాలముల స్నాన మాచరించి, సకల జనులకు సంతృప్తిగ సంతర్పణ జేసి, ఆయా దేవత లందఱిని మ్రొక్కి, యెన్నియో పూజ లొనరించిన నెట్టి మహాఫలము గలుగుచున్నదో, ఎట్టి దివ్యపదవి లభించుచున్నదో- ఆ ఫలమంతయు నొకసారి శ్రీసద్గురుదేవుని పాదతీర్థములోని కణమును పరమభక్తితో పానము చేసినచో గలుగు మహాదివ్య ఫలములో వెయ్యవపాలుకు సమాన మగుచున్నది. సహస్రాంశఫలము సరిపో వచ్చును. జ్ఞానతీర్థబిందులేశ మనన్తమని యర్థము.

ఇకను విచారించిన మహాతీర్థ స్నానఫలము పాదతీర్థబిందు సహస్రాంశే న ఫలం = పాదతీర్థబిందు సహస్రాంశ ఫలమునకును సరిగాదు. అనగా శ్రీ సద్గురు పాదతీర్థ పానజన్య బ్రహ్మజ్ఞానఫల మపరిమితము. ఆ స్నానఫలము లన్నియు బాహ్యప్రయోజనములను గలిగించుచున్నవి. శ్రీ సద్గురు పాదతీర్థ జ్ఞానఫలమో, అనాద్యన్తరాత్మమూలాజ్ఞాన నాశకమై మహానందము గలిగించు చున్నది. ఇది యక్షయఫల జనకము. అది క్షయఫలహేతుకము. కనుక ఈ ప్రకారము శ్రీ గురుపాదతీర్థబిందు సహస్రాంశఫలమును దెలియుడు.

అవ: శ్రీగురుదేవుని రక్షణసామర్థ్యమును ప్రకటించుచు శ్రీగురువుయొక్క సమాశ్రయణమును విశదపరచుచున్నారు.

**శివే రుష్టే గురుస్త్రాతా గురౌ రుష్టే న కశ్చన ।**
**లబ్ధ్వా కులగురుం సమ్యగ్గురుమేవ సమాశ్రయేత్ ॥ 88**

శివే - రుష్టే - గురుః - త్రాతా - గురౌ - రుష్టే - న - కః - చన - లబ్ధ్వా - కులగురుం - సమ్యక్ - గురుం - ఏవ - సమాశ్రయేత్.

గురుః = శ్రీగురుపరమాత్మ, శివే రుష్టే = శివుడు కోపించినవాడు కాగా, త్రాతా = రక్షించువాడు (అగుచున్నాడు), గురౌ రుష్టే = శ్రీగురుమూర్తి ఆగ్రహము చెందినవాడు కాగా, కశ్చన = ఏ దేవుడున్ను, న = అట్టి గురుపరాఙ్ముఖు డగువానిని రక్షించడు, (ఇట్లున్నది కాబట్టి) కులగురుం = కులగురువును, లబ్ధ్వా = పొంది, సమ్యక్ గురుం ఏవ = సమ్యగ్

జ్ఞానముగల పరమగురువునే. సమాశ్రయేత్ = బాగుగా భక్తిశ్రద్ధలతో నాశ్రయించవలయును.

శ్రీగురుకృప యమోఘము. శ్రీగురుదేవుని యనుగ్రహము తప్పిన సకల దేవతలయొక్క దయయు తప్పిపోవుచున్నది. శ్రీగురుదేవుడు స్వయముగా లోకరక్షణకై వచ్చిన పరంధాముడు, దయానిధి, శిష్యులను రక్షింపవలయు ననియే చూచుచుండును. ఇట్టి పరమాప్తునికి విరుద్ధముగ నాచరించిన వానిని నే దేవుడును జేపట్టరు. చేబట్టజాలరు. శ్రీ సద్గురుమూర్తి త్రిగుణాతీతుడు కాబట్టి త్రిగుణాత్మకు లగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల నతిక్రమించి కేవల పరబ్రహ్మస్వరూపియై యున్నాడు. ఆ త్రిమూర్తులున్ను శ్రీగురుదేవ పరమాత్మానుగ్రహమునకై నిరంతరము కేల్మోడ్చి వేచియుందురు. కావున శివుడు కోపము చెందినను శ్రీగురుమహాదేవుడు, ఈశ్వరునికి కోపమును గలిగించినట్టి మహాపరాధము చేసినవారినిగూడ రక్షించుచున్నాడు. జ్ఞాన మొసగి పరిశుద్ధులను చేయుచున్నాడు.

కాని శ్రీగురుదేవుడు కోపమును జెందినచో మఱెవ్వరును, ఏదేవతలును, త్రిమూర్తులును రక్షించరు. అన్నిటికిని గురువే మూలము. ముందు చెప్పినట్లు రక్షణసామర్థ్యమున్ను మఱెవ్వటికిని లేదు.అయితే త్రిమూర్తులచేతను బహిష్కృతు డయిన మహాపాపినిగూడ దగ్గఱ జేర్చి జ్ఞానము నుపదేశించుచున్నాడు. అదియే శ్రీగురువరుని దయావిశేషము. ఈ విషయమును, పురాణములలో త్రిమూర్తులచే శాపగ్రస్తు లయిన వారిని మహర్షులు రక్షించుచున్నట్టి విషయమునుబట్టి కనుగొనవచ్చును. కాబట్టి శ్రీగురుమూర్తి దగ్గఱకు కులగురువును విచారించి పోవలయును. కులగురువున్ను అనేక ధర్మములను చెప్పుచున్నాడు. వానిని, శ్రీగురూపసదనాది విధులను తెలిసికొనవలయును. తరువాత జ్ఞానామృత పిపాసచే శ్రోత్రియ బ్రహ్మనిష్ఠ డయిన, దయానిధి యయిన, సమ్యక్దర్శన సమ్పన్నుడయిన శ్రీగురుదేవుని పాదములనే ఆశ్రయించవలయును. ఆ యనన్యశరణ్యమే అజ్ఞానభంజకమై జ్ఞానరక్ష నొసగును.

అవ: సామాన్యులగు కులగురువు మొదలయిన వారిని వదలి జ్ఞాన సమ్పన్నులగు నన్యగురువుల నాశ్రయించుట దోషము లేదను విషయమును తెలుపుచున్నారు.

**మధులుబ్ధో యథా భృంగః పుష్పాత్పుష్పాన్తరం వ్రజేత్।**
**జ్ఞానలుబ్ధస్తథా శిష్యో గురోర్గుర్వన్తరం వ్రజేత్॥ 89**

మధులుబ్ధః - యథా - భృంగః - పుష్పాత్ - పుష్పాన్తరం - వ్రజేత్ - జ్ఞానలుబ్ధః - తథా - శిష్యః - గురోః - గుర్వన్తరం - వ్రజేత్.

మధులుబ్ధః = పుష్పరసమందాసక్తి గల, భృంగః = భ్రమరము, యథా = ఎట్లు, పుష్పాత్ = పుష్పమునుండి (దానిని వదలి), పుష్పాన్తరం = మఱియొక పుష్పమును, వ్రజేత్ = పొందునో, తథా = అట్లే, జ్ఞానలుబ్ధః ఆత్మజ్ఞానమందాశ గల్గిన, శిష్యః = శిష్యుడు, గురోః = సామాన్యగురువునుండి (కులగురువు మొదలయిన వారిని వదలి), గుర్వన్తరం = మఱియొక శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు శ్రీగురుదేవుని, వ్రజేత్ = శరణుపొందును.

కొందఱు "పతివ్రతాస్త్రీ మఱియొకరిని నాశ్రయించునా? అట్లాశ్రయించినచో నెంతోపాపమును పొందును గదా ! శివభక్తుడు విష్ణువునుగాని, విష్ణుభక్తుడు శివునిగాని స్మరించవచ్చునా? అట్లే మొదట నొక గురువు నాశ్రయించి మఱియొక గురువు నాశ్రయించకూడదు. అట్లైన మహాపాపమునుగూడ పొందుచున్నారు" అని చెప్పుచు తదనుగుణములగు శ్లోకములనుగూడ వచింతురు. అవన్నియు సంకుచితభావము లనియు, నసూయాగ్రస్తము లనియును దెలియవలెను.

ప్రత్యక్షముగా శ్రీ గురుగీతయు నెట్టి మహా విశాలభావమును బోధించుచున్నదో చూడుడు. తుమ్మెద ఎప్పుడును కమలములందు వసించుచు మకరందమును గ్రోలుచున్నది. అది దానిస్వభావము. తృప్తిగా పుష్పరసమును పానము చేసిన తరువాత నున్మత్తమై యుండిపోవును. అట్లే జ్ఞానమును వాంఛించు ముముక్షువుల స్వభావముండ వలయును. మొదట సామాన్యగురువుల నాశ్రయించుచున్నారు. పిమ్మట దృప్తిని పొందక స్వస్వరూపజ్ఞానము లేనందుచే గురువులను వెతకుచున్నారు. కట్టకడపట ఏ గురువర్యునిచే తనయొక్క జన్మకర్మబంధ విచ్ఛేదకమగు పరమజ్ఞానము జీవేశ్వరైక్య తత్త్వము లభించెనో, నిత్యశాంతి గలిగెనో అట్టివారినే ఆత్మగురువునుగా జేసికొనుచున్నారు. చేసికొనవలయునుగూడ. సందేహము లేదు.

కాని భ్రమరవృత్తాంతమును మరిచిపోగూడదు. అది అనేక పుష్పములలో

సంచరించిన దైనను రసమును మాత్రము గ్రహించినది. ప్రవేశించి నప్పుడును తదుపరి విడిచిపోవు నప్పుడు నేమాత్రమును పుష్పమును జెరచలేదు. దాని బుద్ధియంతయు మకరంద పానమునందే లయించి యుండెను. ఆ ప్రకారము శిష్యులును గురువుల దగ్గఱ జ్ఞానమును మాత్రము గ్రహించవలయును. వారికేలాటి బాధ గలిగించకూడదు. వదలిపోవునప్పుడు నిందింపకయు నెప్పుడును కృతజ్ఞత గలిగియుండవలయును. తన కాత్మశాంతిని గలుగజేసిన వారిని పరమగురువునుగా జేసికొనవచ్చును. జనకచక్రవర్తియు ననేక గురువులను ఆశ్రయించి కడపట అష్టావక్ర మహామునినే ఆత్మగురువునుగా అంగీకరించి పరమశాంతిని పొందెను.

అవ: శ్రీగురు పాదపద్మయుగమును భావించి వర్ణించుచున్నారు.

**వందే గురుపదద్వన్ద్వం వాఙ్మనోఽతీతగోచరం ।**
**శ్వేతరక్తప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరమ్ ॥ 90**

వందే - గురుపదద్వన్ద్వం - వాఙ్మనోఽతీతగోచరం - శ్వేతరక్తప్రభాభిన్నం - శివశక్త్యాత్మకం - పరం.

శ్వేతరక్తప్రభాభిన్నం = తెల్లని, ఎఱ్ఱని కాంతులతో గూడినదియు, లేక తెలుపు, ఎఱుపు అను చిత్కళకంటెను విలక్షణ మయి నదియు, వాఙ్మనోఽతీతగోచరం - వాఙ్మనః = వాక్కును, మనస్సును, అతీత = అతిక్రమించిన జ్ఞానమునకు, గోచరం = గోచరించు నదియు, శికశక్త్యాత్మకం = శివశక్తి యనబడు కేవల జ్ఞాన స్వరూప మయినదియు, (సృష్టిస్థితిలయములకు గారణభూతమగు శివశక్తి స్వరూప మయినదియు) పరం = సర్వోత్కృష్టము నయిన, గురుపదద్వన్ద్వం = శ్రీ గురుదేవుని కేవల చైతన్యస్వరూప పాదపద్మములను, వందే = నమస్కరించు చున్నాను.

గురువర్యుని చరణద్వంద్వము మహాదివ్యకాంతితో గూడినది. శ్వేతరక్తప్రభా మిశ్రిత మయినది. కేవల జ్యోతిస్స్వరూప మయినది. లేక శ్వేతరక్తములని వచించుటచే సత్త్వరజోగుణములు చెప్పబడెను. తమస్సనునది లేనేలేదు. త్రిగుణములను నతిక్రమించిన తేజోరూపము. జడములగు వాక్కునకును, మనస్సునకు నందని స్వస్వరూప జ్ఞానమునకే గోచరించుచున్నది. వాని నన్నిటిని దెలియునది.

శివశక్తి యనగా సర్వహరణశక్తి యగును. సమస్త సృష్టి స్థితి లయములకు కారణ మయిన శివశక్తి స్వరూపమై యున్నది. సకల పాపములను, అజ్ఞానమును ధ్వంస మొనరించు కేవల చైతన్యముయొక్క స్వరూపమయి యున్నది. ఇట్లు పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీగురుదేవునియొక్క చరణద్వంద్వమును కేవల జ్ఞానాత్మక ప్రకాశస్వరూప మయిన దానినిగా భావించి ధ్యానించవలయును. అట్టి శ్రీగురుదేవుని పరమోత్కృష్టపద ద్వంద్వమును జ్ఞానమునకై నమస్కరించు చున్నాను.

అవ: మరియు నిదివరకు బోధింపబడిన గురుతత్త్వమునే, దృఢత్వమునకైమునకై ప్రకారాంతరముచే నిరూపించుచున్నారు.

**గుకారం చ గుణాతీతం రుకారం రూపవర్జితమ్ ।**
**గుణాతీతమరూపం చ యో దద్యాత్స గురుస్స్మృతః ॥ 91**

గుకారం - చ - గుణాతీతం - రుకారం - రూపవర్జితం - గుణాతీతం - అరూపం - చ - యః - దద్యాత్ - సః - గురుః - స్మృతః.

గుకారం = గు అను అక్షరము, గుణాతీతం = త్రిగుణములను నతిక్రమించినది. రుకారం చ = రుకారముగూడ, రూపవర్జితం - రూపముచే విడువబడినది (రూపశూన్యము), గుణాతీతం = సత్త్వరజస్తమోగుణముల నతిక్రమించిన, అరూపం = రూపము లేని పరబ్రహ్మస్వరూపమును, యః = బ్రహ్మజ్ఞాన స్వరూపుడగు నేగురువు. దద్యాత్ = ఇచ్చునో, సః = అట్టి తత్త్వజ్ఞాన రూపుడగు మహనీయుడు, గురుః = గురువుగా, స్మృతః = చెప్పబడెను,

పరబ్రహ్మస్వరూపము గుణాతీతమైనది, నామరూపములు లేనిది. అట్టి నిర్గుణ నీరూపమగు పరబ్రహ్మమే 'గురు' అను శబ్దముచే చెప్పబడుచున్నది. కావున, బ్రహ్మస్వరూప జ్ఞానముయొక్క నిర్గుణత్వము 'గు' అను నక్షరముచేతను, రూపరహితత్వము 'రు' అను నక్షరముచేతను చెప్పబడుచున్నవి. గురువనగా గుణాతీతుడు, నీరూపుడు. ఆయన జ్ఞానము నట్టిదే. అట్టి తత్త్వమును బోధించువాడే గురువరుండని వేదాంతశాస్త్రములో చెప్పబడినది.

అవ: శ్రీగురుదేవుడు బ్రహ్మ విష్ణు శివ స్వరూపుడని తెలుపుచు, వారికంటె విభిన్నత్వమునుకూడా గురువరునికి ప్రతిపాదించుచున్నారు.

**అత్రినేత్రశ్శివస్సాక్షాత్ ద్విబాహుశ్చ హరిస్స్మృతః ।**
**యోఽచతుర్వదనో బ్రహ్మా శ్రీగురుః కథితః ప్రియే ॥ 92**

అత్రినేత్రః - శివః - సాక్షాత్ - ద్విబాహుః - చ - హరిః - స్మృతః - యః - అచతుర్వదనః - బ్రహ్మా - శ్రీగురుః కథితః - ప్రియే.

హేప్రియే! = ఓ పార్వతీ, యః = ఏ మహాత్ముడు, అత్రినేత్రః = మూడుకన్నులు లేని, సాక్షాత్ శివః = సాక్షాదీశ్వరుడు, ద్విబాహుః = రెండుచేతులు గల, హరిః = విష్ణువు, అచతుర్వదనః = నాలుగుముఖములు లేని, బ్రహ్మ చ = బ్రహ్మదేవుడు అనియు, స్మృతః = చెప్పబడెనో, సః = అట్టి సర్వోత్తము డగువాడు, శ్రీగురుః = జ్ఞానసమృద్ధిగల గురుదేవుడుగా, కథితః = చెప్పబడెను.

శ్రీగురుమూర్తి నేత్రత్రయములేని సాక్షాన్మహేశ్వరుడు. శివుడు మూడవ కన్ను గలవాడు అను విషయమును శాస్త్రములలో చెప్పుచున్నారు. ఆ తృతీయ నేత్రము సకల జగములను ప్రళయకాలమందు నశింపజేయుటకై ఏర్పడినది. అందుచే తృతీయనేత్రము సర్వదా మూయబడి యుండునట్లు చిత్రములో చూచుచున్నారము. కాని శ్రీగురుపర మహేశ్వరుని యొక్క ప్రజ్ఞాననేత్రమును తెరచియే యుంచుచున్నారు. శివునకు మూడు కండ్లుంటున్నవి. వీరికిని నేత్రత్రయ ముంటున్నది. విచారించిన జ్ఞాననేత్రముగల వారందరు సాక్షాదీశ్వరులే.పుట్టంధు డగువానికి సులోచనము లుండినను ప్రయోజనము లేదు. అట్లు శాస్త్రజ్ఞాన ముండినను. ఆత్మజ్ఞానము లేకపోయిన ప్రయోజనము లేదు.

**"లోచనాభ్యాం విహీనస్య దర్పణః కిం కరిష్యతి।**
**తథాత్మజ్ఞానహీనస్య తచ్ఛాస్త్రం కిం కరిష్యతి॥"**

దీని యర్థము పైన దెలుపబడినదే.

విష్ణుదేవుడు నాలుగు భుజములు కలవాడు. శ్రీగురుదేవుడు రెండు భుజములు కలవాడైనను సర్వవ్యాపకు డగుటచే విష్ణుమూర్తిగనే యున్నాడు. భగవంతునికి భక్తులయొక్క యనుగ్రహార్థమై ధర్మార్థకామ మోక్షముల నొసంగుటకై చతుర్భుజము లున్నవని భక్తులు వచించుచున్నారు. శ్రీగురుదేవుడు ద్విబాహువులచే ఆత్మజ్ఞానము, దానిచే మోక్షము గలుగునని బోధించుచున్నాడు. లేక శాస్త్రజ్ఞానము,

అపరోక్షజ్ఞానము అను ద్విహస్తములను చేర్చి చతుర్భుజుడగు విష్ణువనియు చెప్పవచ్చును.

మరియు బ్రహ్మదేవుడు నాలుగుముఖములు గలవాడు, ఈ గురుదేవుడు చతుర్వేదసారములను, మహావాక్య చతుష్టయమును తత్త్వార్థముతో గూడియున్నాడు. ఇట్లు శ్రీగురుదేవుడు సకలాత్మస్వరూపకుడు అని ఓపార్వతీదేవీ! నీవు తెలిసికొనుము. ఇకను విచారించిన త్రిగుణాతీత పరబ్రహ్మము శ్రీగురుస్వరూపమని నిశ్చయజ్ఞానము కలిగియుండుము.

**"ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।**
**వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥"**

దీని యర్థము పై దెలిపినదే.

అవ: శిష్యునియొక్క ప్రార్థనను దెలుపుచున్నారు.

**అయం మయాంజలిర్బద్ధో దయాసాగరసిద్ధయే ।**
**యదనుగ్రహతో జంతుః చిత్రసంసారముక్తిభాక్ ॥ 93**

అయం - మయా - అంజలిః - బద్ధః - దయాసాగర - సిద్ధయే - యదనుగ్రహతః - జంతుః - చిత్రసంసారముక్తిభాక్.

జంతుః = జీవుడు, యదనుగ్రహతః = ఏ గురుదేవుని యనుగ్రహమువలన, చిత్రసంసారముక్తిభాక్ = ఆశ్చర్యకరమగు సంసారమునుండి ముక్తిని పొందుచున్నాడో, హేదయాసాగర = ఓ కరుణాసముద్రుడా! సిద్ధయే = అట్టి నీ కృపకొఱకు, అయం = ఇదిగో, అంజలిః = నమస్కారము, మయా = నాచేత, బద్ధః = ఆచరింపబడెను.

కరుణా సముద్రుడగు శ్రీగురుదేవునియొక్క యనుగ్రహమువలన సకలప్రాణులు చిత్రవిచిత్రమగు, నిమిషనిమిషమునకు మారుచున్నట్టి, నానావిధ దుఃఖదాయకమగు నీ సంసారబంధమునుండి ముక్తులై శాశ్వతానందమును పొందుచున్నారు. ఇట్లు గురుదేవునికృప మహామహిమ సంపన్నమై యుంటున్నది. శ్రీగురుదేవుని దయయు అజ్ఞానపాశఖడ్గమై యున్నది. ఈషణత్రయ వ్రతతీ లవిత్రమై (తీగెలకు కొడవలియై) యున్నది. సకల కర్మబన్ధ దాహకమై యున్నది.

తాపత్రయాగ్నికి మహామృతవృష్టియై యున్నది. ఇట్టి మీయొక్క అపారకరుణా సిద్ధికై కరుణాసాగరా! దీనబంధో! స్వామీ! ఇదిగో నాచే నమస్కారాంజలి చేయబడుచున్నది. అనన్యశరణ్యుడను. దీనుడ నగు నన్నుద్ధరింపుము.

అవ: శ్రీగురుదేవుని స్వరూపమును గాంచుటకు మహాపుణ్యమును జేయ వలెననియు, నాత్మసంస్కార ముండవలయు ననియు, శ్రీగురుదర్శనము మహ భాగ్యమనియు, నంతకన్నను మరియొకటి త్రిలోకములలో లేదనియు తెలుపుచున్నారు.

**శ్రీగురోః పరమం రూపం వివేకచక్షురగ్రతః ।**
**మందభాగ్యా న పశ్యన్తి అంధాస్సూర్యోదయం యథా ॥ 94**

శ్రీగురోః - పరమం - రూపం - వివేకచక్షుః - అగ్రతః - మందభాగ్యాః - న - పశ్యన్తి - అంధాః - సూర్యోదయం - యథా.

వివేకచక్షుః = ఆత్మజ్ఞాననేత్రము గలవాడు, శ్రీగురోః = శ్రీగురుపరమాత్మయొక్క, అగ్రతః = ముందున్న, పరమం రూపం = శ్రేష్ఠమైన స్వరూపమును. పశ్యతి = చూచుచున్నాడు, మందభాగ్యాః = పుణ్యము చేయని మందులు, అంధాః = గ్రుడ్డివారు, సూర్యోదయం యథా = అదిత్యోదయమునువలె, న పశ్యన్తి = చూడజాలకుంటున్నారు.

ఆత్మానాత్మవివేకము గలిగి పరమవైరాగ్య ధురంధరుడై శమాదిషట్క సంపత్తి గలిగి, వేదాంత శాస్త్రవిచారణా తత్త్వజ్ఞానము కలిగిన ప్రజ్ఞాననేత్రుడు శ్రీగురుపరబ్రహ్మస్వరూపమును నపరోక్షముగా గాంచుచున్నాడు. వాని జన్మము ధన్యమగు చున్నది. నిత్యానంద పదవియందు నుంటున్నాడు. అటుగాక వివేకజ్ఞానము లేక అజ్ఞానకుహరములో పడి కొట్టుకొనుచుండు భాగ్యము లేని మందులు గురుభాస్కరుడు దేదీప్యమానుడై ప్రకాశించు చుండినను సూర్యోదయ మగుచుండినను తత్ప్రకాశమును గ్రుడ్డివారు జూడజాలనట్లు తత్త్వజ్ఞాన ప్రకాశమును పొందనివారై గురుస్వరూపమును తెలియక యుంటున్నారు.

అవ: శ్రీగురుమూర్తి సర్వజనోద్ధారకుడను విషయమును నిచ్చోట వివరించు చున్నారు.

**కులానాం కులకోటీనాం తారకస్తత్ర తత్క్షణాత్ ।**
**అతస్తం సద్గురుం జ్ఞాత్వా త్రికాలమభివాదయేత్ ॥ 95**

కులానాం - కులకోటీనాం - తారకః - తత్ర - తత్క్షణాత్ - అతః - తం - సద్గురుం- జ్ఞాత్వా - త్రికాలం - అభివాదయేత్.

తారకః = ప్రణవతారక మంత్రస్వరూపు డైనట్టి శ్రీ సద్గురుదేవుడు, తత్ర = శ్రీగురుసన్నిధానమునందే, తత్క్షణాత్ = ఆక్షణమునందే, కులానాం = తమవంశీయులను, కులకోటీనాం = ఇతర వంశీయులను, తారకః = అందరిని తరింపజేయువాడై యున్నాడు. అతః = ఇందువలన, తం = సర్వోత్తారకుడగు, సద్గురుం = సద్గురుని, జ్ఞాత్వా = మహిమను తెలిసికొని, త్రికాలం = మూడుకాలముల యందును, అభివాదయేత్ = నమస్కరించవలయును.

శ్రీగురుదేవుడు ప్రణవతారక మంత్రస్వరూపుడై "స్వయం తీర్త్వా పరాంస్తారయేత్" తాను తరించి ఇతరులను తరింపజేయవలయును అన్నట్లు సర్వసంతరణ సామర్థ్యోపేతుడై తన సన్నిధానమున నున్నవారిని దర్శనముచేతనే తనయొక్క కులజులను, ఇతరవంశజులను, శరణుబొందిన తరువాత సమస్త ప్రాణికోటులను తరింపజేయుచున్నాడు. ఈ వాక్యముచే శ్రీగురుదేవుని కర్తవ్యమును దెలిపిరి. తానుమాత్రము సంతృప్తి జెందినచో నెవరికి లాభము? ఇట్టి మహానుభావులను సాక్షాదీశ్వరునిచే పంపబడిన వారినిగను, లేక స్వయముగా వచ్చిన వారినిగను దెలియవలెను. అట్టివారు అపారకరుణామయులు. పరోత్తారణమే తమయొక్క స్వభావమని పరంపరగా వచ్చుచుందురు. సూర్య డేలాగున నొక్కడయ్యు సర్వలోకమును పవిత్రముగా జేయుచున్నాడో, అట్లు గురుదేవు డాప్రదేశమును గాక, ఆ దేశమునుగాక, సమస్తలోకమును తత్త్వజ్ఞానోపదేశముచే జ్ఞానవంతము చేయుచున్నాడు. ఇందువలన శ్రీగురుస్వరూప మిట్టిదని, సర్వసంసార సాగరోత్తారకమని, జ్ఞానానందమని యెఱింగి త్రికాలములయందును శ్రీగురు దేవునకు నమస్కారము చేయవలెను. ఇట్లాచరించుటచే త్రికాలము లందును తమఃప్రదేశ మనునది లేక ప్రజ్ఞానానందఘను డగుచున్నాడు.

అవ: శ్రీగురు నమస్కార విధానము:

**శ్రీనాథచరణద్వంద్వం యస్యాం దిశి విరాజతే ।**
**తస్యాం దిశి నమస్కుర్యాత్ భక్త్యా ప్రతిదినం ప్రియే ॥ 96**

శ్రీనాథచరణద్వంద్వం - యస్యాం - దిశి - విరాజతే - తస్యాం - దిశి - నమః - కుర్యాత్ - భక్త్యా - ప్రతిదినం - ప్రియే.

యస్యాం దిశి = యే దిక్కునందు, శ్రీనాథచరణద్వంద్వం - శ్రీనాథ = సర్వజ్ఞాన సంపన్నుడగు సర్వలోక రక్షకుడైన శ్రీగురుదేవునియొక్క, చరణద్వంద్వం = పాదపద్మ యుగళము, విరాజతే = విశేషముగా ప్రకాశించుచున్నదో (సర్వతమోఽపహారియై జ్ఞానతేజో రూపమై యున్నదో), తస్యాం దిశి = ఆ దిక్కునందు, భక్త్యా = పరమభక్తితో, ప్రతిదినం= నిత్యమును, హే ప్రియే! = ఓ గౌరీదేవీ, నమః = నమస్కారము, కుర్యాత్ = ఆచరించ వలయును.

ఈ శ్లోకమున ఆదిత్యోపాసకు లెట్లు సూర్యు డుదయించు తూర్పు దిక్కునకు దిరిగి నమస్కరించు చున్నారో, సాయంకాలమున పశ్చిమ దిక్కునకు దిరిగి సమస్కరించుచున్నారో, మధ్యాహ్నమున ఆకాశమధ్యమును గాంచుచు ప్రణమిల్లుచున్నారో- అట్లు శ్రీగురుదేవుని నమస్కరించవలయునని తెలుపు చున్నారు. సర్వలోక రక్షకుడును నఖండవిజ్ఞాన సమృద్ధి సముపేతుడును నగు శ్రీగురువరునియొక్క చరణకమల యుగళము ఏ దిక్కునందు విరాజిల్లుచున్నదో, ఆ దిక్కున అజ్ఞానాంధకారము నశించి జ్ఞానప్రకాశము తేజరిల్లుచున్నదని యర్థము. అచట నున్నవారు పవిత్రాత్ములు, జ్ఞానస్వరూపులు, గురుభక్తులని భావము. అట్టి దిక్కుకొఱకు ప్రతిదినము పరమభక్తితో ఓ పార్వతీదేవీ ! నమస్కారము చేయవలయును. సర్వదా సూర్యోపాసకులవలె త్రికాలములయందు నభివాదనము గావించుచు, శ్రీగురుమూర్తియొక్క స్వస్వరూపమును మరువకుండవలయును. ఆ మహాత్ముని చరణద్వంద్వమును హృదయపీఠమున నధిష్ఠింపజేసి పూజించు చుండవలెను. అట్లే హృదయములో నున్న గురుపరబ్రహ్మమును సందర్శించు చుండవలయును.

అవ: ఈ ప్రకారము గురుదేవుని నభివర్ణించుచు ప్రత్యేకముగా నమస్కారము యొక్క ప్రయోజనమును దెలుపుచున్నారు.

**సాష్టాంగప్రణిపాతేన స్తువన్నిత్యం గురుం భజేత్ ।**
**భజనాత్ స్థైర్యమాప్నోతి స్వస్వరూపమయో భవేత్ ॥ 97**

సాష్టాంగప్రణిపాతేన - స్తువన్ - నిత్యం - గురుం - భజేత్ - భజనాత్ - స్థైర్యం - ఆప్నోతి - స్వస్వరూపమయః - భవేత్.

సాష్టాంగప్రణిపాతేన = సాష్టాంగ దండప్రణామముచేత, గురుం = గురుదేవుని, నిత్యం = ఎల్లప్పుడు, స్తువన్ = స్తోత్రము చేయుచు, భజేత్ = సేవించవలయును, భజనాత్ = అట్టి గురువుయొక్క స్మరణమువలన, స్థైర్యం = స్వస్వరూపస్థితియందు స్థిరత్వమును జ్ఞానమునందు దృఢత్వమును, ఆప్నోతి = పొందుచున్నాడు, స్వస్వరూపమయః = తనయొక్క ఆత్మస్వరూపుడుగా, భవేత్ = తప్పక అగుచున్నాడు.

నమస్కార మనిన వినమ్రుడై సర్వదా యుండుట యని ధాత్వర్థము. అందుచే ఎంత విజ్ఞానసంపత్తి కలిగినను, సర్వలోకపూజితు డైనను, శిష్యుడాత్మ గురువు దగ్గర కేల్మోడ్చి నమస్కరించుచు వినమ్రుడై యుండ వలయును. “భావాద్వైతం సదా కుర్యాత్ నాద్వైతం గురుసన్నిధౌ’ అనువాక్యము పై విషయమునే తెలుపుచున్నది. నిత్యము శ్రీగురుదేవునికి సాష్టాంగముగా నమస్కరించుచు, గురుదేవుని సేవించుచు, శ్రీగురూపదేశ ప్రకారము తపోధ్యానాదులు సలుపుచు, గురువుయొక్క ఆజ్ఞ నుల్లంఘించనివాడై ప్రవర్తించుచుండిన ఆత్మజ్ఞాన స్థైర్యము గలిగి గురుస్వరూపమగు ఆత్మస్వరూపమును పొందుచున్నాడు, అనగా తాను పరబ్రహ్మ మగుచున్నాడు. ఇట్లు నమస్కారము స్వస్వరూప సాక్షాత్కారమునకు ప్రధాన కారణముగ నున్నది.

అవ: పైన దెలుపబడిన సాష్టాంగదండప్రణామముయొక్క లక్షణమును చెప్పుచున్నారు.

**దోర్భ్యాం పద్భ్యాం చ జానుభ్యామురసా శిరసా దృశా ।**
**మనసా వచసా చేతి ప్రణామో౾ష్టాంగ ఉచ్యతే ॥ 98**

దోర్భ్యాం - పద్భ్యాం - చ - జానుభ్యాం - ఉరసా - శిరసా - దృశా - మనసా - వచసా - చ - ఇతి - ప్రణామః - అష్టాంగః - ఉచ్యతే.

దోర్భ్యాం = చేతులచేత, పద్భ్యాం = పాదములచేత, జానుభ్యాం చ = మోకాళ్ళచేతను, ఉరసా = వక్షఃస్థలముచేతను, శిరసా = శిరస్సుచేతను, దృశా = నేత్రముల చేతను, మనసా = మనస్సుచేతను, వచసా చ = వాక్కుచేతను చేయబడినట్టి, ప్రణామః = నమస్కారము, అష్టాంగః ఇతి = ఎనిమిదంగములతో గూడినదని, ఉచ్యతే = చెప్పబడుచున్నది.

(1) చేతులచేతను, (2) పాదములచేతను, (3) మోకాళ్ళచేతను, (4) వక్షస్థలముచేతను, (5) శిరస్సుచేతను, (6) నేత్రములచేతను, (7) వాక్కుచేతను, (8) మనస్సుచేతను చేయబడు నమస్కారము ఎనిమిదంగములతో గూడిన దగుటచే సాష్టాంగ నమస్కారమని చెప్పబడుచున్నది.

మరియు నింతియే గాదు, దండప్రణామ మనియు చెప్పుచున్నారు. దానియర్థ మేమనగా, శిష్యుడు తనయొక్క శరీరమును కర్రవలె భూమిమీద దీర్ఘముగా పడునట్లు చేయవలెను. అనగా నిరభిమానియై యుండవలయునని యర్థము. తరువాత బాహువులచే శ్రీగురుదేవుని పాదములను స్పృశించి తనయొక్క మోకాళ్ళు, పాదములు, వక్షస్థలము, శిరస్సు- భూమిమీద బాగుగా తాకునట్లు చేసి నేత్రములను గురుపాదముల మీదనే ప్రసరింపజేసి వాక్కుతో గురుస్తోత్రమును చెప్పుచు, తమ నామధేయ వంశాదులను వచించుచు మనస్సును గురుస్వరూపమం దేకముచేసి నమస్కరించవలయును. ఇట్టి నమస్కారమే "వందనం మోక్షదాయకం" అన్నట్లు మోక్షమును గలిగించుచున్నది.

ఇందుచే శ్రీగురువుయొక్క దర్శనము, స్పర్శనము, సంభాషణములును గలుగుచున్నవి. అట్టి మహాభాగ్యము నిరంతరము గలుగునట్టి వానికి ముక్తిపద మనునది మరియొండు లేదు. అదే స్వస్వరూపజ్ఞానము, నిఖిలానందము, శివము, అద్వయము, నిత్యము, శాంతము.

అవ: ప్రపంచమును మాయానాటకముగను, శ్రీగురుదేవుని అద్వితీయ సార్వభౌమునిగను నిరూపించుచు, నామహానుభావునకు నిత్యము నమస్కరించు చుండవలయునని బోధించుచున్నారు.

**తస్యై దిశే సతతమఞ్జలిరేష నిత్యం**
**ప్రక్షిప్యతాం ముఖరితైర్మధురైః ప్రసూనైః।**

**జాగర్తి యత్ర భగవాన్ గురుచక్రవర్తీ**
**విశ్వస్థితిప్రళయనాటకనిత్యసాక్షీ ॥** **99**

తస్మై - దిశే - సతతం - అఞ్జలిః - ఏషః - నిత్యం - ప్రక్షిప్యతాం - ముఖరితైః - మధురైః - ప్రసూనైః జాగర్తి - యత్ర - భగవాన్ - గురుచక్రవర్తీ - విశ్వస్థితిప్రళయనాటకనిత్యసాక్షీ.

యత్ర = ఏదిక్కునందు, భగవాన్ = పూజ్యుడయిన, విశ్వ......... నిత్యసాక్షీ - విశ్వ = ప్రపంచమనెడి, స్థితిప్రళయ = స్థితినాశములయొక్క, నాటక = నాటకమునకు, నిత్యసాక్షీ - నిత్య = సర్వదా యున్నట్టి, సాక్షీ = సాక్షియయిన, భగవాన్ = భగవంతుడైన, గురుచక్రవర్తీ = శ్రీ గురువను ఏకచ్ఛత్రాధిపతి (సార్వభౌముడు), నిత్యం = ఎప్పుడును. జాగర్తి = మేలుకొని యుంటున్నాడో, ప్రకాశించుచున్నాడో, తస్మై = అట్టి సర్వలోకరక్షకుడగు గురుసార్వభౌమునితో నిత్యము గూడియున్న,దిశే = దిక్కుకొఱకు, మధురైః = మాధుర్యముతోగూడిన, ముఖరితైః= శబ్దములచేతను(గురుస్తోత్రములచేతను), ప్రసూనైః = పుష్పములచేతను, (లేక) మధురైః ముఖరితైః ప్రసూనైః = తుమ్మెదలయొక్క మనోహరములగు శబ్దములతో గూడుకొన్న అనగా పరిమళించుచున్న కుసుమములతో, ఏషః అంజలిః = ఈ(నిర్దేశింపబడుచున్న) అంజలి, ప్రక్షిప్యతాం = చల్లబడుగాక.

గురుదేవుడు జ్ఞాన స్వరూపు డగుటచే సర్వలోక పూజనీయుడుగ నున్నాడు. మఱియు విశ్వస్థితి ప్రళయనాటక నిత్యసాక్షిగ నుంటున్నాడు. ప్రపంచ మనునదియే మాయానాటకము. నాటకములో ననేక పాత్రధారులు చిత్రవిచిత్ర వేషములను ధరించి యాడుచున్నారు. అందులో గొందఱేడ్చుచు శోకరసమును, కొందఱు పరస్పరానురాగ ప్రవర్తితులై శృంగారరసమును, మఱికొందఱు భయంకర సంగ్రామమును జేసి క్రోధ భయరసములతోడి వీరరసమును, ఇకను గొందఱు సాధురూపమును, మహర్షుల రూపమును స్వీకరించి ప్రాణాయామాద్యను ష్ఠానములను ఘోరతపస్సును జేయుచు శాంతరసమును, వికారవేషములను వేసికొని హాస్యరసమును బీభత్సరసము నిట్లనేకవిధములుగ ప్రవర్తించి, నవరసములను జూపుచున్నారు. వీని నన్నిటిని ప్రేక్షకులు కాంచుచుందురు. నటించువారలు ధనమునకై వచ్చినవారు. సభాసదులును వినోదముకొఱకు జూచుచున్నారు. కాని వారు చూపిన దంతయు నిజమును గాదు. రామాది రూపములను ధరించినప్పుడు వారు రాము లగుదురా? పురుషుడు స్త్రీ వేషమును

వేసినప్పుడు స్త్రీ యగునా? మఱియు నాటకములో పాత్రలు వచ్చుచున్నవి; పోవుచున్నవి. ఆ నాటకము పూర్తియయిన తరువాత నేమియు కానుపించదు. ఆ ప్రకారము ప్రపంచము మిథ్యాభూతవస్తువు.

ఈ నాటకరంగములో వారివారి కర్మానుగుణముగా వేషముల వలె శరీరములను ధరించి నానావిధ సుఖదుఃఖములను, నవరసములనువలె ననుభవించుచున్నారు. ఈ ప్రపంచనాటకములోను నవరసముల ననుభవించు చున్నారు. సాధుపురుషులు గలరు. దుర్మార్గులు నుందురు. అయినను నాటకములోని వారు సుఖదుఃఖముల నేలాటి వికారముల ననుభవించుట లేదు. ప్రేక్షకులును వినోదమునే పొందుచున్నారు. జగన్నాటకములో నున్నవారు యథార్థముగా సుఖదుఃఖముల ననుభవించు చున్నారనియే తలంచుచున్నారు. విచారించిన నదియు మిథ్యయే. నాటక మాడువరకుండి తరువాత నేమియు లేనట్లు ప్రపంచములు గూడ కర్మానుగుణముగ ప్రవర్తించి కడపట లీనమగు చున్నవి. వ్యవహారదశలో నిత్యముగ దోచును. విచారించిన లేని వగుచున్నవి.

ఈ ప్రకారము విశ్వమను నాటక ముత్పత్తి స్థితి లయములకు నిలయముగ నున్నది. నాటకములోని ప్రేక్షకులవలె సమస్తమును గాంచుచు జగదీశ్వరుడు వినోదించుచుండును. లేదా తటస్థుడుగ నుండును. సమస్తమును తెలియుచు సర్వసాక్షియై వికారరహితుడై నిత్యుడుగ నుంటున్నాడు. తానుమాత్ర మేవేషమును ధరించుట లేదు. అచలుడు ఉత్పత్తిస్థితి నాశరహితుడునై యున్నాడు. నాటక మనునది యథార్థముగ జరిగిన కథాభాగమునుగాని, కల్పిత కథాభాగమునుగాని తెలుపును. ఈ ప్రపంచములో సృష్టి స్థితి ప్రళయరూప జగము లనన్తములని తెలుపుచు తనయొక్క అనాదిత్వ మిట్టిదని బోధించు చున్నది. తద్వారా జగదీశ్వరునకు నిత్యత్వమును స్థిరము చేయుచున్నది. ఈశ్వరు డిట్టి ప్రపంచము నకు సాక్షియగుట మాత్రమే గాదు. జడమగు సర్వప్రపంచమను నాటకమును విద్యుచ్ఛక్తివలె తనయొక్క ప్రకాశముచే ప్రకాశింపఁజేయుచు రెప్పపాటుగూడ నేమరక జాగరూకుడై చైతన్యవంతముగ సకలము నొనరించుచున్నాడు. ఆయన మేలుకొనక యుండిన, చేతనత్వము గలుగజేయ కుండిన సమస్తము లయము నొందుచున్నది.

ఇదియే మహాప్రళయము. కాబట్టి పరమాత్మ సర్వప్రకాశుడు, స్వయంజ్యోతి, సర్వసాక్షి, అవికారి, నిత్యుడనై యున్నాడు. అట్టి ప్రభువే శ్రీగురుస్వామివరుడై యున్నాడు.

సార్వభౌము డెట్లు సర్వలోకమును శాసించువాడై హితాహితములను దెలియుచు, నేకచ్ఛత్రాధిపతియై యద్వితీయుడై యున్నాడో, అదేవిధముగ శ్రీగురుపరమాత్మదేవుడును సకలాత్మ సామ్రాజ్యాభిషిక్తుడై విజ్ఞానతేజముతో దేజరిల్లుచు, సకలజగత్తును సంకల్పశక్తిచేతనే నడిపించుచు, సమస్తమును తనయొక్క జ్ఞానశక్తిచే దెలియుచు నద్వితీయడై యొప్పుచున్నాడు. కావున నట్టి జగదీశ్వరుండు శ్రీగురుదేవు డేదిక్కునందున్నాడో, ఆ దిశయు మహాపవిత్రవంత మయినది. అచ్చటనున్న వారందఱు ధన్యాత్ములు, జ్ఞానతేజో విరాజితులు. అట్టి దిక్కుకొఱకు మిగుల జ్ఞానమాధుర్యముతో గూడి నమృతత్వము నొసగు మనోహరములగు గురుస్తోత్రములచేతను, పరిమళవంతములగు పుష్పరాజములను నంజలియం దుంచుకొని యంతట నిత్యము చల్లబడుగాక.

అనగా శ్రీగురుదేవుడు విరాజిల్లు దిక్కునకు నభిముఖులై పరమభక్తులగు శ్రీగురుదేవునియొక్క భక్తులు పరమభక్తితో సాష్టాంగపడి, శ్రీగురుదేవుని స్తుతించుచు నానావిధ గంధాక్ష తలచేతను, పుష్పములచేతను నాదిక్కునకు పూజించవలయును. లేదా ఆదిక్కున శ్రీగురుదేవుని పాదుకలనుగాని, చిత్రమునుగాని యుంచి పూజించవచ్చును. ఇట్లు శ్రీగురుదేవుని కేవల పరబ్రహ్మస్వరూపునిగ దెలిసి నిత్యము నమస్కరించుచు, పూజించుచు, భావించుచు తన్మయుడై నిత్యతృప్తుడై ముక్తుడై యుండవలయును.

అవ: శ్రీగురుసేవా సాధనోత్తమతా:

**అభ్యస్తైః కిము దీర్ఘకాలవిమలై ర్వ్యాధిప్రదైర్దుష్కరైః**
**ప్రాణాయామశతై రనేకకరణైర్దుఃఖాత్మకైర్దుర్జయైః ।**
**యస్మిన్నభ్యుదితే వినశ్యతి బలీవాయుస్స్వయం తత్క్షణాత్**
**ప్రాప్తుం తత్సహజస్స్వభావమనిశం సేవేత చైకం గురుమ్ ॥** 100

అభ్యస్తైః - కిము - దీర్ఘకాలవిమలైః - వ్యాధిప్రదైః - దుష్కరైః - ప్రాణాయామశతైః - అనేకకరణైః - దుఃఖాత్మకైః - దుష్కరైః - యస్మిన్ - అభ్యుదితే - వినశ్యతి - బలీ - వాయుః- స్వయం - తత్క్షణాత్ - ప్రాప్తుం - తత్ - సహజస్వభావం - అనిశం - సేవేత - చ - ఏకం- గురుం.

అభ్యస్తైః = అభ్యసింపబడుచున్న, దీర్ఘకాలవిమలైః = బహుకాలమునకు నన్తఃకరణశుద్ధిని గలుగజేయునట్టియు, వ్యాధిప్రదైః = (ఏమరునంతమాత్రమున) రోగము నుత్పన్నము చేయునవియు, గనుకనే, దుష్కరైః = దుస్సాధ్యము లయినట్టియు, ప్రాణాయామశతైః = ప్రాణసంయమమునకై యేర్పడిన రేచక పూరక కుమ్భకాది నానావిధ ప్రాణాయమములచేతను, దుఃఖాత్మకై = దుఃఖమును గలిగించునట్టి, దుర్జయైః = జయింప కష్టము లైనట్టి, అనేకకరణైః= బహుసాధనములచేతను, ఇంద్రియములచేతను (దేహేన్ద్రియముల శోషింప జేయు తపోవ్రతాదులచేతను), కిము = ఏమి ప్రయోజనము, యస్మిన్ = ఏ స్వస్వరూపజ్ఞానము (నిర్వికల్పసమాధి), అభ్యుదితే సతి = ఉదయించిన దగుచుండగా, తత్క్షణాత్ = ఆ క్షణకాలములోనే, బలీవాయుః = సర్వదా చిత్తచాపల్యము గలిగించు సామర్థ్యము గల ప్రాణవాయువు, స్వయం = తనంతటనే, వినశ్యతి = లయించి పోవుచున్నదో, తత్ = అటువంటి, సహజస్వభావం = సహజసమరస భావము గల, ఏకం గురుం ఏవ = శ్రీ గురుదేవు నొకనినే, అనిశం = ఎల్లప్పుడు, సేవేత = సేవించవలయును.

పరమకారుణికు డగు శ్రీ గురుదేవునియొక్క మహిమను దెలిసి నిర్మలుడై పరమభక్తితో ననన్యశరణుడై శ్రీగురుదేవునే సేవించు చుండినచో, నఖండ జ్ఞానోదయము శిష్యునకు గలుగుచున్నది. తదితరసాధన లవసరము లేదను శ్రీగురుసేవా ప్రయోజనమును ప్రతిపాదించుచున్నారు. ప్రాణాయామము లనునవి రేచక పూరక కుమ్భకాది నానావిధ భేదములచే నొప్పుచు, కఠినతర సాధన లగుటచే దుస్సాధములై కొంచెము తప్పిపోయిన వెంటనే ప్రబలతరమగు నే వైద్యునిచేతను, నే యౌషధము లిచ్చినను కుదురని దీర్ఘవ్యాధిని గలుగజేయునవి గనుకనే కేవల దుఃఖరూపములై బాధనే కలిగించుచున్నవి. మఱియు నవి యన్తఃకరణశుద్ధిని బహుకాలము నాచరింపబడినగాని చేయజాలవు. మనోమాలిన్యమును పాపములను శీఘ్రముగ పోగొట్టజాలవు.

ఇకను ననేక కఠినతమ సాధనలు గలవు. అవన్నియు దుఃఖరూపములే యగుచున్నవి. కేవలము దేహేన్ద్రియాదులను శుష్కింపజేయు తపోవ్రతాదులు

గలవు. ఇంద్రియముల జయము దుస్సాధ్య మగుటచే వాని నాచరింతురు. కాని వర్షము వచ్చినచో నెండియున్న బీజములు మొదలయినవి తిరుగా నంకురించు నట్లు తపములను మానినయెడల నా దేహేంద్రియాదులు మామూలు స్థితిలోనికి వచ్చుచున్నవి. ఇక నేతి ధౌతి క్రియాదులు నుంటున్నవి. ఇవన్నియు హఠయోగాదు లకు జెందినవి. ఇట్టి సాధనచే పాపక్షయము, నన్తఃకరణశుద్ధి, కాయశుద్ధి మొదలయిన ప్రయోజనములు గలిగినను పరమశాంతి దాయకమగు జ్ఞానము కలుగ కుండినచో నేమిఫలము?

పైన జెప్పబడిన సాధనలు కేవలము మందమతుల కేర్పడినవి. కావున వీని నన్నిటి ననన్తముగ నాచరించుచుండిన ప్రయోజనము లేదు. స్వస్వరూప జ్ఞానోదయమునకై శ్రీగురువుదగ్గఱ నుండి శీలించవలయును. గుర్వాజ్ఞను పాలించవలయును, సేవించవలయును. శ్రీగురువర్యుని పరమకృపచే నఖండ జ్ఞానోదయము గలుగుచుండగా, సర్వదృశ్యరహిత స్వస్వరూప సాక్షాత్కార నిర్వికల్ప సమాధి సిద్ధించుచుండగా తత్క్షణమే దృశ్యోత్పత్తికి హేతువగు చలనాత్మకమగు చిత్తమునకు ప్రధాన కారణ మయిన ప్రాణవాయువున్ను లయించి పోవుచున్నది. తద్ద్వారా చిత్తముగూడ బ్రహ్మములో కలిసిపోవుచున్నది. బ్రహ్మాకార మగుచున్నది. ఇట్టి సర్వదృశ్యరహిత సహజస్వభావ సచ్చిదానంద లక్షణజ్ఞానమును బడయుటకై యిట్టి సహజసమరస భావముతో నొప్పుచున్న శ్రీగురుదేవునే శరణుపొంద వలయును; సేవించవలయును. ఇట్లాచరించుటచే గురుస్వరూపమగు పరమాత్మ తత్త్వజ్ఞానము గలిగి నిత్యానందము ప్రాప్తమగు చున్నదని సారము.

అవ: ఇకను శ్రీగురుదేవునియందలి పరమభక్తి యొకటియే శిష్యునకు మోక్షదాయిగ నున్నదని ప్రతిపాదించుచున్నారు.

**జ్ఞానం వినా ముక్తిపదం లభ్యతే గురుభక్తితః ।**
**గురోస్సమానతో నాన్యత్సాధనం గురుమార్గిణామ్ ॥ 101**

జ్ఞానం - వినా - ముక్తిపదం - లభ్యతే - గురుభక్తితః - గురోః - సమానతః - న - అన్యత్ - సాధనం - గురుమార్గిణామ్.

జ్ఞానం వినా = శాస్త్రాది జ్ఞానము లేకపోయినను, గురుభక్తితః = కేవలము గురువునే

ప్రత్యక్షదైవముగ దలంచు పరమభక్తివల్లనే, ముక్తిపదం = మోక్షస్థానము, లభ్యతే = పొందబడుచున్నది. ఇందువలన, గురోః = శ్రీ గురువరునికంటెను, సమానతః = సమాన మయిన దగుటవలన, అన్యత్ సాధనం = ఇతరసాధనము, గురుమార్గిణాం = శ్రీగురువే సాధనమార్గముగ గలవారికి (మోక్షమునకు పరమసాధనమునుగ గురువరుని విశ్వసించిన భక్తవరులకు), న = లేదు.

శాస్త్రజ్ఞానము లేకపోయినను, ఏమియు తెలియని వాడైనను, కేవల గురుభక్తివలన నీమోక్షమును పొందుచున్నాడు. గురుభక్తి స్వరూపమును ముందు తెలిపియున్నారు. గురునామజపము, గురుమూర్తిధ్యానము, గురువు చెప్పినట్లా చరించుటయు, (నిదంతయు) గురుభక్తిలో జేరిన వగుచున్నవి. శ్రీగురుదేవుని విషయక మగు నాచరణ తప్ప తదితరజ్ఞానము లేనివాడు పై దెల్పినట్టి పరమభక్తితోనే స్వస్వరూపజ్ఞాన ముదయించి యఖండపదవి నధిష్ఠించు చున్నాడని తాత్పర్యము. కావున నాప్రకారము శ్రీ గురుదేవ స్వరూపచిన్తనము నాధారముగ జేసికొని మోక్షము నొందగోరువారికి శ్రీ గురుదేవుడు తప్ప మఱియొక సమాన మయిన సాధన మెద్దియును లేదు. శ్రీగురుదేవుడే పరమశరణ్యము. ఇట్లు శ్రీ శంకరాచార్యుల దగ్గఱ పరమభక్తుడగు త్రోటకాచార్యులు విజ్ఞానవంతు లయిరి.

అవ: 'నేతి నేతి' అను మహావాక్యార్థమును విశదీకరించుచున్నారు.

**యస్మాత్పరతరం నాస్తి నేతి నేతీతి వై శ్రుతిః ।**
**మనసా వచసా చైవ సత్యమారాధయేద్గురుమ్ ॥ 102**

యస్మాత్ - పరతరం - న - అస్తి - నేతి నేతి - ఇతి - వై - శ్రుతిః - మనసా - వచసా - చ - ఏవ - సత్యం - ఆరాధయేత్ - గురుం.

నేతినేతి ఇతి = నేతి నేతి అను, శ్రుతిః = వేదము, యస్మాత్ = ఏకాద్వితీయ పరబ్రహ్మమగు ఏ శ్రీ గురుదేవునికంటెను, పరతరం = శ్రేష్ఠమయినది, ఇతరమైనది, నాస్తి = లేదు. అని తెలుపుచున్నది. వై = ప్రసిద్ధము కావున, సత్యం = సత్యస్వరూపు డయిన, గురుం = శ్రీగురుమూర్తిని, మనసా = మనస్సుచేత, వచసా చ ఏవ = వాక్కుతోను, ఆరాధయేత్ = ఆరాధించవలయును.

ఇది నేను కాను, ఇది నేను కాను అని సర్వదృశ్య నిషేధమును జేసి కేవల చిన్మాత్రుడ నని 'నేతి నేతి' అను శ్రుతియొక్క యర్థము. అట్లే శ్రీ గురు

బ్రహ్మముకన్న ఉత్కృష్ట మైనదియు, నితర మయినది యగు వస్తువు లేదు. లేనే లేదు. పరబ్రహ్మ గురుదేవుడే సత్తామాత్రుడని 'నేతినేతి' యను అపవాదశ్రుతి తెలుపుచున్నది. ఇదంతయు వేదాంతశాస్త్రమున స్పష్టము. కాబట్టి సత్యస్వరూపుడగు శ్రీగురుమూర్తినే నిరంతరము వాక్కుతో స్తుతించుచు, మనస్సుతో ధ్యానించుచు, దేహముతో సేవించుచు, త్రికరణశుద్ధిగా నన్నివిధముల నారాధించ వలయును.

అవ: శ్రీగురుపరమాత్మయొక్క యనుగ్రహాతిరేకముచేతనే సృష్టిస్థితి లయములు జరుగుచున్న వను క్రమమును దెలుపుచున్నారు.

**గురోః కృపాప్రసాదేన బ్రహ్మవిష్ణుమహేశ్వరాః ।**
**సామర్థ్యమభజన్సర్వే సృష్టిస్థిత్యన్తకర్మణి ॥ 103**

గురోః - కృపాప్రసాదేన - బ్రహ్మవిష్ణుమహేశ్వరాః - సామర్థ్యం - అభజన్ - సర్వే - సృష్టిస్థిత్యన్తకర్మణి.

గురోః = శ్రీగురుపరమాత్మయొక్క, కృపా = అపారకరుణయొక్క, ప్రసాదేన = ప్రసరణముచేత, బ్రహ్మవిష్ణుమహేశ్వరాః = బ్రహ్మవిష్ణుమహేశులు, సర్వే = అందరు (ముగ్గురు), సృష్టి స్థితి అన్త కర్మణి = సృష్టి స్థితి లయములను కర్మలందు, సామర్థ్యం = శక్తిని, అభజ న్= పొందిరి.

బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ముగ్గురును దీర్ఘకాలము శ్రీ సద్గురు పరమాత్మనుగూర్చి తపస్సు చేసిరి. అందుచేతనే శ్రీగురుపరమాత్మయొక్క యనుగ్రహమును బడసి, బ్రహ్మదేవుడు తనయొక్క రజోగుణముచే సకల ప్రపంచమును సృష్టించెను. విష్ణుదేవుడు తనయొక్క సత్త్వగుణముచే సమస్త విశ్వమును పాలించుచున్నాడు. మహేశ్వరుడు తమోగుణముచే సకలమును లయింప జేయుచున్నాడు. ఈ ప్రకారము త్రిమూర్తులును శ్రీగురుపరమాత్మ యొక్క కృపాకటాక్షమును సంపాదించియే సృష్టిస్థితిలయ సామర్థ్యమును పొందిరి.

దీని ననుసరించియే పంచీకరణశాస్త్రములో శుద్ధపరబ్రహ్మమునందు ఒకానొక క్షోభ గలిగెను. ఇది రజోగుణము. దానిచే శుద్ధమాయ వ్యక్త మాయెను. ఇది స్థితిశీల మయిన దగుటచే సత్త్వగుణము. తరువాత మోహమావరించెను.

ఇది జ్ఞానమును లయింప జేయున దగుటచే తమోగుణము. ఇట్లే ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి క్రియాశక్తులను వర్ణించెదరు. కాబట్టి త్రిగుణాతీత పరబ్రహ్మము శ్రీగురు పరమాత్మయే.

ఆయన నిగ్రహానుగ్రహ సమర్థుడు. ఇచ్ఛామాత్రమున బ్రహ్మవిష్ణు మహేశ్వరులను సృష్టించుచున్నాడు. వారి ద్వారా సమస్తము నేర్పడుచున్నది. ఇట్లు శ్రీగురుదేవుని యనుగ్రహాతిశయము నిరతిశయము, నిరుపమము, సర్వసమర్థము. బ్రహ్మవిష్ణు మహేశ్వరుల తపఃప్రకారము పురాణములలోను ఉపనిషత్తులలోను గనందగును. "కేవలం గురుసేవయా" అనియు చతుర్థపాదము గలదు. శ్రీగురుదేవుని సేవించి త్రిమూర్తులు పైదెల్పిన శక్తులను బడసిరని దానియర్థము.

అవ: శ్రీగురుశుశ్రూషావిధి మహోత్కృష్టము, ఋష్యాదులకును బాగుగా గోచరము కానిదని చెప్పుచున్నారు.

**దేవకిన్నరగన్ధర్వాః పితృయక్షాస్తు తుమ్బురః ।**
**మునయోఽపి న జానన్తి గురుశుశ్రూషణే విధిమ్ ॥ 104**

దేవకిన్నరగన్ధర్వాః - పితృయక్షాః - తు - తుమ్బురః - మునయః - అపి - న - జానన్తి - గురుశుశ్రూషణే - విధిం.

దేవకిన్నరగన్ధర్వాః = దేవతలు, కిన్నరులు, గన్ధర్వులు, పితృయక్షాః = పితరులు, యక్షులు, తుమ్బురుః = తుమ్బురు మహర్షియు, మునయః అపి = నారదాది మహామునులును, గురుశుశ్రూషణే = గురుశుశ్రూషయందు, విధిం = విధిని, న జానన్తి = తెలియజాలరు.

దేవతలు కిన్నరులు గన్ధర్వులు మొదలయిన వారును, పితృదేవతలు, యక్షులు, తుంబురుమహర్షి, నారదాది మహామునులును శ్రీగురుపరమాత్మయొక్క శుశ్రూషావిధిని స్పష్టముగ దెలియజాలరు. శు శ్రూష యనగా సేవ యని సామాన్యార్థము. శ్రోతుం ఇచ్ఛా శుశ్రూషా = శ్రవణము చేయ నిచ్ఛ శుశ్రూష యగునని మఱియొక యర్థము. శ్రీగురుపరమాత్మ స్వరూప తత్త్వాదికము శ్రవణము చేయుటయు, నిక దానికి సమ్బంధించిన వన్నియును శుశ్రూషాపద గ్రాహ్యము లగుటచే శుశ్రూష యని తెలియవలెను.

ఇట్టి తత్త్వమును శ్రీగురుదేవుని పరమభక్తులే తెలియగలరు. పై జెప్పబడిన దేవగన్ధర్వాదు లందఱును శ్రీగురుసేవ చేయకయు, శ్రవణమననాదుల చేయకయు శ్రీగురుభక్తి లేనిచో పరమతత్త్వమగు శ్రీ గురుపరబ్రహ్మతత్త్వము నెఱుంగ జాలరని సిద్ధార్థము. లేదా శ్రీగురుపరబ్రహ్మతత్త్వము మనోవాగతీత మగుటచే నెవరికిని నిట్టిదని వచింపను, తలంపను సాధ్యము గాదు. కేవలానుభవైకవేద్య మనియు నర్థము. శ్రీగురుభక్తి ప్రాశస్త్యము నీరీతిగ దెలియవలెను.

అవ: శ్రీ గురుపరబ్రహ్మ స్వరూప రహస్యమును కేవల శాస్త్రజ్ఞానము గలవారు (లౌకికులు) తెలియ జాలరను విషయమును తేటపరచుచున్నారు.

**తార్కికాశ్ఛాందసాశ్చైవ దైవజ్ఞాః కర్మఠాః ప్రియే ।**
**లౌకికాస్తే న జానన్తి గురుతత్త్వం నిరాకులమ్ ॥ 105**

తార్కికాః - ఛాందసాః - చ - ఏవ - దైవజ్ఞాః - కర్మఠాః - ప్రియే - లౌకికాః - తే - న - జానన్తి - గురుతత్త్వం - నిరాకులం.

హేప్రియే = అనుగ్రహపాత్రురాలవగు భవానీ, తార్కికాః = తర్కశాస్త్రజ్ఞులు, ఛాందసాః = వేదాధ్యయనము చేయువారు (శ్రోత్రియులు), దైవజ్ఞాః చ = జ్యోతిష్కులు, కర్మఠాః = యజ్ఞయాగాదిక్రియ లొనరించు కర్మనిష్ఠ గల మీమాంసకులు, (యే = ఎవరు గలరో) తే = వారందఱును, లౌకికాః ఏవ = లోకజ్ఞానము గలవారు మాత్రమే. కావున, నిరాకులం = సంశయ రహితమగు, అలౌకికమగు, గురుతత్త్వం = శ్రీగురుబ్రహ్మస్వరూపమును, న జానన్తి = యెఱుంగజాలరు.

తార్కికులు, శ్రోత్రియులు మొదలయిన వారందఱును కేవలము తర్కాది శాస్త్రములను మాత్రము చదివినవారు. వారు శాస్త్రవాసనా వాసితులై బుద్ధిచేత మతికి లోబడిన శాస్త్రము లవగాహనము చేసికొని లోకజ్ఞానము గలవారైరి. శాస్త్రములచే నాత్మజ్ఞాన ముదయించదు. శాస్త్రార్థజ్ఞానమున్ను వేదాంతములో చెప్పబడుచున్న దేహవాసన, లోకవాసన, శాస్త్రవాసన యను వాసనాత్రయములో జేరియున్నది. కావున నాగురుబ్రహ్మతత్త్వము బుద్ధ్యతీతము, వేదాతీతము. కేవల ఔపనిషదిక విజ్ఞానముచేతనే గోచర మగునది. వాసనాత్రయము నతిక్రమించి యుండునది, అలౌకికము, సర్వసందేహ రహితము. వ్యాకరణాదిశాస్త్రము

లెంతకాలము చదువు చుండినను పూర్తిగావు. ఇకను సందేహమునే గలిగించు చుండును. తుదకు నా శాస్త్రవాసన బలవత్తరమై వదలుటకును సాధ్యముగాక దుఃఖమునే గలిగించును. వానిచే శాంతి లేదు. అందుచే మీమాంసకాది శాస్త్రజ్ఞులును, లౌకికులు, వ్యవహారతత్త్వమునే తెలిసికొనినవారు నిస్సంశయ గురుపరబ్రహ్మతత్త్వమును దెలిసికొనజాలరు. మఱేమనిన బుద్ధ్యతీత స్థితిలో నున్న వేదాంత శాస్త్రజ్ఞులు మాత్రము ఈతత్త్వము దెలిసి శాశ్వతసుఖమును బడయు చున్నారు.

అవ: "అవిద్యాయామన్తరే వర్తమానాః" అను కఠోపనిషత్తుయొక్క మన్త్రార్థమును దెలుపుచున్నారు.

**మహాహంకారగర్వేణ తపోవిద్యాబలేన చ ।**
**భ్రమన్తి చాస్మిన్ సంసారే ఘటీయన్త్రం యథా పునః ॥ 106**

మహాహంకారగర్వేణ - తపోవిద్యాబలేన - చ - భ్రమన్తి - చ - అస్మిన్ - సంసారే - ఘటీయన్త్రం - యథా - పునః.

ఘటీయన్త్రం = ఏతము, యథా = ఎట్లు, పునః = మఱల మఱల, భ్రమతి = క్రిందికి పైకి తిరుగుచున్నదో, తథా = అట్లే, మహాహంకారగర్వేణ = గొప్పదగు అహంభావముచే గలుగు గర్వముచేత, తపోవిద్యాబలేన = తపో విద్యల బలిమిచేతను, చ = కూడుకొన్నవారును, అస్మిన్ సంసారే = ఈ సంసారమను మహాకూపమందు, పునః భ్రమన్తి = మాటికి మాటికి పడుచున్నారు, తిరుగా వచ్చుచున్నారు. (జననమరణములను పొందుచున్నారు.)

జననమరణరూప సంసారకూపములో పడి తిరుగా వచ్చు విధమును స్పష్టీకరించుచున్నారు. ఎవరు నేనే గొప్పవాడను, శ్రేష్ఠుడను, ధనికుడను, శాసకుడను అను మహాహంకారముచేతను అంతయు నాకే కావలయును, నాదియే యను మమకారముచేతను గర్వితు లగుచున్నారో, నేను మహాతపస్సమ్పన్నుడను, నా తపశ్శక్తిచే నిఖిలము దగ్ధము చేయగలను; నేను మహాపండితుడను, నాతో సరి యెవడును లేడు ఇట్లు తపోవిద్యాబలముల చేతను దురహంకారు లగుచున్నారో, ఇట్టి రజోగుణ తమోగుణములు గల యజ్ఞానజనులు మహాఅగాధమగు బావిలో నేతముయొక్క బాన మునుగుచు తేలుచు నుండునట్లున్ను; ఏతమున్ను క్రిందికి

పైకి తిరుగుచుండునట్లున్న మహా ఆగాధమగు నన్ధకారబంధురమైన భయంకర సంసారకూపములో మునిగి తేలుచున్నారు. అనగా సుఖదుఃఖాది ద్వన్ద్వముల ననుభవించుచున్నారు. అంతవరాత్రమే గాదు, మ్రియన్తే = చచ్చుచున్నారు; జాయన్తే= తిరుగా పుట్టుచున్నారు. సిద్ధార్థ మేమనగా, శ్రీ గురుబ్రహ్మతత్త్వము నెఱుంగనివారు జననమరణరూప సంసారములో ద్రిమ్మరిల్లుచున్నారు. ఈ యర్థమునే కఠోపనిషత్తు తెలుపుచున్నది.

**అవిద్యాయామన్తరే వర్తమానాః స్వయం ధీరాః పండితం మన్యమానాః ॥**
**దంద్రమ్యమాణాః పరియన్తి మూఢా అన్ధేనైవ నీయమానా యథాఽన్ధాః ॥**

కేవల శాస్త్రజ్ఞానము గలవారు గ్రుడ్డివారు. బావికి తగిలించిన గిలక నీళ్ళను తోడునప్పుడు గిరగిర తిరుగు చున్నట్లు అహంకారాదులచే కన్ను తెలియనివారై కర్మానుభవము గలుగునప్పుడు వీరును సంసారములో గిరగిర తిరుగుచున్నారు. అట్లుగాక శ్రీగురుతత్త్వము నెఱింగినవారు పైన నిరూపింపబడిన దుర్గతిని పొందనివారై చిదాకాశమున విహరించుచు శాశ్వతానందము నొందుచున్నారు.

అవ: శ్రీ గురుభక్తి లేకయు శ్రీ గురుబ్రహ్మతత్త్వమును దెలియకున్న వారైనను ముక్తిని బడయజాలరను విషయమును ప్రతిపాదించుచున్నారు.

**యజ్ఞినోఽపి న ముక్తాస్స్యుః న ముక్తా యోగినస్తథా ।**
**తాపసా అపి నో ముక్తా గురుతత్త్వాత్పరాఙ్ముఖాః ॥ 107**

యజ్ఞినః - అపి - న - ముక్తాః - స్యుః - న - ముక్తాః - యోగినః - తథా - తాపసాః - అపి - నో - ముక్తాః - గురుతత్త్వాత్ - పరాఙ్ముఖాః.

గురుతత్త్వాత్ = శ్రీ గురుపరబ్రహ్మ తత్త్వజ్ఞానమునుండి, పరాఙ్ముఖాః = విముఖులయినవారు, యజ్ఞినః అపి = యాజ్ఞికు లయినను, న ముక్తాః స్యుః = ముక్తులు కాజాలరు, తథా = అట్లే, యోగినః = యోగీశ్వరు లయినను, న ముక్తాః = మోక్షమును పొందజాలరు, తాపసాః అపి = తపోవంతు లయినను, నో ముక్తాః = కైవల్యము పడయజాలరు.

సోమయాగము మొదలయిన యజ్ఞయాగాదు లొనరించి సోమయాజి మొదలయిన నామధేయములతో నొప్పుచున్న వారైనను, యోగమహిమచే నణిమాద్యష్ట సిద్ధులను సంపాదించిన యోగీశ్వరు లయినను, వనారణ్యా గుహాదులలో

కష్టతమ ఘోరతప మొనరించు తాపసవరేణ్యు లయినను శ్రీగురువునందు పరమ భక్తి లేక శ్రీ గురుపరబ్రహ్మతత్త్వమును తెలియకపోయినచో వారెన్నటికిని ముక్తులు కాజాలరు. నిక్కము. కనుకనే ప్రత్యేకముగ ముమ్మారు నుడివిరి. యాజక తాపసాదులు పైన తెల్పిన ప్రకార మొనరించిన వన్నియును జ్ఞానము లేనిచో వ్యర్థములే యని భావము. అపవిత్రాత్ములును శ్రీ గురుదేవు నుపాసించి ఆత్మ జ్ఞానమును బడసిన వారై రేని నిత్యముక్తులై నిత్యానందమును పొందుచున్నారు.

అవ: శ్రీగురుసేవా పరమార్థము!

**న ముక్తాస్తు చ గన్ధర్వాః పితృయక్షాస్తు చారణాః ।**
**ఋషయస్సిద్ధదేవాద్యా గురుసేవాపరాఙ్ముఖాః ॥ 108**

న - ముక్తాః - తు - చ - గన్ధర్వాః - ః - తు - చరణాః - ఋషయః - సిద్ధదేవాద్యాః - గురుసేవాపరాఙ్ముఖాః.

గురుసేవాసపరాఙ్ముఖాః = శ్రీగురుసేవయందు పరాఙ్ముఖు లయినట్టి, గంధర్వాః తు = గన్ధర్వులయినను, పితృయక్షాస్తు = పితృదేవత లయినను, యక్షు లయినను, చారణాశ్చ = చారణులును, ఋషయః = మునులును, సిద్ధదేవాద్యాః చ = సిద్ధులు, దేవతలు మొదలయినవా రెవరైనను, న ముక్తాః = ముక్తిని పొందజాలరు.

శ్రీ గురుసేవను చేయవలయునను విషయమునే తెలుపుచు శ్రీగురుసేవను జేయనివారు ముక్తులు కాజాలరని పదేపదే చెప్పి యీ యధ్యాయమును పూర్తిచేయుచున్నారు. ఋషులు, పితృదేవతలు, దేవతలు మొదలయిన వారెవరైనను శ్రీగురుని సేవించకుండిన ముక్తిని పొందజాలరు. మరేమనగా, మునులు మొదలయిన వారందఱు నీ శ్రీగురుగీతాశాస్త్రమున జెప్పిన ప్రకారము శ్రీగురుని సేవించి శ్రీగురుతత్త్వము నెఱింగిన వారైనచో, నఖండజ్ఞాన సమ్పత్సమృద్ధి గలిగి సకలబంధ నిర్ముక్తులై శాశ్వతానందము నొందుదురు.

ఇతి శ్రీ స్కాన్దపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వరసంవాదే శ్రీ గురుగీతాయాం
శ్రీ గురుప్రభావవర్ణనం నామ ప్రథమోఽధ్యాయః.
మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వామివర్యాణాం గురుపుత్రవర్గప్రవిష్టేన
శివచరణ నామధేయేన విదుషా లిఖిత పదవిభాగ టీకాతాత్పర్య సహితః ప్రథమాధ్యాయస్సమాప్తః.

ఓమ్

శ్రీ సద్గురుచరణారవిందాభ్యాం నమః
ఓం నమో భగవతే వేదవ్యాసాయ

# అథ ద్వితీయో ఽధ్యాయః

అవ: శ్రీ గురుధ్యానమునుగూర్చి వచింప ప్రారంభించుచున్నారు.

**ధ్యానం శృణు మహాదేవి సర్వానందప్రదాయకమ్ ।**
**సర్వసౌఖ్యకరం చైవ భుక్తిముక్తిప్రదాయకమ్ ॥ 109**

ధ్యానం - శృణు - మహాదేవి - సర్వానందప్రదాయకమ్ - సర్వసౌఖ్యకరం - చ - ఏవ - భుక్తిముక్తిప్రదాయకమ్.

హేదేవీ! = ఓ పార్వతీ. సర్వానందప్రదాయకం = అందరికిని ఆనందము నొసంగునదియు, సర్వసౌఖ్యకరం = అందరికిని శాశ్వత సౌఖ్యము నొసంగునదియు, భుక్తిముక్తిప్రదాయకం చ = భుక్తిముక్తుల నిచ్చునదియు నైన, ధ్యానం ఏవ = శ్రీ గురుపరబ్రహ్మధ్యానమునే, శృణు = వినుమా!

ధ్యాన మనగా శ్రీగురుపరబ్రహ్మస్వరూపమును నితరచింత లేక యెడతెగక చిత్తములో చింతించుట యగును. ఆ ధ్యానము సర్వప్రకృతిగుణములను నశింపజేసి యందరికిని ఆనందమును కలుగజేయుచున్నది. నిరంతర సౌఖ్యమును గలిగించు నదిగను నున్నది. మరియు నా ధ్యానము భుక్తిముక్తులనుగూడ నొసగుచున్నది. అట్టి ధ్యానమునుగూర్చి యాలింపుమా!

అవ: ఈ శ్లోకమున శ్రీ గురుధ్యానమును దెలుపుచున్నారు.

**శ్రీమత్పరం బ్రహ్మ గురుం స్మరామి**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం భజామి ।**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం వదామి**
**శ్రీమత్పరం బ్రహ్మ గురుం నమామి ॥ 110**

శ్రీమత్ - పరం - బ్రహ్మ - గురుం - స్మరామి - శ్రీమత్ - పరం - బ్రహ్మ - గురుం - భజామి - శ్రీమత్ - పరం - బ్రహ్మ - గురుం - వదామి - శ్రీమత్ - పరం - బ్రహ్మ- గురుం - నమామి.

శ్రీమత్ = జ్ఞానసంపత్తు గల, పరం బ్రహ్మ = పరబ్రహ్మ మగు, గురుం = శ్రీగురుదేవుని, స్మరామి = స్మరించుచున్నాను, శ్రీమత్ = ప్రకాశము గల, పరం బ్రహ్మ = పరబ్రహ్మ మగు, గురుం = శ్రీగురువరుని, భజామి = సేవించుచున్నాను, శ్రీమత్ = చైతన్యాత్మకమైన, పరంబ్రహ్మ = పరబ్రహ్మమగు, గురుం = శ్రీసద్గురుమూర్తిని, వదామి = చెప్పుచున్నాను, శ్రీమత్ = ఆనందసమృద్ధిగల, పరం బ్రహ్మ = పరబ్రహ్మమగు, గురుం = శ్రీగురువర్యుని, నమామి = నమస్కరించుచున్నాను.

సర్వదా జ్ఞానసంపత్తి గలిగి పరబ్రహ్మస్వరూపుడైన శ్రీగురుదేవుని నిరంతరము నా చిత్తమున చింతించుచున్నాను. తేజస్స్వరూపుడై పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ గురువరుని సతతము నేను సేవించుచున్నాను, పూజించు చున్నాను. చైతన్యాత్మకుడై పరబ్రహ్మస్వరూపుడైన శ్రీగురువరుని సర్వదా నేను స్తుతించుచున్నాను. ఆనందసమృద్ధితో నొప్పుచున్నవాడై పరబ్రహ్మస్వరూపుడైన శ్రీసద్గురుదేవుని సంతతము నేను నమస్కరించుచున్నాను. ఈ ప్రకారము శ్రీ సద్గురుమూర్తియొక్క స్మరణము, భజనము, స్తుతి, నమస్కారములు- వీని రూపమైన ధ్యానమును త్రికరణశుద్ధిగా జేయవలయునని తెలిపిరి. నమస్కార పూజలచే కాయశుద్ధియు, శ్రీగురుదేవుని నామసంకీర్తనాదులచే వాక్కుయొక్క శుద్ధియు, నిరంతరము చిన్తనారూప ధ్యానముచే నంతఃకరణ శుద్ధియు నేర్పడుచున్నవి. ఇట్టి ధ్యానముచే పరబ్రహ్మస్వరూప గురు తత్త్వజ్ఞానమును బడయగలరు.

అవ: శ్రీగురుమూర్తియొక్క స్వరూపమును నిరూపించుచున్నారు.

**బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం**
**ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।**
**ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం**
**భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి ॥ 111**

బ్రహ్మానందం - పరమసుఖదం - కేవలం - జ్ఞానమూర్తిం - ద్వంద్వాతీతం - గగనసదృశం - తత్త్వమస్యాదిలక్ష్యం - ఏకం - నిత్యం - విమలం - అచలం - సర్వధీసాక్షిభూతం - భావాతీతం - త్రిగుణరహితం - సద్గురుం - తం - నమామి.

బ్రహ్మానందం = పరబ్రహ్మానంద స్వరూపుడును, పరమసుఖదం = శాశ్వతసుఖము నిచ్చువాడును, కేవలం = ఒకే స్వరూపుడును, జ్ఞానమూర్తిం = జ్ఞానస్వరూపుడును, ద్వంద్వాతీతం= శీతోష్ణ సుఖదుఃఖాది ద్వంద్వముల నతిక్రమించిన వాడును, గగనసదృశం = ఆకాశముతో సమానుడైనవాడును, తత్త్వమస్యాదిలక్ష్యం = తత్త్వమసి మొదలగు మహావాక్యముల యొక్క లక్ష్యార్థ మైనవాడును, ఏకం = అద్వితీయుడును, నిత్యం = శాశ్వతుడును, విమలం= నిర్మలుడును, అచలం = చలనము లేనివాడును, సర్వధీసాక్షిభూతం- సర్వ = సమస్త ప్రాణులయొక్క, ధీ = బుద్ధికి, సాక్షిభూతం = సాక్షిగ నుండువాడును, భావాతీతం= భావముల నతిక్రమించినవాడును, త్రిగుణరహితం = నిర్గుణుడును, తం = అట్లు ప్రసిద్ధ పురుషుడైన, సదురుం = త్రికాలాబాధితుడైన గురుమూర్తినిగూర్చి, నమామి = నమస్కరించుచున్నాను.

శ్రీ సద్గురుదేవు డనగా, పరబ్రహ్మమే, వేరుగాదను విషయము నెప్పుడును గురుభక్తులు మఱువగూడదు. పరబ్రహ్మ స్వరూప లక్షణములే శ్రీగురుమూర్తికి నున్నవి. ఆ గురుపరబ్రహ్మ అఖండానందస్వరూపము. లోకములో పిపీలికము మొదలుకొని బ్రహ్మదేవుని వరకుగల యానందము లన్నియు నశించు నవియే యగుచున్నవి. కాని విచారించినచో నా యానందము లన్నియు బ్రహ్మముయొక్క స్వరూపము లయ్యే యున్నవి.

ఇకను నది పరమసుఖ స్వరూపము. శాస్త్రములలో జెప్పబడినట్టి పరమ సుఖములుగాని, ప్రత్యక్షముగా నీ లోకమున ననుభవించు చున్నట్టి ఐహిక సుఖములుగాని, విష్ణ్వాది దివ్యలోకములలో ననుభవింప బడుచున్న పరాత్పర సుఖములుగాని, ఇకను లోకములో నెన్నెన్ని సుఖము లున్నవో యవి యన్నియు వినశ్వరములు. మరియు నిక నవి దుఃఖముయొక్క లేశముతోగాని, ఆధిక్యముతో గాని గూడియుండును.

ఈ బ్రహ్మసుఖ మనునది ఆత్మసుఖము, నిర్విషయము, అనంతము, మహోత్కృష్టము, శాశ్వతము. ఇకను నా గురుపరబ్రహ్మము కేవల చైతన్యాత్మకమై యున్నది. స్వయంప్రకాశ జ్ఞానస్వరూపమై యున్నది.శీతోష్ణములు, సుఖదుఃఖములు,

పుణ్యాపాపములు, తమఃప్రకాశములు మొదలగు ద్వంద్వములకు విలక్షణమై యున్నది. మరియు నా పరబ్రహ్మము గగనమువలె నీరూపమై సర్వవ్యాపకమై స్వచ్ఛమై యుంటున్నది. అంతమాత్రమే కాదు, లోకములో నాల్గువేదములను మహోఘనములుగను, పవిత్రములుగను జెప్పుచున్నారు. ఆ వేదములయొక్క సారముల నుపనిషత్తులని వచించుచున్నారు. వానియొక్క సారాతిసారములై నాల్గువేదముల నుంచి గ్రహింపబడిన "తత్త్వమసి, అహం బ్రహ్మాస్మి,ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ" అను చతుర్విధ మహావాక్యములయొక్క లక్ష్యార్థమైన సచ్చిదానందాత్మకమై ఉన్నది.

మరియు నా తత్త్వము అద్వితీయము, నిత్యము, స్వచ్ఛము, అచలము. సర్వభూతములలో నుండుచు వాని బుద్ధికిని సాక్షియై యాబ్రహ్మ ముంటున్నది. భావములు సంకల్పములు వికల్పములు - ఇవన్నియు మనోబుద్ధులయొక్క ధర్మములు. వానికినిగూడ విలక్షణమై యున్నందుచే భావాతీత మైనదియు, త్రిగుణాత్మకమగు మాయ లేని దగుటచే నిర్గుణమై త్రికాలాబాధితమై సర్వదా ప్రసిద్ధమై యున్న యా గురుపరబ్రహ్మమునుగూర్చి నేను నమస్కరించుచున్నాను.

ఈ శ్లోకముయొక్క ముఖ్యభావ మేమనగా, విచారించినచో నా గురుపర బ్రహ్మము సత్తు, చిత్తు, ఆనందము, పరిపూర్ణము, వ్యాపకము- అను నైదు లక్షణములతో గూడినదని తెలియవలెను.

అవ: ఇందు శ్రీగురుపరబ్రహ్మము నెటుల ధ్యానించవలయునో, ఆ ప్రకారమును దెలుపుచున్నారు.

**హృదంబుజే కర్ణికమధ్యసంస్థే సింహాసనే సంస్థితదివ్యమూర్తిమ్ ।**
**ధ్యాయేద్గురుం చంద్రకలాప్రకాశం సచ్చిత్సుఖాభీష్టవరం దధానమ్ ॥ 112**

హృదంబుజే - కర్ణికమధ్యసంస్థే - సింహాసనే - సంస్థితదివ్యమూర్తిం - ధ్యాయేత్ - గురుం - చంద్రకలాప్రకాశం - సచ్చిత్సుఖాభీష్టవరం - దధానం.

హృదంబుజే - హృత్ = హృదయమను, అంబుజే = కమలము నందలి, కర్ణికమధ్య సంస్థే - కర్ణిక = దుద్దుయొక్క (మిద్దెవలెనున్న మధ్యభాగముయొక్క) మధ్య = నడుమ,

సంస్థే = ఉన్నటువంటి, సింహాసనే = సింహాసనమందు, సంస్థితదివ్యమూర్తిం - సంస్థిత = బాగుగ నధిష్ఠించి యున్నట్టియు, దివ్యమూర్తిం = ప్రకాశమాన స్వరూపము గలవాడును, చంద్రకలాప్రకాశం - చంద్రకలా = చంద్రరేఖయొక్క, ప్రకాశం = కాంతివంటి కాంతి గలవాడును, సచ్చిత్సుఖాభీష్టవరం - సత్ చిత్ సుఖ = సచ్చిదానంద స్వరూపుడును, అభీష్టవరం = ఇష్టములగు వరములను, దధానం = ధరించువాడును అయిన, గురుం = శ్రీ సద్గురుపరమాత్మను, ధ్యాయేత్ = ధ్యానించవలయును.

**"అంగుష్ఠమాత్రః పురుషోఽన్తరాత్మా**
**సదా జనానాం హృదయే సన్నివిష్టః,**
**అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి,**
**అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివాధూమకః"**

హృదయ మధ్యభాగము కమలమువలె నున్నది. దాని నంతఃకరణ మందురు. అదియే అంగుష్ఠము. దానిలో నున్న యంతరాత్మ అంగుష్ఠమాత్ర పురుషుడని చెప్పబడుచున్నాడు. ఇట్లాపరమాత్మ యందఱి హృదయములలోను నంగుష్ఠమాత్రుడై స్వయంజ్యోతి స్స్వరూపుడై ప్రకాశించుచున్నాడు - అను కఠోపనిషదర్థము ననుసరించి హృదయకమలమునందలి మిద్దెవలె నున్న దుద్దుయొక్క మధ్యభాగము నందున్న సింహాసనమును పరమాత్మయగు శ్రీ గురుదేవుడే అధిష్ఠించియున్నాడు. ఆ మధ్యభాగమే సింహాసనము. పరిపాలించునట్టి రాజులు మధ్యయందు సింహాసనము పై కూర్చుండి సమస్తమును విచారించుచు వృత్తాన్తములను దెలియుచుందురు. అట్లే శ్రీ సద్గురు మహారాజుకూడ శరీర మధ్యయందు కమలసింహాసనాధిరూఢుడై దేహరాజ్యమును పరిపాలించుచు సకలేన్ద్రియముల ప్రవృత్తులను దెలియుచున్నాడు. మఱియు బ్రహ్మదేవునివలె నున్నాడు. ఈ ప్రకారము పరమాత్మస్వరూపుడగు శ్రీగురుదేవుడు సర్వహృదయాంబుజముల యందున్న వాడై దేదీప్యమాన స్వయంప్రకాశముతో దేజరిల్లుచున్నాడు. సమస్తదేహేన్ద్రియములకే గాక, సర్వలోకములకు ప్రకాశము నొసంగు భగవంతుడై యున్నాడు.

మఱియు నా గురుదేవుడు చంద్రకళవంటి ప్రకాశము గలవాడు. చంద్రకళ యేవిధముగ పరిశుద్ధమై లోకము నందంతటను తనకాంతిని ప్రసరింపజేసి

సర్వసంతాపములను పోగొట్టుచున్నదో, ఆ ప్రకారముగనే శ్రీ గురుదేవుడును పరిశుద్ధుడై తనయొక్క జ్ఞానతేజస్సును దిగన్తములందు ప్రసరింపజేసి (అన్నిచోట్లను జ్ఞానబోధ లొనరించి) అందరి హృత్తాపములను నశింప జేయుచున్నాడు. చంద్రరేఖ ధవళకాంతి గల్గినదై సర్వానందదాయకమై యున్నది. శ్రీగురుచంద్రరేఖయు పరిశుద్ధమై, సర్వవ్యాపకమై, మహానంద స్వరూపమై యున్నది.

"చంద్రకలాప్రకాశం" అను ప్రయోగముయొక్క నిగూఢార్థ మేమనగా, హంసయను పరమాత్మదేవుడు షడాధారములయందును విహరించుచు ప్రకాశించుచున్నాడు. ఆ హంసయొక్క స్వరూప మత్యంత ధవళము. అనగా మహాపరిశుద్ధమై, దేదీప్యమానమై, సర్వేన్ద్రియ శుద్ధిదాయకమై యున్నది. దీని నెఱుంగుటయే జ్ఞానచంద్రోదయమని యోగశాస్త్రములు చెప్పుచున్నవి. అప్పుడు సకలవృత్తు లుపశమించుచున్నవి. తమస్సు తొలంగుచున్నది. పరమశాంతి గలుగుచున్నది. ఇకను విచారింపుడు. చంద్రుడు వినువీథియందు విరాజిల్లు చున్నాడు. అట్లే హృదయ చిదాకాశమందు శ్రీగురుచంద్రుడు విహరించుచు సర్వవేదాంతతత్త్వ సకలకలాపరిపూర్ణుడై సర్వసన్తాపహ మహానందజ్ఞాన శరచ్చంద్రికచే నిత్యము ప్రకాశించుచున్నాడు.

ఇకను నా పరమాత్మ గురుదేవుడు సచ్చిదానంద స్వరూపుడై భక్తులయొక్క సకలాభీష్టవరముల నఖండముగా పూర్తిజేయుచున్నాడు. శ్రీ గురుభక్తులకు శ్రీగురుదేవుని యనుగ్రహము, శ్రీగురుమూర్తియొక్క స్వరూపధ్యానాదులు, సకలాభీప్సితములు లేనివెల్ల నిచ్చువాడును నై యున్నాడు. అట్టి స్వయంప్రకాశ జ్ఞానస్వరూప పరమకృపాసాగర సర్వాన్తర్యామి యగు శ్రీ గురు పరమాత్మదేవుని పైన దెల్పిన ప్రకారము నిరంతరము ధ్యానించవలయును. పరమశాంతి గల్గును.

పాఠాన్తరము: "హృదంబుజే కర్ణికమధ్యసంస్థ, సింహాసనే సంస్థిత దివ్యమూర్తిమ్" అని యున్నది. పూర్వమువలె హృదయాంబుజ మధ్యసంస్థితు డని అర్థము. "సింహాసనే" అనుచోట మాత్రము ఓంకారాఖ్య సింహాసన మందుండుచు సర్వదా దేదీప్యమాన ప్రకాశస్వరూపుడు నని యర్థము దెలియ నగును. "వరం దధానం" అనుచోట "వరప్రదానం" అని పాఠాంతర మున్నది.

ఇది సులభాన్వయముతో గూడియున్నది గావున దానికన్న సమంజసమని తెలియవలెను. అర్థము మాత్రమొకటిగనే యున్నది.

అవ: ఈ శ్లోకమును శ్రీగురుదేవుని పరిశుభ్రవర్ణము గలవానినిగా వర్ణించుచు "మందస్మితం స్ఫురితముగ్ధముఖారవిందం" అను శ్రీదక్షిణామూర్తి యొక్క స్వరూపమును శ్రీగురుదేవునికి నిరూపించుచున్నారు.

**శ్వేతామ్బరం శ్వేతవిలేపపుష్పం ముక్తావిభూషం ముదితం ద్వినేత్రమ్ ।**
**వామాంకపీఠస్థితదివ్యశక్తిం మందస్మితం పూర్ణకృపానిధానమ్ ॥ 113**

శ్వేతాంబరం - శ్వేతవిలేపపుష్పం - ముక్తావిభూషం - ముదితం - ద్వినేత్రం - వామాంకపీఠస్థితదివ్యశక్తిం - మందస్మితం - పూర్ణకృపానిధానమ్.

శ్వేతాంబరం = తెల్లని వస్త్రము గలవాడును, శ్వేతవిలేపపుష్పం = తెల్లని చందనమును పుష్పములును గలవాడును, ముక్తావిభూషం = ముత్యాలహారము గలవాడును, ముదితం = సంతోషించువాడును, ద్వినేత్రం = జ్ఞానవిజ్ఞానములను రెండుకన్నులు గలవాడును, వామాంకపీఠస్థిత దివ్యశక్తిం - వామాంక = ఎడమ తొడయను, పీఠ = పీఠమునందు, స్థిత = ఉంటున్న, దివ్యశక్తిం = పార్వతీదేవియను దివ్యశక్తి గలవాడును (ఈశ్వరస్వరూపుడును), మందస్మిత = చిరునగవు గలవాడును, పూర్ణకృపానిధిం = పరిపూర్ణదయకు నిధియైనవాడును అగు, శ్రీ సద్గురుం నిత్యం అహం నమామి = శ్రీ సద్గురుదేవుని నెల్లప్పుడును నేను నమస్కరించుచున్నాను.

తెల్లని పరిశుద్ధములగు వస్త్రములను ధరించు స్వభావము గలవాడును, అత్యంత ధవళమగు చందనమును పూసికొని మిక్కిలి తెల్లనైన పుష్పములను ధరించినవాడును, ముత్యాలహార భూషణుడును, సర్వదా సంతుష్టహృదయుడగుటచే ప్రసన్నుడును, శాస్త్రజ్ఞాన, అనుభవజ్ఞాన రూపజ్ఞాన విజ్ఞానములను నేత్రద్వయమును కలవాడును, తనయెడమ తొడయను పీఠమునందు సర్వదా యున్న పార్వతీదేవీ రూప దివ్యశక్తి గలవాడును, శ్రీదక్షిణామూర్తివలె తనయొక్క దంతకాంతులచే భక్తులయొక్క తమస్సును హరింపజేయుచున్న వాడువలె చిరునగవుతో నొప్పువాడును, అపారదయకు పెన్నిధియు నైన శ్రీగురుమూర్తిని నేను నిత్యము నమస్కరించు చున్నాను.

ఈ ప్రకారము గురుభక్తుడు తన హృదయమందు శ్రీ గురుదేవుని ధ్యానించవలయును. శ్రీ గురుదేవుడు ధరించిన వస్త్రములు, చందనము, పుష్పములు, ముక్తాహారము- ఇవన్నియు అత్యంత ధవళములై, పరిశుద్ధములై యున్నవని నుడువుటచే శ్రీగురుపరబ్రహ్మము మాయామాలిన్యము లేక సర్వదా పరిశుద్ధమని భావము. శ్వేతాంబరమన తనయొక్క స్వభావము సర్వదా శుద్ధమనియు, శరీరమున గంధము పూసికొని యున్నాడని తెలుపుటచే శ్రీ గురుదేవుని హృదయము, అట్లే సర్వేంద్రియములు సర్వదా పరిశుద్ధము లనియు, తెల్లని పుష్పములు ధరించు వాడగుటచే పరిశుద్ధ గుణములచే నొప్పువాడనియు, ముక్తాహారమును కంఠమందు ధరించి యున్నందుచే శ్రీ గురుదేవుని కంఠమందు పరిస్ఫుటము లగు శబ్దజాలము లున్నవనియు, అట్లే శ్రీ సరస్వతీదేవియు నిరంతరము నివసించుచున్న దనియు తెలియవలెను.

ఈ ప్రకారము సాత్త్వికగుణ స్వభావమును వర్ణించుటచే నాత్మజ్ఞానమునకు పరిశుద్ధమగు సత్త్వగుణము కారణమని యెరుంగవలయును. ప్రసన్నుడు, కోపతాపములు లేనివాడు, సకలజనులకు నాశ్రయము నొసగువాడు. అంతమాత్రమే కాదు, తన వామాంకాసనమున దివ్యశక్తి యగు పార్వతీదేవితో నొప్పుచున్నాడని తెలుపుటచే నర్ధనారీశ్వరు డగుటయు గాక, సృష్టి స్థితి లయములకు పరమకారణము లగు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులతో గూడుకొన్న మహేశ్వరరూపుడై శ్రీ గురుపరమాత్మ యున్నాడు. "మందస్మితం" మందస్మితు డనగా ముసిముసి నవ్వులు నవ్వువాడని యర్థము తెలుపుటచే మాయాప్రపంచ మిథ్యాభూత విలాసములను గాంచుచు, జనుల పరిస్థితి ఇట్లున్నదనియు నందుచే పరమహాసమును పొందుచున్నాడని భావము. ఇట్లు శ్రీగురుదేవుని సర్వదా ధ్యానించి శిష్యుడు పరిశుద్ధతత్త్వమును బొందుచున్నాడు.

అవ: శ్రీగురుస్వరూపానందము:

**ఆనందమానందకరం ప్రసన్నం జ్ఞానస్వరూపం నిజబోధయుక్తమ్ ।**
**యోగీంద్రమీడ్యం భవరోగవైద్యం శ్రీమద్గురుం నిత్యమహం నమామి ॥ 114**

ఆనందం - ఆనందకరం - ప్రసన్నం - జ్ఞానస్వరూపం - నిజబోధయుక్తం -

యోగీంద్రం - ఈడ్యం - భవరోగవైద్యం - శ్రీమద్గురుం - నిత్యం - అహం - నమామి.

ఆనందం = ఆనందస్వరూపుడును, ఆనందకరం = ఆనందమును కలుగజేయువాడును, ప్రసన్నం = నిర్మలస్వరూపుడును, జ్ఞానస్వరూపం = జ్ఞానస్వరూపియు, నిజబోధయుక్తం = స్వయంబోధతో (ప్రబోధముతో) గూడుకొన్నవాడును, యోగీంద్రం = యోగీశ్వరుడును, ఈడ్యం = అందరిచేత స్తుతింపదగినవాడును, భవరోగవైద్యం = అనాది సంసార మహావ్యాధికి చికిత్సకుడను అయిన, శ్రీమద్గురుం = జ్ఞానప్రకాశముతో గూడినవాడైన నాయొక్క గురువును, అహం = నేను, నిత్యం = ఎల్లప్పుడు, నమామి = వందనము చేయుచున్నాను.

తానానంద పరబ్రహ్మ మగుటచే నాశ్రయించిన జనవరులను నానంద తత్త్వములను బోధించి ఆనందమయ బ్రహ్మస్వరూపులనుగా జేయువాడును, నిర్మలుడును, నఖండజ్ఞాన స్వరూపియు, సకల మూలాజ్ఞానము ధ్వంస మగుటచే హృదయపుండరీకము వికసించినందుచే సర్వేంద్రియములు పరిశుద్ధములై నందున అఖండ స్వయంప్రబోధముతో నొప్పువాడును, యోగీశ్వరుడును (సంయమనశక్తి గల సంయములలో శ్రేష్ఠుడును) సులభముగా ననాదియగు మహాసంసారవ్యాధిని జ్ఞానౌషధమను చికిత్సను జేసి పోగొట్టు వాడగుటచే సర్వాశ్రితుడై వేనోళ్ళ పొగడొందు వాడును, జ్ఞానశ్రీ విరాజితుడై పరమదయానిధి యగు నాయొక్క శ్రీగురు పరమాత్మదేవుని నిత్యము నేను ధ్యానించుచున్నాను. తత్త్వబోధమునకై ప్రార్థించు చున్నాను. నా సర్వాభిమానముల నాశనమునకై సర్వదా సమస్కరించు చున్నాడను.

అవ: శ్రీపరమగురుమూర్తియొక్క అమోఘ పాదకమల సంస్మరణము సకలాజ్ఞాన ధ్వంసక మగుచున్నదను విషయమును స్పష్టీకరించుచున్నారు.

**వన్దే గురూణాం చరణారవిన్దే సందర్శితస్వాత్మసుఖావబోధే ।**
**జనస్య యే జాంగలికాయమానే సంసారహాలాహలమోహశాంత్యై ॥ 115**

వన్దే - గురూణాం - చరణారవిన్దే - సందర్శితస్వాత్మసుఖావబోధే - జనస్య - యే - జాంగలికాయమానే - సంసారహాలాహలమోహశాంత్యై.

జనస్య = ప్రాణికోటియొక్క, సంసారహాలాహలమోహశాంత్యై - సంసార హాలాహల = సంసారమను కాలకూటవిషముయొక్క, మోహశాంత్యై = మోహమును

మూర్ఛయొక్క నాశముకొరకు, యే = శ్రీ గురుదేవునియొక్క చరణకమలములు, జాంగలికాయమానే = విషవైద్యుడువలె నుంటున్నవో (అందువల్లనే), సందర్శితస్వాత్మ సుఖావబోధే - సందర్శిత = బాగుగా నెరిఁగింపబడిన, స్వాత్మసుఖ = పరబ్రహ్మస్వరూప ఆత్మసుఖముయొక్క, అవబోధే = జ్ఞానము గలవై యున్న, గురూణాం = శ్రీసద్గురుదేవుల యొక్క, చరణారవిన్దే = పాదకమలములను, వన్దే = నమస్కరించుచున్నాను.

శ్రీగురుదేవుని పాదారవిందములు, అనాదియగు కాలకూట విషమువంటి సంసారమునకు విషవైద్యునివలె నున్నవి. విషవైద్యుడు కాలకూటవిషమును నశింపజేసి సర్పదష్టు లగువారిని మూర్ఛనుండి దేర్చి తెలివి నొందిన వారినిగా జేయుచున్నాడు. ఆ ప్రకారము అజ్ఞానసర్పముచే కరువబడి సంసారమను విషమెక్కి దేహాది పుత్రాది మోహమను మూర్ఛను జెందినవారిని క్షణములో బాగుజేయునట్టి విషవైద్యుడువలె శ్రీగురుదేవుని పాదములు జ్ఞానౌషధముచే సకలాజ్ఞానజన్య సంసారమోహ భ్రాంతులను తెగటార్చుచున్నవి.

అనగా శ్రీ గురుపాద స్మరణ మాత్రమున సకల మాయాభ్రాంతులు దొలంగుచున్నవి. ఇకను నవి పరబ్రహ్మస్వరూపమగు నాత్మయొక్క సుఖస్వరూప మిట్టిదని సులభముగ బోధించి జనులను జ్ఞానస్వరూపులనుగా జేయుచున్నవి. అట్టి శ్రీ గురుదేవునియొక్కపరమప్రయోజన జనకములగు పాదారవిందములను గూర్చి నేను సకలాజ్ఞాన దుఃఖసంతతి వినాశమునకై మ్రొక్కు లిడుచున్నాను. ఇట్లు శ్రీ గురుపాదారవింద స్మరణము సర్వాజ్ఞాన సంసారమోహధ్వంసక మగు టయు గాక, ఆనంద స్వరూపాత్మ సుఖావబోధకమై యున్నదని తెలియ వలయును.

పాఠాన్తరశ్లోకము:-

**వన్దే గురూణాం చరణారవిన్దం సందర్శిత స్వాత్మసుఖాంబుధీనామ్ ।**
**జనస్య యేషాం గులికాయమానం సంసారహాలాహలమోహశాంత్యై ॥**

దీనియర్థము పైన దెలిపిన దైనను గొంతభేదముతో నొప్పుచున్నది. "జనస్య గుళికాయమానం" సంసార కాలకూట విషహరణమునకై శ్రీ గురుదేవుని పాదారవిందము జ్ఞానగుళికవలె నున్నది. అనగా విషనాశనమునకై మాత్రల

నుపయోగించెదరు. అట్లున్నవని భావము. "గుళికాయమానం" జ్ఞానము ద్రారూపముగా చరణారవింద మున్నదని యర్థము. ఇట్టి జ్ఞానముద్రచే సకలాత్మ స్వరూపమును బోధించుటకు నాత్మసుఖ సముద్రులుగా శ్రీగురు దేవులున్నారు. ముఖ్యభావ మేమనగా, అఖండజ్ఞాన సాగరులగు శ్రీగురుదేవుల యొక్క పాదారవిందము సంసారకాలకూట విషనాశనమునకై జ్ఞానముద్రవలె మాత్రవలె నున్నదని భావము.

అవ: శ్రీగురుపరమాత్మ సర్వశక్తిసంపన్నుడను విషయమును దెలియజేయు చున్నారు.

**యస్మిన్సృష్టిస్థితిధ్వంసనిగ్రహానుగ్రహాత్మకం ।**
**కృత్యం పంచవిధం శశ్వద్భాసతే తం గురుం భజేత్ ॥ 116**

యస్మిన్ - సృష్టిస్థితిధ్వంసనిగ్రహానుగ్రహాత్మకమ్ - కృత్యం - పంచవిధం - శశ్వత్ - భాసతే - తం - గురుం - భజేత్.

యస్మిన్ = ఏ శ్రీగురుదేవునియందు, సృష్టిస్థితిధ్వంస నిగ్రహానుగ్రహాత్మకమ్ - సృష్టిస్థితి ధ్వంస = సృష్టిస్థితిలయములు, నిగ్రహానుగ్రహ = దుష్టశిక్షణ శిష్టపరిపాలనల యొక్క, ఆత్మకం = స్వరూపము గల, పంచవిధం = ఐదు విధములైన, కృత్యం = శక్తి, శశ్వత్ = ఎల్లప్పుడు, భాసతే = ప్రకాశించుచున్నదో, తం = సర్వసమర్థుడైన, గురుం = శ్రీగురు పరమాత్మను, భజేత్ = స్మరించవలెను, సేవించవలెను.

శ్రీగురుపరమాత్మదేవుడు సంకల్పమాత్రమున జగమును సృష్టింపను, బెంపను, లయ మొనరింపను, నికను ననేక అవతారములను ధరించి దుష్టశిక్షణ శిష్టపరిపాలనముల నొనరించుటకును, కటాక్షపాతమాత్రమున నవివేకిని వివేకిగను, ననుగ్రహము లేకపోవుటచే నవివేకిగా నుండునట్లు చేయుటకును శక్తిగలిగి యున్నాడు. ఎప్పుడును ఈ దివ్యశక్తి శ్రీసద్గురుపరమాత్మయందు నెలకొని యున్నది. ఆయన సంకల్పశక్తి మహిమచేతనే (1) సృష్టి, (2) స్థితి, (3) లయ, (4) నిగ్రహ, (5) అనుగ్రహములను నైదువిధములగు జగత్కార్యములు జరుగుచున్నవి. ఆ శ్రీగురుపరంధాముడు వినా వేరుశరణ్యుడు భువిలో లేడు. అట్టి శ్రీగురుదేవుని అనుగ్రహమునకై సర్వదా భజించవలయును.

అవ: మరియు శ్రీగురుమూర్తి జ్ఞానమునే తెలుపుచున్నారు.

**పాదాబ్జే సర్వసంసారదావకాలానలం స్వకే ।**
**బ్రహ్మరంధ్రే స్థితాంభోజమధ్యస్థం చంద్రమండలమ్ ॥ 117**

పాదాబ్జే - సర్వసంసారదావకాలానలం - స్వకే - బ్రహ్మరన్ధ్రే - స్థితాంభోజమధ్యస్థం - చంద్రమణ్డలమ్.

స్వకే = తనదగు, పాదాబ్జే = పాదకమలమందు, సర్వసంసారదావకాలానలం - సర్వసంసార = సకలసంసార దుఃఖములకు, దావకాలానలం = దావమను మహాభయంకరాగ్ని గలవాడును, బ్రహ్మరన్ధ్రే = సహస్రారమందు, స్థితాంభోజమధ్యస్థం - స్థితాంభోజ = ఉంటున్న కమలముయొక్క, మధ్యస్థం = మధ్యలోనున్న, చంద్రమండలం = సోమమండల స్వరూపుడును అయిన, గురుం స్మరేత్ = శ్రీ సద్గురుమూర్తిని ధ్యానించవలయును.

శ్రీగురుదేవునియొక్క పాదారవిందమందు సకల సంసార దుఃఖ సమూహముయొక్క నిశ్శేషధ్వంసమునకై మహాభయంకర దావాగ్నిని ధరించి యున్నవాడును, అనగా శ్రీగురుదేవుడు పాదములు పెట్టిన చోటంతయు సకల సంసార దుఃఖములు నశించుచున్న వనియు, సకల జ్ఞానైశ్వర్యాదులు గలుగుచున్న వనియు దెలియవలెను.

అంతమాత్రమే గాదు, మహారణ్యాగ్ని సమస్తారణ్యమును (దానిలో నున్న పచ్చివైన కట్టెలనుకూడ) క్షణములో దహించునట్లు తనయొక్క పాదసంస్పర్శము జెందిన నెట్టి అవివేకులయొక్కయు మూలాజ్ఞానారణ్యమును జ్ఞానప్రదమగు పాదానలముచే ధ్వంసము చేయుచున్నాడు. అగ్నిలో పవిత్రగుణము లుంటున్నవి. పవిత్రమగు పాదముచే నందరిని పవిత్రులుగ జేయుచు సర్వపాపమాలిన్యమును దరిజేరనీయక జ్ఞానప్రకాశము నొసగుచున్నాడు.

ఇకను నా మహాత్ముని సహస్రారమున సర్వదా ప్రకాశమానమగు సహస్ర కమలమందు పరిశుద్ధ చంద్రబింబమై దేదీప్యమాను డగుచున్నాడు. సహస్రారము గురుదేవుని స్థానము. ఈశ్వరుడు చంద్రుని శిరమున ధరించి యాశ్రితుల సకల తాపములఁబోగొట్టునట్లు సహస్రారములో జ్ఞానచంద్రుని ధరించియున్నాడు. తనయొక్క బ్రహ్మరన్ధ్రకమలమందు చంద్రస్వరూప హంస నిరావరణమై

(అడ్డులేనిదై) విహరించుచున్నది.

అనగా సకలవృత్తులును నశించినప్పుడు హంస యూర్ధ్వగామియై సహస్రారమందును శుద్ధమగు చంద్రప్రకాశము వ్యాపించియుండును. అప్పుడు సకల సంతాపములు నశించుచున్నది. అనగా నిర్వికల్ప సమాధియందు జ్ఞానచంద్రోదయము కలిగి, ఆనందామృతమయుడై యుంటున్నాడు. సహస్రార ధ్యాతలకు తాపమును బోగొట్టి జ్ఞానామృతము నొసంగును. ఇదియే బ్రహ్మదేవుడు హంసవాహనారూఢు డనుటకు, మహేశుని చంద్రశేఖరు డనుటకు పరమని గూఢమైన యర్థము. ఇట్లు చంద్రునివలెను, కాలానలమువలెను, బ్రహ్మ మహేశులవలె నున్న శ్రీసద్గురు బ్రహ్మమును నిరంతరము సర్వసంతాప హరమగు నానందప్రాప్తికై ధ్యానించ వలయును. ఇదియే తత్త్వమార్గము.

అవ: శ్రీగురుదేవుని యన్త్ర మన్త్ర యోగ శాస్త్రముల ననుసరించి యుపాసింప వలయు ననియు నిందు దేటపరచుచున్నారు.

**అ క థా ది త్రిరేఖాబ్జే సహస్రదళమణ్డలే ।**
**హంసపార్శ్వత్రికోణే చ స్మరే త్తన్మధ్యగం గురుమ్ ॥ 118**

అ క థా ది త్రిరేఖాబ్జే - సహస్రదళమణ్డలే - హంసపార్శ్వత్రికోణే - చ - స్మరేత్ - తన్మధ్యగం - గురుం.

అ క థా ది త్రిరేఖాబ్జే - అ = అకారము మొదలుకొని యున్న వర్ణములు (అచ్చులు 16), క = కకారము మొదలకొనియున్న యక్షరములు (క మొదలు త వరకున్న 16 అక్షరములు), థ ఆది = థ మొదలు ళ వరకుగల 16 అక్షరములు (అనగా అకారవర్ణ సముదాయము 16, కకారవర్ణ సముదాయము 16, థకారవర్ణ సముదాయము 16 అంతు 48 అక్షరములు) ఇవియే, త్రిరేఖ =మూడగు రేఖలుగా గల, అబ్జే = కమలమునందు, సహస్రదళమండలే = సహస్రారచక్రమందును, హంసపార్శ్వత్రికోణే చ - హంస = హంసకు, పార్శ్వ = ప్రక్కన, త్రికోణే చ = త్రికూట మనబడు మూడుమూలలు గల భ్రూమధ్యస్థానమందును (చంద్రసూర్యాగ్ని మండలత్రయమందును), తన్మధ్యగం = వానిమధ్యను పొందిన, గురుం = హంసస్వరూపుడగు గురుదేవుని, స్మరేత్ = నిరన్తరము చిన్తించవలయును.

(1) అకారము మొదలుకొని యున్న అచ్చులు 16, ఇది యొక రేఖయు,

(2) క కారము మొదలు త వరకుగల హల్లులు16, ఇదియొక రేఖయు, (3) థ కారము మొదలుకొని ళకారమువరకు గలహల్లులు, ఇదియొక రేఖయు - ఈ ప్రకారము మూడు గీతలుగ లిఖించవలయును. 48 అక్షరములతో గూడిన చక్రమిది. దీనివివరణము మన్త్రమహోదధి అను మన్త్రశాస్త్రమున జూడనగును. అట్టి చక్రమందు శ్రీగురుపరమాత్మ యుంటున్నాడు.

ఇకను దృశ్యరహిత మొనరించు శ్రీ గురుస్థానమగు హంస నిలుచు స్థానమయిన ప్రణవస్వరూపమైన సహస్రదళములతో నొప్పుచున్న సహస్రారమందు హంసము అనబడు పరబ్రహ్మమై యున్నవాడును, జీవుని స్థానము కంఠము విశుద్ధచక్రము, ఈశ్వరుని స్థానము భ్రూమధ్యము ఆగ్నేయచక్రము, అనగా జీవుని, ఈశ్వరుని అతిక్రమించినది శ్రీ గురుదేవుని స్థానమని తెలియవలెను. అట్టి సహస్రార హంసయొక్క పార్శ్వమున క్రిందప్రక్కన ఉన్నది భ్రూమధ్యస్థానము. అదియే త్రికోణమను త్రికూటస్థానము. ఆ భ్రూమధ్య త్రికూటస్థానమున శ్రీ గురుపరమాత్మ కూటస్థుడై సాక్షియై యున్నాడు. లేక సహస్రారముయొక్క పార్శ్వమున సూర్యాగ్నిచంద్ర మండలము లుంటున్నవి. వానియందును నాయా జ్యోతిస్స్వరూపుడై హంసయై వెలుంగుచున్నాడు. ఈ ప్రకారము యన్త్ర, మన్త్ర యోగశాస్త్రముల ననుసరించి త్రిరేఖచక్రమందును, సహస్రారమందును, త్రికోణమందున్న శ్రీగురుభగవానుడు హంసస్వరూపుడై యున్నాడు.

కట్టకడపటి స్థానము సహస్రారము. అదియే సర్వదృశ్య రహితస్థానము. అచ్చట దృష్టి నుంచి ధ్యానించు వానికి సర్వదృశ్యము రహితమై అఖండజ్ఞానము గలుగుచున్నది. అప్రాకృతబుద్ధి గలవారికి నిది లభ్య మగును. ఇదియే నిర్వికల్ప సమాధి. సిద్ధార్థ మేమనగా, సర్వదృశ్యరహిత స్వరూపుడై సర్వసాక్షియై దేహమున జీవరూపమున నున్న జీవునికిని సాక్షియై పరమహంసయని వచింపబడుచు, ఇకను నఖండజ్ఞాన తేజోనిధి యగు శ్రీగురుపరమాత్మను నిత్యము స్మరించవలయును, అనన్యశరణ్యుడై ధ్యానించవలయును. ఇదియే జ్ఞానమార్గము,

అవ: శ్రీగురుపరబ్రహ్మస్వరూపమును దెలుపుచున్నారు.

**నిత్యం శుద్ధం నిరాభాసం నిరాకారం నిరంజనమ్ ।**
**నిత్యబోధం చిదానందం గురుం బ్రహ్మ నమామ్యహమ్ ॥ 119**

నిత్యం - శుద్ధం - నిరాభాసం - నిరాకారం - నిరంజనం - నిత్యబోధం - చిదానందం - గురుం - బ్రహ్మ - నమామి - అహమ్.

నిత్యం = నిత్యుడును (త్రికాలాబాధితుడును), శుద్ధం = విశుద్ధతత్త్వ స్వరూపుడును, నిరాభాసం = అభాసమాత్రుడు గానివాడును (సత్యస్వరూపుడును), నిరాకారం = ఆకారము లేనివాడును, నిరంజనం = మలినమగు నజ్ఞానము లేనివాడును, నిత్యబోధం = నిత్యము జ్ఞానస్వరూపుడును, చిదానందం = ప్రకాశానంద స్వరూపుడును, బ్రహ్మ = పరబ్రహ్మము నయిన, శ్రీగురుం = శ్రీగురుదేవుని, అహం నమామి = నేను నమస్కరించుచున్నాను; ధ్యానించుచున్నాను.

శ్రీగురుపరబ్రహ్మ స్వరూపి త్రికాలములందుండుచు కాలత్రయము నతిక్రమించిన వాడు. విశుద్ధతత్త్వ స్వరూపముతో నొప్పుచు త్రిగుణాతీతుడై యున్నాడు. ఆభాసమాత్రుడు (ఒకప్పుడు ప్రకాశించుచు మరొకప్పుడు ప్రకాశించని వాడు) గాక సర్వదా ప్రకాశించుచు నున్నవాడై వ్యవహారదశలోమాత్ర మున్నందుచే నాభాసమాత్ర మయిన సర్వప్రపంచమునకు విలక్షణుడై దృశ్యరహితు డగుచున్నాడు. ఏ నామములు నేరూపములును లేక నిరాకారు డగుటచే నాకారములును, స్థూల సూక్ష్మకారణ శరీరములును లేనివాడై యున్నాడు. మహామలిన మగు నజ్ఞానము లేనివా డగుటచే నిరంజనుడు నిర్వికారుడని చెప్పబడువాడును, నిత్యపరిపూర్ణ బోధస్వరూపు డగుటచే నఖండజ్ఞానముతో అనృతజడ దుఃఖములు లేనివాడును, సకలాతీత పరబ్రహ్మస్వరూపుడు నయిన శ్రీగురుదేవుని నమస్కరించుచున్నాను; ధ్యానించుచున్నాను.

అవ: శ్రీ సద్గురుదేవునియొక్క దివ్యదృష్టి విలాసప్రభావములను వర్ణించుచున్నారు.

**సకలభువనసృష్టిః కల్పితాశేషసృష్టిః నిఖిలనిగమదృష్టిస్సత్పదార్థైకసృష్టిః ।**
**అతద్గణపరమేష్టిస్సత్పదార్థైకదృష్టిః భవగుణపరమేష్టిర్మోక్షమార్గైకదృష్టిః ॥ 120**

సకలభువనసృష్టిః - కల్పితాశేషసృష్టిః - నిఖిలనిగమదృష్టిః - సత్పదార్థైకసృష్టిః - అతద్గణపరమేష్టిః - సత్పదార్థైకదృష్టిః - భవగుణపరమేష్టిః - మోక్షమార్గైకఃదృష్టిః.

సకలభువనసృష్టిః = సర్వలోకములయొక్క సృష్టి గలదియు, కల్పితాశేషసృష్టిః - కల్పిత = కల్పింపబడిన, అశేష = సమస్త వస్తువులయొక్క, సృష్టిః = సృష్టి గలదియు, నిఖిలనిగమదృష్టిః = సమస్తవేదములందు చూపుగలదియు, సత్పదార్థైకసృష్టిః - సత్పదార్థ = నశించని పదార్థమగు, ఏక = ముఖ్యమగు నాత్మవస్తువుయొక్క, సృష్టిః = సృష్టి గలదియు (తా నీయాత్మ యగుటయే సృష్టియని తెలియవలెను), అతద్గణపరమేష్టిః - అతత్ = అసత్యములగు పదార్థములయొక్క, గణ = సమూహముకంటె, పరమ = విలక్షణమైన, ఇష్టిః= ప్రియమైనదియు, సత్పదార్థైకదృష్టిః = సత్పదార్థమయిన ముఖ్యమయిన పరబ్రహ్మమందు చూపు గలదియు, భవగుణపంమేష్టిః - భవగుణ = సంసారధర్మములకంటె, పరమ = భిన్నమయిన, ఇష్టిః = అభీప్సిత మైనదియు, మోక్షమార్గైకదృష్టిః - మోక్షమార్గ = మోక్షమార్గము నందే, ఏకదృష్టిః = ముఖ్యమయిన ఆసక్తి గలదియు నగునది శ్రీ సద్గురుదేవునియొక్క దివ్యదృష్టి

సంకల్పమాత్రమున సకలభువనములను సృజించుచున్నది.మఱియు నందులో ననేక భోగ్యవస్తువులను సృష్టించుచున్నది. సకలవేదములను కనుగొని యుపదేశించుచున్నది. వేదసారమగు సత్పదార్థమగు నాత్మవస్తు వొక్కటియే తానై యున్నది. మరియు విచారించిన సకల మాయాకల్పిత వస్తువులకు విలక్షణమై యత్యన్తప్రియమై కేవల సత్పదార్థ పరబ్రహ్మమందు నిరంతరము నిరత మయి యున్నది. సకల సంసారధర్మరహితమై సర్వవిలక్షణమై మిగుల ప్రియరూపమున నున్నది. అంతేకాదు, మోక్షమార్గ మనదగు తత్త్వమార్గమునందే ప్రవర్తించుచున్నది. ఈ ప్రకారము సద్గురుదేవుని దివ్యదృష్టి అలరారుచున్నది.

అవ: గురుదేవుని దివ్యదృష్టి సకలాధారము-

**సకలభువనరంగస్థాపనా స్తంభయష్టి**
**స్సకరుణరసవృష్టిస్తత్త్వమాలాసమష్టిః ।**
**సకలమయసృష్టిస్సచ్చిదానందదృష్టి**
**ర్నివసతు మయి నిత్యం శ్రీగురోర్దివ్యదృష్టిః ॥ 121**

సకలభువనరంగస్థాపనాస్తమ్భయష్టిః - సకరుణరసవృష్టిః - తత్త్వమాలాసమష్టిః - సకల సమయసృష్టిః - సచ్చిదానందదృష్టిః - నివసతు మయి - నిత్యం - శ్రీగురోః - దివ్యదృష్టిః.

సకలభువనరంగస్థాపనా స్తమ్భయష్టిః - సకలభువనరంగ = సర్వలోక నాట్యస్థలము యొక్క, స్థాపనా = స్థాపనయందు, స్తమ్భయష్టిః = ఆధార స్తమ్భ మయినదియు,

సకరుణరసవృష్టిః = కృపారసవర్షముతో గూడినదియు, తత్త్వమాలా సమష్టిః = వేదాన్తార్థపరమ్పరా సమూహము గలదియు, సకలసమయసృష్టిః = సర్వకాలములయొక్క సృష్టిగలదియు, సచ్చిదానందదృష్టిః = సచ్చిదానంద పరబ్రహ్మమందాసక్తి గలదియు నగు, శ్రీగురోః = శ్రీ గురుదేవునియొక్క, దివ్యదృష్టిః = అప్రాకృతమైన దేదీప్యమాన మయిన తత్త్వదృష్టి, నిత్యం = ఎల్లప్పుడును, మయి = నాయందు, నివసతు = నివసించు గాక.

మఱియు నా శ్రీసద్గురుదేవుని దివ్యదృష్టి సర్వలోకములను మహారంగ స్థలమునకు నాధారభూత మగు ప్రధాన స్తమ్భముగాను, లేక సర్వలోకములను నాట్యశాలా నిర్మాణమునకై శంకుస్థాపన స్తమ్భముగాను, లేక లోకములను రంగులరాట్నమునకు నాధార మయిన కఱ్ఱగా నున్నది.

రంగులరాట్నములో గూర్చున్న వారందఱును గిరగిర తిరుగుచుందురు. కాని దాని కమర్చబడి యాధారముగ నున్న దండము మాత్రము కదలదు. వారిని పడనీయదు. అట్లే యీ దివ్యదృష్టియు సకల జీవులు గిరగిర దిరుగుచున్నను తానుమాత్ర మాధారమై, చలనరహితమై యున్నది.

ఇకను సర్వదా కరుణా రసామృతమును వర్షించు నదియు, ఎప్పుడు నెడతెగక ధారాప్రవాహముగ పుంఖానుపుంఖములుగ దొరలు పరంపరా రూపమగు వేదాంతార్థముల ప్రబోధసమూహము గలదియు, సకలకాలములను నాచారము లను, మర్యాదలను, సృష్టించి కాలాద్యతీత మయినదియు, సచ్చిదానంద పరబ్రహ్మమందు సంలగ్న మయినదియు నగు శ్రీగురుపరమాత్మ దేవునియొక్క అప్రాకృతమగు దివ్యశక్తిరూప దివ్యదృష్టి నాయందు నిత్యము నివసించుగాక. అట్టి శ్రీగురుదేవుని పరమదయారసదృష్టి అపారానుగ్రహావలోకనము నాయందు నిరతము ప్రసరించుగాక. అందుచే నేను ఈ జన్మమును తరించి ధన్యుడ నగుదునుగాక.

పాఠాన్తరం "సకలభవనభంగ" అనుటచే సకల లోకములు పడి పోకుండుటకు నాధారయష్టిగ నున్నదని తెలియవలెను.

అవ: శివుని సాక్షిగా జేసి శ్రీగురుదేవునియొక్క మహోత్కృష్టత్వమును దెలుపుచున్నారు.

**న గురోరధికం న గురోరధికం న గురోరధికం న గురోరధికమ్ ।**
**శివశాసనతః శివశాసనతః శివశాసనతః శివశాసనతః ॥ 122**

న - గురోః - అధికం - న - గురోః - అధికం - న - గురోః - అధికమ్ - న - గురోః - అధికం - శివశాసనతః - శివశాసనతః - శివశాసనతః - శివశాసనతః.

శివశాసనతః = శివునియొక్క యాజ్ఞవలన, గురోః = శ్రీగురువరునికంటె, అధికం = ఉత్కృష్టమైనది, న = మరియొక్కటి లేదు, శివశాసనతః = ఈశ్వరాజ్ఞవలన, గురోః = శ్రీ గురుపరబ్రహ్మముకంటె, అధికమ్ = అనుత్తమ మైనది, న = ఇతరమగున దెద్దియు లేదు, శివశాసనతః = మహేశ్వరుని యానతివలన, గురోః = శ్రీగురుదేవునికంటె, అధికం = మహోత్తమ మైనది, న = ఇతర మేదియు లేదు, శివశాసనతః = మహేశుని శాసనమువలన, గురోః = శ్రీదేశికేంద్రస్వామికంటె, అధికం = మహోత్కృష్ట మైనది, న = భిన్నవస్తువు లేవియు లేవు.

శ్రీశివునిసాక్షిగా గురువుకంటె నధికమైనది లేదు. మహేశ్వరుని సాక్షిగా శ్రీగురువుకంటె మహోత్కృష్టమైనది లేదు శంభుని సాక్షిగ శ్రీ సద్గురుమూర్తికంటె నుత్కృష్ట మగున దేదియు లేదు. శ్రీ హరుని సాక్షిగా శ్రీదేశికేంద్ర స్వామికంటె నితరమగు ననుత్తమమగు పదార్థ మేదియు లేదు. ఇట్లు నాలుగుసారులు చెప్పుటచే శివుని సాక్షిగా జేసికొని శ్రీగురుదేవునియొక్క మహోత్కృష్టతను శిష్యులు పరమభక్తితో నిరంతరము గొనియాడుచుండవలయునని యర్థము.

అవ: శ్రీహరిని సాక్షిగా తీసికొని శ్రీగురుస్వరూపము పరమశివ స్వరూపమని శపథపూర్వకముగ వివరించుచున్నారు.

**ఇదమేవ శివం ఇదమేవ శివం ఇదమేవ శివం ఇదమేవ శివమ్ ।**
**హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతో హరిశాసనతః ॥ 123**

ఇదం - ఏవ - శివం - ఇదం - ఏవ - శివం - ఇదం - ఏవ - శివమ్ - ఇదం - ఏవ - శివం - హరిశాసనతః - హరిశాసనతః- హరిశాసనతః - హరిశాసనతః.

హరిశాసనతః = శ్రీ విష్ణువుయొక్క యాజ్ఞవలన, ఇదమేవ = ఈ శ్రీ గురుపరబ్రహ్మస్వరూపమే, శివమ్ = మంగళము, హరిశాసనతః = విష్ణుమూర్తియొక్క యానతివలన, ఇదమేవ = ఈ గురుబ్రహ్మరూపమే, శివం = మంగళతరము, హరిశాసనతః = హరిసాక్షివలన, ఇదమేవ = ఈ గురుదేవుని స్వరూపమే, శివం = మంగళతమము, హరిశాసనతః =

శ్రీమన్నారాయణుని శాసనమువలన, ఇదమేవ = ఈ శ్రీగురుపరమాత్మస్వరూపమే, శివం = పరమశివము.

శ్రీ హరిసాక్షిగా నీ గురుమూర్తి స్వరూపమే శివము. విష్ణుసాక్షిగ నీ గురుబ్రహ్మరూపమే శివతరము. శ్రీవిష్ణుదేవుని సాక్షిగ గురుదేవ స్వరూపమే శివతమము. శ్రీ విష్ణుదేవుని సాక్షిగ గురుదేవ స్వరూపమే శివతమము. భగవంతు డగు శ్రీమన్నారాయణుని సాక్షిగా శ్రీ గురుపరమాత్మ యొక్క స్వరూపమే పరమ శివము. ఇచ్చటను పరమభక్తితో నాలుగుసార్లు శ్రీగురు స్వరూపము పరమశివమని తెలిపిరి.

పాఠాన్తరము: "మమ శాసనతో, మమ శాసనతో, మమ శాసనతో, మమ శాసనతః = తన్నే ఒట్టుబెట్టుకొని శపథమును జేయుచున్నాడు. నా సాక్షిగ శ్రీగురుస్వరూపము పరమశివము"-ఇట్లు వచించుటచే సర్వము శ్రీపరమగురు స్వరూపముచే వ్యాప్తమై పరమశివమై యున్నదని భావము.

అవ: ఈ శ్లోకమున చతుర్ముఖ బ్రహ్మదేవుని సాక్షిగా తీసికొని శ్రీ గురుతత్త్వము సాక్షాత్కరింపబడెనని నాలుగు పర్యాయములు నొక్కి వక్కాణించు చున్నారు.

**విదితం విదితం విదితం విదితం విజనం విజనం విజనం విజనం ।**
**విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతో విధిశాసనతః ॥ 124**

విదితం - విదితం - విదితం - విదితం - విజనం - విజనం - విజనం - విజనం - విధిశాసనతః - విధిశాసనతః - విధిశాసనతః - విధిశాసనతః.

విధిశాసనతః = శ్రీబ్రహ్మదేవుని ఆజ్ఞవలన, విజనం = నిర్మలమగు శ్రీ గురుస్వరూపము, విదితం = తెలియబడెను, విధిశాసనతః = చతుర్ముఖుని ఆనతివలన, విజనం = ఏకాంతమగు గురురూపము, విదితం = సాక్షాత్కరింపబడెను, విధిశాసనతః = కమలాసనుని సాక్షిగా, విజనం = ఏకమైన గురురూపము, విదితం = దర్శింపబడెను, విధిశాసనతః = పితామహుని శాసనమువలన, విజనం = అద్వితీయ తత్త్వమైన శ్రీగురుదేవుని తత్త్వము, విదితం = సందర్శింపబడెను.

నిర్మలమగు శ్రీగురుతత్త్వమును బ్రహ్మసాక్షిగా నేనెఱింగితిని. ఏకాంత మగు గురుస్వరూపమును విధిసాక్షిగా నేను సాక్షాత్కరించితిని. కమలాసనుని

సాక్షిగా ఏకమైన గురుస్వరూపమును నేను దర్శించితిని. కమలాసనుని సాక్షిగా నద్వితీయమైన శ్రీగురుపర బ్రహ్మతత్త్వమును నేను సందర్శించితిని. ఇట్లు చతుర్ముఖుని సాక్షిగ గైకొన్నందుచే వస్తుతత్త్వ దృఢబోధకై నాలుగుసార్లు శపథము చేసి శ్రీగురుస్వరూపము సాక్షాత్కరింప బడినదని నిస్సంశయముగ శిష్యుడు తెలిపెను.

ఇందు శ్రీగుర్వనుగ్రహ బలిమివలన శిష్యునకు పరబ్రహ్మసాక్షాత్కారము గలిగినదని తెలియవలెను. ఆతడు పరమధన్యాత్ముడు, సందియము లేదని లోకములో నేదోయొక విషయమును నిస్సంశయముగ నమ్మిక గలుగునట్లు తెలుపుటకై సూర్య చంద్రాదులను సాక్షిగ తీసికొనుచున్నారు. ఇచ్చోట శ్రీగురుభక్తు డట్లుగాక పరమభక్తితో శ్రీగురుతత్త్వజ్ఞాన దృఢత్వమునకై శివుడు, హరి, విధి-ఈ ముఫ్వురిని సాక్షిగా గైకొన్నందుచే శ్రీగురుస్వరూపము బ్రహ్మవిష్ణు మహేశులవలె పరమోత్కృష్టము, పరబ్రహ్మము, పరమశివము.

అవ: ఈ శ్లోకములో నీ యధ్యాయము మొదటినుండి తెల్పిన శ్రీగురుపర బ్రహ్మధ్యానమును జేసినందుచే స్వయముగా నెట్టి జ్ఞానము కలుగుచున్నది, తర్వాత నేమి కలుగుచున్నది అను విషయమును తెల్పుచున్నారు.

**ఏవంవిధం గురుం ధ్యాత్వా జ్ఞానముత్పద్యతే స్వయమ్ ।**
**తదా గురూపదేశేన ముక్తో ఽహమితి భావయేత్ ॥ 125**

ఏవం - విధం - గురుం - ధ్యాత్వా - జ్ఞానం - ఉత్పద్యతే - స్వయమ్ - తదా - గురూపదేశేన - ముక్తః - అహం - ఇతి - భావయేత్.

ఏవం విధం = ముందు చెప్పిన శ్రీగురుపరబ్రహ్మమును, ధ్యాత్వా = ధ్యానించుటవలన, స్వయమ్ = స్వయముగా, జ్ఞానం = ఆత్మజ్ఞానము, ఉత్పద్యతే = కలుగుచున్నది, తదా = అప్పుడు, గురూపదేశేన = తత్త్వమసి యను శ్రీ గురువరుని మహోపదేశమువలన, అహం = నేను, ముక్తః ఇతి = ముక్తుడ నైతినని (కైవల్యపదవి నొందితినని), భావయేత్ = భావించవలయును.

పూర్వము చెప్పిన గ్రంథసార మేమనగా, శ్రీగురుస్వరూపము కేవలపర బ్రహ్మము; సచ్చిదానందము. అద్దానిని శిష్యుడు మనస్సున నిరంతరము ధ్యానించవలెను. ఇట్లాచరించుటచే నాగురుతత్త్వము పరోక్షముగ దెలియుచున్నది.

ఇదియే పరోక్షజ్ఞానము. ఇది స్వయముగ గల్గును. ఇందువలన బ్రహ్మమందలి యున్న అసంభావన, విపరీతభావనలు నశించుచున్నవి. అయినను సంశయభావన అనగా స్వరూపజ్ఞానము లేకపోవుట యను దోషము మిగిలియున్నది .లక్ష్యము చలించుచుండిన గ్రహింప సాధ్యము కానట్లు దృశ్యవాసన నశింపకున్నందుచే జీవేశ్వరైక్య తత్త్వము సంశయగ్రస్తమై గ్రహింప సాధ్యాము గాక యున్నది. కేవల పరోక్షమగు నాత్మస్వరూపజ్ఞానము మహావాక్యోపదేశమునకు యోగ్యతను గలిగించుచున్నది.

ఇట్టి యోగ్యత గలిగినప్పుడు 'తత్త్వమసి' యను మహావాక్యోపదేశమును పరమగురువు ద్వారా శ్రవణము చేయవలయును. తరువాత మనన నిది ధ్యాసములచే 'నేను సాక్షాత్పరబ్రహ్మస్వరూప' మను నపరోక్షజ్ఞానము గలుగు చున్నది. ఇందుచే సంశయభావనా రూపదోషముగూడ నశించిపోవుచున్నది. ఇదియే పరమాత్మ తానై, స్వయంప్రకాశమానమై, నిరావరణమై, అఖండమై, అద్వితీయమై, నిత్యానందస్వరూపమై యుండుట యగును. ఇదియే తాను ముక్తుడనని భావించుట యగును. ఇదియే కైవల్యము. ఈప్రకారము శ్రీగురు ధ్యాన మహిమచే పరోక్ష అపరోక్ష జ్ఞానము కలిగి అనాది సంసారబన్ధ నిర్ముక్తుడై స్వస్వరూప జ్ఞానముచే శాశ్వతసౌఖ్యము నొందుచున్నాడు.

అవ: శ్రీగురూపదేశము - శిష్యాచరణము.

**గురూపదిష్టమార్గేణ మనశ్శుద్ధిం తు కారయేత్ ।**
**అనిత్యం ఖండయేత్సర్వం యత్కించిచ్చాత్మగోచరమ్ ॥ 126**

గురూపదిష్టమార్గేణ - మనశ్శుద్ధిం - తు - కారయేత్ - అనిత్యం - ఖండయేత్ - సర్వం - యత్ - కిం - చిత్ - చ - ఆత్మగోచరం.

గురూపదిష్టమార్గేణ = శ్రీగురుదేవునిచే నుపదేశింపబడిన మార్గము ననుసరించి, మనశ్శుద్ధిం = మనసునకు పరిశ్శుద్ధిని, కారయేత్ = చేయించవలెను, యత్కించిత్ = ఏ కొంచెమగు దృశ్యమైనను, ఆత్మగోచరం = ఆత్మకు గోచరించినయెడల, అనిత్యం = అనిత్యమైన, తత్సర్వం = ఆసమస్తమును, ఖండయేత్ = ఖండించవలయును.

పై దెల్పినప్రకారము శ్రీ గురుధ్యాన బలిమిచే, శ్రీ గురుసేవాదులచే నంతఃకరణశుద్ధిని సంపాదించవలయును. అనగా మనస్సును నిర్మలముగను, నేకాగ్రముగను జేసి బహుసూక్ష్మముగ జేయవలెను. "సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను నుపనిషద్వాక్యానుసారముగ సూక్ష్మమగు మనస్సు నాత్మను విషయీకరించును. అట్టి మనస్సుచే నాత్మను దెలియుచున్నను అద్వితీయ జ్ఞానమునకై, మనస్సునుగూడ లయ మొనరించుటకై, దృశ్యరహిత ధ్యానమునకై 'తత్త్వమసి' యను మహావాక్యార్థమును చింతించవలయును. "ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్" అను భగవద్గీతా వాక్యానుసారముగా నేదృశ్యమును చింతించకూడదు. అయిన నికను పూర్తిగా సంస్కారములు నశింపనందుచే, దృఢజ్ఞానము గలుగనందుచే యత్కించిత్తు దృశ్యము తనకు గోచరించిన దానినంతయు ననిత్యమని ఖండించి 'నేను కేవల పరబ్రహ్మస్వరూపుడను, సత్తామాత్రుడను, దృశ్యరహితుడను, అద్వితీయుడ' నని భావించి దృశ్యాతీత జ్ఞానము నొందవలయును.

అవ: ముందు శ్లోకమున నేదియైన దృశ్యము గోచరించుచుండినచో నదంతయును ఖండింప వలయునని తెలిపిరి. ఈ శ్లోకమున నట్టి జ్ఞానప్రాప్తికై యుపాయమును స్పష్టీకరించుచున్నారు.

**జ్ఞేయం సర్వం ప్రతీతం చ జ్ఞానం చ మన ఉచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం సమం కుర్యాన్నాన్యః పన్థా ద్వితీయకః ॥ 127**

జ్ఞేయం - సర్వం - ప్రతీతం - చ - జ్ఞానం - చ - మనః - ఉచ్యతే - జ్ఞానం - జ్ఞేయం - సమం - కుర్యాత్ - న - అన్యః - పన్థాః - ద్వితీయకః.

ప్రతీతం = తోచుచున్న, సర్వం = సమస్తమైన, జ్ఞేయం చ = జ్ఞేయమున్ను (తెలిసికోదగినదంతయు అనగా నేదేది జ్ఞానవిషయమై తెలియబడుచున్నదో) సకలపదార్థసముదాయమున్ను, జ్ఞానం చ = వానినన్నిటిని తెలియుట యను వృత్తియయిన జ్ఞానమున్ను (ఈ రెండును), మనః = మనస్సుగా, ఉచ్యతే = చెప్పబడుచున్నది కావున, జ్ఞానం = తెలివి, జ్ఞేయం = దృశ్యము, సమం = ఏకముగా, కుర్యాత్ = చేయవలెను, అన్యః పన్థాః = దృశ్యరాహిత్యమునకై యీ మార్గము తప్ప వేరుమార్గమైన, ద్వితీయకః = రెండవది, న = లేదు.

పాఠాన్తర శ్లోకము:

**జ్ఞేయం సర్వమతీతం చ జ్ఞానం చ మన ఉచ్యతే ।**
**జ్ఞానం జ్ఞేయం సమం కృత్వా యథా నాన్యత్ ద్వితీయకమ్ ॥**

జ్ఞేయము, బ్రహ్మము సర్వాతీతము; గ్రహించు మనస్సు జ్ఞానరూపము. జ్ఞేయజ్ఞానములు వేరు గానందున, మనస్సు బ్రహ్మములో లయించినందున వేరు వస్తువు లేదు. ఇదియే అఖండము.

దృక్ దృశ్య దర్శనములు, జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానములు, ధ్యాతృ ధ్యేయ ధ్యానములు అను త్రిపుటిత్రయమును భాసింపజేయక త్రిపుటి రహితజ్ఞాన మగు నేకత్వమును, తాను కేవల సత్తామాత్రుడై యుండుటను, దృశ్యరహిత అద్వితీయ జ్ఞానమును పొందునట్టి పరమసాధనమును తెలుపుచున్నారు. త్రిపుటి రహితమును చేయవలయు నను విషయములో జ్ఞాతగూడ లేకపోవలయునని చెప్పువారు గలరు. అది నశించిన శూన్యమే యగుచున్నది. జ్ఞాత అనగా తెలియునది. దృక్ అనగా చూచునది. ధ్యాత అనగా ధ్యానించునది. ఆత్మయని యర్థము. అది నశించిన మరి యేమున్నది? అట్లే జ్ఞానం = స్వస్వరూపజ్ఞానము నేను బ్రహ్మ మనునది. అదియు వృత్తియే కాబట్టి యది నశించవలయునని చెప్పువారును గలరు.

సూర్యుని స్వభావము ప్రకాశము. చంద్రుని ప్రకాశము వెన్నెల. ప్రకాశము నశించిన సూర్యచంద్రు లేమిగా ఉన్నారు? అట్లే స్వరూపజ్ఞానము లేకపోయిన విస్మృతి యగుచున్నది. అదియే తమస్సు. తనయొక్క స్వభావము జ్ఞానము. అది లేకుండిన మరేమున్నది? తనయొక్క స్వరూపము సచ్చిదానందమై యున్నది గదా! కావున త్రిపుటి రహితజ్ఞాన మనగా దృశ్య ముండకూడదని యర్థము. అంతయు తానై, తనయొక్క స్వరూపముకన్న వేరు భాసించకూడదు. అప్పుడు జ్ఞాత, దృక్కు, ధ్యాత అనునట్టి వ్యవహారములు నశించుచున్నవని యర్థము. దృశ్య మున్నప్పుడే ఆత్మ కావ్యవహారము లుండును. అది లేనప్పు డాత్మ కేవలసత్తామాత్రుడు. వేరు వస్తు వేదియు లేదు. తనయొక్క స్వరూపము జ్ఞానమే. జ్ఞానము ఆత్మ వేరుగా లేదు. ఇట్లు జ్ఞానజ్ఞేయముల యేకత్వమును దెలియవలయును.

ఇట్లే ధ్యేయ మనగా బ్రహ్మము. ధ్యానబలిమిచే ధ్యేయము తానైనప్పుడు త్రిపుటి భాసించదు. ఉన్నదొకటియే. ఈ ప్రకారము త్రిపుటి నశించడ మనగా ఏకత్వజ్ఞానము గలుగవలయునని భావము. జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు, దృక్ దృశ్య దర్శనములు, ధ్యాతృ ధ్యేయ ధ్యానములు- వీనికి నంతరార్థము తీసికొని పై యర్థము తెలుపబడెను. ఇచ్చట దృశ్యమన దర్శిందగినది ఆత్మయని తెలియవలెను.

ఇక నా త్రిపుటికి బాహ్యార్థముల ననుసరించి దృశ్యనాశనోపాయమును (ప్రపంచభ్రాన్తి రహితోపాయమును) తెలుపుచున్నారు. ఏదేది గోచర మగుచున్నదో యది యంతయు జ్ఞేయము. అనగా సమస్త పదార్థములు (దృశ్యము) వానిని గ్రహించు జ్ఞానము (దర్శనము) ఆయా పదార్థములను గ్రహించునప్పుడు మనస్సు సాధన మగుచున్నది; ఆయా వస్త్వాకారములను పొందుచున్నది. కావున జ్ఞేయమనినను, జ్ఞానమనినను మనస్సే. అనగా జ్ఞానమను వృత్తియు, జ్ఞేయమగు దృశ్యము మనస్సుగానే యున్నది. అందుచే జ్ఞానజ్ఞేయములను సమముగ చేసిన దృశ్య ముండదు. జ్ఞానజ్ఞేయముల సమమొనరించుట అనగా జ్ఞేయము మనస్సే, జ్ఞానము మనస్సే, ఈ రెండును దృశ్యములే. వానిని రహిత మొనరించి సత్తామాత్రుడై యుండిన, సర్వదృశ్యమగు మనస్సు నతిక్రమించినట్టి యద్వితీయ జ్ఞానము గలుగుచున్నది. ఇంతకన్న వేరుమార్గము లేదు. దీనికి మఱియొక యర్థ మున్నది. అదేమనగా, ప్రతీయమానమగు సమస్త ప్రపంచము.జ్ఞేయ మనగా పరబ్రహ్మస్వరూపము. దానిని గ్రహించు శుద్ధమనస్సున్న పరబ్రహ్మాకారమును జెందుచున్నది. ఇదియే జ్ఞానము. అప్పుడు మనస్సు జ్ఞానరూపమై యున్నది. పరబ్రహ్మము, దానిస్వరూపమగు జ్ఞానము వేరుగానందుచే జ్ఞాతృజ్ఞేయము లనగా నొకటియే. ఇదియే జ్ఞాతృజ్ఞేయములను సమముగా జేయుట యగును. ఇంతకన్న వేరుమార్గము సర్వదృశ్యరహిత అద్వితీయ జ్ఞానసిద్ధికై లేదు. ఇదియే త్రిపుటి రాహిత్యము; అఖండము.

అవ: చెప్పవలసిన దంతయు చెప్పుచు కట్టకడకు పరమగురుకృపయే శరణ్యము, వేరుగతి లేదను విషయమును జెప్పుచున్నారు.

**కిమత్ర బహునో క్తేన శాస్త్రకోటిశతైరపి ।**
**దుర్లభా చిత్తవిశ్రాన్తిః వినా గురుకృపాం పరామ్ ॥** **128**

కిం - అత్ర - బహునా - ఉక్తేన - శాస్త్రకోటిశతైః - అపి - దుర్లభా - చిత్తవిశ్రాన్తిః - వినా - గురుకృపాం - పరాం.

అత్ర = ఈ దృశ్యరహిత ధ్యానవిషయమై, శాస్త్రకోటిశతైరపి = అనేక శాస్త్రములచేతను, ఉక్తేన బహునా = ఎక్కువగా చెప్పుటచేతను. కిం = ఏమిప్రయోజనము, పరాం = మహోత్కృష్టమగు, గురుకృపాం = గురుదయను, వినా = వదలి, చిత్తవిశ్రాన్తిః = పరబ్రహ్మమునందు చిత్తము లయించి శాంతి గలుగుట, దుర్లభా = బహుదుస్సాధమైనది, కష్టతమము.

పరమగురుకృపను తప్పక సంపాదింపవలయును. ముందధ్యాయములో గురుకృపను సంపాదించు నుపాయములను, శ్రీగురుసేవా ధ్యానాదికములను దెలియ జెప్పిరి. అనేక శాస్త్రములను జదివి, మహాగంభీరార్థములను గ్రహించి, బహుళములుగా వ్యాఖ్యానము చేసినను ప్రయోజనము లేదు. వానిచే చిత్తమునకు శుద్ధియు, ఏకాగ్రతయు గలిగి శాన్తి నొందజాలడు. మరేమనగా శ్రీగురుదేవుని యనుగ్రహమును సంపాదింప వలయును. ఆ అమోఘమగు పరమసాధనయే త్రుటిలో సకలదోషములను నశింపజేసి చిత్తశాన్తిని గలుగజేయును. చిత్తము లయమై పరబ్రహ్మమం దేకత్వమును పొందుట చిత్తశాన్తి యనబడును. అదియే సకలవృత్త్యుపశమరూప పరమశాన్తి. సకల యోగశాస్త్రములు, చిత్తములోని సకలవృత్తులు నశించి ఏకాగ్రతను పొందు విషయమునే యోగమని తెలుపుచున్నవి. అందుచే జీవబ్రహ్మైక్యము గలుగునని జ్ఞానశాస్త్రము బోధించుచున్నది. ఇదంతయు పరమగురుదేవుని కృప యుండిన సులభముగా సిద్ధించునని తెలియవలయును.

**"దుర్లభో విషయత్యాగః దుర్లభం తత్త్వదర్శనం ।**
**దుర్లభా సహజావస్థా సద్గురోః కరుణాం వినా ॥"**

అని వేదాంతశాస్త్రము చెప్పుచున్నది.

అవ: ఇందునను కరణామహిమనే తెలుపుచున్నారు.

**కరుణా ఖడ్గపాతేన ఛిత్వా పాశాష్టకం శిశోః ।**
**సమ్యగానందజనక స్సద్గురు స్సోఽభిధీయతే ॥ 129**

కరుణాఖడ్గపాతేన - ఛిత్వా - పాశాష్టకం - శిశోః - సమ్యక్ - ఆనందజనకః - సద్గురుః - సః - అభిధీయతే.

యః = ఏ మహాత్ముడు, శిశోః = బిడ్డయగు శిష్యునియొక్క, పాశాష్టకం = అష్టపాశములను, కరుణాఖడ్గపాతేన = శ్రీగురుదేవుని కరుణయను ఖడ్గముయొక్క పడవేయుట(ప్రహారము) చేత, ఛిత్వా = ఛేదించి, సమ్యక్ = బాగుగా, అనందజనకః - శాశ్వతానందమును గలుగజేయువాడో, సః = ఆ మహాత్ముడు, సద్గురుః = సద్గురువుగా, అభిధీయతే = చెప్పబడుచున్నాడు.

శ్రీగురుదేవునియొక్క కరుణ యను మహాతీవ్రఖడ్గము నుపయోగించుటచేత అనగా ఖడ్గమువంటి కరుణాప్రసరణముచేత శిశువువలె నిష్కపటహృదయుడై, శరణు పొందిన శిష్యునియొక్క (1) దయయు, (2) జుగుప్సయు, (3) మోహము, (4) భయము, (5) సంశయము, (6) కులము, (7) బలము, (8) శీలము అను అష్టపాశములను ఛేదించి పరమానందమును గలుగజేయువాడే శ్రీసద్గురువని వేదాన్తశాస్త్రములు చెప్పుచున్నవి. ఇట్లు సకల సంసారబన్ధ పాశములనుండి శ్రీగురుకృపాతిశయముచే శిష్యుడు ముక్తుడై శాశ్వతానందము నొందుచున్నాడు. కనుక శ్రీ గురుకృపను సంపాదించ వలయును.

అవ: ఇప్పుడు శ్రీగురుదేవునియొక్క మహిమను దెలిసియు, గురనింద చేయువాని గతిని తెలుపుచున్నారు.

**ఏవం శ్రుత్వా మహాదేవి గురునిన్దాం కరోతి యః ।**
**స యాతి నరకాన్ ఘోరాన్ యావచ్చన్ద్రదివాకరౌ ॥ 130**

ఏవం - శ్రుత్వా - మహాదేవి - గురునిన్దాం - కరోతి - యః - సః - యాతి - నరకాన్ - ఘోరాన్ - యావత్ - చంద్రదివాకరౌ.

హే మహాదేవి ! = ఓ ఉమాదేవి ! యః = ఏ పాపణ్ణుడు, ఏవం = ముందు చెప్పినట్లుగ నున్న గురుమాహాత్మ్యమును, శ్రుత్వా = విని, గురునిందాం = గురునిందను, కరోతి = చేయుచున్నాడో, సః = అట్టి నాస్తికుడు, చన్ద్రదివాకరౌ = సూర్యచంద్రులు, యావత్ = ఎంతకాలమువరకు, (స్తః = వుంటున్నారో, తావత్ = అంతవరకు,) ఘోరాన్ నరకాన్ =

భయంకర నరకములను, యాతి = పొందుచున్నాడు.

శ్రీగురువు దగ్గరజేరి అనేక రహస్యములను దెలిసికొని తిరుగ వ్యాఖ్యానమును జేయుచు భక్తిశ్రద్ధలు లేనివాడై - నాస్తికుడై - సర్వవిషయ సుఖవిముఖమగు వైరాగ్యము నొందజాలక దృశ్యవస్తువులనే యభినందించుచు, శ్రీగురుదేవుని నిందించువాడు సూర్యచంద్రు లున్నంత వరకును, మహాభయంకర నరకములను పొందుచున్నాడు. సందియము లేదు.

అవ: శ్రీగురువునందు కృతజ్ఞుడై యుండవలయు ననెడి విషయమును చెప్పుచున్నారు.

**యావత్కల్పాంతకో దేహస్తావద్దేవి! గురుం స్మరేత్ ।**
**గురులోపో న కర్తవ్యః స్వచ్ఛన్దో యది వా భవేత్ ॥ 131**

యావత్ - కల్పాంతకః - దేహః - తావత్ - దేవి - గురుం - స్మరేత్ - గురులోపః - న - ః - యది - వా -

హే దేవి ! = ఓ పార్వతీ ! దేహః = దేహము, యావత్ = ఎంతవర కుంటున్నదో, కల్పాంతకః = కల్పమువఱ కుంటున్నదో, తావత్ = అంతవరకును, గురుం = గురుదేవుని, స్మరేత్ = స్మరించవలయును, స్వచ్ఛన్దో యది = సేచ్ఛావృత్తి గలవాడు అయినను, భవేద్వా = అగుగాక ! గురులోపః = గురువు నందలి భక్తిలోపము, న కర్తవ్యః = చేయకూడదు.

ఓ పార్వతీ ! దేహమున్నంతవరకు శ్రీ గురుదేవుని స్మరించుచునే యుండవలయును, మరువకూడదు. అంతమాత్రమే కాదు, ఈ దేహము కల్పాంతమువర కున్నను శ్రీగురుపరబ్రహ్మస్వరూపమును మరువకూడదు. శ్రీగురుదేవునివలన తనయొక్క అజ్ఞానము నాశ మగును. శాశ్వతానందము లభించును. ఇట్టి గురుదేవుని దగ్గర శ్రవణమననాదులను చేసి పరమలాభమును పొందియున్నందుచే కారణాంతరములచే ననేక జన్మములు కలిగినను శ్రీగురువునుమాత్రము విస్మరింపకూడదు.

ఒకవేళ తాను గురువును వదలి వేరుగా నున్నవాడైనను గురువునందు భక్తినిమాత్రము వదలకూడదు. తాను మఠములోగాని, ఆశ్రమములోగాని, ఎచ్చోట

నున్నను శ్రీగురుస్మరణకై శ్రీగురుదేవుని పూజాదులను చేయుచుండవలయును. తన కర్తవ్యమునుమాత్రము వదలకూడదు. ఇట్లు కృతజ్ఞత గలవాడై యుండ వలయును. వాడెన్ని జన్మము లెత్తినను వాని జీవిత మంతయు గురుభక్తిమయ మగుటచే కేవలానందమయ మగుచుండును.

**"ఆజీవితం త్రయస్సేవ్యా వేదాన్తో గురురీశ్వరః ।**
**ఆదౌ జ్ఞానాప్తయే పశ్చాత్ కృతఘ్నత్వనివృత్తయే ॥"**

జీవితపర్యన్తము వేదాంతములు, గురువు, ఈశ్వరుడు సేవింప దగినవారు. మొదట జ్ఞానముకొరకును, తరువాత కృతఘ్నుడు కాక కృతజ్ఞుడై యుండుట కని తెలియవలయును.

అవ: శిష్యప్రవర్తనా నియమము.

**హుంకారేణ న వక్తవ్యం ప్రాజ్ఞశిష్యైః కదాచన ।**
**గురోరగ్రే న వక్తవ్యమసత్యం తు కదాచన ॥** **132**

హుంకారేణ - న - వక్తవ్యం - ప్రాజ్ఞశిష్యైః - కదా - చన - గురోః - అగ్రే - న - వక్తవ్యం - అసత్యం - తు - కదా - చన.

గురోః = శ్రీగురుదేవునియొక్క, అగ్రే = ముందర, ప్రాజ్ఞశిష్యైః = వివేకవంతులగు శిష్యులచేత, కదాచన = ఎప్పుడును, హుంకారేణ = కోపముచేత హుంకారశబ్దముచే, న వక్తవ్యం = పలుక దగదు, కిం తు = మరియు, కదాచన = ఎప్పుడును, అసత్యం = అసత్యమునుకూడ, న వక్తవ్యం = చెప్పకూడదు.

శ్రీగురువుదగ్గర శిష్యుడెట్టి ప్రవర్తన గలిగియుండవలయునో దానిని వచించుచున్నారు. శిష్యులు గురువుదగ్గర యుక్తాయుక్త వివేకము గలిగి ప్రజ్ఞా వంతులై మెలంగవలయును. అప్రాకృతబుద్ధి గల శ్రీగురుదేవుడు శిష్యులయొక్క తారతమ్యమును చక్కగా నెరుంగును. శిష్యులధర్మ మేమనగా సర్వదా శ్రీ గురువర్యునకు నానందము కలుగునట్లు ప్రవర్తించు చుండవలయును. వివేకవంతులగు శిష్యులు శ్రీగురువు సమీపమున కోపముతో హుంకారము చేసి మాట్లాడరు. వినయవిధేయతలతో గురుభక్తి గలిగి మాట్లాడవలయును.

శాస్త్రములలో అసత్యముకన్న మించిన పాపము లేదని చెప్పుచున్నారు. కావున నట్టి యసత్యము నొకప్పుడైనను ప్రమాదవశముచే నైనను సత్యాత్ముడగు, జ్ఞానవంతుడగు, సాక్షాద్భగవత్స్వరూపుడగు శ్రీ గురువుదగ్గర వచింప దగదు. అనగా శిష్యుడు సత్యభాషియై వినయవిధేయతలు గలిగి పరమభక్తితో మెలంగవలయునని తాత్పర్యము.

అవ: శ్రీగురుదేవునిదగ్గర అపభాషణము లాడెడు, భక్తి లేనివానియొక్క గతిని తెలుపుచున్నారు.

**గురుం త్వంకృత్య హుంకృత్య గురుసాన్నిధ్యభాషణః ।**
**అరణ్యే నిర్జలే దేశే సంభవేద్బ్రహ్మరాక్షసః ॥ 133**

గురుం - త్వంకృత్య - హుంకృత్య - గురుసాన్నిధ్యభాషణః - అరణ్యే - నిర్జలే - దేశే - సంభవేత్ - బ్రహ్మరాక్షసః.

గురుం = శ్రీగురుమూర్తిని, త్వంకృత్య = నీవని బోధించి, హుంకృత్య = హుంకరించి, గురుసాన్నిధ్య భాషణః = శ్రీ గురుదేవునియొక్క సమీపమున మాటలాడు నటువంటివాడు, నిర్జలే = నీళ్ళులేని, అరణ్యే దేశే = అటవీప్రదేశము నందు, బ్రహ్మరాక్షసః = బ్రహ్మరాక్షసుడై, సంభవేత్ = తప్పక పుట్టును.

శ్రీగురుదేవుని కోపావేశముచే నీవని నీచమగు సంబోధము గావించి హుంకరించి మాట్లాడునట్టి అహంకారి పురుషుడు జలమే లభింపని మహారణ్యము నందు బ్రహ్మరాక్షసుడై తప్పక జన్మ మెత్తును. వాడెన్నిసార్లు హుంకరించెనో అన్నిసార్లు బ్రహ్మరాక్షసుడై పుట్టును.

అరణ్యములో జన్మించడమే బహుకష్టము. ఇకను జలము లభించనిచో, వాని దుస్థితిని చెప్పవలయునా ! నీవని వాక్కుతో నీచసంబోధనము గావించిన ఫలము జలము లేకయే తపించుట యగును. క్రోధపూర్ణుడై రాక్షసునివలె రజోగుణ తమోగుణములతో గూడి హుంకరించి పలికినందుచే, దానియొక్క ఫలము బ్రహ్మరాక్షసుడై పుట్టుచున్నాడు. బ్రహ్మరాక్షసు డనగా దారిలో పోవు వారందరిని పట్టి మ్రింగువా డగును. చేయరాని పాపము చేసినందుచే బ్రహ్మ రాక్షసునియొక్క జన్మము వచ్చెను. వానికి పూర్వజ్ఞానముగూడ నుండును. అయినను, మహాపాపము

చేయు వాడగుటచే నా బ్రహ్మరాక్షసుడు జన్మ మనుభవించిన తర్వాతను పాప ఫలితమునకు దగు జన్మమునే మరల బొందు చున్నాడు. ఇట్లు నిరంతరము పాపవర్తను డయ్యేపోవును. వానికి సద్గతి లేదు. చూచితిరా శ్రీగురుదేవుని మహిమను! భక్తి లేక సంచరించగూడదని దీనిభావము.

అవ: తాను సర్వదా అద్వైతభావన కలవాడైనను, గురుస్వరూపస్థితిలో నున్న వాడైనను ప్రవర్తింపవలసినట్టి తత్త్వమును వివరించుచున్నారు.

**అద్వైతం భావయేన్నిత్యం సర్వావస్థాసు సర్వదా ।**
**కదాచిదపి నో కుర్యాదద్వైత్వం గురుసన్నిధౌ ॥ 134**

అద్వైతం - భావయేత్ - నిత్యం - సర్వావస్థాసు - సర్వదా - కదా - చిత్ -అపి - నో - కుర్యాత్ -అద్వైతం - గురుసన్నిధౌ ॥

నిత్మం = నిత్యమగు, అద్వైతం = అద్వైతమును, సర్వావస్థాసు = అన్నివేళలయందును, సర్వదా = ఎప్పుడును, భావయేత్ = భావించవలయును, గురుసన్నిధౌ = గురుసన్నిధానమందు, కదాచిదపి = ఒకప్పుడును, అద్వైతం = అభేదముతో ప్రవర్తించుటను, నో కుర్యాత్ = చేయగూడదు.

శ్రీ గురుదేవు డుపదేశించిన మహావాక్యార్థ తత్త్వమగు శ్రీ గరుపరబ్రహ్మము తానను నద్వైతభావము గలవాడైనను, కేవలాద్వైతములో 'గురుర్నైవ శిష్యః' అనునట్లు భేదరహితజ్ఞానము నొందినను, శ్రీ గురుసన్నిధానమున వ్యకహార దశయందు బాహ్యమునగాని, అంతరమునగాని విధిప్రకార ముండవలయును. అద్వైతతత్త్వమును మాత్రము సర్వదా అన్నివేళలయందును భావించవలయును. అచ్చోట దృశ్యప్రతీతి గలుగకూడదు. కాని అచట యఖండ స్వస్వరూప విజ్ఞానము ఏ దేవునిచే తనకు సంప్రాప్త మాయెనో, అట్టి శ్రీగురుపరంధామునిపై కృతజ్ఞత్వము గలిగి, వినయవినమ్రుడై పరమభక్తిభావముతో ప్రవర్తించవలయును. లేనిచో తాను కృతఘ్ను డగును. కాబట్టి పరమభక్తితోను, మహాఖండాద్వైత తత్త్వముతోను పరిపూర్ణుడై యుండవలయునని భావము.

**అద్వైతం త్రిషు లోకేషు నాద్వైతం గురుసన్నిధౌ ।**
**భావాద్వైతం సదా కుర్యాత్ క్రియాఽద్వైతం న కుత్రచిత్ ॥**

అని పై యర్థమునే శాస్త్రము తెలుపుచున్నది.

అవ: ఏ పరమభక్తుడు ముక్తిని బొందునో ఆ విషయమును ప్రతిపాదించు చున్నారు.

**దృశ్యవిస్మృతిపర్యన్తం కుర్యాద్గురుపదార్చనమ్**
**తాదృశస్యైవ కైవల్యం న చ తద్వ్యతిరేకిణః ॥ 135**

దృశ్యవిస్మృతిపర్యన్తం - కుర్యాత్ - గురుపదార్చనమ్ - తాదృశస్య - ఏవ - కైవల్యం - న - చ - తద్వ్యతిరేకిణః.

గురుపదార్చనమ్ = శ్రీ గురుదేవుని పాదారవిందములయొక్క పూజనము, దృశ్యవిస్మృతిపర్యన్తం = ప్రపంచస్మృతి లేకపోవుటవరకు (దేహమునుగూడ మరచువరకు), కుర్యాత్ = చేయవలెను. తాదృశస్యైవ = అట్లు తన్మయత్వముతో నర్చనజేయు మహాభక్తునికే, కైవల్యం = మోక్షము, తద్వ్యతిరేకిణః = అట్టి పరమభక్తి లేక ప్రతిష్ఠకొఱకు పూజించువానికి, న = ముక్తి లేదు.

భక్తుడు తన ధ్యేయమగు శ్రీ గురుపద ద్వంద్వముయొక్క పూజనమును బాహ్యమగు ప్రపంచమును మరచి దేహేన్ద్రియములయొక్క స్మృతి లేకయు, తన్మయత్వముతో ధ్యేయముమాత్రము గోచరించువరకు చేయవలయును.

మరియొక యర్థము: గురుపద మనగా గురుస్థానము. అట్టి శ్రీగురుపర బ్రహ్మము యొక్క అర్చన మనగా స్వస్వరూప భావన యగును. ఇదియే 'అహం బ్రహ్మాస్మి' యను దృశ్యరహితవృత్తి. ఇట్టి ఆత్మానుసంధానమును సకలదృశ్యము బాహ్యముగను, నాంతరముగను నశించి కేవలత్వము గలుగువరకు నభ్యసించుచునే యుండవలయును.

మరియొక విశేష మిందులో గలదు. అదేమనగా, దీపము వెలిగించి నంతమాత్రమున చీకటి పోవునట్లు నేను బ్రహ్మనను భావనామాత్రమున దృశ్యము యొక్క విస్మరణము కలుగుచున్నది. కాని దృఢత్వము లేనందుచే ననేక సంకల్ప ములు వచ్చిపడి తిరుగ నాత్మను అనాత్మవృత్తిలోనికి ప్రవేశించునట్లు చేయుచున్నవి. కావున పూర్తిగ దృశ్యము నశించి అఖండతత్త్వజ్ఞానము కలుగునంత వరకును

స్వస్వరూపానుసంధానమును జేయుచునే యుండ వలయును. కట్టకడకు సత్తామాత్రుడై ప్రకాశించుచున్నాడు. ఇదియే కైవల్యము.

**అహం బ్రహ్మాస్మి వాక్యార్థబోధో యావద్దృఢీభవేత్ ।**
**శమాదిసహితస్తావదభ్యసేచ్ఛ్రవణాదికమ్ ॥**

ఇట్లు వేదాంతపంచదశి చెప్పుచున్నది. పైన దెలిపిన గురుపాదారవిందార్చనము చేయువానికే ముక్తిపదవి గలుగును. శ్రీగురుదేవుని యనుగ్రహముచే జ్ఞానము గలిగి ముక్తు డగును. అటుగాక కేవల ప్రతిష్ఠకొరకుగాని, సంకల్పములు నశించకగాని, త్రికరణశుద్ధి లేక బాహ్యముగ జేయు శ్రీగురుపాదపూజనము గలవానికి మోక్షము లేదు. గుర్వనుగ్రహము కలుగదు. త్రికరణశుద్ధిలేక ,చేయు స్వస్వరూప జ్ఞానముగాని, పూజగాని, ఫలవంతములు గావని భావము.

అవ: సంపూర్ణజ్ఞాన ముదయించినను శ్రీగురుదేవునియందలి పరమభక్తిని వదలకూడదను విషయమును దెలుపుచు దానిచే గలుగు పరమానర్థమును వివరించుచున్నారు.

**అపి సంపూర్ణతత్త్వజ్ఞో గురుత్యాగీ భవేద్యదా ।**
**భవత్యేవ హి తస్యాన్తకాలే విక్షేపముత్కటమ్ ॥ 136**

అపి - సంపూర్ణతత్త్వజ్ఞః - గురుత్యాగీ - భవేత్ - యదా - భవతి - ఏవ - హి - తస్య - అన్తకాలే - విక్షేపం - ఉత్కటం.

సంపూర్ణతత్త్వజ్ఞః అపి = పరిపూర్ణ తత్త్వజ్ఞానము కలవాడైనను, యదా = ఎప్పుడు, గురుత్యాగీ = గురుభక్తి లేనివాడుగా , భవేత్ = అగునో, తస్య = వానికి, అన్తకాలే = అవసానకాలమందు, ఉత్కటం = గొప్పదైన, విక్షేపం = చలనాత్మకబుద్ధి (దృశ్యప్రతీతిభ్రాన్తి), హి = నిశ్చయముగా, భవత్యేవ = కలుగుచునే యున్నది.

తాను శ్రీగురువుదగ్గఱ నిరంతరము సేవజేసి కష్టపడి శ్రీగురువుయొక్క యనుగ్రహముచే పరిపూర్ణ తత్త్వజ్ఞానము బడసి యున్నను పిదప ఎప్పుడు గురుభక్తి లేనివా డగుచున్నాడో అట్టివాడు మరణమందు దృశ్యభ్రాన్తిచే దుర్గతిని పొందు చున్నాడు. అదేమనగా వేదాన్తశాస్త్రములో మరణసమయమున నెట్టి భావన కలిగియున్నాడో, అట్టి స్థితినే పొందునని తెలిపియున్నారు.

**యం యం వాఽపి స్మరన్భావం తజత్యన్తే కళేబరమ్ ।**
**తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావితః ॥**

అని భగవద్గీతయు పై విషయమునే తెలుపుచున్నది. కావున గురుభక్తివర్జితుడు అవసానకాలములో గొప్పదగు విక్షేపమును పొందుచున్నాడు. వానికి మహా మోహమును గలిగించు దృశ్యప్రతీతి జనించును. అద్వైత తత్త్వజ్ఞానమునకు భంగము కలుగును. వాడంతవరకు నాచరించినట్టి సాధన లన్నియు విఫలము లగును. ఇంతకు సిద్ధించినట్టి యర్థ మేమనగా జ్ఞానోదయము కాక మునుపును గలిగిన పిమ్మటను శ్రీగురుదేవునియందు కృతజ్ఞుడై యుండవలయును. అట్లే పరమగు శ్రీగురుదేవునియొక్క యనుగ్రహము యావజ్జీవ ముండవలయునని భావము. గురుదేవుని విషయమై సర్వదా కృతజ్ఞుడై యుండిన తనయొక్క జ్ఞానరక్ష సుస్థితమై యుండునని తెలియవలెను.

అవ: శిష్య డెట్లు నిత్యము శ్రీగురుదేవుని విషయమై ప్రవర్తించవలయునో, అద్దానిని దెలుపుచున్నారు.

**గురుకార్యం న లంఘేత నాపృష్ట్వా కార్యమాచరేత్ ।**
**న హ్యుత్తిష్ఠేద్దిశేఽనత్వా గురుసద్భావశోభితః ॥** **137**

గురుకార్యం - న - లంఘేత - న - అపృష్ట్వా - కార్యం - ఆచరేత్ - న - హి - ఉత్తిష్ఠేత్ - దిశే - అనత్వా - గురుసద్భావశోభితః.

గురుసద్భావశోభితః - గురు = శ్రీగురుదేవునియందు, సద్భావ = సదభిప్రాయముతో (సత్తగు పరమాత్మయొక్క భావముతో), శోభితః = ప్రకాశించునట్టి పరమభక్తుడు, గురుకార్యం = శ్రీ సద్గురుకార్యమును, న లంఘేత = అతిక్రమించగూడదు, కార్యం = పనిని, అపృష్ట్వా = అడుగక, నాచరేత్ = అచరించకూడదు, దిశే = గురువున్న దిక్కుకొఱకు, అనత్వా = నమస్కరించక, న ఉత్తిష్ఠేత్ = లేవకూడదు, హి = నిశ్చయము.

శ్రీగురుదేవునియందు మంచిదగు మనస్సు గలిగియుండవలయును. పరమవిశ్వాసముతో తను ధన మనముల నర్పించినవాడై యుండవలయును. శ్రీగురువన దైవమను సద్భావముతో నుండవలయును. అట్టి భావము గలిగి అట్లు ప్రవర్తించడమే శిష్యునకు శోభ గలిగించుచున్నది.

శ్రీగురుదేవుడును శిష్యుని నుద్ధరింపవలయునని పరమాదరముతో నుండుటయు, శిష్యుడు నన్నివిధముల వినమ్రుడై నిష్కపట ప్రవృత్తి గలిగి గురువర్యుని సేవించుటయు పరస్పర శోభాదాయికములు. అట్లున్నందుచే జ్ఞానతత్త్వము ప్రతిబంధము లేక ప్రకాశించును. శిష్యుని నిత్యకృత్య మేమనగా? పడకనుండి శ్రీగురుస్మరణమును జేయుచు, నమస్కరించుచు లేవవలయును. అప్పుడు వానికి నిరంతరము సకల శుభములు (అధ్యయన జపతపోధ్యానాదులు ప్రతిబంధములు లేకుండ జరుగుట) గలుగును.

మఱియు నాతడు శ్రీ గురువు నాజ్ఞాప్రకారము శ్రీరామకార్యమందు శ్రీఆంజనేయస్వామివలె సర్వకార్య ధురంధరుడై సకల గురుకార్యముల నాచరించు చుండవలయును, శ్రీగురుదేవునికి విన్నవించక నెట్టి చిన్న కార్యము నైనను చేయదగదు. శ్రీగురువు అప్రాకృతబుద్ధి గలవారు. వారెట్టి భావముతో నేకార్యము నెట్లు దెలిపిరో తెలిసికొనుట కష్టము. కావున తనకు మంచిదని తోచినను శ్రీగురుదేవునకు విన్నవించియే చేయవలెను. "ఋషేర్హృదయం ఋషిరేవ వేత్తి" అన్నట్లు తాను నట్టివా డయినచో సకలము తెలియును. ఇట్లు శిష్యుని పరమ ధర్మములు తెలియపరచబడినవి.

అవ: శిష్యసంచయ విషయమై దివ్యోపదేశమును జేయుచున్నారు.

**గురౌ సతి స్వయం దేవి! పరేషాన్తు కదాచన ।**
**ఉపదేశంనకుర్యాద్ధి తదా చేద్రాక్షసో భవేత్ ॥ 138**

గురౌ - సతి - స్వయం - దేవి - పరేషాం - తు - కదా - చన - ఉపదేశం - న - కుర్యాత్ - హి - తదా - చేత్ - రాక్షసః - భవేత్.

హే దేవి = ఓ పార్వతీదేవి ! గురౌ సతి = శ్రీ గురుదేవు డుండగనే, పరేషాం = ఇతరులకు, ఉపదేశం తు = ఉపదేశము నయితే, కదాచన = ఎప్పుడును, న కుర్యాత్ = చేయకూడదు, హి = నిశ్చయము, తదా = అట్లుపదేశము చేసినప్పుడు, రాక్షసః = రాక్షసుడగ, భవేత్ = అగును.

కొందఱు యోగ్యత లేకుండినను స్వప్రయోజనము గోరి శ్రీగురుదేవు డున్నను 'వారికేనా యుండవలసినది? మనకేల శిష్యులు, పూజాదు లుండగూడ'

దని వాదించుచు భక్తులను వంచించి తమ శిష్యులనుగా జేసికొనువా రున్నారు. వా రీశ్లోకార్థమును బాగుగా మననము చేయవలయును. శ్రీగురుదేవుడు ప్రపంచభాస్కరునివలె సర్వతమము నడంపను దేజరిల్లుచుండగా తానొక చిన్నదగు దీపమువలెగాని, ఆంజనేయుని ముందు గుప్పిగంతులవలెగాని ఇతరుల కుపదేశము జేయుట హాస్యాస్పద మగును. అంతమాత్రమేగాక నీ క్రింద జెప్పబోవు విధమున మహాపాతకి యగుచున్నాడు.

అట్లుగాక పరమజ్ఞాన సమ్పన్నుడై, వేదాంతతత్త్వము నెఱింగి యుండిన వాడైనను శ్రీ గురుదేవునియందలి భక్తివశముచే నాకార్యము లన్నియును గురువుయొక్క యధీనములు చేయవలెను. ఇది పరమధర్మము. తండ్రి రాజ్యము పాలించునప్పుడు తాను రాజగుట ధర్మము గాదు. వారి యాజ్ఞచే రాజు కావచ్చును. అట్లే గురుదేవునియొక్క ఆజ్ఞను బడసి యోగ్యత గలవాడు దీనజనోద్ధరణకై, ఆర్తి బాపుటకై మంత్రాద్యుపదేశములను చేయవచ్చును. ఈ రహస్యము ననుసరించియే సన్న్యాసము నిచ్చునప్పుడు మఠియొకఠికి సన్న్యాసాధికారము నిచ్చునట్టి యధికారము నిచ్చుచున్నారు. కాన, శ్రీ గురుదేవు డున్నప్పుడు వారియాజ్ఞ గైకొనక నర్వ్హడయ్యు నుపదేశము చేయదగదు. ఇటుండగా యోగ్యత లేనివాడు, శ్రీగురువున్నను నుపదేశము చేయువాడు సర్వపుణ్యకర్మరహితుడై, పతితుడై, మహారాక్షసుడై పుట్టి యరణ్యములో సంచరించును. ఇట్టి దుర్గతిని పొందుచున్నాడు.

అవ: గురువుయొక్క ఆశ్రమములో నడచుకొను పద్ధతులను దెలుపుచున్నారు.

**న గురోరాశ్రమే కుర్యాద్దుష్పానం పరిసర్పణమ్ ।**
**దీక్షావ్యాఖ్యాప్రభుత్వాది గురోరాజ్ఞాం న కారయేత్ ॥ 139**

న - గురోః - ఆశ్రమే - కుర్యాత్ - దుష్పానం - పరిసర్పణమ్ - దీక్షావ్యాఖ్యాప్రభుత్వాది- గురోః - ఆజ్ఞాం - న - కారయేత్.

గురోః ఆశ్రమే = గురువుయొక్క ఆశ్రమమందు, దుష్పానం = మద్యపానము ధూమపానము మొదలైనవి, పరిసర్పణమ్ = తిరుగుటయు, దీక్షావ్యాఖ్యాప్రభుత్వాది - దీక్షా= వ్రతాదిదీక్షయు, వ్యాఖ్యా = స్వేచ్ఛగా వ్యాఖ్యానము చేయుటయు, ప్రభుత్వాది = అధికారత్వము మొదలైనియు వీనిని, న కుర్యాత్ = చేయగూడదు, గురోః అజ్ఞాం = గురువుయొక్క ఆజ్ఞను,

న కారయేత్ = చేయించగూడదు.

చుట్ట, బీడి మొదలైన వానిని త్రాగకూడదు. గంజాయి పీల్చకూడదు. అభిని మొదలగు వానిని సేవించకూడదు. సురాపానము చేయగూడదు. ఏవేవి బుద్ధిని చెఱచి ఉన్మాదకత్వమును గలిగించు నవియో అట్టి దురాచారములను వదలవలయును. కొందరు 'గంజాయి, అభిని మొదలయినవి మత్తును కలుగ జేయును. అందుచే ధ్యానములో ప్రపంచమును మఱచి యుండవచ్చును. ఇకను కొన్ని మత్తును కలుగజేయు గుళికలు గలవు. అవికూడ ధ్యానములో నెంతకాలమైన నుండునట్లు చేయు' ననియు చెప్పువారు కలరు. ఇట్టి వాక్యములను విశ్వసించ కూడదు.

పై దెలిపిన దురాచారముల నెప్పుడు నెచ్చోటను చేయగూడదు. ఇట్లుండగా గురుకులాశ్రమములో చేయకూడదని మరి చెప్పవలయునా! ఆశ్రమమునకు పవిత్రు లగుటకు వచ్చియు, రహస్యముగ మొదట నభ్యాసపడిన కొన్ని దురలవాటులను విడువజాల కుందురు. అందులకై ఇట్టి మహోపదేశమును చేయుచున్నారు. అంతమాత్రమే కాదు, ఆశ్రమములో చేరుట తనయొక్క పాపములను పోగొట్టు కొనుట కని మరువకూడదు. అటుండగా నిచ్చోటను పాపకార్యములను జేయుచుండిన వానిపాపము బ్రహ్మలోకములోగూడ నశించదనియు, నొకవేళ నశించు ననియు శాస్త్రములు చెప్పుచున్నవి.

**అన్యక్షేత్రే కృతం పాపం పుణ్యక్షేత్రే వినశ్యతి ।**
**పుణ్యక్షేత్రే కృతం పాపం బ్రహ్మలోకే న నశ్యతి ॥**

ఇకను వ్యర్థముగా మతిస్థిరము లేక తిరుగుటయు, శ్రీగురునాజ్ఞ లేక స్వయముగా వ్రతాది దీక్షను గైకొనుటయు, నితరుల విషయమై విమర్శించుటయు అనగా నితరుల దోషమునుమాత్రము కొండంతగ దెలుపుచు, తనవి కప్పిపుచ్చు కొనుటయు, నాశ్రమములో తానే యధికారిగ నుండవలయునని కోరి కొన్ని యనవసరములగు నధికారములను జేయుటయు, తాను వచ్చిన కార్యమును మరచి ఇవన్నియు చేయగూడదు. ఇందుచే నిదివరకన్న చాల నపవిత్రు డగుచున్నాడు. శ్రీగురుదేవుని ఆజ్ఞను స్వయముగా చేయక నశ్రద్ధతో పరులచే

చేయించుటయు కూడదు. పై దెలిపిన వానిని వదలి నిరంతరము వైరాగ్యాదులచే నొప్పుచు శ్రీగురుశాసనమును నుల్లంఘించక పవిత్రుడు కావలెను.

అవ: శిష్యుని యాచరణ విషయమై తెలుపుచు, జితేన్ద్రియుడై యుండవలయునని చెప్పుచున్నారు.

**నోపాశ్రయం చ పర్యంకం న చ పాదప్రసారణమ్ ।**
**నాంగభోగాదికం కుర్యాన్న లీలామపరామపి ॥ 140**

న - ఉపాశ్రయం - చ - పర్యంకం - న - చ - పాదప్రసారణం -న - అంగభోగాదికం - కుర్యాత్ - న - లీలాం - అపరాం - అపి.

(గురోః ఆశ్రమే = గురువుయొక్క ఆశ్రమములో) ఉపాశ్రయం = ఆనుకొని కూరుచుండుటయును, పర్యంకం = మంచము (పరుపు) మీద పరుండుటయును, న కుర్యాత్ = చేయగూడదు, పాదప్రసారణం = పాదములనుజాచి కూర్చుండుటయును, న కుర్యాత్ = చేయకూడదు. అంగభోగాదికం = దేహమును పట్టించుకొనట, పాదముల నొత్తించుకొనుట మొదలగు కార్యములను, న కుర్యాత్ = చేయగూడదు, అపరాం అపి లీలాం = వినోదకార్యములను దేనినికూడ, న కుర్యాత్ = చేయగూడదు. సకలేన్ద్రియములను వశములో నుంచుకొని ప్రవర్తించవలయునని అర్థము.

శ్రీగురుదేవుడున్న చోట ఆనుకొని కూరుచుండుటయు, మంచముమీద పరుపుమీద పరుండటయు, కాళ్లు చాచుకొనుటయు, దేహము నొత్తించు కొనుటయు, కాళ్లను పట్టించు కొనుటయు, నికను వినోదచేష్టలును, వ్యర్థముగా నూరకే మాట్లాడుటయు మొదలగు కార్యములను జేయకూడదు. సంయమియై శ్రీగురుపరమాత్మను ధ్యానించు చుండవలయును.

**న చ వాక్పాణి చపలో న నేత్రచపలో యది । న చిత్తచపలశ్చైవ ఇతి శిష్యస్య లక్షణమ్ ॥**

వాక్చాపల్యము గలిగియుండుట, కాళ్లుచేతులను గదలించుట, ఇటునటు చూచుచుండుట, మనస్సు చలించుట- ఇవి లేక యుండుటయే శిష్యుని లక్షణము. ఇట్టి వానికే బ్రహ్మవిద్య లభించును.

అవ: శిష్యుడు శ్రీగురువిషయములో దాసబుద్ధి గల్గి ప్రవర్తించవలయునని తెలుపుచున్నారు.

**గురూణాం సదసద్వాఽపి యదుక్తం తన్న లంఘయేత్।**
**కుర్వన్నాజ్ఞాం దివారాత్రౌ దాసవన్నివసేద్గురౌ ॥ 141**

గురూణాం - సత్ - అసత్ - వా - అపి - యత్ - ఉక్తం - తత్ - న - లంఘయేత్ - కుర్వన్ - ఆజ్ఞాం - దివారాత్రౌ - దాసవత్ - నివసేత్ - గురౌ.

సత్ అసత్ వా అపి = మంచిదైనను, చెడ్డదయినను (తనమనస్సుకుమాత్రము చెడ్డదిగా తోచిన దయినను), యత్ = ఏది, ఉక్తం = చెప్పబడెనో, తత్ = దానిని, న లంఘయేత్ = తిరస్కరించగూడదు, గురూణాం = గురువులయొక్క, ఆజ్ఞాం = ఆజ్ఞను, కుర్వన్ = చేయుచున్నవాడై, దివారాత్రౌ = రాత్రింబవళ్లు, దాసవత్ = దాసునివలె, గురౌ = గురుసన్నిధానమున, నివసేత్ = కాచుకొనియుండవలయును.

దాసుడు యజమానికడ కనిపెట్టుకొని సర్వదా నిరీక్షించుచుండును. ఆప్రకారమే శ్రీగురునిదగ్గఱ శిష్యుడు రాత్రింబవళ్లు చూపుపెట్టుకొనియే యుండవలయును. శ్రీగురుదేవుని వాక్కునుండి వచ్చిన విషయమును తన యందనుగ్రహమని తలంచి మారుమాటాడక శ్రీ గురుదేవుని యాజ్ఞా ప్రకారముగ జేయవలయును. శ్రీగురుదేవుడు వచించిన దానిని విమర్శించకూడదు. అది తనయొక్కమతికి నసత్తుగా దోచవచ్చును.

శ్రీగురుదేవుని వాక్కు అమృతత్వమును పొందినది. దానిలో నసత్య ముండునా? తనయొక్క మతితో నూహించి అది మంచిది గాదని చెప్ప సాధ్యము గాదు. శిష్యుని మతి పరిచ్ఛిన్నము. శ్రీగురుదేవుని ధీశక్తి యపరిచ్ఛిన్నము. శిష్యుని కర్తవ్య మేమనగా శ్రీగురుదేవు డానతిచ్చినది చేయవలెను. మిక్కిలి భక్తి విశ్వాసము లతో నమ్రభావముతో మెలగవలయును.

ఇట్లు మహాపురుషులగు గురువుల దగ్గఱ నిరీక్షించుచుండినచో శిష్యుడు వారియొక్క దయాప్రసారముచేతనే జన్మసాగరమును తరించు జ్ఞానమును సులభముగా పొందును. నారదమహర్షి మహర్షులదగ్గఱ నుండి వారియుచ్ఛిష్టమును భక్షించి దాసునివలె నుండినందున దివ్యజ్ఞానము పొందెనని భాగవతములో గలదు. అట్లే శ్రీశంకరాచార్యుల దగ్గఱ త్రోటకాచార్యులును విజ్ఞానవంతులై తరించిరి. పరమభక్తుడు దాసునివలె నుండి శ్రీగురుదేవుని కృపకు పాత్రుడు కావలెను.

అందుచే నఖండత్వము సిద్ధించును.

అవ: శ్రీ గురుద్రవ్యవిషయమై శిష్యు డెట్లుండవలయునో తెలుపుచున్నారు.

**అదత్తం న గురోర్ద్రవ్యముపభుంజీత కర్హిచిత్ ।**
**దత్తం చ రంకవద్గ్రాహ్యం ప్రాణోఽప్యేతేన లభ్యతే ॥ 142**

అదత్తం - న - గురోః - ద్రవ్యం - ఉపభుఞ్జీత - కర్హిచిత్ - దత్తం - చ - రంకవత్ - గ్రాహ్యం - ప్రాణః - అపి - ఏతేన - లభ్యతే.

అదత్తం = ఇవ్వబడని, గురోః = గురువుయొక్క, ద్రవ్యం = ధనమును, కర్హిచిత్ = ఒకప్పుడును, న ఉపభుంజీత = అనుభవించగూడదు, కిం చ = మఱేమనగా, దత్తం = గురువుచే నీయబడిన ద్రవ్యమును, రంకవత్ = దాసునివలె (లేక స్వల్పమగు నౌషధమువలె), గ్రాహ్యం = గ్రహించవలయును. ఏతేన = ఇట్లు స్వీకరించుటచే, ప్రాణః అపి = ఆత్మరక్షణయు, లభ్యతే = పొందబడుచున్నది. (ఆత్మరక్షణము గలుగుచున్నది.)

శిష్యుడు శ్రీగురుద్రవ్యమును విషమువలె జూడవలయును, అది కేవలము దైవధనము, ధర్మద్రవ్యము కావున దానిని శిష్యుడు వాంఛించగూడదు.

**న విషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే ।**
**విషమేకాకినం హన్తి బ్రహ్మస్వం పుత్రపౌత్రకమ్ ॥**

అని శాస్త్ర మున్నది. కాబట్టి శ్రీ గురుదేవుడు ద్రవ్యము నీయకుండిన తెలియ కెప్పుడును గ్రహించరాదు. అయితే శ్రీగురుదేవుడు పరమదయతో ద్రవ్యము నిచ్చినచో దానిని దాసునివలె నిరభిమానియై గ్రహించవలయును. పరమ అనుగ్రహమని తలంచవలయును. శ్రీగురుదేవుని యాజ్ఞ పొంది తీసికొన్నందుచే నా ద్రవ్యము వీనిని రక్షించును. శ్రీగురునాజ్ఞచే నొసంగబడిన దానినిగూడ ఔషధమువలె శరీరసంరక్షణార్థము మాత్రము గ్రహించవలయును.

అవ: శిష్యుని పరమధర్మమునే వచించుచున్నారు.

**పాదుకాసనశయ్యాది గురుణా యదభీష్టితమ్ ।**
**నమస్కుర్వీత తత్సర్వం పాదాభ్యాం న స్పృశేత్క్వచిత్ ॥ 143**

పాదుకాసనశయ్యాది - గురుణా - యత్ - అభీష్టితం - నమః - కుర్వీత - తత్ - సర్వం - పాదాభ్యాం - న - స్పృశేత్ - క్వ - చిత్.

పాదుకాసనశయ్యాది - పాదుక = పావుకోళ్లు, ఆసన = దర్భాసనాదులు, శయ్యా = పడక, ఆది = మొదలుగా గలది, యత్ = ఏది, గురుణా = గురుదేవునిచేత, అభీష్టితం = ఇచ్ఛయింపబడినదో, తత్ సర్వం = దానినంతటిని, నమః కుర్వీత = నమస్కరించవలయును, క్వచిత్ = ఒకప్పుడు ప్రమాదవశముచేనైనను, పాదాభ్యాం = పాదములచేత, న స్పృశేత్ = తగలనీయగూడదు.

లోకములో నెవరు ప్రియులై యుందురో వారికి సమ్బంధించిన వస్తువులును ప్రియము లగుచున్నవి. అట్లే శ్రీ గురుదేవుని భక్తునకు శ్రీగురువునకు సమ్బంధించిన వన్నియు ప్రియము లగుచున్నవి. ఆ విషయము ననుసరించి యిట్లు చెప్పుచున్నారు. శ్రీగురుదేవుని కిష్టములగు పాదుకలు, యోగదండము, కమండలము, దర్భాసన కృష్ణాజినాసనాదులు, పడక, విభూతి మొదలయిన వేవేవి గలవో వాని కన్నిటికిని భక్తితో నమస్కరించవలయును. ప్రమాదవశమునగాని వానికి కాలు తగులకుండునట్లు ప్రవర్తించవలయును. పాదుకాదులను పరమ పవిత్రములుగ దలంచవలయును. శ్రీగురుదేవునిచే సేవింపబడిన వన్నియు మహత్తు గలిగియుండును. అందుచేతనే శ్రీగురుదేవుని పాదుకలు మొదలయిన వానిని పూజించుచుందురు.

అవ: శ్రీగురుదేవుని విషయమై శిష్యుడు ప్రవర్తించవలసిన విషయములనే మఱియు దెలుపుచున్నారు.

**గచ్ఛతః పృష్ఠతో గచ్ఛేత్ గురుచ్ఛాయాం న లంఘయేత్ ।**
**నోల్బణం ధారయేద్వేషం నాలంకారాం స్తతోల్బణాన్ ॥ 144**

గచ్ఛతః - పృష్ఠతః - గచ్ఛేత్ - గురుచ్ఛాయాం - న - లంఘయేత్ - న - ఉల్బణం - ధారయేత్ - వేషం - న - అలంకారాన్ - తతః - ఉల్బణాన్.

గచ్ఛతః = పోవుచున్న శ్రీగురువరునియొక్క, పృష్ఠతః = వెనుక, గచ్ఛేత్ = పోవలయును. గురుచ్ఛాయాం = గురువుయొక్క నీడను, న లంఘయేత్ = దాటుకొని పోకూడదు, ఉల్బణం = అధికమైన, వేషం = బాహ్యవేషమును, న ధారయేత్ = ధరించగూడదు, తతః =

దానికన్నను, ఉల్బణాన్ = అధికములగు, అలంకారాన్ = అలంకారములను, న ధారయేత్ = వేసికొనకూడదు.

శ్రీగురుదేవుడు ముందు పోవుచుండగా తాను వెనుకనే ప్రక్కగనే అనుసరించి పోవుచుండవలయును. వారి నీడను త్రొక్కి నడవకూడదు. అంత మాత్రమే గాదు, శ్రీగురుదేవుని నీడను దాటుకొని ముందుకు జనకూడదు. అట్లే తాను పరమభక్తుడని జనులు తలంచుకొనునట్లు శరీరమంతటను బాహ్య వేషములగు విభూతిధారణలను, నామధారణలను నధికముగా వేసికొనగూడదు. అట్లే అంతకన్న నెక్కువగా తులసీరుద్రాక్షాదులను చేతినిండ, మెడనిండ వేసికొని చూచువారికి భ్రమ గలిగించగూడదు. అనగా సాధుపురుషుడు పరమభక్తుడు అనుకొనునట్లు బాహ్యవేషములచే నటించ గూడదు. శ్రీ గురుదేవుని యందు నిజమగు భక్తితో నుండవలయునని తాత్పర్యము.

అవ: గురునిందాకరుని విషయమై గురుభక్తుడు ప్రవర్తించ వలసిన విధానమును వివరించుచున్నారు.

**గురునిందాకరం దృష్ట్వా ధావయేదథ వాసయేత్ ।**
**స్థానం వా తత్పరిత్యాజ్యం జిహ్వాచ్ఛేదాక్షమో యది ॥ 145**

గురునిందాకరం - దృష్ట్వా - ధావయేత్ - అథ - వాసయేత్ - స్థానం - వా - తత్ - పరిత్యాజ్యం - జిహ్వాచ్ఛేదాక్షమః - యది.

గురునిందాకరం = గురునిందచేయుచున్న దుర్మార్గుని, దృష్ట్వా = చూచి, జిహ్వాచ్ఛేదాక్షమః యది - జిహ్వాచ్ఛేద = నాలుకయొక్క ఖండనమందు, అక్షమః యది = అసమర్థు డాయెనేని, ధావయేత్ = తరిమివేయవలెను. అథవా = అట్లుగానిచో, వాసయేత్ = మఱియొకచోట నుండనట్లు చేయవలెను (గ్రామాన్తరమునకు వెళ్లగొట్టవలయును), అథవా = అట్లును గాకపోయినచో, తత్ స్థానం = ఆ ప్రదేశమును, పరిత్యాజ్యం = (తాను) వదలిపెట్టవలయును.

ఎవడైనను నాస్తికు డసూయాపరుడు, రాగద్వేషాదులతో గూడిన పరమదుర్మార్గుడు గురునింద చేయుచుండినచో, గురుభక్తుడు వెంటనే వానియొక్క నాలుకను ఛేదించవలయును. గురునిందాకరు డెట్టివాడన కొంతకాలము శ్రీగురువు

దగ్గఱనే యుండి వారి యన్నమును తిని జీవించిన వాడు భక్తి తగ్గియో ఏదో కారణముచేత గురువును విడచినవాడు.వాడంతమాత్రమే యుండక తిరుగా గురునిందను విశేషముగా చేయువాడు. అట్టివాని నాలుకను శతధా చేయవలెను. ఇది ఉత్తమపక్షము.

అట్లు చేయుటకు సామర్థ్యము లేని శిష్యుడు వానిని వెంటనే తరిమి వేయవలెను. ఇది మధ్యమపక్షము. ఆ ప్రకారము తరిమివేయుటకు సాధ్యము గాకపోయిన గ్రామాన్తరమునకు వెళ్లగొట్టించవలయును. ఇది కనిష్ఠపక్షము. అదియు సాధ్యము గాకుండిన తానే అ చోటును వదలి దూరముగా పోవలయును. ఇది అధమపక్షము.

కేవల మసూయాగ్రస్తుడై యిదివరకు నాశ్రమములో నుండి చాలవరకు నుపకారము పొందినవాడు గురువును నిందించుచుండగా తానున్ను ప్రత్యక్షముగా వినుచుండు శిష్యుడు నిందించువాని జిహ్వాచ్ఛేదనము చేయవలయును. ఇది ఉత్తమపక్షమని తెలియవలెను. అటుగాక వీడు గురునిందాకరుడని తెలిసి గురునిందను వినకనే గురుభక్తుడు భయపడి పరువులెత్తరాదు. మరేమన నిందకుని తరిమివేయవలెను. ఇది మధ్యమపక్షము. తదితరములగు రెండును గురునిందా శ్రవణముతో గూడుకొన్నందుచే కనిష్ఠాధమములై యున్నవి. యథార్థము తెలియక గురునిందను జేయువారును గలరు. అట్టివారిని శక్తుడైనచో బోధించి సన్మార్గము లోనికి త్రిప్పవలయును. లేనిచో తానే దూరముగ బోవలయును.

అవ: ఇకను శిష్యుని ధర్మములనే చెప్పుచున్నారు.

**నోచ్ఛిష్టం కస్య చిద్దేయం గురోరాజ్ఞాం న చ త్యజేత్।**
**కృత్స్నముచ్ఛిష్టమాదాయ హవిరివ భక్షయేత్స్వయమ్॥ 146**

న - ఉచ్ఛిష్టం - కస్య - చిత్ - దేయం - గురోః - ఆజ్ఞాం - న - చ - త్యజేత్ - కృత్స్నం - ఉచ్ఛిష్టం - ఆదాయ - హవిః ఇవ - భక్షయేత్ - స్వయం.

గురోః = గురుదేవునియొక్క, ఉచ్ఛిష్టం = భుక్తశేషమును, కస్యచిత్ = ఇతరుల కెవరికిని, న దేయం = ఒసగకూడదు, ఆజ్ఞాం = శ్రీగురువుయొక్క ఆజ్ఞను, చ = కూడను, న

త్యజేత్ = వదలకూడదు, కృత్స్నం = సమస్తమయిన, ఉచ్ఛిష్టం = అవశిష్టాన్నమును (మిగిలిన దంతయును), ఆదాయ = గ్రహించి, హవిఃఇవ = హవిస్సునువలె, స్వయం = తానే, భక్షయేత్= భుజింపవలయును.

గురుభక్తి లేని వారెవరికిని శ్రీ గురూచ్ఛిష్టము నొసంగరాదు. అదిచాల పవిత్ర మయినది. శ్రీగురుదేవుడు చాల పవిత్రభావముతో చరాచరము తానై భుజించుచున్నాడు. శ్రీగురుదేవుడే తృప్తిపడినచో సమస్తభూతములును శాంతి పడుచున్నవి. శ్రీగురుదేవు డనగా సాక్షాన్నారాయణ మూర్తియే. అట్టి మహానుభావుని భుక్తాన్నశేషము నందఱి కివ్వరాదు. వారును వేఱుగా తలంచవచ్చును. ఇకేమి చేయవలయు ననగా యజ్ఞములో పక్వమైనది హవిస్సని తెలియవలెను. యాజకులు దానిని పరమపవిత్రభావముతో భుజించునట్లు శ్రీగురుభక్తుడును పరమపవిత్ర భావముతో నుచ్ఛిష్టమును గైకొని హవిస్సు నెవరి కివ్వని ప్రకారము మఱియొకరికి నివ్వక తానే భుజించవలయును. అట్టి భుక్తాన్నశేష భక్షణముచే తనయొక్క మానసిక తత్త్వముగూడ పరిణమించి జ్ఞాన వైరాగ్యాదులతో గూడిన దగుచున్నది. శ్రీగురూచ్ఛిష్టము మహాపవిత్రము, క్రమశః జ్ఞానజనకమని భావము.

అవ: శిష్యుని వాగ్రూప ప్రవర్తనావళి:

**నానృతం నాప్రియం చైవ న గర్వం నాపి వా బహు ।**
**న నియోగపరం బ్రూయాద్గురోరాజ్ఞాం విభావయేత్ ॥ 147**

న - అనృతం - న - అప్రియం - చ - ఏవ - న - గర్వం - న - అపి - వా - బహు- న - నియోగపరం - బ్రూయాత్ - గురోః - ఆజ్ఞాం - విభావయేత్.

అనృతం = అసత్యమును, న బ్రూయాత్ = చెప్పకూడదు, అప్రియం చ ఏవ = ప్రీతికరముగాని వాక్యమునేగాని, నబ్రూయాత్ = వచింపరాదు, గర్వం = అహంకారముతో గూడిన మాటను, న బ్రూయాత్ = పలుక కూడదు, బహు అపి వా = అధికముగాను, న బ్రూయాత్ = సంభాషించ తగదు, నియోగపరం = విధిరూపమయిన వచనమును, న బ్రూయాత్ = మాట్లాడగూడదు, గురో : = శ్రీగురుదేవునియొక్క, ఆజ్ఞా ఏవ = ఆజ్ఞనే, విభావయేత్ = విశేషముగ భావించవలయును. ఆజ్ఞకై చూపెట్టుకొని యుండవలయును. స్వతన్త్రించి ఏమియు చేయరాదు.

శ్రీ సద్గురుదేవునియందు గురుభక్తుడు ప్రవర్తించవలసిన విషయములో మహోపదేశము నీశ్వరుడే పార్వతీదేవికి నుడువుచున్నాడు.

**సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్సత్యమప్రియమ్ ।**
**ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః ॥**

అను శాస్త్రరీతిగా శ్రీ సద్గురువు దగ్గఱ అసత్యము చెప్పగూడదు. సత్యమునే వచింపవలయును. తథ్య మయినను నప్రియమును పలుకూడదు. ప్రియముగనే హితకరముగనే యుండవలయును. మఱియు నహంకారవాక్యములను పలుకరాదు. శ్రీగురుదేవుని దగ్గఱ నెక్కువగ సంభాషించ రాదు. శ్రీగురుదేవులు సంయమనశీలురు. వృథాగా కాలమును బోగొట్టువారు గారు. బ్రహ్మమయులై యుందురు. చీటికిమాటికి, లేనిపోనివి కల్పించుకొని, యేవి యేవియో మాట్లాడిన విశ్వసించెదరని తలంచి శిష్యుడు స్వతన్త్రించి బహుభాషి కాకూడదు. ఇకను శ్రీగురుదేవుని యాశయమును గనుగొనక, నవకాశ మందిచ్చినారని యెంచి యిట్లు చేసిన బాగుండునని విధిపూర్వకముగ దేనినిగూడ శిష్యు డెన్నటికిని వచింపరాదు. శ్రీగురుదేవుడు మహాత్ముడు గనుక యేవిషయములోను శిష్యుడు స్వతన్త్రించరాదు. శ్రీగురుదేవునియొక్క యాజ్ఞనే విశేషముగ భావించుచు, దానినెట్లు గురువర్యుని ప్రీతికరముగ పరిశుద్ధముగ జేయుదునా యని నిరీక్షించుచుండవలయును. శిష్యున కట్లుండడమే స్వాతన్త్ర్యము, నిత్యజీవన మానందకరము. వానిజన్మము ధన్యము. ఈశ్వరుని దగ్గఱ నందికేశ్వరుని మాడ్కియని తెలియవలెను.

అవ: శ్రీగురుదేవుని శిష్యు డెటుల సంబోధించవలయునో దానిని తెలుపుచు తనయొక్క ప్రవర్తనను చూపుచున్నారు.

**ప్రభో! దేవకులేశానాం స్వామిన్రాజన్! కులేశ్వర! ।**
**ఇతి సంబోధనైర్భీతో గురుభావేన సర్వదా ॥ 148**

ప్రభో - దేవకులేశానాం - స్వామిన్ - రాజన్ - కులేశ్వర - ఇతి - సంబోధనైః - భీతః - గురుభావేన - సర్వదా.

దేవకులేశానాం = దేవసమూహములకు ప్రభువులగు వారికి, ప్రభో = రాజాధిరాజయిన

మహాప్రభో !, స్వామిన్ = స్వామి!, రాజ = సర్వాహ్లాదకరా ! ప్రకాశమానస్వరూపా!, కులేశ్వర = కులపతీ!, ఇతి = అని, సంబోధనైః = సంబుద్ధివచనములచేతను, గురుభావేన = గురువను భావముచేతను గూడినవాడై, సర్వదా = ఎల్లప్పుడును, భీతః = ఇన్ద్రియములను తనయొక్క స్వాధీనము లోనుంచుకొని యేమి యపచారము గలుగునో యని భీతిల్లినవాడై యుండ వలయును.

శ్రీ గురుదేవుని దగ్గర శిష్యుడు సర్వదా నమ్రుడు కావలయును. తనవలన నెట్టి యపచారము గలుగునో యని భీతిల్లినవాడై జాగ్రత్త గలవాడై శ్రీ గురువునందు సర్వేశ్వరభావముతో నుండుచు, ఓ దేవాధిదేవా! సర్వరక్షకుడవగు నో స్వామీ ! అందఱిని సంతోషపెట్టు వాడగుటచే సర్వాహ్లాదకరా! స్వయం ప్రకాశస్వరూప ! కులపతే! జగద్గురో! శరణాగతత్రాణపరాయణా! దయానిధే! ఇట్లు శ్రీగురుదేవుని సంబోధించుచు, స్తుతించుచు, నమస్కరించుచు, ధ్యానించుచు సర్వము శ్రీగురు దేవమయముగ తనజీవితమును గావించుచు, తదేకనిరతుడై మహాపవిత్రుడై అనన్యశరణ్యుడై యుండవలయును.

అవ: శ్రీగురుదేవునియొక్క రక్షణాప్రకార మనితరసాధ్య మనుపమ మని నుడువుచున్నారు.

**మునిభిః పన్నగై ర్వాఽపి సురైర్వా శాపితో యది ।**
**కాలమృత్యుభయాద్వాఽపిగురుస్సంత్రాతి పార్వతి! ॥ 149**

మునిభిః - పన్నగైః - వా - అపి - సురైః - వా - శాపితః - యది - కాలమృత్యుభయాత్- వా -అపి - గురుః - సంత్రాతి - పార్వతి.

హే పార్వతి = ఓ దేవీ, మునిభిః = మహర్షులచేతను, పన్నగైః వా అపి = సర్పములచేత నైనను, సురైః వా = దేవతలచేత నైనను, శాపితః యది = శపింపబడినను, కాలమృత్యుభయాత్ వా = భయంకర మృత్యుభయము నుండిగాని, గురుః = గురుదేవుడు, సంత్రాతి = శిష్యుని రక్షించుచున్నాడు.

మహర్షులచేతను, సర్పములచేతను, దేవతలచేతను నిక నెవరిచేతను శాపమొందిన వాడైనను శిష్యుని, శరణు పొందిన వానిని శ్రీగురుదేవుడు శాపవిమోచనము గావించి రక్షించుచున్నాడు. శాస్త్రములలో మహర్షులు తమ

శిష్యులను శాపవిముక్తులనుగా జేసిన కథలను వినుచున్నారము. త్రిశంకు డనువాడు మునిచే శప్తుడాయెను. దేవతలచే స్వర్గమునుండి త్రోయబడెను. అట్టి వానిని విశ్వామిత్రమహాముని రక్షించెను. అందుచేతనే అంబరీషునికి కోపము వచ్చినప్పుడు దుర్వాసమహామునిని మహావిష్ణువు, తనను శరణుజొచ్చినను పరమభక్తుడగు నంబరీషునే శరణు పొందుమని చెప్పెను. ఈలాంటి విషయములను తెలిసి కొనవలయును. ఇకను శ్రీగురుదేవుడు కాలమృత్యుభయమునుండి (మరణ భయమునుండి) శిష్యుని రక్షించుచున్నాడు.

"స్వరసవాహీ విదుషోఽపి తథాఽఽరూఢోఽభినివేశః" అను పతంజలి మహర్షి సూత్రానుసారముగా పండితులకును మరణభయము మిక్కిలి ఆరూఢమై సహజముగ నున్నది. ఇట్టి మహాభయంకర మరణభయమునుండి 'నీవు శాశ్వతాత్మ స్వరూపుడవు, మరణించువాడవు కావు, త్రికాలములందు నున్నవాడవు' అని బోధించి జ్ఞానస్వరూపునిగా శిష్యుని జేసి గురువరుడు రక్షించుచున్నాడు. అనగా శ్రీగురుమన్త్రోపాసకుడు సర్వశాపములనుండి, మరణభయము నుండియు విముక్తు డగుచున్నాడని ఎఱుంగుడు. ఈప్రకారము శ్రీగురుపరమాత్మ రక్షణమహిమను ఓ పార్వతీ తెలియుమా !

అవ: శ్రీగురుదేవుని రక్షణవలె శాపముగూడ అమోఘమని తెలుపుచున్నారు.

**అశక్తా హి సురాద్యాశ్చ హ్యశక్తా మునయస్తథా ।**
**గురుశాపోపపన్నస్య రక్షణాయ చ కుత్రచిత్ ॥ 150**

అశక్తాః - హి - సురాద్యాః - చ - హి - అశక్తాః - మునయః - తథా - గురుశాపోపపన్నస్య- రక్షణాయ - చ - కుత్ర - చిత్.

గురుశాపోపపన్నస్య = గురుదేవుని శాపమును పొందినవానియొక్క, రక్షణాయ = రక్షణకొఱకు, కుత్రచిత్ = ఎక్కడను, సురాద్యాఃచ = దేవతలు మొదలయిన వారును, అశక్తాః = అసమర్థులు, హి = నిశ్చయము, తథా = అట్లే, మునయః = మునులు, అశక్తాః = అశక్తు లగుచున్నారు, హి = సందేహము లేదు.

**వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి ।**
**లోకోత్తరాణాం చేతాంసి కో ను విజ్ఞాతుమర్హతి ॥**

అన్నట్లు శిష్యుడు తప్పు చేసినప్పుడు హృదయము వజ్ర మగుటచే శ్రీగురుదేవుని శాపము తిరుగా ఒరులచే త్రిప్ప సాధ్యము గాదని తెలియవలెను. గురుశాప హతుడగు శిష్యుని దేవతలు మునులు మొదలయిన వారెవరును రక్షింప సమర్థులు గారు. క్షత్రియులకు మహర్షులు గురువులై యుంటున్నారు. కాన శమీకమహాముని కుమారుడగు శృంగిమహామునియొక్క శాపమును పరీక్షిన్మహారాజు పొందిన వాడాయెను. ఆయన శాపమును త్రిప్ప నెవరికిని సాధ్యము గాకపోయెను. తుదకు శుకమహర్షి వచ్చి పరీక్షితునకు జ్ఞానబోధ కావించెను. శ్రీ జనకచక్రవర్తియొక్క సభలో యాజ్ఞవల్క్యమహామునిచే శాకల్యుడు శప్తుడాయెను. ఆసభలో ననేకమహర్షి పుంగవు లున్నను, నా మహర్షి శిష్యు లున్నను శాపమును త్రిప్పలేకపోయిరి. అయితే యాజ్ఞవల్క్యమహామునియు గురువగు వైశంపాయనుని శాపమొంది సమస్త వేదములను గ్రక్కిన వాడాయెను. జ్ఞానశూన్యు డాయెను. తరువాత సూర్యభగవాను నుపాసించి మహావిజ్ఞాన సమ్పన్ను డాయెను. కర్ణుడును గురువగు పరశురాముని శాపముచే మహాసంగ్రామములో బాణప్రయోగమును మరచెను. ఇట్టి కథలు పురాణములలో నుపనిషత్తులలోను గనందగును.

సారమేమనగా అందఱికిని శ్రీగురుదేవుని కృప ప్రధానము. మోక్ష మార్గమునకు ప్రయత్నించినది మొదలుకొని జ్ఞానము సిద్ధించిన పిదపను శ్రీగురుదేవుని యనుగ్రహ మపేక్షితముగా నున్నది. ఈ విషయము లన్నియు సవిస్తరముగా నీ గ్రంథములోనే తెలిపిరి. మొదటనే శ్రీగురుదేవుని దయ తప్పినచో నంతయు తప్పినట్లే. వా డేలోకములోను బహిష్కృతుడే. లోకములో మాతృద్రోహిని నెవ్వరైనను జేరదీయుదురా! అట్లే శ్రీగురుదేవునకు దూరు డయినవాడు మహాపాపి యని తెలియవలెను. శ్రీగురుదర్శనము కానిదే, దైవసందర్శనముగాని ఆత్మ సాక్షాత్కారము గాని పొందజాలడు. ఇట్లు గురుమహిమను తెలియవలెను. శ్రీగురుదేవుని శాపము శ్రీగురుదేవుని యనుగ్రహమువల్లనే పోవలయునని ముఖ్యతాత్పర్యము.

అవ: గురుప్రభావముచెప్పి తద్వాచకమగు మన్త్రమును తెలుపుచున్నారు.

**మన్త్రరాజమిదం దేవి! గురురిత్యక్షరద్వయమ్ ।**
**స్మృతివేదపురాణానాం సారమేవ న సంశయః ॥ 151**

మన్త్రరాజం - ఇదం - దేవి - గురుః - ఇతి - అక్షరద్వయం - స్మృతివేదపురాణానాం- సారం - ఏవ - న - సంశయః.

హే దేవి = ఓ పార్వతీ, గురుః ఇతి = 'గురు' అను, అక్షరద్వయం = రెండక్షరములు గల, ఇదం = ఈ, మన్త్రరాజం = శ్రేష్ఠమగు మన్త్రము, స్మృతి వేద పురాణానాం = స్మృతి వేద పురాణములకు, సారం = శ్రేష్ఠమయినది, న సంశయః = సందేహము లేదు.

వేదములకును, మన్త్రములకును ప్రణవ మెట్లు ప్రధానమో, అట్లే 'గురు' అను రెండక్షరములు గల మన్త్రము సకల మన్త్రములలో శ్రేష్ఠమై యున్నది. 'గు' అనగా అన్ధకారము. 'రు' అనగా తన్నాశకము. అజ్ఞానాన్ధకారమును పోనడంచి జ్ఞాన మొసగునది గురుమన్త్రము. ఇంతకన్న శ్రేష్ఠము మఱియొకటి యేమి యున్నది?

గురువన బ్రహ్మమని యర్థమాయెను. ఇట్టి గురుబ్రహ్మముకన్న శ్రేష్ఠమగు మన్త్రార్థముగాని, అట్లే గురు అను మన్త్రముకన్న గరిష్ఠమయిన మన్త్రముగాని లేదు. ఈ గురుమన్త్రమే స్మృతివేద పురాణముల సారము. సకల శాస్త్రములు నజ్ఞాన ధ్వంస మొనరించుకొని జ్ఞానవంతుడు కావలయునని చెప్పుచున్నవి, అట్టి ప్రయోజనము శ్రీగురురాజమన్త్రము వలననే సిద్ధించుచున్నది. శ్రీగురుదేవుడే ప్రత్యక్షదైవము. గురుమన్త్రమే సులభమగు మన్త్రము. ఇంతకన్నను వేరు భాగ్యము గలదా, తరణోపాయము గలదా?

పాఠాన్తరము: స్మృతివేదార్థవాక్యానాం గురుస్సాక్షాత్పరం పదం = స్మృతులకు వేదార్థవాక్యములకు గురుదేవుడే లక్ష్యార్థమగు పరబ్రహ్మము, గమ్యస్థానము. వానిని బోధించు గురువే ప్రత్యక్షకైవల్యము.

అవ: సన్న్యసించిన వారియొక్క విషయమును చెప్పుచున్నారు.

**సత్కారమానపూజార్థం దణ్డకాషాయధారణః ।**
**స సన్న్యాసీ న వక్తవ్యస్సన్న్యాసీ జ్ఞానతత్పరః ॥ 152**

సత్కారమానపూజార్థం - దణ్డకాషాయధారణః - సః - సన్న్యాసీ - న - వక్తవ్యః - సన్న్యాసీ - జ్ఞానతత్పరః.

జ్ఞానతత్పరః = బ్రహ్మజ్ఞానమునం దాసక్తి గలవాడు, సన్న్యాసీ = సన్న్యాసి యగుచున్నాడు కావున, సత్కారమానపూజార్థం - సత్కార = తనను సత్కరించుకొఱకును, మాన = గౌరవించుటకొఱకును, పూజార్థం = పూజించుటకొఱకును, యః = ఎవడు, దండకాషాయ ధారణః = దండకాషాయములను ధరించువాడో, సః = అతడు (బాహ్యవేషధారి), సన్న్యాసీ = సన్న్యాసిగ, న వక్తవ్యః = చెప్పదగినవాడు గాడు.

**ద్రవ్యార్థమన్నవస్త్రార్థం యః ప్రతిష్ఠార్థమేవ వా।**
**సన్న్యసేదుభయభ్రష్టో స ముక్తిం నాప్తుమర్హతి**

అను మైత్రేయ్యుపనిషదర్థమునే యీ శ్లోకమున తెలుపుచున్నారు. సన్న్యాసః = సకలవృత్తులను నిశ్శేషముగా వదలుట సన్న్యాస మగును. అట్టి సన్న్యాసము గల్గి నిరంతరము నాత్మజ్ఞానము సంపాదించువాడే సన్న్యాసి యగుచున్నాడు. ఇత డేయాశ్రమములో నున్నవాడైనను, యథార్థముగ సన్న్యాసి శబ్దవాచ్యు డగుచున్నాడు. లేక కొన్ని ప్రతిబంధము లున్నందుచే నాత్మజ్ఞానము కొఱకుమాత్రము సన్న్యాసాశ్రమ స్వీకారమును చేసికొనిన వాడును సన్న్యాసియే. ఆతడెప్పుడును శ్రీగురూపదేశము రీతిగా సకలవృత్తులను నశింపజేయుచు అనాత్మభావనలను దూరీకరించుచు బ్రహ్మజ్ఞానమును నిరంతరము సంపాదించుచుండును.

అటుగాక, "కాషాయదండమాత్రేణ యతిః పూజ్యో న సంశయః" అను శాస్త్రము ననుసరించి తనను పూజింతురనిగాని, సత్కరించెద రనిగాని, సభలోను నెచ్చోటను తనకు గౌరవము ముందుగా లభించుననిగాని తలంచి కేవలము జీవనార్థమై సన్న్యసించువాడు సన్న్యాసి గానేరడు. ఇతరులను పోషింపలేక, తన కుక్షిని నింపుకొనలేక తిరుగు కుక్షింభరుడని తెలియవలెను. లోకములో సన్న్యాసులు సాధువేషమును ధరించినవారు మొదలయిన వారెంతగ నాచరణదూరు లైనను, కుమార్గములో ప్రవర్తించిన వారైనను వారిని కొంతమంది భక్తులు బాహ్యవేషము జూచి పూజించుచున్నారు. ఇకను పూర్వకాల వాసన పోకున్నది. కారణ మేమనగా

పూర్వకాల మహర్షులు సన్న్యాసులు మహాజ్ఞాన సమ్పన్నులై మహాపవిత్రతను సంపాదించిరి. ఆ పరమ్పర ననుసరించి వారి గౌరవాదులు నిలిచి యున్నవి. దానిని రక్షించుకొనుడు.

పాఠాన్తరము:

**సత్కారమానపూజార్థం గురుశబ్దధరో నరః ।**
**స యాతి నరకాన్ దేవి! నాస్తి సన్దేహమణ్వపి ॥**

కేవల జ్ఞానశూన్యుడై గౌరవాదుల నపేక్షించి మఠాధిపతు లగుటయు, గురువులై తిరుగుటయు మహాపాపకార్యము. అట్టివాడు ఓ దేవీ ! ఘోరనరకములను పొందుచున్నాడు. సంశయ మీ విషయములో నొకించుకయు లేదు; నమ్ముము.

అవ: సన్న్యాసి లక్షణమును జెప్పుచున్నారు.

**విజానన్తి మహావాక్యం గురోశ్చరణసేవయా ।**
**తే వై సన్న్యాసినః ప్రోక్తా ఇతరే వేషధారిణః ॥ 153**

విజానన్తి - మహావాక్యం - గురోః - చరణసేవయా - తే - వై - సన్న్యాసినః - ప్రోక్తాః - ఇతరే - వేషధారిణః.

యే = ఎవరు, గురోః = గురువుయొక్క, చరణసేవయు = పాదసేవచేత, మహావాక్యం = తత్త్వమసి మహావాక్యముయొక్క యర్థమును, విజానంతి = సందేహములేక తెలిసికొనుచున్నారో (బ్రహ్మమే నేనను నపరోక్షజ్ఞానము గలిగి యున్నారో), తే వై = వారలే, సన్న్యాసినః = పరమహంసలుగా, ప్రోక్తాః = చెప్పబడుచున్నారు, ఇతరే = ఇతరులు, వేషధారిణః = వేషమును మాత్రము ధరించిన వారలే.

సన్న్యాసులను పరమహంస లందురు. పరమగు పరబ్రహ్మమందు తామరపుష్పమందు హంసవలె విహరించు వారలు పరమహంసలు. ఎవరు చాలకాలమువరకు శ్రీగురుదేవుని సేవించి వారియొక్క అనుగ్రహమునకు పాత్రులై, 'తత్త్వమసి' యను మహావాక్యార్థోపదేశమును బడసి "అహం బ్రహ్మాస్మి" అను నఖండజ్ఞానము గలిగియున్నారో అనగా, నాత్మతత్త్వ జ్ఞానము గలిగినవారే సన్న్యాసులని తెలియవలయును. అట్లు జ్ఞానము లేక, బాహ్యములగు కాషాయ,

దండ, కమండలాదులను ధరించినవారు వేషధారు లగుదురు. అట్టివారు భుక్తికిని ముక్తికిని దూరులై భ్రష్టు లగుచున్నారు. ఈ జ్ఞానోపాయమును "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అను భగవద్గీతా వాక్యము తెలుపుచున్నది.

అవ: శ్రీ గురుదేవు డొనర్పవలసిన విషయమును తెలుపుచున్నారు.

**నిత్యం బ్రహ్మ నిరాకారం నిర్గుణం బోధయేత్పరమ్ ।**
**భాసయన్బ్రహ్మభావం చ దీపో దీపాంతరం యథా ॥ 154**

నిత్యం - బ్రహ్మం - నిరాకారం - నిర్గుణం - బోధయేత్ - పరమ్ - భాసయన్ - బ్రహ్మభావం - చ - దీపః - దీపాంతరం - యథా.

బ్రహ్మభావం = బ్రహ్మస్వరూపమును, భాసయన్ = ప్రకాశింపజేయుచున్నవాడై, దీపః = దీపము, దీపాన్తరం = మఱియొక దీపమును, యథా = ఎట్లు ప్రకాశించుచు ప్రకాశింప జేయుచున్నదో, తథా = అట్లే, నిత్యం = శాశ్వతమైన, నిరాకారం = ఆకారములేని, నిర్గుణం = గుణత్రయాతీతమైన, పరంబ్రహ్మ = పరబ్రహ్మమును, బోధయేత్ చ = బోధించుటనుగూడ చేయవలయును.

లోకములో తానుమాత్రము తృప్తు డగుట స్వార్థపరత్వమని చెప్పుచున్నారు. తాను భుజించినమాత్రము, తాను ధనికు డైనమాత్రము, విద్యావంతు డైనమాత్రము చాలదు. తా నెట్టిసుఖమును బొందుచున్నాడో అట్టి సుఖము నొరులకుగూడ కలిగింపవలెను. ఇదియే విశాలభావము. ఆ భావము ననుసరించి ఇచ్చోట తత్త్వమును దెలుపుచున్నారు. తాను మొదట సుఖవంతు డైనచో నితరులను సుఖపెట్టవచ్చును. తాను దరిద్రుడైన మరియొకరిని ధనవంతునిగ నెట్లు చేయగలడు? ఆ ప్రకార మితరులను తరింపజేయ నిచ్ఛయించువాడు తాను మొదట సకలానాత్మ బంధములనుండి తరించు రీతిగను, మఱియొకరిని బంధముక్తిని చేయదలంచినవాడు తనకున్న బంధములను ముందుగ త్రెంపుకొను రీతిగ విడివడి బ్రహ్మజ్ఞాన సంపన్నుడు కావలయును.

దీపము స్వయముగా ప్రకాశించుచు నన్యపదార్థములను గూడ ప్రకాశింప జేయుచున్నది. ఆ విధముగానే తాను ముందు బ్రహ్మత్వము నొంది స్వయం ప్రకాశమానుడు కావలయును. అప్పుడు తాను మాత్రము నిరతిశయ సుఖమును

జెందుచున్నాడు. అంతటితో తృప్తినొందుట విశాలభావము గాదు. కనుక సంసారములో నవివేకముచే బద్ధులై దుఃఖించు జనులను నాదరించి వివేకఖడ్గముచే వారిబంధములనుగూడ త్రెంపవలయును. భక్తులకు, శరణుబొందిన వారికి నిత్యమైన, నిరాకారమైన, గుణాతీతమైన పరబ్రహ్మతత్త్వమును గూడ బోధించు చుండవలయును. మహాత్ము లీతత్త్వమును గైకొనియే లోకహితమును జేయు చుందురు. దీపమునకు స్వయముగా ప్రకాశించుట ప్రకాశింపజేయుట యను రెండును స్వభావము లైనట్లు తాము తరించుటయు తరింపజేయుటయు; బోధరూపు లగుటయు, బోధించుటయు నీ రెండును పరమదయాశీలురగు శ్రీ గురుదేవులయొక్క సహజధర్మములై యున్నవి. వారిస్వభావమును వివేకచూడామణి యందు గాంచుడు:-

**"శాన్తా మహాన్తో నివసన్తి సన్తో వసన్తవల్లోకహితం చరంతః ।**
**తీర్ణాస్స్వయం భీమభవార్ణవం జనా న హేతునాఽన్యానపి తారయన్తః ॥"**

పాఠాన్తర శ్లోకము:

**నిత్యం బ్రహ్మ నిరాకారం నిర్గుణం సత్యచిద్ఘనమ్ ।**
**యస్సాక్షాత్కురుతే లోకే గురుత్వం తస్య శోభతే ॥**

పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించిన వారికే గురుత్వము శోభించును. తదితర మఠాధిపతులు మఠములోని దేవునే చూడనివారు.

అవ: శ్రీగురుదేవుని అనుగ్రహమువలన క్రమముగా సమత్వాదులు గలుగు చున్నవని తెలుపుచున్నారు.

**గురుప్రసాదతః స్వాత్మన్యాత్మారామనిరీక్షణాత్ ।**
**సమతా ముక్తిమార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే ॥** **155**

గురుప్రసాదతః - స్వాత్మని - అత్మారామ నిరీక్షణాత్ - సమతా - ముక్తిమార్గేణ - స్వాత్మజ్ఞానం - ప్రవర్తతే.

గురుప్రసాదతః = శ్రీగురుదేవుని అనుగ్రహమువలన, స్వాత్మని = తనయందు, ఆత్మారామ నిరీక్షణాత్ - ఆత్మారామ = ఆత్మారాముడగు పరమాత్మయొక్క, నిరీక్షణాత్ =

సందర్శించుటవలన, సమతా = సర్వభూతముల యందు సమభావము, ముక్తిమార్గేణ = ముక్తిమార్గమగు వేదాన్తవిచారణచేత, స్వాత్మజ్ఞానం = బ్రహ్మజ్ఞానము, ప్రవర్తతే = కలుగుచున్నది

శ్రీగురుదేవునియొక్క సేవాదులచేత శ్రీ గురుదేవుని పరిపూర్ణానుగ్రహము సిద్ధించుచున్నది. శ్రీగురుడుపదేశించిన రీతిగ ధ్యానాద్య నుష్ఠానాదుల బలిమిచే తనయం దాత్మారాముని సందర్శించుచున్నాడు. అప్పుడు సకల భూతములందును సమమగు బ్రహ్మమును గాంచినందున సర్వాత్మకుడై సమభావముతో నుంటు న్నాడు. నిర్వికల్ప సమాధియు నిదియే. శ్రీగురువు దగ్గర జీవబ్రహ్మైక్యరూప వేదాన్తముయొక్క శ్రవణముచేత మనన నిదిధ్యాసనముల నొనరించి యఖండ బ్రహ్మజ్ఞానమును పొందుచున్నాడు. శాశ్వతానంద స్వరూపు డగుచున్నాడు. ఈ విషయమునే

**యోఽన్తః సుఖోఽన్తరారామస్తథాన్తర్జ్యోతిరేవ యః ।**
**స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతో ఽధిగచ్ఛతి ॥**

అని శ్రీభగవద్గీత తెలుపుచున్నది.

అవ: శ్రీగురు సర్వాత్మకత్వము.

**ఆబ్రహ్మ స్తమ్బపర్యన్తం పరమాత్మస్వరూపకమ్ ।**
**స్థావరం జంగమం చైవ ప్రణమామి జగన్మయమ్ ॥ 156**

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం- పరమాత్మస్వరూపకమ్ - స్థావరం - జంగమం - చ - ఏవ - ప్రణమామి - జగన్మయం.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం = బ్రహ్మమొదలుకొని తృణపర్యన్తము, పరమాత్మ స్వరూపకం= పరమాత్మస్వరూపము గలదియు, స్థావరం జంగమం చ ఏవ = చరాచరాత్మకమైన, జగన్మయం= జగద్రూపకమైన శ్రీ గురుస్వరూపమునుగూర్చి, ప్రణమామి = నమస్కరించు చున్నాను.

శ్రీ గురుస్వరూపమును వర్ణించుచున్నారు.

**"తిలేషు తైలం దధినీవ సర్పిః ఆపస్స్రోతస్స్వరణీషు చాగ్నిః"**

అను ఉపనిషద్రీతిగా బ్రహ్మ మొదలుకొని తృణము పర్యంతము

వ్యాపించినదియు, పరమాత్మస్వరూప మైనదియు, చరాచరాత్మక జగద్రూప మైనదియు, అఖండస్వరూపము నగు శ్రీగురుస్వరూపమును గూర్చి నమస్కరించుచున్నాను.

అవ: శ్రీగురుస్తోత్రము:

**వన్దేఽహం సచ్చిదానందం భావాతీతం జగద్గురుమ్ ।**
**నిత్యం పూర్ణం నిరాకారం నిర్గుణం స్వాత్మసంస్థితమ్ ॥ 157**

వన్దే - అహం - సచ్చిదానందం - భావాతీతం - జగద్గురుం - నిత్యం - పూర్ణం - నిరాకారం - నిర్గుణం - స్వాత్మసంస్థితమ్.

సచ్చిదానందం = సచ్చిదానంద స్వరూపుడును, భావాతీతం = మనోభావముల నతిక్రమించిన వాడును, నిత్యం = శాశ్వతుడును, పూర్ణం = పరిపూర్ణుడును, నిరాకారం = నిరాకారుడును, నిర్గుణం = గుణాతీతుడును, స్వాత్మసంస్థితం = తన ఆత్మలో సుస్థిరముగ నుండువాడును, జగద్గురుం = లోకగురువైన మా గురువునుగూర్చి, అహం = నేను, వందే = నమస్కరించుచున్నాను.

సచ్చిదానంద స్వరూపుడును, భావములకు నంతఃకరణమునకు నతీతుడును, నిత్యుడును, పరిపూర్ణుడును, నామరూపములు లేనివాడును, త్రిగుణాతీతుడును, నాలో నిరంతరము వెలుగువాడును, సర్వలోక గురువు నగు నా గురుదేవునిగూర్చి నమస్కరించుచున్నాను.

అవ: శ్రీ గురుధ్యానమును గూర్చి తెలుపుచున్నారు.

**పరాత్పరతరం ధ్యాయేన్నిత్యమానందకారకమ్ ।**
**హృదయాకాశమధ్యస్థం శుద్ధస్ఫటిక సన్నిభమ్ ॥ 158**

పరాత్పరతరం - ధ్యాయేత్ - నిత్యం - ఆనందకారకం - హృదయాకాశ మధ్యస్థం - శుద్ధస్ఫటిక సన్నిభం.

నిత్యం = మూడుకాలములలో నున్నవాడును, ఆనందకారకం = నిత్యానందమును గలుగజేయువాడును, హృదయాకాశ మధ్యస్థం = హృదయాకాశమధ్యలో నున్నవాడును, శుద్ధస్ఫటిక సన్నిభం = పరిశుద్ధమగు స్ఫటికమణితో సమానమైన వాడును, పరాత్పరతరం =

పరముకంటెను శ్రేష్ఠుడును, విలక్షణుడును అగు శ్రీ గురుపరబ్రహ్మస్వరూపమును గూర్చి, ధ్యాయేత్ = ధ్యానించవలయును.

త్రికాలముల యందుండుచు కాలాతీతుడై నిత్యుడయినవాడును, దేవగన్ధర్వాద్యానందములకంటె విలక్షణమైన అఖండ పరమానందమును గలిగించు వాడును, హృదయాకాశమధ్యలో పరిశుద్ధమణివలె ప్రకాశించుచు, నుంటున్న గురువును ధ్యానించవలెను.

హృదయ మనునది పుండరీకమువలె నుండును. దానిలో నున్నట్టి యాకాశ మనగా నిర్మల మయినది బయలని యర్థము. దానిలో చైతన్యస్వరూపుడై సర్వదా ప్రకాశించుచున్నాడు. "హృదాకాశే చిదాదిత్యే సదా భాసతి భాసతి = హృదయా కాశమందు సర్వదా ప్రకాశించునట్టి చిత్తను (పరమాత్మయను) సూర్యుడు ప్రకాశించుచుండగా" అను వాక్యము పై యర్థమునే బోధించుచున్నది.

పరమాత్మయొక్క ప్రకాశము పరిశుద్ధమై సర్వసన్తాపహరమై అజ్ఞాన మనునది లేశముగూడ లేక భాసిల్లుచుండును. హృదయాకాశ మనగా, మనస్సుయొక్క ఆకాశమని యర్థము. మనస్సునకు స్థానము భ్రూమధ్యస్థానమై యున్నది. కాన భ్రూమధ్యస్థానమందు దేదీప్యమాన ప్రకాశముతో నుండువాడును, ఇట్లే పరాకాశ మహాకాశాదులగు నైదాకాశములలోను ప్రకాశించువాడును. హృదయమందు మహాసూక్ష్మమై ఉన్న దహరాకాశములో ప్రకాశించువాడనగా మహాసూక్ష్మరూపుడై ప్రకాశించువాడును - (హృదయ మనగా సహస్రారమేను, వేరొకటిగాదు.) ఆ సహస్రారములో చంద్రునివలెను స్ఫటికమువలెను ప్రకాశించు వాడును, ఉండునని అనేకు లనేకవిధములుగా జెప్పియున్న గురువును ధ్యానించవలెను

పరమాత్మ సర్వవ్యాపకుడు గాన గగనమువలె నంతటను వ్యాపించి సర్వదా ప్రకాశించువాడును, పరముకంటెను పరమైనవాడును, శ్రేష్ఠుడును, (పరస్థానము లనగా బ్రహ్మాదిస్థానము లగుచున్నవి.)

**"ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున !"** **(భగవద్గీత)**

అశాశ్వతమగు శివవిష్ణ్వాది స్థానములకంటెను పరమైనవాడును అయిన సర్వప్రకాశక స్వయంప్రకాశమాన శాశ్వతానంద పరబ్రహ్మస్వరూపమగు శ్రీగురుస్వరూపమును ధ్యానించవలయును.

అవ: జీవాత్మ పరిశుద్ధ మగునప్పుడు, సర్వావరణములు నశించినప్పుడు సచ్చిదానందస్వరూప మగుచున్నది. కాన నట్టి జీవాత్మ సచ్చిదానంద పరబ్రహ్మ మగుచున్నాడు. జీవేశ్వరైక్యము సిద్ధించుచున్నది. జీవుడను వేరు వస్తువు లేదు, పరబ్రహ్మమే యను నఖండజ్ఞానము గలుగుచున్నదని దృష్టాన్తములతో నిరూపించుచున్నారు.

**స్ఫటికే స్ఫాటికం రూపం దర్పణే దర్పణో యథా ।**
**తథా ఽఽత్మని చిదాకారమానన్దం సోఽహమిత్యుత ॥ 159**

స్ఫటికే - స్ఫాటికం - రూపం - దర్పణే - దర్పణః - యథా - తథా - ఆత్మని - చిదాకారం - ఆనన్దం - సః - అహం - ఇతి - ఉత.

స్ఫటికే = స్ఫటికమణియందు, స్ఫాటికం రూపం = మఱియొక స్ఫటికమణికి సమ్బంధించిన రూపము, యథా = ఎట్లు కలిసిపోవుచున్నదో, దర్పణే = అద్దమునందు, దర్పణః = మఱియొక అద్దము, యథా = ఎట్లు భేదమును జెందుచున్నదో, తథా = అట్లు, ఆత్మని = ఆత్మయందు, అనన్దం = అనన్ద మయిన, చిదాకారం = చిత్తగు పరమాత్మయొక్క స్వరూపము ఏకత్వమును పొందుచున్నది, ఉత = మఱియు (అప్పుడు), సః = ఆ పరమాత్మయే, అహం = నేను, ఇతి = అని, అఖండాభేదజ్ఞాన ముదయించుచున్నది.

పరిశుద్ధస్ఫటికమణియందు మఱియొక శుద్ధస్ఫటిక మణియొక్క స్వరూపము నేకమగుచున్నది. వాని రెంటియొక్క కాంతులును కలిసిపోవుచున్నవి. భేద మేర్పడదు. అనగా ఎట్లు శుద్ధస్ఫటిక శిలయొక్క పురోభాగమున నింకొక శుద్ధస్ఫటికశిల నుంచినచో, నారెండును నిర్మలము లగుటచే నేకత్వమును జెందుచున్నవో, అట్లే ఆత్మపరమాత్మలు రెండును శుద్ధము లగుటవలన సచ్చిదానంద స్వరూపములై యేకత్వమును జెందుచున్నవి. ఇట్లు స్ఫటిక దృష్టాన్తమును చెప్పిరి.

అంతటితో తృప్తినొందక మఱియొక దృష్టాన్తమును చెప్పుచున్నారు. ఇచ్చట స్ఫటికములు రెండున్నవి. వానికి స్వరూపముతో నభేదము సిద్ధించినను కేవల

వస్తువు లేకత్వమును జెందలేదు. ఒకేవస్తువుగా లేదు. అందుచే దర్పణ దృష్టాన్తము స్వీకరింపబడుచున్నది. శుద్ధదర్పణము నందు మఱియొక శుద్ధదర్పణ మభేదమును పొందుచున్నది. అనగా పరిశుద్ధ దర్పణముయొక్క ముందుభాగమున నింకొక నిర్మల దర్పణ ముంచినచో, నారెండు నేకములే యగుచున్నవి. అట్లే జీవాత్మ శుద్ధావస్థను జెందినప్పుడు ఆత్మపరమాత్మల కేకత్వము సిద్ధించుచున్నది. అద్దములు రెండును నిర్మలము లగుటచేతను, పరస్పరాభిముఖములుగా నున్నందుచేతను వస్తుగ్రహణమును జేయజాలకున్నవి. అవి రెండుగా నున్నను వాని పనిని జేయుట లేదు. అంతమాత్రమే గాదు, పురోభాగమున నున్న వస్తువే యందులో ప్రతిఫలించుచున్నది. వేరు వస్తువు గాదు. అట్టి ప్రతిబింబభావముగూడ నిప్పుడు నశించినది గదా.

ఆ ప్రకారము జీవాత్మ పరమాత్మయు పరిశుద్ధము లయినవి. కావున దర్పణములు వస్తువులను గ్రహించని చందమున నవి అవిద్యోపాధి మాయోపాధులను గ్రహించుట లేదు. పరమాత్మ యనగా నిచట నిరుపాధికు డనియే గ్రహించవలయును. ఇక్కడ తొలంగవలసినది అవిద్యోపాధియే. అనగా విచారణచేత లక్ష్యార్థములగు నిరుపాధిక జీవాత్మపరమాత్మలయొక్క అభేదమును తెలియవలెను. జీవాత్మ యనగా పరమాత్మయొక్క ప్రతిబింబమని శాస్త్రములు వ్యవహరించుచున్నవి. ఈ దర్పణద్వయ దృష్టాన్తముచే నట్టి బిమ్బప్రతిబిమ్బ భావము నశించి దృశ్యరహిత కేవలచైతన్యమే అవశిష్ట మయినది. భేదమే నశించినయున ఆ పరమేత్మయే నేను. నేననగా పరమాత్మ, పరమాత్మ యనగా నేను అని యెన్ని సార్లు త్రిప్పి చెప్పినను నొకే సద్వస్తువుంటున్నది. ఆ తత్త్వమునే "హంసః సోఽహం" అను మహామన్త్రము బోధించుచున్నది. అందుచే కేవల సచ్చిదానందస్వరూపుడను నేను, అదియే గురుస్వరూపము అని శ్రీగురు ధ్యానముమున గలుగుచున్నది. ఈవిషయమునే

**"క్షీరం క్షీరే యథా క్షిప్తం తైలం తైలే జలం జలే ।**
**సంయుక్తమేకతాం యాతి తథాత్మన్యాత్మవిన్మునిః ॥**

అని వివేకచూడామణి తెలుపుచున్నది. ఉపనిషత్తు లట్లేచెప్పుచున్నవి.

అవ: హృదయదహరాకాశమందు శ్రీగురుపరబ్రహ్మమును ధ్యానించుటచే గల్గు భావముల నిక జెప్పబోవుచున్నారు.

**అంగుష్ఠమాత్రం పురుష ధ్యాయేచ్చ చిన్మయం హృది ।**
**తత్ర స్ఫురతి యో భావః శృణు తత్కథయామి తే ॥ 160**

అంగుష్ఠమాత్రం - పురుష - ధ్యాయేత్ - చ - చిన్మయం - హృది - తత్ర - స్ఫురతి- యః - భావః - శృణు - తత్ - కథయామి - తే.

హృది = హృదయమునందు, అంగుష్ఠమాత్రం - అంగుష్ఠమాత్రుడయిన, చిన్మయం= జ్ఞానప్రకాశస్వరూపుడైన పురుషం = శ్రీ గురుపరమాత్మను, ధ్యాయేత్ = ధ్యానించవలయును, తత్ర = ఆహృదయకమలమునందు, యః -భావః = ఏ పరమాత్మవస్తు తత్త్వజ్ఞానము, స్ఫురతి= ప్రకాశించునో, తత్ = ఆ భావమును, తే = జిజ్ఞాసగల నీకు, కథయామి, చెప్పుచున్నాను, శృణు = వినుము.

ఓ పార్వతి! హృదయపుండరీకమందు చిదాకార అంగుష్ఠమాత్ర శ్రీగురు పరమపురుషుని ధ్యానించ వలయును. అందుచే హృదయకమలము వికసించినదై, అజ్ఞానావావరణము దొలగినదై యెట్టి శ్రీగురుపరమాత్మ విషయకజ్ఞానము ప్రకాశించునో తెలిపెదను వినుము.

అవ: శ్రీగురుపరబ్రహ్మస్వరూపధ్యానముచే గలిగినట్టి యఖండబోధను వివరించుచున్నారు.

**అజోఽ హమమరోఽ హం చ అనాదినిధనో హ్యహమ్ ।**
**అవికారశ్చిదానందో హ్యణీయాన్మహతో మహాన్ ॥ 161**

అజః - అహం - అమరః - అహం - చ - అనాదినిధనః - హి - అహమ్ - అవికారః- చిదానందః - హి - అణీయాన్ - మహతః - మహాన్.

అహం = నేను, అజః = పుట్టువాడనుగాను, అహమ్ = నేను, అమరశ్చ = మృతిలేనివాడను, అహం = నేను, అనాదినిధనః = ఆద్యంతములు లేనివాడను (ఆదిమాధ్యాన్త రహితుడును) హి = నిశ్చయము, అవికారః = వికారము లేనివాడును. చిదానందః = జ్ఞానప్రకాశానందస్వరూపుడను, అణీయాన్ = మిక్కిలి, సూక్ష్మస్వరూపుడను, మహతః = బృహత్తగు వస్తువుకంటె, మహాన్ = గొప్పవాడను, కేవల శ్రీగురుపరబ్రహ్మస్వరూపుడను.

**"అణోరణీయాన్ మహతో మహీయాన్" "న జాయతే మ్రియతే'** అను మొదలగు నుపనిషదర్థములను తెలుపుచున్నారు. నేను పుట్టుక లేనివాడును. నేను మృతి లేనివాడను. పుట్టుట చచ్చుట ప్రపంచధర్మములు, అట్టి మాయాప్రపంచ మెచ్చట దాగునో జ్ఞాపకముగూడ వచ్చుట లేదు. నేనొకప్పుడు పుట్టను లేదు చావను లేదు. నేను సర్వదా అమృత స్వరూపుడను. శాశ్వతుడను, ఆది మధ్యాంతములు లేనివాడను, వచ్చు పోవు వస్తువులకు ఆదిమధ్యాన్తములు సంభవించును. **"అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత! అవ్యక్తనిధనాన్యేవ"** అని భగవద్గీతయు నా విషయముచే చెప్పుచున్నది. మధ్యలో వచ్చువానికి పోవువానికి అది అన్తములు గలుగును. ఆద్యన్తములు గలవేవియో నాకు తెలియకున్నవి. నేనెప్పుడును గమనాగమన వర్జితుడను, అపరిచ్ఛిన్నుడను, అఖండస్వరూపుడను, ఏలాంటి వికారములు లేనివాడును. పరిణామము చెందువానికి వికారములు గలుగుచున్నవి. నేను అపరిణామి, నిర్వికారుడను, అనగా అస్తి, జాయతే, వర్ధతే, అపక్షీయతే, పరిణమతే, నశ్యతి అను షడూర్ములు షడ్భావములు లేనివాడను, జ్ఞానరూపుడను, స్వయంప్రకాశుడను, ఆనందరూపుడును.

అంతయు నేనై యుండగా నాకంటె సూక్ష్మవస్తువుగాని, మహద్వస్తువుగాని యెచ్చటుండును? పరమాణువుకన్న నెంతగనో సూక్ష్మస్వరూపుడను. "నీవారశూకవత్తన్వీ" అను శ్రుతియు బోధకొరకట్లు చెప్పినది. గగనము సర్వవ్యాపియై యన్నిటికంటె మహత్తైనది. అదియు నాలో మహా సూక్ష్మము గానున్నది. ఇట్లు సూక్ష్మాతిసూక్ష్ముడను. బృహతోఽతిబృహత్తుడను. ఇట్టి యఖండ జ్ఞానము శ్రీగురుస్వరూప ధ్యానముచే గలుగుచున్నది. నిశ్చయము, ముమ్మాటికి నిశ్చయము.

అవ: తానైనట్టి శ్రీగురుపరబ్రహ్మస్వరూపమును విశేషించి తెలుపుచున్నారు.

**అపూర్వమపరం నిత్యం స్వయం జ్యోతిర్నిరామయమ్ ।**
**విరజం పరమాకాశం ధ్రువమానందమవ్యయమ్ ॥** 162

అపూర్వం - అపరం - నిత్యం - స్వయంజ్యోతిః - నిరామయమ్ - విరజం - పరమాకాశం - ధ్రువం - ఆనందం - అవ్యయం.

అపూర్వం = ముందు లేనిదియును (నవోదయమై సర్వదా యున్నదియు), అపరం = వెనుకల లేనిదియును (శిధిలవస్తువు గానిదియు), నిత్యం = శాశ్వత మయినదియు, స్వయం జ్యోతిః = స్వయంప్రకాశమాన మయినదియు, నిరామయమ్ = భవరోగము లేనిదియు, విరజం = రజోగుణము లేనిదియు (రజోగుణములగు వృత్తులు విక్షేపములు లేనందుచే పరమశాంత స్వరూప మయినదియు), పరమాకాశం = మహోత్కృష్టాకాశ మయినదియు (నిర్మల మయినదియు చిదాకాశ మయినదియు), ధ్రువం = నిశ్చయ మయినదియు, ఆనంద మయినదియు, అవ్యయం = క్షయము లేనిదియు నగు శ్రీగురుపరబ్రహ్మ స్వరూపము నేనే.

ఆ పరవస్తువు అపూర్వము = పూర్వము లేనిది. దానికన్న ముందు వస్తువు లేదు. సర్వాది యయినది. సర్వదా నూత్నభాస్వరములతో భాసించునది. అపరము= దానికన్న వెనుక వస్తువు లేదు. సర్వము నశించినను అవిశిష్ట మయిన వస్తు వదియే. శిథిల మైనది గాదు. నిత్యము, స్వయంప్రకాశము, భవరోగరహితము, రజోగుణము లేనిదియునై యున్నది. రజోగుణవృత్తులు విక్షేపములు లేక విశుద్ధ తత్త్వస్వరూపమై పరమశాంతి స్వరూప మయినది. పరమాకాశము, చిదాకాశము, నిర్మలము, సర్వవ్యాపకము, నిశ్చయము. సంశయ విపరీత భావనాది దోషశూన్యమై సర్వ సంశయరహిత మైనది, క్షయము లేనిది, ఆనందస్వరూప మైనది. అట్టి శ్రీ గురుపరమాత్మ స్వరూపము నేనై యున్నాను.

అవ: ఇకను పరబ్రహ్మ మెట్టిదో నిరూపించుచున్నారు.

**అగోచరం తథాఽగమ్యం నామరూపవివర్జితమ్ ।**
**నిశ్శబ్దం తు విజానీయాత్స్వభావాద్బ్రహ్మ పార్వతి! ॥** 163

అగోచరం - తథా - అగమ్యం - నామరూప వివర్జితమ్ - నిశ్శబ్దం - తు - విజానీయాత్- స్వభావాత్ - బ్రహ్మ - పార్వతి.

హే పార్వతీ! = ఓ పార్వతీదేవీ! బ్రహ్మ = పరబ్రహ్మమును, స్వభావాత్ = స్వభావమువలన (దానియొక్క స్వరూపమువలన), అగోచరం = పొందదగనిదిగను, నామరూపవివర్జితమ్ = నామరూపములు లేనిదిగను, కిం తు = మఱియు, నిశ్శబ్దం = శబ్దబ్రహ్మాతీత మయినదిగను (సర్వవేదాతీత మయినదిగను), విజానీయాత్ = లెస్సగా విచారించి తెలిసికొనుము.

మననము చేయదగిన దగుటచే మాటిమాటికి విశేషించి చెప్పుచున్నారు. ఆ పరబ్రహ్మము ఇంద్రియాదులగు గోచరము గానిది. వానిచే పొంద సాధ్య మగునది గాదు. మనోబుద్ధ్యాదులనుగూడ తెలిసికొను నట్టిది. సర్వేంద్రియాతీతము, అతీంద్రియ జ్ఞాననిధి, నామరూపములు లేనిది. నీరూపము. అంతమాత్రమే గాదు, అపర యను శబ్దబ్రహ్మాతీత మయినది. వేదములును తెలియజాలవు. "త్రైగుణ్య విషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున" అను భగవద్గీతరీతిగ నది త్రిగుణాతీతము. మఱియు నాదబిందు కళాతీతము. ఓంకార నాదమునకును విలక్షణ మైనది. అందువల్లనే "నిశ్శబ్దం బ్రహ్మ ఉచ్యతే" అని శ్రుతి చెప్పుచున్నది. పై జెప్పిన లక్షణము లన్నియు శ్రీపరబ్రహ్మమునకు స్వభావము లనియు, స్వరూప మనియు ఓ పార్వతీ! నిస్సన్దిగ్ధముగ దెలియుము. అట్టి పరబ్రహ్మమే శ్రీగురువు.

అవ: బ్రహ్మమునకు శాశ్వతమను గుణము స్వభావమని చెప్పుచున్నారు.

**యథా గన్ధస్వభావత్వం కర్పూరకుసుమాదిషు ।**
**శీతోష్ణత్వస్వభావత్వం తథా బ్రహ్మణి శాశ్వతమ్ ॥** 164

యథా - గన్ధస్వభావత్వం - కర్పూరకుసుమాదిషు - శీతోష్ణత్వస్వభావత్వం - తథా - బ్రహ్మణి - శాశ్వతం.

కర్పూరకుసుమాదిషు = కర్పూరము, పుష్పము మొదలయిన వానియందు (అగ్ని యందును), గన్ధస్వభావత్వం = పరిమళ స్వభావము గలిగి యుండుటయు, శీతోష్ణస్వభా వత్వం = శీతమగు ఉష్ణమగు స్వభావము గలిగియుండుటయు, యథా = ఎట్లు ప్రసిద్ధమో, తథా = ఆ ప్రకారముగానే, బ్రహ్మణి = పరబ్రహ్మమందు, శాశ్వతం = నిత్యమగు గుణము, స్పష్టముగా నున్నది.

బ్రహ్మమనునది నశించున దెన్నటికిని గాదు. కర్పూరము, పుష్పము, చందనము మొదలయినవి పరిమళముతో గూడుకొని యెప్పుడును చల్లగా నుంటున్నవి. అగ్ని ఉష్ణమైనది. ఆప్రకార ముండుట ఆయా వస్తువులకు సహజము, విడువని గుణములు. వస్తువుతోపాటు గుణముగూడ నశించుచున్నది. ఇంతలోపల వాని స్వభావము పోదు. ఈ విషయ మెల్లరికిని విదితమై యున్నది. అట్లే బ్రహ్మముయొక్క స్వభావము నిత్యత్వము. ఎప్పుడును నశించునది గాదు.

బ్రహ్మము నిత్యము గనుక దానికి సహజమయిన శాశ్వతగుణము పోదు. ఇంతకు బ్రహ్మముయొక్క స్వరూపము నిత్యము, శాశ్వతము. అట్టి బ్రహ్మము నేనై యున్నాను- అని శిష్యునికి బోధ గలిగినది.

అవ: శ్రీగురుపరబ్రహ్మ స్వరూపము నేనైతినను విజ్ఞానమునే పదేపదే తెలుపు చున్నారు.

**యథా నిజస్వభావేన కుండలే కటకాదయః ।**
**సువర్ణత్వేన తిష్ఠన్తి తథాఽహం బ్రహ్మ శాశ్వతమ్ ॥ 165**

యథా - నిజస్వభావేన - కుండలే - కటకాదయః - సువర్ణత్వేన - తిష్ఠన్తి - తథా - అహం - బ్రహ్మ - శాశ్వతం.

నిజస్వభావేన = తమస్వభావముచేత, కుండలే = కర్ణభూషణములు, కటకాదయః = కడియము మొదలయినవి, సువర్ణత్వేన = బంగారుయొక్క స్వరూపముతో, తిష్ఠన్తి = ఉంటున్నవో, తథా = ఆవిధముగానే, అహం = నేను, శాశ్వతం = సర్వదా యుండునట్టి, బ్రహ్మ = పరబ్రహ్మముగ నున్నాను.

సువర్ణాభరణములకు బంగారుయొక్క రూపము సహజముగానే యున్నది. ఆ కనకముతో కుండలములను జేసినను; కడియములు, కంకణములు, గాజులు, గొలుసులు మొదలయిన వానిని జేసినను స్వభావముగా వానియందున్న స్వర్ణత్వము= కాంచనస్వరూపము పచ్చగా నుండుట, నిగనిగ మెరయుట పోవునా? అట్లే పరబ్రహ్మమందు నిత్యత్వగుణము సహజముగా నున్నది, శాశ్వత మయినది.

స్వభావ మనగా స్వస్య భావః = స్వభావః- తనయొక్క స్వరూపమని యర్థము. కావున బ్రహ్మస్వరూపము శాశ్వతము. అందుచేతనే యెన్ని నామ రూపములుగా మారినను బ్రహ్మము మాత్రమే మార్పు లేక శాశ్వతముగ నున్నది. వెండి, రాగి మొదలయిన వానియొక్క వికారరూపములగు ఆభరణముల యందును, వస్తువులయందును రజతత్వము, తామ్రత్వము మొదలయినవి శాశ్వతములని తెలియవలెను. ఆ వస్తువు లన్నియు కారణములగు స్వర్ణాదులకంటె వేరుగా లేనట్లు బ్రహ్మమునకంటె వేరుగా నేవస్తువును లేదని తెలియవలెను.

అంతయు బ్రహ్మస్వరూపమే. అట్లే శాశ్వతమగు శ్రీగురుపర బ్రహ్మ స్వరూపమే నేను, ఆనందస్వరూపుడను, అవ్యయుడను, నిత్యుడను. అయితే యిచ్చోట నీ విషయమును గమనించవలయును. కనక మయినను రాగి మొదలయిన వానితో జేరిన దానియొక్క మూల్యము తగ్గుచున్నది. అట్లే జీవుడు పరబ్రహ్మస్వరూపి యయినను దృశ్యముతో జేరియుండినచో కేవల సచ్చిదానంద స్వరూపుడు కాజాలడు. రాగిని వదలినచో బంగారు శుద్ధ మగునట్లు తానును నిత్యశుద్ధ స్వరూపుడు గావలయును. దృశ్యరహిత జ్ఞానమును సంపాదించ వలయును. అప్పుడే జీవుడు దేవు డగుచున్నాడు. యోగవాసిష్ఠము:-

**"యథైకం చ సువర్ణాది మిళితం రజతాదినా ।**
**అల్పమూల్యం ప్రజాయేత తథా జీవోఽప్యహం యుతః ॥**

యథైకం చ సువర్ణాది క్షారాదేశ్శోధితం మలం ।
**పూర్వవన్మూల్యతాం యాతి తథా జీవోఽపి సంస్కృతేః ॥**

**జీవశ్శివశ్శివో జీవః స జీవః కేవలశ్శివః ।**
**త్యజేదజ్ఞాననిర్మాల్యం సోఽహంభావేన పూజయేత్ ॥"**

దీని యర్థ మదియే.

అవ: భ్రమరకీట న్యాయము ననుసరించి బ్రహ్మ మగుటను తెలుపు చున్నారు.

**స్వయం తథావిధో భూత్వా స్థాతవ్యం యత్ర కుత్ర చిత్ ।**
**కీటో భృంగ ఇవ ధ్యానాద్యథా భవతి తాదృశః ॥** 166

స్వయం - తథావిధః - భూత్వా - స్థాతవ్యం - యత్ర - కుత్ర - చిత్ - కీటః - భృంగః - ఇవ - ధ్యానాత్ - యథా - భవతి - తాదృశః.

ధ్యానత్ = భ్రమరరూపమునే చింతించుటవలన, కీటః = పురుగు, తాదృశః = అటువంటి, భృంగః ఇవ = తుమ్మెదవలె, యధా భవతి = ఏ ప్రకార మగుచున్నదో అదేవిధముగ, స్వయం = తాను, ధ్యానాత్ := శ్రీ గురుపరబ్రహ్మస్వరూపమునే ధ్యానించుటవలన, తథా విధో భూత్వా = ధ్యేయమగు పరబ్రహ్మముగ అయి, యత్ర కుత్ర చిత్ = తన కిష్టము వచ్చినచోట, స్థాతవ్యం = ఉండదగినది.

వేదాంతములో భ్రమరకీటక దృష్టాన్తము నెక్కువగా జెప్పుచుందురు. కీటకము భీతి జెందినదై భ్రమరమునే ధ్యానించుచుండును. ఆ భ్రమరముగూడ ఝుంకారము జేయుచు మధ్యమధ్య పొడుచుచు దానినే నిరీక్షించుచుండును. తరువాత కీటకము తాను చింతించిన భృంగమువలెనే యగుచున్నది. చూచితిరా భావనామహిమను! కీటకము ముందు తాను వేరురూపముగ నుండెను. ఇప్పు డారూపము స్వభావము పోయి భ్రమరమై ఝుంకారము చేయుచున్నది. అట్లే శిష్యుఢును సంసార భయభీతుడై, గురూపదేశానుసారము శ్రీగురు బ్రహ్మ స్వరూపమునే ధ్యానించుచు నిరంతరము శ్రీగురువు ఉపదేశించుచున్న మహావాక్యార్థమును శ్రవణము జేయుచు, మనననిదిధ్యాసములను చేయుచు, శ్రీగురుదేవుడు శిక్షించుచున్నను వానిని సహించుకొనుచు, కట్టకడకు తనయొక్క స్వరూపమగు శ్రీగురుపరబ్రహ్మ స్వరూపమును పొందుచున్నాడు. జీవుడు శివు డగుచున్నాడు.

అంతమాత్రమే గాక, కీటకము భ్రమర మయిన తరువాత నదియు మఱికొన్ని భ్రమరములను తయారు చేయునట్లు శివత్వమును గురుత్వమును పొందిన శిష్యుడు ననేకజీవులను శివత్వమును పొందించుచున్నాడు. ఇది వేదాంతసారము.

శిష్యుడు విజ్ఞానానుభవమును పొందిన తరువాత శ్రీగురువుదగ్గరనే యుండవలయునను నియమము లేదు. తన కర్తవ్యము పూర్తియయినది. పొందవలసిన దానిని పొందిన వాడాయెను. ధాన్యుడాయెను. శ్రీగురుశిష్యు లెచ్చోట నుండినను నేకరూపులుగనే యున్నారు. శ్రీ గురుదేవుని యపారకరుణను శిష్యుడు సంపాదించినవా డగుటచే నెచ్చోట నుండియు దీనజనులను తరింపజేయవచ్చును.

అవ: ముక్తుల విషయమును ప్రతిపాదించబోవుచున్నారు.

**గురుధ్యానం తథా కృత్వా స్వయం బ్రహ్మమయో భవేత్ ।**
**పిండే పదే తథా రూపే ముక్తాస్తే నాత్ర సంశయః ॥** 167

గురుధ్యానం - తథా - కృత్వా - స్వయం - బ్రహ్మమయః - భవేత్ - పిండే - పదే -

తథా - రూపే - ముక్తాః - తే - న - అత్ర - సంశయః.

తథా = ఆ కీటకమువలె, గురుధ్యానం = శ్రీగురుబ్రహ్మాధ్యానమును, కృత్వా = చేసి, స్వయం = తాను, బ్రహ్మమయః = బ్రహ్మస్వరూపుడై, ముక్తః భవేత్ = ముక్తు డగును, తే = ధ్యానమువలన శ్రీ గురుపరబ్రహ్మస్వరూప మయిన వారలు, పిండే = పిండమందును, పదే = పదమందును, తథా = ఆప్రకారము, రూపే = రూపమందును, ముక్తాః = ముక్తిని బడసిన వారలు, అత్ర = ఈ ముక్తివిషయములో, సంశయః = సందేహము, న = లేదు.

శ్రీగురు పరబ్రహ్మాధ్యానమును భ్రమరకీటకముల న్యాయము ననుస రించి చేసినవారు తాము స్వయముగ బ్రహ్మస్వరూపు లగుచున్నారు. అదియును గాక ఆ జ్ఞానులు పిండమందును, పరమందును, అట్లే రూపమందును, మూడింటియందును ముక్తుల గుచున్నారు. ఈ ముక్తు లయిరను విషయములో సందేహము లేదు.

**పార్వత్యువాచ = పార్వతీదేవి పలికెను:-**

అవ: పార్వతి సందేహము నడుగుట.

**పిండం కిం తు మహాదేవ! పదం కిం సముదాహృతమ్ ।**
**రూపాతీతం చ రూపం కిం ఏతదాఖ్యాహి శంకర! ॥** 168

పిండం - కిం - తు - మహాదేవ - పదం - కిం - సముదాహృతమ్ - రూపాతీతం - చ - రూపం - కిం - ఏతత్ - ఆఖ్యాహి - శంకర.

హే మహాదేవ = ఓ మహేశ్వరా! పిండం = పిండము, కిం = ఏది, సముదాహృతమ్ = చెప్పబడినది, పదం తు = పద మయితే, కిం = ఏది, సముదాహృతం = చెప్పబడినది, రూపం = రూపము, కిం = ఏది, రూపాతీతం = రూపము నతిక్రమించిన దేది, శంకర = ఓ శుభంకరా! ఏతత్ = ఈ విషయము నంతయు, అఖ్యాహి = చెప్పుము.

పిండాదులను మహేశ్వరుడు చెప్పిన తరువాత పార్వతీదేవి నాలుగు ప్రశ్నలు వేసెను. (1) పిండ మననేమి? (2) పద మననేమి? (3) రూప మననేమి? (4) రూపాతీత మననేమి? ఓ ఈశానా ! శంకరా ! యీ విషయముల నన్నిటిని తెల్పుడు.

**శ్రీ మహాదేవ ఉవాచ = ఈశ్వరుడు పలికెను-**

**పిండం కుండలినీశక్తిః పదం హంసముదాహృతమ్ ।**
**రూపం బిందురితి జ్ఞేయం రూపాతీతం నిరంజనమ్ ॥ 169**

పిండం - కుండలినీశక్తిః - పదం - హంసం - ఉదాహృతం - రూపం - బిందుః - ఇతి - జ్ఞేయం - రూపాతీతం - నిరఞ్జనమ్

పిండం = పిండము, కుండలినీశక్తిః = కుండలినీ శక్తిగ, ఉదాహృతం = చెప్పబడినది, పదం = పదము, హంసం = హంసగ, ఉదాహృతం = వచింపబడినది, రూపం = రూపము, బిందురితి = బిందువని, జ్ఞేయం = తెలియదగినది, రూపాతీతం = నామరూపములు లేనిది, నిరంజనం = మయారహితమగు పరబ్రహ్మము.

మహాదేవుడు క్రమముగా పార్వతీదేవి ప్రశ్నలకు సమాధానమును జెప్పుచున్నాడు. (1) పిండ మనునది కుండలినీశక్తి యగును, (2) పద మనునది హంస యగును. (3) రూపమనగా బిందు వగును. (4) రూపాతీత మయినది మాయారహిత పరబ్రహ్మమేను.

కుండలినీ శక్తిని గురించి యనేకు లనేకవిధములుగ జెప్పుచున్నారు. కుండలినీ అనగా ఆడపాము అని యర్థము. పామునకు చుట్టుకొని యుండుట స్వభావము. అందుచే దానికి కుండలి యనియు, ఆడుది గనుక కుండలిని యనియు చెప్పుచున్నారు. "సర్పాకారేణ త్రివేష్టనయుతా శక్తి : కుండలినీ" కావున దీనినే పరాశక్తి యనెదరు.

శరీరమునకు వెనుక ప్రక్కన మూలాధారమునుండి సహస్రారమువరకును వ్యాపించి వెన్నముక యున్నది. దీనినే వీణాదండి, బ్రహ్మదండి యనెదరు. దీనియందే అనేక నాడు లుంటున్నవి. ఇట్టి వెన్నెముకయొక్క మొదటి నుంచి మధ్యభాగముగుండ ఒక సన్నని బిలము భ్రూమధ్యము వరకున్నది. దీనినే సుషుమ్నానాడీ సంచారబిల మందురు. దీనిలో హంసను నడిపించుటయే కుండలిశక్తి యనియు చెప్పుదురు.

మఱియు మూలాధారము మూడు కోణములు గలిగియుండును. దానిలో కుండలి యనునది చుట్టుకొనియున్నది. ఒక సర్పము మూలాధారమందు పడగ

నుంచుకొని శిరసునందు తోక నుంచుకొని యున్నది. దీనిని అధఃకుండలి యనెదరు. అందుచేత వీణాదండియొక్క నిర్మాణము సర్పాకారముగ నున్నది. దానిని బట్టియే కుండలినీ శక్తిని వర్ణించుచున్నారు. కావున మూలాధారమును అధఃకుండలి యనియు, శిరస్సును ఊర్ధ్వకుండలి యనియును జెప్పుచున్నారు. అధఃకుండలి యనగా ఆడపాము మూలాధారమందు శిరమును నిడికొని పుచ్ఛమును భ్రూమధ్యస్థానమం దుంచుకొనియున్నది. ఇదియే పరాశక్తి, ప్రకృతి, ఇది అజ్ఞానదశ.

కావున నజ్ఞానులకు కుండలీ ప్రబోధము లేక కుండలినీశక్తి జ్ఞానవిషయములో నిద్రించుచుండును. ఇదియే ప్రకృతిద్వారము. మోక్షద్వారము మూయబడినది. ఇట్టి వారికి మోక్షము లభించదు. కుండలీ ప్రబోధము గలిగినప్పుడు జ్ఞానావస్థయందు మూలాధారమందు పుచ్ఛమును, భ్రూమధ్యమందు శిరమును గలిగి సర్పాంగన యుంటున్నది. ఇదియే చిత్స్వరూపిణి, అఖండజ్ఞానావస్థ. ఇది ఊర్ధ్వకుండలి యని చెప్పబడుచున్నది. ఇప్పుడు ప్రకృతిద్వారము మూయబడినది, మోక్షద్వారము తెరువబడినది. ఇట్టివారికి కైవల్యము లభించును.

నాభికమలమందు కుండలినీశక్తి ప్రబోధము జేయవలయు ననియుం జెప్పుదురు. ఇచ్చట కుక్కుటాండమువలె సకల నాడీచక్ర మున్నది. యోగాభ్యాసముచే నా నాడీచక్రము శుద్ధ మగుచున్నది. అప్పుడు సకల నాడులు శుద్ధము లగుచున్నవి. ప్రజ్ఞావిశేష మధికరించుచున్నది. స్వయంజ్యోతి స్స్వరూపదర్శనము గలుగుచున్నది. ఇట్టి వానికి ప్రాకృతగుణములు క్రమముగా నశించి జ్ఞానము గలుగుచున్నది అనియు జెప్పుచున్నారు.

విచారించినచో ముఖ్యవిషయ మేమనగా మనస్సను నదియే మహాచంచల స్వభావము గల సర్పాంగన యగును. అది విషయాదులను కాలకూట విషమును గ్రక్కుచుండును. శ్రీగోపాలకృష్ణుడు కాళియమర్దనము చేసినట్లు మనస్సను మహోరగస్త్రీ యొక్క చాపల్యమును పోగొట్టి విషయాదులను విషమును హరించవలయును. కావున మనస్సు దృశ్యవిషయములలో సంచరించడమే అధఃకుండలి యగును. అప్పుడు సంసారపాతము తప్పదు. కామక్రోధాదులచే

సుఖదుఃఖముల ననుభవించవలసివచ్చును. అట్టి మనస్సు పరమాత్మ విషయములో ప్రవర్తించడమే ఊర్ధ్వకుండలి యగును. అప్పుడేలాటి సుఖదుఃఖము లుండవు. జ్ఞానతత్త్వము బోధపడిన దగుచున్నది. ఇదియే కుండలీప్రబోధము, సర్వాజ్ఞాన నాశకము, స్వయంప్రకాశమానము.

మనస్సు ఊర్ధ్వగామి యయినచో వాయురూప హంసయు నూర్ధ్వగామి యగుచున్నది. అందుచే కుండలీప్రబోధము తప్పక గలుగును. సర్వదృశ్యములు నశించి యఖండజ్ఞానము గలుగును. ఇదియే కుండలినీ శక్తి యని తెలియ వలయును. ఇక పదమనగా హంసయని చెప్పబడినది. హంసయనగా సామాన్యముగా మూలాధారమునుండి సహస్రారమువరకు సంచరించు ప్రాణవాయువని యర్థము. దీనిద్వారా జీవుడు దినమునకు 21,600 సార్లు జపము చేయుచున్నాడు. దీనినే యజపాగాయత్రీ మంత్ర మనుచున్నారు.

**"హకారేణ బహిర్యాతి సకారేణ విశేత్పునః ।**
**హంస హంసేతి యన్మన్త్రం జీవో జపతి సర్వదా ॥"**

జీవు డాపరమాత్మనే నేనని జపించుచున్నాడని యర్థము. పరమాత్మ ప్రకృతిసంబంధముచే జీవుడని చెప్పబడుచున్నాడు. కావున హంస యనగా జీవుడని రెండవ యర్థము. హంస యనగా పరమాత్మ యని మూడవ యర్థము. షడాధారములందును సంచరించు పవనము హంసయని మొదట చెప్పబడెను. దీనిలోనే మనస్సు బుద్ధియు జేరియున్నవి. అట్టి వాయువుకన్న విలక్షణములుగ మనోబుద్ధు లుంటున్నవి. అవియే వాయువును నడుపుచున్నవి. వాని కన్నిటికిని విలక్షణమై జపించువాడు జీవుడు. ఈ జీవుడును హంసయని చెప్పబడెను. అనగా ప్రాణమయకోశము, మనోమయకోశము, విజ్ఞానమయకోశము- వీనికంటె విలక్షణుడుగా జీవు డున్నాడు. అట్టి జీవునికిని సాక్షి పరమాత్మ యయి యున్నాడు. ఈ పరమాత్మయు హంసయని వచింపబడెను. ఇదియే హంసపదముయొక్క యథార్థ మయిన యర్థము.

అట్టి పరమాత్మయే పదమని చెప్పబడినది. రూపము బిందువుగా జెప్పబడినది. బిందు వనగా యోగశాస్త్రములో దశవిధ వాయువుల యొక్కయు

మనస్సుయొక్కయు అగ్రభాగమునం దుండునది. అనగా హృదయములో నుగు నిశ్చయాత్మకబుద్ధి బిందువని చెప్పబడి సామాన్యముగా బుద్ధియు ప్రకృతి దోషములతో గూడి చంచలాత్మకముగా నుండును. పరమాత్మధ్యానముచే శుద్ధమగు చున్నది, పరమాత్మను ధ్యానించి ధ్యానించి పరమాత్మ స్వరూపమగు అప్రాకృతమగు ప్రజ్ఞారూప మగుచున్నది, "ప్రజ్ఞానం బ్రహ్మ" అను స్థితిని పొందుచున్నది. ఇదియు పరబ్రహ్మముయొక్క రూపమని చెప్పబడెను. రూపాతీత మనగా నిరంజనము, మాయారహిత పరబ్రహ్మము. పైన తెలిపిన పిండమునకు, పదమునకు, రూపమునకు మూడింటికి విలక్షణ మయినది. కేవల దృశ్యరహిత పరబ్రహ్మము రూపాతీతమని తెలియవలయును.

అవ: ముక్తుల స్వరూపము:

**పిండే ముక్తాః పదే ముక్తా రూపే ముక్తా వరాననే ।**
**రూపాతీతే తు యే ముక్తా స్తే ముక్తా నాత్ర సంశయః ॥ 170**

పిండే - ముక్తాః - పదే - ముక్తాః - రూపే - ముక్తాః - వరాననే - రూపాతీతే - తు - యే - ముక్తాః - తే - ముక్తాః - న - అత్ర - సంశయః.

యే = ఏ మహాత్ములు, పిండే = కుండలినీశక్తియందు, ముక్తాః = ముక్తులయిరో, పదే = హంసతత్త్వమందు, ముక్తాః = ముక్తిని బడసిరో, రూపే = బిందువందు (ప్రజ్ఞానమునందు), ముక్తాః = ముక్తిని పొందిరో, కిం తు = కాని యు, రూపాతీతే = నామరూపరహిత పిండాది విలక్షణ పరబ్రహ్మమందు, ముక్తాః = కైవల్యమును పొందిరో, తే = వారందరును, ముక్తా : = జననమరణ రహితతత్త్వమును బొందినవారలే, అత్ర = ఈ ముక్తుల విషయములో, సంశయః = సందేహము, న = లేదు.

ఈ శ్లోకములోని పిండాదులయొక్క వివరణము ముందుగనే చెప్పబడెను. కుండలీశక్తి ప్రబోధముచే కొందఱు ముక్తు లయిరి. అనగా ప్రాణాయామాది యోగాభ్యాసములచే కుండలీశక్తి ప్రబోధముచే నాత్మానాత్మజ్ఞానము గలిగి ముక్తు లయిన వీరలు పిండముక్తులు. మఱికొందఱు సోఽహం అను జపముచే హంసతత్త్వము నెఱింగి పరమహంస లయిరి. వీరలు పదముక్తులు. మఱికొందఱు బుద్ధిని ధ్యానవశముచే ప్రజ్ఞారూపముగ జేసి ముక్తు లయిరి. వీరలు రూపముక్తులు.

మఱికొందఱు రూపాతీత మగు కేవల బ్రహ్మస్వరూపమునే శ్రవణ మనన నిదిధ్యాసములచే సాక్షాత్కరించుకొనిరి. వీరందురును జనన మరణాది దుఃఖములు లేక నిత్యానందప్రాప్తిని బడసినవారే; సందేహము లేదు. ఈ ప్రకారము (1) ప్రాణాయామ యోగమార్గము, (2) హంసతత్త్వరూప తారకమార్గము, (3) ధ్యానమార్గము, (4) శ్రవణమననాదిరూప ఆత్మవిచారణమార్గము- అను నాలుగు మార్గములు తెలిపి ముక్తులను నాలుగువిధములుగ నిరూపించిరి. అయితే "రూపాతీతే తు" అని తు శబ్దప్రయోగముచే తు అనునది విలక్షణార్థమును తెలుపు చున్నది. అదేమనగా రూపాతీత మయిన పరబ్రహ్మమును కేవలాత్మ తత్త్వముచే నెరుంగుట యనునది మహాశ్రేష్ఠము అని సూచించిరని తెలియవలెను.

అవ: పై జెప్పినప్రకారము శ్రీగురుధ్యానము చేసి తరించినవాని విషయము తెలుపుచున్నారు.

**గురుధ్యానేనైవ నిత్యం దేహీ బ్రహ్మమయో భవేత్ ।**
**స్థితశ్చ యత్ర కుత్రాపి ముక్తో ఽసౌ నాత్ర సంశయః ॥ 171**

గురుధ్యానేన - ఏవ - నిత్యం - దేహీ - బ్రహ్మమయః - భవేత్ - స్థితః - చ - యత్ర - కుత్ర - అపి - ముక్తః - అసౌ - న - అత్ర - సంశయః.

దేహీ = ఆత్మ, నిత్యం = ఎప్పుడును, గురుధ్యానేనైవ = శ్రీ గురుపరబ్రహ్మ ధ్యానముచేతనే, బ్రహ్మమయః = బ్రహ్మస్వరూపముగ, భవేత్ : అగును, అసౌ = ఇట్టి బ్రహ్మస్వరూపి, యత్రకుత్రాపి = ఎక్కడయినగాని, స్థితః చ = ఉండినను, ముక్తః = ముక్తుడే, అత్ర = ఈ విషయములో, సంశయః = సందేహము, న = లేదు.

జీవుడు నిరంతరము శ్రీ గురుపరబ్రహ్మస్వరూప ధ్యానముచేతనే బ్రహ్మస్వరూపు డగుచున్నాడు. వేరుపాయము లేదు. అట్టివా డెచ్చోట నుండినను ముక్తుడే; సందియము లేదు. అట్టి మహాత్ము డెచ్చోటను ఆశ్రమములో గాని, అరణ్యములోగాని, జనమధ్యములోగాని, గృహస్థాశ్రమాద్యాశ్రమములోగాని ఉన్నను ముక్తుడే. లేక ఏ ఆశ్రమములో నున్నవాడైనను, ఏ జాతిలో నున్నవాడైనను శ్రీ గురుధ్యానముచేతనే ముక్తుడు గావలయును; సందేహము లేదు.

అవ: శ్రీగురుదేవుడు సాక్షాద్భగవంతుడని చెప్పుచున్నారు.

**జ్ఞానం వై రాగ్యమైశ్వర్యం యశశ్శ్రీస్స్వముదాహృతమ్**
**షడ్గుణైశ్వర్యయుక్తో హి భగవాన్ శ్రీగురుః ప్రియే! ॥ 172**

జ్ఞానం - వైరాగ్యం - ఐశ్వర్యం - యశః - శ్రీః -స్వం - ఉదాహృతమ్ - షడ్గుణైశ్వర్యయుక్తః- హి - భగవాన్ - శ్రీ గురుః - ప్రియే.

జ్ఞానం = ప్రజ్ఞానము (చూచుట, వినుట మొదలగు వ్యాపారములను తెలియుచు చతుర్ముఖేన్ద్రాదులయందును వ్యాపించియున్న చైతన్యము), వైరాగ్యం = పరాపరవైరాగ్యము, ఐశ్వర్యం - ఈశ్వరభావము, యశః = కీర్తియు, శ్రీః = సర్వసమృద్ధి, స్వం = సర్వవ్యాపక స్వస్వరూపము- అను షడ్గుణైశ్వర్యయుక్తః = ఆరుగుణములతో గూడిన, భగవాన్= భగవంతుడు, శ్రీగురుః = స్వయం ప్రకాశమానగురువు, హి = నిశ్చయము అని, హే ప్రియే = ఓ పార్వతీ, ఉదాహృతమ్ = చెప్పబడినది.

దేహేన్ద్రియాదుల యొక్కయు సర్వజగత్తుయొక్కయు సర్వవ్యాపారము లను దెలియుచు, బ్రహ్మాది పిపీలికాంతము వరకుగల సకలజీవులయందును వ్యాపించిన చైతన్యము ప్రజ్ఞాన మని తెలియవలెను. అదియే యిచ్చోట జ్ఞానశబ్దముచే గ్రహింపబడినది.

వైరాగ్యము పరాపరములని రెండు విధములు. "దృష్టానుశ్రవిక వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యం । తత్పరం పురుషఖ్యాతేః గుణవైతృష్ణ్యమ్"= ఇహలోక పరలోక సుఖములం దాసక్తి లేకుండట అపరమనియు, ఆత్మ నిత్యవస్తు వను జ్ఞానముచే త్రిగుణము లందును విరక్తి గలిగియుండుట పరమనియు శ్రీ పతంజలిమహర్షి చెప్పిరి. 1. అట్టి జ్ఞానము, 2. అట్టి వైరాగ్యము, 3. ఐశ్వర్యము (అణిమాద్యష్ట సిద్ధులతో గూడుకొనియున్న ఈశ్వరభావము), 4. కీర్తి (సకలాభయ వరప్రదాను డను ప్రసిద్ధి), 5. శ్రీ (సర్వభూతి), 6. స్వం (అంతట వ్యాపించి యుండునట్టి తనయొక్క పరిపూర్ణత్వము. అదియే స్వస్వరూపము, ఆనందము.)- ఈ ఆరుగుణములతో కూడుకొన్నట్టి భగవంతుడు శ్రీగురుమూర్తియే యని ఇష్టురాలగు నో పార్వతీ! తెలియుమా! ఇది నిశ్చయము.

**ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః ।**

**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా: ॥**

ఈ యారు గుణములు భగ మనబడును. ఇవి గలవాడు భగవంతుడు.

**ఉత్పత్తిం ప్రళయం చైక భూతానామాగతిం గతిమ్ ।**
**వేత్తి విద్యామవిద్యాం చ స వాచ్యో భగవానితి ॥**

సకలభూతములయొక్క ఉత్పత్తినాశములు, గమనాగమనములు, విద్యావిద్యలు అను నీయారింటిని తెలియు వాడు భగవంతుడు. అట్టి భగవంతుడు స్వయంప్రకాశమాన జ్ఞానస్వరూప గురుదేవు డని తెలియవలెను. భగవంతుడే శ్రీ గురుస్వరూపముగ జ్ఞానబోధకై వచ్చెనని భక్తులు భావించవలెను. ఇది సత్యము.

అవ: అంతయు శ్రీగురుస్వరూప మని తెలుపుచు వేరొకదృశ్యము లేదని తెలుపుచున్నారు.

**గురుశ్శివో గురుర్దేవో గురుర్బంధుశ్శరీరిణామ్ ।**
**గురురాత్మా గురుర్జీవో గురోరన్యన్న విద్యతే ॥ 173**

గురు: - శివ: - గురు: - దేవ: - గురు: - బన్ధు: - శరీరిణాం - గురు: - ఆత్మా - గురు: - జీవ: - గురో: - అన్యత్ - న -విద్యతే.

శరీరిణాం = సకలప్రాణులకు, గురు: = గురువు, శివ: = మంగలస్వరూపుడగు సాక్షాదీశ్వరుడు, గురు: = గురువర్యుడు, దేవ: = నిరంతరము ప్రకాశించు దేవుడు, గురు: = గురువు, బన్ధు: = ఆప్తుడు, గురు: = గురువు, ఆత్మా = తనలో నున్న పరమాత్మ, గురు: = గురువు, జీవ: = సర్వేన్ద్రియములకు సాక్షియగు జీవుడు, గురో: = గురువుకంటె, అన్యత్ = ఇతర మగుచున్నది, న విద్యతే = లేదు.

గురువే శివుడు, దేవుడు, బన్ధువు, జీవాత్మ, పరమాత్మ, అంతయు శ్రీగురుదేవుడే; వేరెద్దియు లేదు.

అవ: బాలునివలె నుండు తత్త్వజ్ఞానియొక్క లక్షణము నిట గొంత నిరూపించు చున్నారు.

**ఏకాకీ నిస్స్పృహశ్శాన్తశ్చింతాసూయావివర్జిత: ।**
**బాల్యభావేన యో భాతి బ్రహ్మజ్ఞానీ స ఉచ్యతే ॥ 174**

ఏకాకీ - నిస్పృహః - శాన్తః - చింతాసూయావివర్జితః - బాల్యభావేన - యః - భాతి - బ్రహ్మజ్ఞానీ - సః - ఉచ్యతే.

యః = ఏ మహానుభావుడు, ఏకాకీ = ఒంటరిగా నుండువాడును, నిస్పృహః = ఆశలేనివాడును, శాన్తః = పరమశాన్తస్వరూపుడును, చిన్తాసూయావివర్జితః = దుఃఖములు అసూయా రాగద్వేషములు మొదలైన వానిచే రహితుడునునై, బాల్యభావేన = బాలభావముతో, భాతి = ప్రకాశించుచున్నాడో, సః = అట్టి మహానుభావుడు, బ్రహ్మజ్ఞానీ = పరబ్రహ్మమును గుర్తెఱింగిన వాడని, ఉచ్యతే = చెప్పబడుచున్నాడు.

ప్రపంచమున బ్రహ్మజ్ఞానులు నిమిత్తమాత్ర ముండుచు బాలోన్మత్త పిశాచాదులవలె దిరుగుచుందురు; వారి తత్త్వ మట్టివారికి గాక త్రిమూర్తులకుగూడ గోచరము కాదని శాస్త్రములు చెప్పుచున్నవి. తానెప్పుడు నద్వితీయ పర బ్రహ్మమందే విహరించువా డగుటచే నేకాకిగను, ఆనందరసాత్మయందు పరితృప్తు డగుటచే నన్నిటియందును వాంఛ నశించిన వాడును, సర్వవృత్తులు ఉపశ మించుటచే పరమశాంత స్వరూపుడును, రాగద్వేష అసూయాది సర్వవృత్తులు నశించినందున నిష్కల్మషుడై పరిశుద్ధాత్మ స్వరూపుడై యున్నవాడును, యథార్థ బ్రహ్మము నెరింగిన వాడును నైన మహానుభావుడే బ్రహ్మజ్ఞాని యని చెప్పబడు చున్నాడు. ఆ తత్త్వజ్ఞాని బాలునివలె ప్రపంచములో మానాభిమానములు లేక ఏమియు దెలియనివానివలె నుండుచు దృశ్యరహిత జ్ఞానములో విహరించుచు చూచు వారలకు బాలునివలె ముద్దుగొల్పుచు నుంటున్నాడు, ఇందులకు దృష్టాంతము శ్రీ శుకమహర్షి భాగవతమును చూడుడు.

అవ: ఇప్పుడు సచ్చిదానంద స్వరూపమగు పరబ్రహ్మముయొక్క అనుభవముచే గలిగెడి ఆనందము అనంతమని తెలుపుచున్నారు.

**న సుఖం వేదశాస్త్రేషు న సుఖం మంత్రయంత్రకే ।**
**గురోః ప్రసాదాదన్యత్ర సుఖం నాస్తి మహీతలే ॥ 175**

న - సుఖం - వేదశాస్త్రేషు - న - సుఖం - మంత్రయంత్రకే - గురోః - ప్రసాదాత్ - అన్యత్ర - సుఖం - న - అస్తి - మహీతలే.

మహీతలే = భూమియందు, వేదశాస్త్రేషు = వేదములందును శాస్త్రములందును,

సుఖం = స ఘ, న = లేదు, మంత్రయంత్రకే = మహామంత్రములయందును, శ్రీచక్రాది యంత్రములయందును, సుఖం = పరమశాంతి, న = లేదు, గురోః = శ్రీగురుపరమాత్మయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహముకంటె, అన్యత్ర = మఱియొకచోట, సుఖం = పరమానందము, నాస్తి = లేదు.

వేదములందును, శాస్త్రములందును సుఖము లేదు. మహామంత్రముల యెడలను, శ్రీచక్రాది యంత్రములందును పరమసుఖము లేదు. అనగా వేదశాస్త్రములను జదివినను, యంత్రమంత్ర రహస్యముల నెరుంగు విద్యలను బడసినను అవన్నియు తనలో నున్న యవిద్యను బాపి పరమసుఖమును గలుగ జేయజాలవు. శ్రీ గురుదేవునియొక్క యనుగ్రహమాత్ర మనాదిదుఃఖమును నివర్తించి శ్రీ గురుబ్రహ్మ స్వరూపానుభవమును గలిగించి అపరిచ్ఛిన్న సుఖము ననుభవింప జేయుచున్నది. ఇట్టి తత్త్వమును నెరింగినప్పుడే వేదశాస్త్రములయొక్క ప్రయోజనము పూర్తి యగుచున్నది. శ్రీగురుస్వరూపము కేవల సుఖము, దానికన్న వేరు లేదు.

అవ: ఏ మతమునందును శాశ్వతసుఖము లభించదని నిరూపించుచున్నారు.

**చార్వాకవైష్ణవమతే సుఖం ప్రాభాకరే న హి ।**
**గురోః పాదాంతికే యద్వత్ సుఖం వేదాన్తసమ్మతమ్ ॥ 176**

చార్వాకవైష్ణవమతే - సుఖం - ప్రాభాకరే - న - హి - గురోః - పాదాంతికే - యద్వత్ - సుఖం - వేదాన్తసమ్మతమ్.

గురోః = శ్రీపరమాత్మయొక్క, పాదాన్తికే = చరణసన్నిధానమునందు, వేదాన్తసమ్మతం = ఉపనిషత్ప్రతిపాదితమైన, సుఖం = కేవలానందము, యద్వత్ = ఏప్రకారము పరిపూర్ణమై యున్నదో, తత్ సుఖం = అట్టిసుఖము, చార్వాకవైష్ణవమతే = చార్వాకులయొక్కయు వైష్ణవులయొక్కయు మతములందు, ప్రాభాకరే = పూర్వమీమాంసకుల మతమందును, న = లేదు, హి = నిశ్చయము.

శ్రీ గురుదేవునియొక్క సన్నిధానమున నిర్గుణ నిర్వికారమగు సకలోపనిషత్ప్రతి పాద్యమగు జననమరణరహిత ప్రజ్ఞానస్వరూపమగు నాత్మతత్త్వము తెలియ బడుచున్నది. అందుచే నపరిమితసుఖము లభించుచున్నది.

జీవులు స్వస్వరూపజ్ఞానమును తెలిసికొను పరమశాన్తిని పొందుచున్నారు. అట్టిసుఖము చార్వాకమతమును గాని, వైష్ణవ మతమునుగాని, శైవమతమునుగాని, జైనమతమునుగాని, పూర్వమీమాంసక మతమునుగాని ఆశ్రయించిన లభించదు. అవన్నియు కేవల తత్త్వజ్ఞానబాహ్యములు. వేదాన్తతత్త్వమే పరమసుఖ జ్ఞానస్వరూపము.

అవ: మఱియు బ్రహ్మసుఖమునే వర్ణించుచున్నారు.

**న తత్సుఖం సురేంద్రస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యత్సుఖం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥ 177**

న - తత్ - సుఖం - సురేంద్రస్య - న - సుఖం - చక్రవర్తినామ్ - యత్ - సుఖం - వీతరాగస్య - మునేః - ఏకాంతవాసినః.

వీతరాగస్య = విషయాసక్తి నశించి విరక్తుడైన, ఏకాంతవాసినః = ఏకాంతములో నుంటున్న (సర్వసంకల్పరహిత విజనమగు పరబ్రహ్మమందు వసించుచున్న), మునేః = మననశీలుడగు మహర్షికి (మౌనమును ధరించిన వానికి), యత్ = ఎటువంటి, సుఖం = అవాఙ్మానసగోచరమగు, నఖండమగు, నద్వితీయమగు పరమసుఖము గలదో, తత్సుఖం = అట్టి నిరుపమ నిర్వికారసుఖము, చక్రవర్తినామ్ = సార్వభౌములకు, న = లేదు, తత్ సుఖం= అట్టి నిర్విషయసుఖము, సురేంద్రస్య = దేవరాజునకు, న = లేదు.

ఈ విషయము నుపనిషత్తులలో విస్తారముగ గనందగును. లోకమున ననేకులు సుఖమును గోరి నానావిధ వ్యాపారములను జేయుచున్నారు. కొందరు ధనమందును, కొందరు శాస్త్రములందును, కొందరు అధికారమునందును సుఖము గలదని తలంచి వానిని సంపాదించుచున్నారు. ఇట్లనేక విధములుగ సుఖమునే కోరుచున్నారు. దానికై భూస్వాములుగను, శ్రోత్రియులుగను, యజ్ఞయాగాదులను జేయువారుగను, మంత్రులుగను, రాజులుగను, ఏకచ్ఛత్రాధిపత్యముచే పరిపాలించు సార్వభౌములుగ నగుచున్నారు. ఇంతకును నూరు యాగములు చేసి దేవేంద్ర పదవిని బొందుచున్నారు. వీరింతగ ప్రవర్తించినను శాశ్వతసుఖమును బడయుట లేదు. ఇంతయేల, త్రిమూర్తుల నుపాసించి మహోత్తమములగు నాలోకములకు జని, తిరుగా వచ్చుచున్నారు. అందెచ్చటను శాశ్వతసుఖము లేక

పరిభ్రమించుచునే యున్నారు.

ఆ సుఖము లన్నియు నింద్రియములకు సంబంధించినవి, విషయములతో గూడినవి. కాని నిర్విషయస్థితి పొందిన, నిరంతరము మననశీలుడై సర్వసంకల్ప రహిత పరబ్రహ్మమందు రమించుచున్నను, అన్నియు దెలిసి తెలియని వానివలె ప్రపంచముతో సంబన్ధము లేక మౌనియై యున్న మహాత్ముడు శ్రీగురుదేవుని యపార కరుణచే నిచ్చుటనే స్వస్వరూప జ్ఞానమును బొంది పరమసుఖమును పొందుచున్నాడు. దీనికి సాటి మరియొక సుఖము లేదు. పై దెల్పినవా రనుభవించిన సుఖముగూడ తన స్వరూప మనియే యెరుంగవలయును. కాని వారిది సోపాధిక మగుటచే, స్వాతిశయ మగుటచే నిత్యము గాదు. తనయొక్క సుఖము బ్రహ్మసుఖము, నిరుపాధికము, నిరతిశయము, అఖండము.

**"నాతస్సుఖతరం కిఞ్చిత్ త్రిషు లోకేషు విద్యతే ।**
**వీతతృష్ణస్య కామేభ్యో ముక్తసంగస్య యత్సుఖమ్ ॥"**

దీని యర్థము పైన దెలిపినదే.

**యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ ।**
**తృష్ణాక్షయసుఖస్యైతే కళాం నార్హతి షోడశీమ్ ॥**

లోకములో విషయసుఖము లేవి గలవో పరలోకములోని దివ్యసుఖము లేవి గలవో, అవన్నియు వీతరాగునియొక్క సుఖలేశములోని యే యొక భాగమునకును సరిరావు.

అవ: బ్రహ్మానంద రసాస్వాదనా మహిమ:

**నిత్యం బ్రహ్మరసం పీత్వా తృప్తో యః పరమాత్మని ।**
**ఇంద్రం చ మన్యతే రంకం నృపాణాం తత్ర కా కథా ॥ 178**

నిత్యం - బ్రహ్మరసం - పీత్వా - తృప్తః - యః - పరమాత్మని - ఇంద్రం - చ - మన్యతే - రంకం - నృపాణాం - తత్ర - కా - కథా.

యః = ఎవడు, నిత్యం = శాశ్వతమైన, బ్రహ్మరసం = బ్రహ్మానందరసమును, పీత్వా = పానము చేసి, పరమాత్మని = స్వస్వరూపమగు పరమాత్మయందు, తృప్తః = సంతృప్తిని

బడయుచున్నాడో, సః = అట్టి మహానుభావుడు, ఇంద్రం చ = త్రిలోకాధిపతియగు దేవేంద్రునిగూడ, రంకం = గవ్వగూడలేని దరిద్రునిగా, మన్యతే = తలంచుచున్నాడు (అట్లుండగా), తత్ర = ఆ విషయమునందు, నృపాణాం = రాజులయొక్క, కథా = వార్త, కా = ఎక్కడిది?

నిత్యమగు బ్రహ్మానందరసమును పానము జేసి, నిరతిశయానంద స్వరూపి యగు, నెప్పుడును స్వస్వరూప పరబ్రహ్మమందే సంతృప్తుడైన మహాత్ముడు త్రైలోక్యరాజ్యము నేలు దేవేంద్రునిగూడ నొకగవ్వలేని దరిద్రునివలె తలంచు చున్నాడు. ఇక నెంతో క్రిందుగ నున్న మహారాజుల విషయమైగాని వారి భృత్యుల విషయమైగాని వార్త యున్నదా? వారి విషయ మేమాత్రము జ్ఞాపకమునకు వచ్చునా? ఇంత యననేల, సమస్తలోకమును గడ్డిపరకవలె చూచు మహావిరాగులకు నేదియు గణనములోనికి రాదు. వారి వైరాగ్యభాగ్య మహిమను జూడుడు.

**పతతు నభః స్ఫుటతు మహీ డయన్తు గిరయో మిళంతు వారిధయః ।**
**అధరోత్తరమస్తు జగత్ కా హానిః వీతరాగస్య ॥**

ఆకాశము ఫళఫళమని విరిగి క్రిందికి పడుగాక; భూమియంతయు పటపటమని పగిలి పాతాళలోకమున బడుగాక; పర్వతములు డేగలవలె నాకాశమున సంచరించుగాక; సముద్రములు మహాటోపముతో లోకము లన్నిటిని ముంచివేయు గాక; బ్రహ్మాండము లన్నియు తలక్రిందు లగుగాక; ఇంత యయినను వీతరాగునికి హాని యెక్కడిది? నిత్యుడగు తన కేమియు భయము లేదని తాత్పర్యము.

**న సుఖం దేవరాజస్య న సుఖం చక్రవర్తినామ్ ।**
**యాదృశం వీతరాగస్య మునేరేకాంతవాసినః ॥**

అని శివతత్త్వజ్ఞానము. దీనియర్థము పైన నుడివినదే.

అవ: ఇంతకు సిద్ధించినట్టి ముఖ్యార్థమును దెలుపుచున్నారు.

**యతః పరమకైవల్యం గురుమార్గేణ వై భవేత్ ।**
**గురుభక్తిరతః కార్యా సర్వదా మోక్షకాంక్షిభిః ॥** 179

యతః - పరమకైవల్యం - గురుమార్గేణ - వై - భవేత్ - గురుభక్తిః - అతః - కార్యా - సర్వదా - మోక్షకాంక్షిభిః.

యతః = ఎందువలన, పరమకైవల్యం = మహోత్కృష్టమగు ముక్తి, గురుమార్గేణ వై = శ్రీగురుతత్త్వ జ్ఞానముచేతనే, భవేత్ = అగునో, అతః = అందువలన, గురుభక్తి = గురుదేవునియందు భక్తి, సర్వదా = ఎప్పుడును,మోక్షకాంక్షిభిః = మోక్షమును గోరువారిచేత, కార్యా =అ నుష్ఠింపదగినది.

ముక్తి మూలకారణ మగు శ్రీగురుదేవునియందలి అనన్యభక్తిచేత లభించుచున్నది కావున శ్రీగురుదేవునియెడ పరమభక్తి గలిగి తత్త్వవిచారణ చేయుచుండిన పరమకైవల్యము లభించును. కనుక మోక్షము బడయువారు శ్రీగురుదేవుని పరమదైవమని నమ్మి సర్వదా సేవించవలయును.

అవ: శిష్యుడు శ్రీగురుదేవుని ద్వారా మహావాక్య తత్త్వోపదేశ మైన తరువాత నెచ్చోటికిని పోనవసరము లేదని తెల్పుచున్నారు.

**ఏక ఏవాద్వితీయోఽహం గురువాక్యేన నిశ్చితః ।**
**ఏవమభ్యస్యతా నిత్యం న సేవ్యం వై వనాంతరమ్ ॥ 180**

ఏకః - ఏవ - అద్వితీయః - అహం - గురువాక్యేన - నిశ్చితః - ఏవం - అభ్యస్యతా - నిత్యం - న - సేవ్యం - వై - వనాంతరం.

గురువాక్యేన = గురువాక్యమగు తత్త్వమసి యను మహావాక్యముచేత, అహం = నేను, అద్వితీయః = రెండవది లేని, ఏకః ఏవ = పరమాత్మనే అని, నిశ్చితః = నిశ్చయింపబడెను, ఏవం = ఇట్టి అభేదభావములో, నిత్యం = ఎల్లప్పుడు, అభ్యస్యతా = అభ్యాసము చేయుచున్న వానిచేత, వనాంతరం = అరణ్య మధ్యప్రదేశము (మఱియొక్క వనము), న సేవ్యం వై = సేవించదగినది కాదుగదా?

మహావనాంతరములలోను, గుహలలోను, తపోధ్యానాదు లొనరించి యెట్టి తత్త్వజ్ఞానము పొందదగినదో, అట్టి ఆత్మజ్ఞానము శ్రీ గురుదేవుని సన్నిధానముననే కలుగుచున్నది. శ్రీగురుదేవుడు పరమదయతో తత్త్వమసి వాక్యార్థమును శిష్యునకును ఉపదేశించెను. ఆ పరబ్రహ్మ స్వరూపము "ఏక ఏవాద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన'' అను నుపనిషద్రీతిగా నేనై యున్నాను. నేనొక్కడనే,

మఱియొకటి లేదు అను నద్వైతజ్ఞానము నిశ్చిత మాయెను. నాకును బ్రహ్మమునకును భేద మేమియు లేదు. ఏకాద్వితీయబ్రహ్మము నేనే యని నిశ్చయపూర్వకముగ నభ్యసించువాడు. వనాంతరములలో పొందదగినది ఇచ్చోటనే ప్రాప్తమాయెను. కనుక వేరొకచోటికి పోనవసరము లేదు. శ్రీగురువుదగ్గరనే యుండవచ్చును. ఇట్లు శ్రీ గురుకరుణచే పరమానందమును బడయుచున్నాడు.

అవ: ఆత్మజ్ఞానముయొక్క మహిమను జెప్పుచున్నారు.

**అభ్యాసాన్నిమిషేణైవ సమాధిమధిగచ్ఛతి ।**
**ఆజన్మజనితం పాపం తత్ క్షణాదేవ నశ్యతి ॥ 181**

అభ్యాసాత్ - నిమిషేణ - ఏవ - సమాధిం - అధిగచ్ఛతి - ఆజన్మజనితం పాపం - తత్క్షణాత్ - ఏవ - నశ్యతి.

అభ్యాసాత్ = ముందు చెప్పబడిన అహం బ్రహ్మాస్మి యను మహావాక్యార్థమగు నేను బ్రహ్మమను జ్ఞానముయొక్క అనుష్ఠానమువలన, నిమిషేణైవ = నిమిషకాలముచేతనే, సమాధిం = జీవబ్రహ్మైక్యమను జ్ఞానసమాధిని (అధికారియగు ముముక్షువు), అధిగచ్ఛతి = పొందుచున్నాడు, తత్క్షణాదేవ = అట్టి బ్రహ్మభావన చేసిన త్రుటికాలములోనే, ఆజన్మ జనితం= తాను జన్మ ధరించినది మొదలుకొని గలిగినట్టి, పాపం = పాపము, నశ్యతి = నశించుచున్నది.

శ్రీగురుదేవునిచే బోధింపబడినట్టి తత్త్వమును శ్రవణము చేసినందువల్ల గలిగిన నేను బ్రహ్మమను జ్ఞానముయొక్క అభ్యాసముచేతనే యొక నిమేష కాలములో జీవబ్రహ్మైక్యమను నపరోక్ష జ్ఞానానుభవ సమాధిని పొందుచున్నాడు. అప్పు డనేకజన్మలలోనుంచి వచ్చిన పాపమను నజ్ఞానావరణము తొలగిపోవుచున్నది. అనేకజన్మజనితపాప మనగా స్వస్వరూప జ్ఞానరహితమగు నజ్ఞానమని గ్రహించవలయును. పాపము లన్నియు శ్రీగురుదర్శనాదులవలన నాశమయినవి. కేవలాజ్ఞానావరణమాత్ర మవశిష్టమై యుండెను. అన్ని సామగ్రు లుండినప్పుడు దీపము వెలిగించినచో వెలుగుచున్నది. ప్రకాశముమాత్రము కనబడుచున్నది. కాని చీకటి యెచ్చటికి పోయెనో విచిత్రముగ నున్నది. ఆప్రకాశము తమస్సును దూరీకరించియే బయలువెడలినది. ఆప్రకారము సాధనచతుష్టయ సమ్పత్తి గల పురుషుడు శ్రీగురువాక్యమును బాగుగా శ్రవణము చేసిన వాడగుటచే నొకసారి

నేను బ్రహ్మమని మననము చేసినంత మాత్రమున నిమేషకాలములో మహాపాప రూప తమస్సు తొలంగి జ్ఞానానుభవము గలవా డగుచున్నాడు.

అవ: పరాపూజావిధానమును సంగ్రహముగ దెలుపుచున్నారు.

**కిమావాహనమవ్యక్తే వ్యాపకే కిం విసర్జనమ్ ।**
**అమూర్తే చ కథం పూజా కథం ధ్యానం నిరామయే ॥ 182**

కిం - ఆవాహనం - అవ్యక్తే - వ్యాపకే - కిం - విసర్జనం - అమూర్తే - చ - కథం - పూజా - కథం - ధ్యానం - నిరామయే.

అవ్యక్తే = వ్యక్తముగాని మహాసూక్ష్మమగు నింద్రియములకు గోచరించని రూపాదులు లేని పరమాత్మ విషయమై, ఆవాహనం = ఆవాహనము చేయుట (మఱియొక చోటునుంచి ఆహ్వానించి నిలబెట్టుట), కిం = సంభవించునా యేమి?, వ్యాపకే = సర్వవ్యాపక పరమాత్మవిషయమై, విసర్జనం = ఉద్వాసనము (విడచుట), కిం = సంభవ మగునా యేమి?, అమూర్తే = ఆకారము లేని దేవుని విషయమై, పూజా = అర్చనము, కథం = ఎట్లు?, నిరామయే = ఆధారములేని పరమాత్మ విషయమై, ధ్యానం = చిత్తముతో చింతించుట, కథం = ఎట్లు?

మహాసూక్ష్మాతిసూక్ష్మమై యింద్రియాదులకు గోచరించని నిరాకార వస్తువగు పరబ్రహ్మము నెటుల ఆహ్వానించవలయును? ఒకచోటనున్న దేవుని మఱియొక చోటికి "ఆవాహయామి, స్థాపయామి, ఆసనం సమర్పయామి" ఇత్యాది మన్త్రాదులచే నాహ్వానాదుల చేయువచ్చును. పరిపూర్ణవస్తువునకు నవి సంభవించునా? అట్లే సర్వపరిపూర్ణ పరబ్రహ్మమునకు విసర్జన మెట్లు సరిపోవును?పరిచ్ఛిన్న వస్తువునకు ఉద్వాసన ఎట్లు సంభవించును? అంతట నిండియున్న పరబ్రహ్మము నెచ్చోటికి నుద్వాసనము జేయవలయును? ఆకారమున్న వానికి పాదౌ "పూజయామి, గుల్ఫౌ పూజయామి" ఇత్యాది మన్త్రములచే సర్వావయవములను పూజింపవచ్చును. రూపనామములు లేని పరబ్రహ్మము నెట్లు పూజించవచ్చును? ఆధారముండిననే ధ్యానింప శక్యమగును. లక్ష్యమును గనుగొని కదా నాదమునో, బిందువునో, కళనో, జ్యోతినో ధ్యానించి సందర్శించవచ్చును. నిరామయము అనగా నిరాధారము.లక్ష్యము గానిది. దాని

నెట్లు ధ్యానింపనగును?

సిద్ధించినట్టి యర్థ మేమనగా, నాకారమున్న దేవునికి మాత్రము ఆవాహనము, విసర్జనము, షోడశోపచారపూజలు, ధ్యానములు చేయవచ్చును. నిరాకార నిరామయమైన పరబ్రహ్మము నెట్లు ఆవాహనము జేయగలము? ఉద్వాసనము చేయగలము?పూజింపగలము? ధ్యానింపగలము? మనస్సుచేత సంకల్పించుటకును, బుద్ధిచేత నూహించుటకును సాధ్యముగాక యుండినచో తదితర పూజాదులు సంభవింప నేరవు. అట్లే స్నానాదులును తెలియందగినవి. అయితే సర్వ పరిపూర్ణ మయిన, సర్వవ్యాపక మయిన, అవ్యక్త మయిన, సర్వాధార మయిన పరబ్రహ్మమందు మనస్సును లయింపజేసి ఆ పరబ్రహ్మమే తానని దృఢజ్ఞానము గలిగి యుండినచో బాహ్యములగు పూజ లొనర్చినట్లే, సర్వదేవతలను పూజించినట్లే, సకలతీర్థములలో మునింగినట్లే, అందఱి యనుగ్రహమును పొందినట్లే. ఇదియే ఆత్మపూజ, పరాపూజ.

**పూజాకోటిసమం స్తోత్రం స్తోత్రకోటిసమో జపః ।**
**జపకోటిసమం ధ్యానం ధ్యానకోటిసమో లయః ॥**

అను శ్లోకమున్ను పరాపూజ లయమునుగూడ నతిక్రమించి యున్నందుచే ననన్తఫలదమని తెలుపుచున్నది. ఈ పరాపూజా విషయమై శ్రీ శంకరాచార్యులు తెలిపినది సంగ్రహముగ నిటక్రింద తెలుపబడుచున్నది. అందుచే నంతయు స్పష్టము.

**ఓం పూర్ణస్యావాహనం కుత్ర సర్వాధారస్య చాసనమ్ ।**
**స్వచ్ఛస్య పాద్యమర్ఘ్యం చ శుద్ధస్యాచమనం కుతః ॥**

**నిర్మలస్య కుతస్స్నానం వస్త్రం విశ్వోదరస్య చ ।**
**నిరాలమ్బస్యోపవీతం పుష్పం నిర్వాసనస్య చ ॥**

**నిర్లేపస్య కుతో గంధో రమ్యస్యాభరణం కుతః ।**
**నిత్యతృప్తస్య నైవేద్యం తామ్బూలం చ కుతో విభోః ॥**
**ప్రదక్షిణా హ్యనంతస్య హ్యద్వయస్య కుతో నతిః ।**
**వేదవాక్యైరవేద్యస్య కుతస్స్తోత్రం విధీయతే ॥**

**స్వయంప్రకాశమానస్య కుతో నీరాజనం విభోః ।**
**అన్తర్బహిశ్చ పూర్ణస్య కథముద్వాసనం భవేత్ ॥**

**ఏవమేవ పరా పూజా సర్వావస్థాసు సర్వదా ।**
**ఏకబుద్ధ్యా తు దేవేశే విధేయా బ్రహ్మవిత్తమైః ॥**

ఈ పరాపూజను నిత్యము బ్రహ్మజ్ఞానులు చేయువలయును. దీని యర్థము సులభగ్రాహ్యము.

అవ: ఈ శ్లోకమున నందఱికిని శ్రీగురుదేవుడే మొదటివాడనియు, నాయనయే త్రిమూర్తులనియు తెలుపుచున్నారు.

**గురుర్విష్ణుస్సత్త్వమయో రాజసశ్చతురాననః ।**
**తామసో రుద్రరూపేణ సృజత్యవతి హన్తి చ ॥ 183**

గురుః - విష్ణుః - సత్త్వమయః - రాజసః - చతురాననః - తామసః - రుద్రరూపేణ - సృజతి - అవతి - హన్తి - చ.

గురుః = శ్రీ గురుమూర్తియే, రాజసః = రజోగుణము గల, చతురాననః = బ్రహ్మదేవుడై, సృజతి = (లోకమును) సృష్టించుచున్నాడు, సత్త్వమయః = సత్త్వగుణ స్వరూపుడైన, విష్ణుః = విష్ణుదేవుడై, అవతి = రక్షించుచున్నాడు, తామసః = తమోగుణ విశిష్టుడై, హన్తి చ = సంహరింపను సంహరించుచున్నాడు.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ముగ్గుఱును క్రమముగా జగముయొక్క సృష్టి స్థితి లయములకు కారణభూతులై యున్నారు. వారెవ్వ రనగా, సృష్టి స్థితి లయములె ట్లేర్పడిన వనగా సంగ్రహముగా స్పష్టముగ చెప్పుచున్నారు. ఆదియందు శ్రీగురు పరబ్రహ్మ మొకటియే యుండెను. ఆ శ్రీగురుపరమాత్మయే త్రిగుణాత్మికమగు మాయ ననుసరించి రాజసగుణముచే చతుర్ముఖుడై నాలుగు వేదములతో గూడినవాడై జగమును సృష్టించుచున్నాడు. సత్త్వగుణముచే సర్వవ్యాపకమగు విష్ణుమూర్తియై జగమును రక్షించుచున్నాడు. తమోగుణముచే నీశ్వరుడై సమస్తజగమును తనలో లయింపజేసికొనుచున్నాడు. ఈ ప్రకారము ఆదిమధ్యాన్తములయందు శ్రీగురుపరబ్రహ్మమే యున్నది. అవశిష్ట మయినదియు నా పరిపూర్ణపరబ్రహ్మమేను. ఇదే విషయము,

**సమస్త్రిమూర్తయే తుభ్యం ప్రాక్సృష్టేః కేవలాత్మనే ।**
**గుణత్రయవిభాగాయ పశ్చాద్భేదముపేయుషే ॥**

సృష్టికి ముందు కేవలస్వరూపుడును, తరువాత త్రిగుణములనుబట్టి త్రిమూర్తులను ధరించిన పరమాత్మవైన నీ కొఱకు నమస్కారము అని బ్రహ్మదేవునిగూర్చి స్తుతిని దేవతలు చేసిరి అను శ్రీ కాళిదాసుని వాక్యముచే తెలియబడుచున్నది.

అవ: గురువే బ్రహ్మమయము:

**స్వయం బ్రహ్మమయో భూత్వా తత్పరఞ్చావలోకయేత్ ।**
**పరాత్పరతరం నాన్యత్ సర్వగం తన్నిరామయమ్ ॥** **184**

స్వయం - బ్రహ్మమయః - భూత్వా - తత్ - పరం - చ - అవలోకయేత్ - పరాత్ - పరతరం - న - అన్యత్ - సర్వగం, తత్ - నిరామయం.

స్వయం = తాను, బ్రహ్మమయః = అద్వితీయ పరబ్రహ్మస్వరూపముగ, భూత్వా = అయి, తత్ =అట్టి సర్వవ్యాపకత్వాదులచే ప్రసిద్ధ మయిన, పరం చ = అన్నిటికిని పరమైన మిగుల శ్రేష్ఠమయిన పరబ్రహ్మమునుగూడ, అవలోకయేత్ = తనలో తాను చూచుచుండవలయును లేక తనను చూడగల్గును, పరాత్ = పరావిద్య యనబడు ఉపనిషత్తుచే వేద్యమయిన పూర్ణమయిన పరబ్రహ్మముకంటె, పరతరం = శ్రేష్ఠమయినది, అన్యత్ = మఱియొక వస్తువు, న = లేదు, తత్ = ఆ పరవస్తువు, సర్వగం = అంతటిని పొందినది (సర్వవ్యాపి), నిరామయం = నిరాధార మయినది (అదన్నిటికి నాధారముగ వెలుగొందుచున్నది).

శ్రీగురూపదేశానుసారము శ్రవణముచేసి మనన నిదిధ్యాసములను చేసి తాను పరబ్రహ్మయే గావలయును. అట్లయ్యును నిశ్చయజ్ఞానము గలిగి నిత్యమునా పరిపూర్ణ పరబ్రహ్మమునే సాక్షాత్కరించుకొనుచుండవలయును. ఇది మహాత్ముల స్వభావము. అమృతపాయి అమృతమును వదలునా! ప్రకాశము చీకటిని పొందునా! సర్వదా తనలో తన్ను దర్శించుకొనుట, అద్వితీయ బ్రహ్మమై యుండుట స్వభావము.

మఱియొక యర్థము: తాను బ్రహ్మస్వరూపుడను నిశ్చయజ్ఞానము గలిగి బ్రహ్మరూపి యయినంత మాత్రాన పరమగు పరబ్రహ్మమును సందర్శించగల్గును; బ్రహ్మలో నైక్యమొందును. అట్టి పరవస్తువుకన్న మఱియొక శ్రేష్ఠవస్తువు లేదు. ఆ

పరబ్రహ్మము సర్వవ్యాపకము, నిరామయము = మాయారహితము, నిరాధారము, సర్వాధారము, పరిపూర్ణము, అఖండము.

అవ: నిరంతరము బ్రహ్మావలోకనమును జేయుచు నున్నందుచే గలుగు స్థితిని దృఢత్వమునకై పునః పునః చెప్పుచున్నారు.

**తస్యావలోకనం ప్రాప్య సర్వసంగవివర్జితః ।**
**ఏకాకీ నిస్స్పృహశ్శాన్తస్స్థాతవ్యం తత్ప్రసాదతః ॥ 185**

తస్య - అవలోకనం - ప్రాప్య - సర్వసంగవివర్జితః - ఏకాకీ - నిస్స్పృహః - శాన్తః- స్థాతవ్యం - తత్ప్రసాదతః.

తస్య = పరమగు స్వస్వరూప పరబ్రహ్మముయొక్క, అవలోకనం = దర్శనమును, ప్రాప్య = పొంది, సర్వసంగవివర్జితః - సర్వసంగ = సమస్తదృశ్యముయొక్క సమ్బన్ధముచేత, వివర్జితః = విడువబడినవాడై, ఏకాకీ = అద్వితీయుడై, నిస్స్పృహః = సర్వాసక్తులును లేనివాడై, శాన్తః = పరమశాంతిని బడసినవాడై, తత్ప్రసాదతః = ఆ శ్రీగురుపరమాత్మానుగ్రహమువలన (పై జెప్పిన విధముగ వానిచేత), స్థాతవ్యం = ఉండవలయును.

తనలో నిత్యమవచ్ఛిన్నముగ స్వస్వరూపమును సాక్షాత్కరించుటచే సర్వదృశ్యములు నశించుచున్నవి. వాసనారహితుడై యసంగు డగుచున్నాడు. అద్వితీయు డగుచున్నాడు. అన్ని చోట్లను తనయొక్క స్వరూపమయ్యే యున్నాడు. వీతరాగియై పరమశాంతిని బొందినవాడై ప్రకాశించుచున్నాడు. తరువాతను శ్రీగురుపరమాత్మానుగ్రహమువలన జ్ఞానరక్షను పొందియుండవలయును.

అవ: పరిపూర్ణ బ్రహ్మానుభవము గలిగిన తరువాత నొకేచోట నుండవలయునని నియమము లేదు. సర్వదా బ్రహ్మస్వరూపుడై విహరించవచ్చును. ఈ విషయము నిచ్చోట తేటపరచుచున్నారు.

**లబ్ధం వాఽథ న లబ్ధం వా స్వల్పం వా బహుళం తథా ।**
**నిష్కామేనైవ భోక్తవ్యం సదా సన్తుష్టమానసః ॥ 186**

లబ్ధం - వా - అథ - న - లబ్ధం - వా - స్వల్పం - వా - బహుళం - తథా - నిష్కామేన - ఏవ - భోక్తవ్యం - సదా - సన్తుష్టమానసః.

సదా = ఎప్పుడును, సన్తుష్టమానసః = పరమాత్మానుభవముచే సంతోషము చెందినవాడు కనుకనే ఆ మహనీయాత్ముడు, లబ్ధం వా = పొందబడిన వస్తువైనను, న లబ్ధం వా = పొందబడని దైనను, స్వల్పం వా = కొంచెమైనను, తథా = అట్లు, బహుళం వా = అధిక మయినను, నిష్కామేనైవ = కోరిక లేకుండువా డగుటచేతనే, భోక్తవ్యం = అనుభవించదగిన దగుచున్నది.

తాను పరబ్రహ్మానుభవానందముచే భరితుడై సన్తుష్టు డగుచున్నాడు. వానికి పొందవలసినది లేదు. వాంఛించ దగినదియు లేదు. కావున కోరకయే యధేచ్ఛముగా వచ్చిన భోజనాదుల ననుభవించుచున్నాడు. ఒకవేళ లభించకపోయిన నూరకే యుంటున్నాడు. అట్లే స్వల్పముగా లభించినను, అధికముగా లభించినను దానిని నిరీహతో భుజించుచున్నాడు. సర్వదృశ్య విషయములందాసక్తి నిశ్శేషముగ నశించి యున్నందుచే నుదాసీనుడై యుంటున్నాడు. 'హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః' 'నాభినందతి న ద్వేష్టి' 'అనికేతః స్థిరమతిః' 'భక్తిమాన్ మే ప్రియో నరః' ఇత్యాది భగవద్గీతా వాక్యములును పై విషయమునే దృఢీకరించుచున్నవి.

అవ: సర్వజ్ఞత్వపదమన నేమిటో దానిని విశదీకరించుచున్నారు.

**సర్వజ్ఞపదమిత్యాహుర్దేహీ సర్వమయో భువి ।**
**సదా౽౽నందః సదా శాంతో రమతే యత్ర కుత్ర చిత్ ॥ 187**

సర్వజ్ఞపదం - ఇతి - ఆహుః - దేహీ - సర్వమయః - భువి - సదా - ఆనందః - సదా- శాంతః - రమతే - యత్ర - కుత్ర - చిత్.

దేహీ = ఆత్మ, సదా = ఎల్లప్పుడు, ఆనందః = ఆనందస్వరూపమై, సదా = ఎల్లప్పుడు, శాంతః = పరమశాంతిని బొందినదై, సర్వమయః = అంతటను వ్యాపించినదై, యత్రకుత్ర చిత్ = ఎచ్చోటనైనను, రమతే = క్రీడించుచున్నదో, (తత్ = ఆ సర్వత్ర రమణమును), సర్వజ్ఞపదమితి = సర్వజ్ఞస్థానమని, ఆహుః = బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు.

ఎవనియొక్క ఆత్మ సదా ఆనందస్వరూపమై శాంత స్వరూపమై సర్వత్ర వ్యాపించి అన్నిచోట్లను విహరించుచున్నదో అనగా తనయొక్క ఆత్మయే అందరి హృదయములో నున్నదని జ్ఞానముగలవా డగుచున్నాడో సమస్తమును దెలియు

నాత్మస్వరూపు డగుచున్నాడో ఆప్రకారము సర్వత్ర వ్యాపించి తన స్వరూపమునుగ తెలిసికొనడమే సర్వజ్ఞునియొక్క స్థానము నధిష్ఠించినవా డగుచున్నాడు. తాను తన దేహేంద్రి యములకు సాక్షియగుట- మాత్రమేగాక సమస్త సమష్టికి సాక్షియై తెలియడమే సర్వజ్ఞత్వపదమని బ్రహ్మజ్ఞానులు చెప్పుచున్నారు.

అవ: ఆ మహాత్ముడున్న ప్రదేశ మంతయు మహాపవిత్రమని చెప్పుచున్నారు.

**యత్రైవ తిష్ఠతే సోఽపి స దేశః పుణ్యభాజనః ।**
**ముక్తస్య లక్షణం దేవి! తవాగ్రే కథితం మయా ॥ 188**

యత్ర - ఏవ - తిష్ఠతే - సః - అపి - సః - దేశః - పుణ్యభాజనః - ముక్తస్య - లక్షణం - దేవి - తవ - అగ్రే - కథితం - మయా.

సః అపి = ఆ మహానుభావుడు (సర్వాత్మకత్వ సర్వజ్ఞత్వ పదవిని పొందినవాడును), యత్ర = ఏ ప్రదేశమునందు, తిష్ఠతే = ఉంటున్నాడో, సః దేశ = ఆ ప్రదేశము, పుణ్యభాజనః = సకల పుణ్యములకు స్థానమైనది, హే దేవి = ఓ పార్వతీదేవీ, తవ = నీయొక్క, అగ్రే = ముందు, ముక్తస్య = జీవన్ముక్తునియొక్క, లక్షణం = స్వరూపము, మయా = నాచేత, కథితం = చెప్పబడినది.

ఆ మహానుభావుడు సర్వజగ దంతర్యామియగు, సర్వసాక్షియగు, సమస్తమును తెలియునట్టి పరమాత్మయొక్క స్వరూపుడై పరిపూర్ణుడై యుంటు న్నాడు. ఇట్టి సర్వజ్ఞత్వపదవి నధిష్ఠించిన బ్రహ్మజ్ఞాని యెచ్చోట నివసించుచున్నాడో ఆ ప్రదేశము సకలపుణ్యములకు నిలయమని తెలియుము. అచ్చట నున్న జనులు మహాపవిత్రాత్ములు దయామయులుగ నుందురు. ఇటుండగా అట్టి మహాను భావుడు గ్రామగ్రామముకు పోయి దివ్యోపదేశము చేయుచుండగా నాప్రాంతమున నవివేకమను తమస్సు సంచరింప గలదా? మహాత్ముల సంచారముయొక్క మహిమ వినుడు.

**నిమిషం నిమిషార్ధం వా యత్ర తిష్ఠతి యోగినః ।**
**తత్ర తత్ర కురుక్షేత్రం ప్రయాగో నైమిశం వనమ్ ॥**

మహాత్ము లెచ్చోట నిమిషముగాని, అర్ధనిమిషముగాని నిలిచి యుందురో

ఆప్రదేశము లన్నియు కురుక్షేత్రముగను, ప్రయాగతీర్థముగను, నైమిశారణ్యముగ నగుచున్నవి. అనగా అట్టి పవిత్రము లగుచున్నవి. మరియు

**"కులం పవిత్రం జననీ కృతార్థా విశ్వంభరా పుణ్యవతీ చ తేన ।**
**అపారసచ్చిత్సుఖసాగరేஉస్మిన్ లీనం పరే బ్రహ్మణి యస్య చేతః ।**

ఎవని మనస్సు క్షణకాల మైనను నపారజ్ఞాన సాగరమగు పరమాత్మయందు లీనమగునో ఆ మహాత్ముని కులము పవిత్ర మగుచున్నది. తల్లిదండ్రులు కృతార్థు లగుచున్నారు. ఆ మహాత్ముడుండు భూమియంతయు(దేశమంతయు) పుణ్యవంత మగుచున్నది. ఓ దేవీ! ఇట్లు జీవన్ముక్తునియొక్క స్వరూపము, మాహాత్మ్యము నీకు జెప్పితిని. "తీర్థీ కుర్వన్తి తీర్థాని సుకర్మీ కుర్వన్తి కర్మాణి సచ్ఛాస్త్రీ కుర్వన్తి శాస్త్రాణి' (శ్రీ నారదసూత్రము.)

అవ: గురుభక్తి ప్రభావము.

**ఉపదేశస్త్వయం దేవి! గురుమార్గేణ ముక్తిదః ।**
**గురుభక్తిః తథాஉత్యంతా కర్తవ్యా వై మనీషిభిః ॥ 189**

ఉపదేశః - తు - అయం - దేవి - గురుమార్గేణ - ముక్తిదః - గురుభక్తిః - తథా - అత్యంతా - కర్తవ్యా - వై - మనీషిభిః.

హే దేవి = ఓ పార్వతీదేవీ, అయం ఉపదేశస్తు = ఈ ఆత్మజ్ఞానోపదేశ మైతే, గురు మార్గేణ = గురువుయొక్క మార్గమగు శుశ్రూషచేత పొందబడినదై, ముక్తిదః = ముక్తినొసగుచున్నది కనుక, మనీషిభిః = వివేకవంతులచేత, తథా = గురుదేవుని అనుగ్రహము గలుగునట్లుగా, అత్యన్తా గురుభక్తిః = పరభక్తి, కర్తవ్యా వై = చేయదగినదిగదా!

గురుభక్తి తప్పక ఆచరించవలయునని చెప్పుచున్నారు. ఈ ఆత్మజ్ఞానో పదేశము శ్రీ గురుదేవుని శుశ్రూషను చేయక, గురుననుగ్రహమును పొందక లభ్యమగునది గాదు. కాన శ్రీగురుననుగ్రహముచే బ్రహ్మతత్త్వోపదేశము వడసి ముక్తిని పొందవలయును. కాబట్టి సర్వదా శ్రీ గురుదేవునియందు పరమభక్తిని వివేకవంతులు చేయుచుండవలయును.

**"గురుభక్తిం సదా కుర్యాత్ శ్రేయసే భూయసే నరః ।**

**గురురేవ శివ స్తస్య నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ॥**

శిష్యునకు గురువే దేవుడు. మోక్షముకొఱకు గురుభక్తిని సదా చేయవలెను.

అవ: శ్రీ గురుస్వరూపమును స్తుతించుచు నమస్కరించుచున్నాడు.

**నిత్యయుక్తాశ్రయస్సర్వవేదకృత్సర్వవేదకృత్ ।**
**స్వపరజ్ఞానదాతా చ తం వందే గురుమీశ్వరమ్ ॥ 190**

నిత్యయుక్తాశ్రయః - సర్వవేదకృత్ - సర్వవేదకృత్ - స్వపరజ్ఞానదాతా - చ - తం - వందే - గురుం - ఈశ్వరం.

యః = ఏ శ్రీగురుదేవుడు, నిత్యయుక్తాశ్రయః - నిత్య = పరమాత్మయందు, యుక్త = కూడుకొన్నయోగము, ఆశ్రయః = ఆశ్రయముగా గలవాడును, సర్వవేదకృత్ = సమస్తవేదముల నుపదేశించువాడును, సర్వవేదకృత్ = సమస్తజ్ఞానములను బోధించువాడును, స్వపరజ్ఞానదాతా - స్వ = తనయొక్క (జీవునియొక్క), పర = ఈశ్వరునియొక్క, జ్ఞానం = జ్ఞానమును, దాతా = ఒసగువాడునునై యున్నాడో, తం = అట్టి జ్ఞానస్వరూపుడగు, ఈశ్వరం గురుం = పరమేశ్వరుడగు గురుదేవుని, వందే = నమస్కరించుచున్నాను.

నిత్యము పరబ్రహ్మైక్యయోగమునందున్న వాడును, సమస్త వేదార్థములను వివరించి అఖండజ్ఞాన స్వరూపమును బోధించువాడును, కట్టకడపట జీవబ్రహ్మైక్య జ్ఞానమును గూడ సులభముగ నుపదేశించువాడును నగు సాక్షాదీశ్వరుడైన శ్రీ గురుదేవుని నమస్కరించుచున్నాను.

అవ: శ్రీగురుదేవుడు లేకున్న యాత్మజ్ఞానము పండితులకును గలుగదని నిరూపించుచున్నారు.

**యద్యప్యధీతా నిగమాష్షడంగా ఆగమాః ప్రియే ।**
**అధ్యాత్మాదీని శాస్త్రాణి జ్ఞానం నాస్తి గురుం వినా 191**

యది - అపి - అధీతాః - నిగమాః - షడంగాః - ఆగమాః - ప్రియే - అధ్యాత్మాదీని- శాస్త్రాణి - జ్ఞానం - న - అస్తి - గురుం - వినా.

నిగమాః = చతుర్వేదములు, షడంగాః = శిక్షావ్యాకరణాదులగు నాఱంగములును, ఆగమాః = శైవవైష్ణవాద్యాగమములును, అధీతాః = అధ్యయనము చేయబడినవి, అధ్యాత్మాదీని= అధ్యాత్మ రామాయణము మొదలగు, శాస్త్రాణి = శాస్త్రములును (ఆత్మజ్ఞానమునకు

సంబంధించిన శాస్త్రములు), అధీతాని = పఠింపబడినవి, యద్యపి = ఇట్లున్నప్పటికన్ని, గురుం వినా = శ్రీగురువును విడిచి, జ్ఞానం = ఆత్మజ్ఞానము, నాస్తి = లేదు.

షడంగయుతముగ చతుర్వేదములను-

**(శిక్షా, వ్యాకరణం, ఛన్దః నిరుక్తం, జ్యోతిషం తథా।**
**కల్పశ్చేతి షడంగాని వేదస్యాహుర్మనీషిణః॥**

ఇవి షడంగములు. ఋగ్వేద యజుర్వేద సామవేద అథర్వవేదములు- ఇవి అపరావిద్య లగును.వీనిని) గురువుదగ్గఱ చక్కగా నధ్యయనముజేసినను, వానినేగాదు, ఆత్మజ్ఞానమునకు సమ్బంధించిన అధ్యాత్మరామాయణము మొదలయిన వానిని బాగుగ పఠించినను శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడగు శ్రీగురుదేవుని యాశ్రయణము లేక బ్రహ్మజ్ఞాన మెన్నిటికిని గలుగజాలదు. ఇది నిక్కము. శ్రీగురుదేవుడనగా సాక్షాదీశ్వరుడు. జనులకు జ్ఞానబోధకై యవతరించిన మహానుభావుడు. ఆత్మజ్ఞానానుభవము గలవాడు. ఒకానొకడు తీర్థయాత్రలను లెస్సగా జేసి మహాత్ములను దేవాలయములను జూచివచ్చినవాడు.వేరొకడు పుస్తకముల లోని యాత్రావిషయములను మాత్రము చదివినవాడు. వీరిద్దరిలో నెవరిని విషయ మడుగవలయునో తెలిసికొనుడు. కేవల మనుభవము గలవాడు స్పష్టముగ వేదాంతార్థములను బోధించును. కేవల శాస్త్రజ్ఞాని సారములేని వాక్యములనే నుడువును.

సామాన్యముగ నేవిద్యయును గురువు లేక అభ్యసింప సాధ్యము గాదు. ప్రాపంచిక విద్యావిషయమందే గురువవసరమైయుండగా అప్రాకృతమగు బుద్ధ్యతీతమయిన దురవగాహ మయిన బ్రహ్మవిద్య శ్రీగురుదేవుడు లేక బోధపడునా ! శ్రీగురునను గ్రహము లేక నాత్మజ్ఞానము కలుగనేరదు. గ్రుడ్డివాడు దారి జూపగలడా? పోగలడా? శాస్త్రజ్ఞానము గలవాడైనను నాత్మజ్ఞానవిషయమున నంధుడే. అంధుడు రూపాదులను గాంచజాలని యట్లు శాస్త్రములను పఠించిన వారుకూడ శ్రీగురువరుని సహాయములేక స్వయముగ బ్రహ్మతత్త్వము నెఱుంగజాలరు. పాయసములోని తెడ్డెన్నిసార్లు తిరిగినను దానిసారము గ్రహించ జాలనట్లు మహాపండితులైనను స్వయముగా నాత్మతత్త్వమును గురుదేవుడు లేక

తెలియజాలరు. వారికి నాత్మజ్ఞానము గలుగదు. ఆ శాస్త్రజ్ఞులు సంసారకూపములో పడి శాంతిలేని వారగుచున్నారు. కావున శ్రీగురుదేవుని నాశ్రయించి శ్రీ గురుకృపకు పాత్రులై ఆత్మజ్ఞానమును సంపాదించవలయును. ఈ విషయమున ప్రమాణ మును చూడుడు-

**ఆచారహీనాన్న పునన్తి వేదా యద్యప్యధీతాస్సహ షడ్భిరఙ్గైః ।**
**ఛన్దాంస్యేనం మృత్యుకాలే త్యజన్తి నీడం శకున్తా ఇవ జాతపక్షాః ॥**

గురువు లేకుండిన ఎట్టిప్రయోజనము గలుగునో దాని నిట జెప్పిరి.

**శివపూజారతో వాఽపి విష్ణుపూజారతోఽథవా ।**
**గురుత త్త్వవిహీనశ్చేత్తత్సర్వం వ్యర్థమేవ హి ॥**

శివపూజారతః - వా - అపి - విష్ణుపూజారతః - అథవా - గురుతత్త్వవిహీనః - చేత్ - తత్ - సర్వం - వ్యర్థం - ఏవ - హి.

శివపూజారతః వా అపి = నిరన్తరము శాస్త్రరీతిగ శ్రీశివుని పూజించుటయందాసక్తి గలవాడైనను, అథవా = అట్లుగాక, విష్ణుపూజారతః = విధిరీదిగ శ్రీవిష్ణుదేవుని యర్చనయందు నిరతము నిరతుడైనను, గురుతత్త్వవిహీనః చేత్ = గురుతత్త్వమగు నాత్మజ్ఞానముచేత రహితుడైనచో, తత్ సర్వం = నిత్యము తాజేయు పూజాదులన్నియు, హి = నిశ్చయముగ, వ్యర్థమేవ = నిష్ఫలమేకదా!. (శివకేశవుల యనుగ్రహ ముండినను శ్రీగురుకరణ లేకుండిన ఆత్మజ్ఞానము కలుగదు).

శ్రీ గురుదేవుని ఆవశ్యకతనే తెలుపుచున్నారు. మోక్షముకొఱకు శివభక్తులై శాస్త్రరీతిగ నానావిధ పూజలను కావించుచున్నారు. కొందఱు శ్రీమహావిష్ణువు నర్చించుచున్నారు. భజనాదులను చేయుచున్నారు. వారి లక్ష్యమేమనగా అనర్థ నివృత్తి, ఆనందప్రాప్తి. ఇట్టి మోక్షము శివకేశవుల భజనచే సిద్ధించదు. ఆత్మజ్ఞానమో యిచ్చుటనే పొందదగియున్నది. వేరుపాయము లేదు. శివకేశవుల భజనాదులు, అన్తఃకరణశుద్ధి, మనకేకాగ్రత మొదలగు వానిని గలుగజేసి పుణ్యాత్ములను జేసి పుణ్యలోకప్రాప్తిని గలిగించుచున్నది. ఇదంతయు శివకేశవుల యనుగ్రహముచే సిద్ధించుచున్నది. కాని ఉపాసనామూర్తియొక్క అనుగ్రహ ముండినను ఆత్మ జ్ఞానము మాత్రము కలుగదు. ఆ మూర్తులకు సామర్థ్య మున్నను వారు జ్ఞానబోధను

జేయరు. అయితే వ్యర్థము గాదు. వీరియందు పరమభక్తి యున్నచో నిట్టి పరమభక్తులకు జ్ఞానము నుపదేశించునట్టి పరమగువరుడు లభించునట్లు చేయు చున్నారు. ఆ భక్తులు తద్వారా తరించు చున్నారు. ఈ విషయమునే-

**తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**
**ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥**

శ్రీకృష్ణభగవానుడు తత్త్వోపదేశకార్యమును జ్ఞానులకు నిచ్చియున్నాడు అని భగవద్గీతయు దృఢీకరించుచున్నది. కావున శ్రీగురుశుశ్రూషజేసి శ్రీ గురు తత్త్వమును గనుకొని ఆత్మతత్త్వ జ్ఞానమును సంపాదించినచో శివభక్తులుగాని విష్ణుభక్తులుగాని యిచ్చోటనే బంధవిముక్తిని పొంది శాశ్వతానందము ననుభవించు చున్నారు. లేనిచో వారి యుద్దేశము ఫలించదు. అందుచే వారు చేసిన క్రియలన్నియు వ్యర్థము లగుచున్నవి. అవశ్యముగ శ్రీగురుదేవుని పరమభక్తితో భజించిన సమస్తము సులభముగ లభించును.

అవ: శ్రీ గురుతత్త్వమనగ నాత్మజ్ఞానము, దానినిపొందిన మాత్రమే శాశ్వతా నందమును పొందుచున్నారు అను విషయమునే ప్రకారాన్తరముగ చెప్పుచున్నారు.

**శివస్వరూపమజ్ఞాత్వా శివపూజా కృతా యది ।**
**సా పూజా నామమాత్రం స్యాచ్చిత్రదీప ఇవ ప్రియే! ॥ 193**

శివస్వరూపం - అజ్ఞాత్వా - శివపూజా - కృతా - యది - సా - పూజా - నామమాత్రం- స్యాత్ - చిత్రదీపః - ఇవ - ప్రియే.

హే ప్రియే = ప్రేమస్వరూపిణి యగు నో పార్వతీదేవీ ! శివస్వరూపం = శివునియొక్క స్వరూపమును (అప్రాకృత సత్యశాంత్యాది స్వరూపమును), అజ్ఞాత్వా = తెలిసికొనక, శివపూజా= మహేశ్వరుని పూజ, కృతా యది = చేయబడినట్లయిన, సా పూజా = ఆ అర్చనాదులు భజనాదులు, చిత్రదీప ఇవ = చిత్తరువునందు వ్రాయబడిన దీపమువలె, నామమాత్రం స్యాత్= పేరునకు మాత్రమే యగుచున్నవి.

గమ్యస్థానమును తెలియకఁ జేయబడు ప్రయాణము, లక్ష్యమును గుర్తెఱుంగక చేయు బాణప్రయోగము లెట్లు వ్యర్థములో తనకు గమ్యమగు

శివస్వరూపమును దెలియక చేయు పూజాదు లన్నియు వ్యర్థములే యగుచున్నవి. శివస్వరూప మనగా శివుడు మంగళస్వరూపుడు. సత్యశాన్త్యాదులగు నప్రాకృత గుణములతో గూడినవాడు. ఈ ప్రకారము భావించినప్పుడే పూజాదులను భక్తి శ్రద్ధలతో జేయుచున్నాడు. అప్పుడు శివస్వరూపసాక్షాత్కారము కలుగుచున్నది. మహానందమును బడయుచున్నాడు. అట్టి తత్త్వము దెలియవలయు ననినచో శ్రీగురు వవసరమైయున్నాడు. కావున శివుని స్వరూపమును దెలియక చేసిన భజనాదులు చిత్రదీపముతో సమానములు.

చిత్రములో లిఖింపబడిన దీపము జూచుటకు మనోహరముగా నుండును. ఈ లోకము నంతయు దహించునదిగా నుండును. కాని ఆ దీపము ప్రకాశము నిచ్చి తమస్సును పోగొట్టజాలదు. ఎట్టి పవిత్రతను గలిగింపజాలదు. నామమాత్రమై యున్నది. అట్లే శివునియొక్క పరతత్త్వమును దెలియక నాచరించిన పూజాదులు, నామస్మరణములు మహాలక్ష్యమగు జ్ఞానముయొక్క ప్రాప్తిని గలిగించనందుచే నామమాత్రములై యున్నవి. పూజాదులు చూచుటకును వినుటకును నానంద ములుగా నున్నవి. కాని ఆంతరికమగు మహానందమును గలిగింపజాలవు.

ఒకానొకడు క్షుద్బాధచే పదార్థములను తీసికొనివచ్చి సిద్ధముగ నుంచుకొని యున్నాడు. వానిని పాకముచేసి భుజింపక పోయినచో నాకలి తీరనట్లు బాహ్యములగు పూజాదులెన్ని చేసినను వానిచే జ్ఞానము గలిగి తృప్తుడు గాజాలడు. కావున శివస్వరూపమును తెలియవలయును. శివస్వరూప మనగా శివుడన శ్రీగురు పరబ్రహ్మము. స్వరూప మనగా ఆత్మజ్ఞానము. వస్తువుయొక్క వస్తుస్థితిని (అవ్యయము, సచ్చిదానందము, అఖండమను స్వరూపమును) తెలియవలెను. ఇకను విచారించిన శివస్వరూపము తనయొక్క ఆత్మస్వరూపమే, ఆ శివుడే తాను, గురువు అను నఖండజ్ఞానము కలుగవలయును. ఇదియే గమ్యము, శివము. ఆత్మజ్ఞానము లేనిదే ప్రయోజనము లేదను విషయమై యోగవాసిష్ఠ ప్రమాణము:-

**చిత్రామృతం నామృతమేవ విద్ధి చిత్రానలం నానలమేవ విద్ధి ।**
**చిత్రాంగనా నూనమనంగనేతి వాచావివేకస్త్వవివేక ఏవ ॥**

ఈ యర్థమును మనసున నిడికొనియే పై శ్లోకార్థమును దెలిపిరి.

అవ: శ్రీ గురుదేవుని ప్రాముఖ్యమునే తెలుపుచున్నారు.

**సర్వం స్యాత్సఫలం కర్మ గురుదీక్షాప్రభావతః ।**
**గురులాభాత్సర్వలాభో గురుహీనస్తు బాలిశః ॥ 194**

సర్వం - స్యాత్ - సఫలం - కర్మ - గురుదీక్షాప్రభావతః - గురులాభాత్ - సర్వలాభః- గురుహీనః - తు - బాలిశః.

గురుదీక్షాప్రభావతః = గురువుచే నొసంగబడిన జ్ఞానదీక్షయొక్క మాహాత్మ్యమువలన, సర్వం కర్మ = సమస్తకర్మలు (వేదాధ్యయన, తపోధ్యానాదులు), సఫలం = జననమరణరహిత ఆనందరూప ప్రయోజనము గలవిగ, స్యాత్ = అగును, గురులాభాత్ = శ్రీగురువరుని లాభమువలన, సర్వలాభః = సకలప్రాప్తి కలుగుచున్నది, గురుహీనః తు = గురువు లేనివాడైతే, బాలిశః = అవివేకి యగుచున్నాడు.

శ్రీగురువరునిద్వారా తత్త్వజ్ఞానదీక్ష పొందినందుచే తన పురాకృత పుణ్యకర్మలయొక్కయు, నిప్పుడు చేయబడుచున్న గురుశుశ్రూషాదులు, తపో ధ్యానాదులు - వీనియొక్కయు ముఖ్యప్రయోజనము లబ్ధమాయెను. అది లేకున్న దేహేన్ద్రియాదు లన్నియు శవమగుచున్నవి. అట్లే జ్ఞానము లేకున్నచో సమస్తకర్మలు ప్రయోజనమును గలిగించునవి గావు. అనగా జ్ఞానము ముఖ్యమనియు, అదిలేనిచో నితరములగు సాధన లుండియు ప్రయోజన విరహితము లగుచున్న వనియు, కేవలజ్ఞానముచేతనే శాశ్వతానందము లభించు ననియు పదేపదే తెలుపుచున్నారు. ఇది ముఖ్యమగు దివ్యోపదేశము. కావున నాత్మజ్ఞాననిధి, అఖండజ్ఞాననిధి యగు శ్రీగురుదేవుని లాభమువలననే లభించుచున్నది. అట్టి శ్రీగురుదేవుని లాభమువలన సర్వలాభములు గలుగు చున్నవి. పరమలక్ష్యమగు శ్రీగురుపరబ్రహ్మ స్వరూపము యొక్క సాక్షాత్కారముచే పొందదగినది పొందబడెను; తెలియదగినది తెలియ బడెను; ఇక తెలిసికొన దగినదియు పొందదగినదియు లేదు. సర్వ లాభములు ప్రాప్తము లాయెను. (వేదాధ్యయనాది ప్రయోజనము లన్నియు లభించెను.) అంతయు ఆత్మ స్వరూపము. ఇట్టి గురుతత్త్వజ్ఞానము లేనివాడు అవివేకి యని తెలియవలెను. వానికి శాశ్వతానందము లభింపదు. జ్ఞానలాభముకంటె మఱియొకటి లేదను విషయమై భగవద్గీతాప్రమాణము: "యం లబ్ధ్వా చాపరం

లాభం మన్యతే నాధికం తతః" ఆత్మజ్ఞానము లేకున్న గలుగు మహానష్టమును కేనోపనిషత్తు చెప్పుచున్నది చూడుడు:

**ఇహ చేదవేదీదథ సత్యమస్తి న చేదిహావేదీన్మహతీ వినష్టిః ।**
**భూతేషు భూతేషు విచిత్యధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవన్తి ॥**

మానవజన్మ జ్ఞానార్జనకై భగవంతునిచే నేర్పడి యున్నది. అదిలేనిచో నంతకన్న మహానష్టము వేరులేదు. ఇది సారాంశము.

అవ: 'శివోఽ హం' అను నాత్మజ్ఞానము లేనివాడు కీటాదులతో సమానుడని తెలుపుచున్నారు.

**గురుహీనః పశుః కీటః పతంగో వక్తుమర్హతి ।**
**శివరూపం స్వరూపఞ్చ న జానాతి యతస్స్వయమ్ ॥ 195**

గురుహీనః - పశుః - కీటః - పతంగః - వక్తుం - అర్హతి - శివరూపం - స్వరూపం - చ - న - జానాతి - యతః - స్వయం.

గురుహీనః = గురువులేని అవివేకి (గురుతత్త్వమగు నాత్మజ్ఞానము లేనివాడు), పశుః= ద్విపాదపశువు, కీటః = భూమిమీద ప్రాకని పురుగు, పతంగః = ఱెక్కలులేని పక్షి అని, వక్తుం= చెప్పుటకు, అర్హతి = తగియున్నాడు, యతః = ఎందువలన ననగా, స్వయం = స్వయముగా (శ్రీగురుదేవుడు లేకుండ), శివరూపం = శివమగు పరబ్రహ్మముయొక్క స్వరూపమును, స్వరూపం చ = తనయొక్క ఆత్మస్వరూపమును, న జానాతి = తెలియక ఉంటున్నాడో.

శివుడే నేనను జ్ఞానమే శివస్వరూపమును, తనయొక్క ఆత్మస్వరూపమును తెలియుట యగును. అట్టి జ్ఞానము శ్రీగురుదేవుని కృపవల్లనే పొందవలసియున్నది. ఇదేవిషయము ననేకపర్యాయములు చెప్పుచున్నారు. జ్ఞానము లేనిచో మనుష్యునకును పశుపక్ష్యాదులను భేదమేమియు లేదు.

అవి యొకవిధమున వ్యవహరించుచున్నవి. మనుజుడొక విధమున వ్యవహరించు చున్నాడు. పశుపక్ష్యాదులు చైతన్యాత్మకములు; మనుజులును, చైతన్యాత్మకులై యున్నారు. భేదమేమియు లేదు. మఱేమనగా ఆత్మజ్ఞాన

మొకటియే సర్వవిలక్షణము.

**ఆహారనిద్రాభయమైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణామ్।**
**జ్ఞానం తు తేషామధికో విశేషః జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః॥**

ఈ యర్థమునే పై శ్లోకమున వివరించుచున్నారు. గురుతత్త్వ జ్ఞానము లేనివాడు భూమిమీద సంచరించు ద్విపాదశువు; అట్లే ప్రాకనట్టి పురుగు, ఱెక్కలులేని పక్షి. అనగా నివి యెట్లు కర్మబద్ధములై సంసారసాగరములో గ్రుంకు లిడుచు సుఖదుఃఖము లనుభవించు చున్నవో, ఆత్మజ్ఞానము లేనివాడు నట్లే అనంతదుఃఖము ననుభవించు చున్నాడు. గురువే శరణ్యము.

అవః గురు సమాశ్రయణకారణము.

**తస్మాత్సర్వప్రయత్నేన సర్వసంగవివర్జితః ।**
**విహాయ శాస్త్రజాలాని గురుమేవ సమాశ్రయేత్ ॥** **196**

తస్మాత్ - సర్వప్రయత్నేన - సర్వసంగవివర్జితః - విహాయ - శాస్త్రజాలాని - గురుం - ఏవ - సమాశ్రయేత్.

తస్మాత్ = ఆత్మజ్ఞాన సంపాదనము ముఖ్య మగుటవలన, సర్వప్రయత్నేన = అన్నివిధములగు ప్రయత్నములచేతను, సర్వసంగవివర్జితః = సకల దృశ్యవస్తువులయొక్క సమ్బన్ధముచేత విడువబడినవాడై, శాస్త్రజాలాని = శాస్త్రములయొక్క సమూహములను, విహాయ= వదలి, గురుం ఏవ = శ్రీ సద్గురుమూర్తినే, సమాశ్రయేత్ = ఆశ్రయించవలయును.

ఆత్మజ్ఞానము ముఖ్యాతిముఖ్య మనియు, అందులకై శ్రీ సద్గురుదేవునే ఆశ్రయించవలయు ననియు హెచ్చరించుచున్నారు. " పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయాత్" అను నుపనిషద్రీతిగా సర్వదృశ్యవస్తువులం దాసక్తిని విడువవలయును; తీవ్రవైరాగ్యమును పొందవలయును. శాస్త్రవాసనలు, దేహ వాసనలు, లోకవాసనలు- వీనిని వదలవలయును. వేరు శరణ్యము లేదు. కావున నాత్మతత్త్వమునకై అన్నివిధములుగ ప్రయత్నించుచు సర్వశాస్త్రములను వదలి శ్రీ గురుదేవుని నాశ్రయించవలయును. 'శబ్దజాలమహారణ్యం చిత్తభ్రమణకారకం' "వాగ్వైఖరీ శబ్దఝరీ శాస్త్రవ్యాఖ్యానకౌశలం!

**పాండిత్యం సర్వవిద్యాసు భుక్తయే న తు ముక్తయే॥**
**అన్యవిద్యాపరిజ్ఞానం హ్యావశ్యం నశ్వరం భవేత్ ।**
**బ్రహ్మవిద్యాపరిజ్ఞానం బ్రహ్మప్రాప్తికరం నృణామ్॥**

ఇవన్నియు నాత్మజ్ఞానప్రాధాన్యమును తెలుపుచున్నవి. అందులకై శ్రీ గురువరుని శరణము పొందవలయును.

అవ: గోవుకొమ్ముబట్టి ఇది గోవని స్పష్టముగా తెలుపునట్లు శ్రీగురుదేవుడు ప్రత్యక్షముగ జీవబ్రహ్మైక్యజ్ఞానమును బోధించుచున్నాడని తెలుపుచున్నారు.

**నిరస్తసర్వసందేహా ఏకీకృత్య సుదర్శనమ్ ।**
**రహస్యం యో దర్శయతి భజామి గురుమీశ్వరమ్॥ 197**

నిరస్తసర్వసందేహః - ఏకీకృత్య - సుదర్శనమ్ - రహస్యం - యః - దర్శయతి - భజామి - గురుం - ఈశ్వరం.

నిరస్తసర్వసందేహః = సకల సంశయములను రహిత మొనర్చిన, యః = ఏ పరమగురుడు, ఏకీకృత్య = ఆ దేవుడే నీవు, జీవుడన పరబ్రహ్మమే అని జీవేశ్వరైక్యమునుజేసి, రహస్యం = వేదాన్తరహస్యమయిన (సారమయిన), సుదర్శనమ్ = స్వస్వరూప సాక్షాత్కారజ్ఞానమును (సమ్యక్ జ్ఞానమును), దర్శయతి = చూపించుచున్నాడో, బోధించు చున్నాడో, తం = అట్టి, ఈశ్వరం = శివస్వరూపుడైన, గురుం = గురుదేవుని, భజామి= సేవించుచున్నాను, స్మరించుచున్నాను, ధ్యానించుచున్నాను.

శ్రీగురుదేవుడు దురవగాహములగు నర్థముల నవగాహనము జేసికొని తపోధ్యానాదులచే సిద్ధపురుషుడై ఆత్మవిచారణచేతను, మహావాక్యార్థ లక్ష్యార్థ చింతనచేత నఖండజ్ఞాన స్వరూపియై సకల సందేహములు నశించి నిశ్చయాత్మక జ్ఞానముచే బ్రహ్మస్వరూపియై యుంటున్నాడు. కావున నట్టి బ్రహ్మజ్ఞాని "శివోఽహం సోఽహం"అను మహామన్త్రములయొక్క లక్ష్యార్థమగు జీవబ్రహ్మైక్యమును నిస్సందేహముగ దెలిపి ఏకత్వజ్ఞానమును గలుగజేసి, శరణాగతిని పొందిన శిష్యునకును నిస్స్వరూప సాక్షాత్కారజ్ఞాన ముపదేశించుచున్నాడు. అందుచే శిష్యుడును గురుస్వరూపమగు పరబ్రహ్మస్వరూపమై నిత్యానందమును జెందుచున్నాడు. అట్టి పరమగురువును నాత్మజ్ఞానప్రాప్తికై నిరంతరము

సేవించుచున్నాను, స్మరించు చున్నాను, శరణు పొందుచున్నాను, ధ్యానించు చున్నాను.

అవ: ముందు, శ్రీగురుదేవుడు సేవించదగిన వాడనియు, అట్టి గురువర్యుడు నెట్లుండవలయు ననియును విస్తారముగా తెలిపిరి. ఈ శ్లోకమునుంచి బాహ్యా గురువులను విడువవలయునని తెలుపుచున్నారు.

**జ్ఞానహీనో గురుస్త్యాజ్యో మిథ్యావాదీ విడమ్బకః ।**
**స్వవిశ్రాన్తిం న జానాతి పరశాన్తిం కరోతి కిమ్ ॥ 198**

జ్ఞానహీనః - గురుః - త్యాజ్యః - మిథ్యావాదీ - విడమ్బకః - స్వవిశ్రాన్తిం - న - జానాతి - పరశాన్తిం - కరోతి - కిం.

జ్ఞానహీనః = ఆత్మజ్ఞానము లేనివాడును, మిథ్యావాదీ = వాచావేదాన్తమును పలుకువాడును, విడమ్బకః = బాహ్యవేషము ననుసరించువాడును, (విలంబకః = ఆలస్యము చేయువాడును, మందుడును) అగు, గురుః = గురువు, త్యాజ్యః = విడువదగినవాడు. కారణమేమనగా, స్వవిశ్రాన్తిం = తనయొక్క లక్ష్యమగు పరబ్రహ్మమందలి విశ్రమించుటను పరమశాంతిని, న జానాతి = తెలియడు, పరశాన్తిం = ఇతరులకు తాపత్రయశాంతిని, కరోతి కిం = చేయునా ఏమి? (చేయజాలడని యర్థము).

శ్రీగురువుదగ్గరకు శాన్తినిపొంద నిచ్ఛచే ఆర్తులై వచ్చుచున్నారు. వారి యార్తిని బాపకున్నచో నట్టి గురువువలన ప్రయోజనము సిద్ధించదు. అంత మాత్రమేగాక నిక నపన్మార్గ ప్రవర్తకు లగుదురు. కావున నాత్మజ్ఞానము లేనట్టియు, అనుభవము లేకపోయినను ననుభవము గలిగిన తవానివలె వాచావేదాంతము చెప్పుచు బ్రాహ్మ వేషమును ధరించి తాను మహాగురువువలె నటించుచు పరులను వంచించునట్టి గురువు వదలిపెట్ట దగియున్నాడు. అతడు గురుశబ్దవాచ్యుడు గాడు.

ఎందుకనగా- గురువనగా తాను బాగుగా తెలిసికొని యితరులకు బోధించు వాడు. పాఠశాలలో నేమియు జదువనివా డుపాధ్యాయుడుగా నుండిన వానివల్ల ప్రయోజనము గలుగదు గదా ! అట్లే గురులక్షణమగు, తనకు పరమలక్ష్యమగు పరబ్రహ్మమందు విశ్రమించి రమించి పరమశాన్తిని పొందుట యను స్వరూపము లేని వాడు గురువై ఆశ్రయించిన వారికి నాత్మజ్ఞానము బోధింప లేడు. వారియొక్క

తాపత్రయశాంతిని పోగొట్టి జ్ఞానామృతమును త్రాగించలేడు. తాను క్షుత్పిపాసాదులచే బాధింపబడువాడు పరులయొక్క ఆకలిదప్పులను తీర్చలేడు. తాను కడుదరిద్రుడు, ప్రజలను ధనవంతులను జేయగల్గునా ! తాను మహావ్యాధిగ్రస్తుడు, అట్టివాడు పరులరోగమును బాప వైద్యుడగునా ! తాను తాపత్రయరూప సంసారారణ్యదావాగ్నిలో దహింపబడుచుండగా నితరులను రక్షింపగలడా ! ఇవన్నియును నూహింప నగును. కావున బద్ధులగు గురువులను వదలవలయును. లేనిచో "అన్ధేనైవ నీయమానా యథాన్ధా" అను దుర్గతినే పొందుచున్నారు.

అవ: ఆత్మజ్ఞానములేని గురుడు శిలతో సమానుడనియు, తాను తరించిన మాత్రముననే యితరులను తరింపజేయగలడనియు నిరూపించుచున్నారు.

**శిలాయాః కిం పరం జ్ఞానం శిలాసంఘప్రతారణే ।**
**స్వయం తర్తుం న జానాతి పరం నిస్తారయేత్కథమ్ ॥ 199**

శిలాయాః - కిం - పరం - జ్ఞానం - శిలాసంఘప్రతారణే - స్వయం - తర్తుం - న-జానాతి - పరం - నిస్తారయేత్ - కథం.

శిలాసంఘప్రతారణే = రాళ్లసమూహముయొక్క తరణమునందు, పరం = ఉత్కృష్టమయిన, జ్ఞానం = జ్ఞానము, శిలాయాః = రాతికి, అస్తి కిం = గలదా, స్వయం = తాను, తర్తుం = తరించుటకు, న జానాతి = తెలియటలేదు, పరం = ఇతరుని, కథం = ఎట్లు, నిస్తారయేత్ = భవసాగరమునుండి తరింపజేయును.

పాషాణమునకు జ్ఞానము గలదా ! అట్టి శిల, నికగొన్ని శిలలను జేరి జ్ఞానము కలుగజేసి తరింపజేయగలుగునా! ఇదెట్లసంభవమో, అట్లే తాను జ్ఞానమును పొందక, భవసాగరమును తరించుటకు తత్త్వమార్గమను ఈతను తెలియక, ఇతరుల నజ్ఞానసముద్రమునుండి దరిజేర్చుటయు సర్వదా అసిద్ధము. ఎప్పటికిని కానిపని.

అనగా జ్ఞానము లేనివాడు పాషాణము వంటివాడు. అట్టి జ్ఞానహీనుడు శిలలవంటి అవివేకులను తరింపజేయజాలడని భావము. ఈ విషయ మెట్లున్న దనగా, అగాధమగు జలము. ఈదుటకు తెలియని వారందులో పడిపోయిరి. అట్టివారిని మఱియొకడు చూచి యీత రానివాడై నను దరిజేర్చెదనని నీటిలో

దుమికెను. తరువాత వీడును వారును కలిసి పట్టుకొని మునింగి మరణించిరి. అట్లే భవతరణము తెలియని గురువు భవార్ణవములో పడియున్న జీవులను గాంచి వారి నుద్ధరింప ప్రయత్నించుచున్నాడు కాని కట్టకడపట నట్టి గురువులు, శిష్యులు కర్మబద్ధులై మహాభయంకర సంసారసాగరములో మునింగి మృత్యువును పొందుచున్నారు. కావున శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడగు గురువును శరణు పొంద వలయును.

మఱియొక యర్థము: శిలాసంఘప్రతారణే - శిలాసంఘ = పాషాణ సమూహములయందలి, ప్రతారణే = తరింపజేయు విషయములో (సాల గ్రామాదులు మోక్షము నొసగుచున్నవను విషయములో), శిలాయాః = నల్ల రాతినుండి, పరం = జ్ఞానం = ఉత్కృష్టజ్ఞానము, కిం భవతి = గలుగునా ఏమి! అనేకులు సాలగ్రామాదులను, ఈశ్వరాది విగ్రహములను సంసారమును తరింపజేయునను మతితో పూజించుచున్నారు. చేతనారహితములగు శిలలవలన ప్రయోజనము గలదా! జ్ఞానము గలుగునా! జ్ఞానములేని వారికి జ్ఞానము నొసంగజాలవు. కావున చైతన్యాత్మకుడగు శ్రీ గురుదేవుని భజించి తరింపుడని భావము.

**"కస్తరతి కస్తరతి మాయాం యస్సంగాంస్త్యజతి**
**యో మహానుభావం సేవతే నిర్మమో భవతి!**
**స తరతి స లోకాంస్తారయతి"** అని నారద భక్తిసూత్రములు.

అవ: బాధగురువులను, వేషధారులను వదలవలయునని తెలుపుచున్నారు.

**న వన్దనీయాస్తే కష్టం దర్శనాద్భ్రాన్తికారకాః ।**
**వర్జయేత్తాన్గురూన్ దూరే ధీరస్య తు సమాశ్రయేత్ ॥ 200**

న - వన్దనీయాః - తే - కష్టం - దర్శనాత్ - భ్రాన్తికారకాః - వర్జయేత్ - తాన్ - గురూన్ - దూరే - ధీరస్య - తు - సమాశ్రయేత్.

దర్శనాత్ = దర్శించుటచేత, భ్రాన్తికారకాః = వేషభాషాదులచే మనస్సునకు భ్రాన్తిని గలుగజేయు, తే = ఆ గురువులు, న వన్దనీయాః = నమస్కరించ దగినవారలు గారు, దూరే= దూరమునందు, తాన్ గురూన్ = ఆ గురువులను, వర్జయేత్ = వదలవలయును, కిం తు=

మరేమనగా, ధీరస్య = ఆత్మజ్ఞాన సమ్పన్నుడగు ధీరుని, సమాశ్రయేత్ = బాగుగా నాశ్రయించవలయును.

వారు చూచుటకు మహాయోగ్యులుగా కానుపింతురు. వారియొక్క చిహ్నములు, భాషలు క్షణములోనే మోక్షము గలుగజేయునట్లుండును. సూక్ష్మము లోమోక్షము, త్రుటిలో ముక్తి యని చెప్పుదురు. అట్టివారి చెంతకే చనగూడదు. ఇక నమస్కార విషయము చెప్పవలయునా! దూరము నుండియు నమస్కరించ గూడదని భావము. అట్టివారిని వదలి జ్ఞానవిజ్ఞాన సమ్పన్ను డయిన పరమ దయాళువైన శ్రీ గురుదేవు నాశ్రయించవలయును.

అవ: త్యాజ్యగురువులను తెలుపుచున్నాడు:

**పాషండినః (పాఖండినః) పాపరతా నాస్తికా భేదబుద్ధయః**
**స్త్రీలమ్పటా దురాచారాః కృతఘ్నా బకవృత్తయః ॥ 201**

పాషండినః - పాపరతాః - నాస్తికాః - భేదబుద్ధయః - స్త్రీలమ్పటాః - దురాచారాః - కృతఘ్నాః - బకవృత్తయః.

పాషండినః = వేదబాహ్యులు, పాపరతాః = పాపాత్ములు, నాస్తికాః = నాస్తికులు. స్త్రీలమ్పటాః = పరస్త్రీలయం దాసక్తి గలవారు, భేదబుద్ధయః = భేదజ్ఞానము గలవారు. దురాచారాః = దురలవాటులను గలవారు. కృతఘ్నాః = చేసిన మేలును మరచినవారు, బకవృత్తయః = బకధ్యానము గలవారు (-వీరలు త్యాజ్యులు).

ఆ దురాచారు లెవరనగా- ఈశ్వరపూజాది ధర్మమార్గములను, వేదములను నిందించువారై దేహపోషణమే ముఖ్యపురుషార్థమని చెప్పునట్టి పాషండులును, ప్రాణిహింసాది పాపకార్యములను జేయుచు మధుమాంసాదులను భుజించి పాపము లేదని చెప్పు పరమపాపాత్ములైన గురువులును, భేదజ్ఞానము గలవారును పరస్త్రీలను కామించువారును, గంజాయి నల్లమందు తిని మత్తెక్కి యిదియే మోక్షమని చెప్పు దురాచారులును, హృదయమందలి దుర్గుణములను బయటికి చూపక కొంగవలె ధ్యానము చేయువారును- వీరందరు త్యాజ్యగురువులని తెలియవలెను.

అవ: త్యాజ్య గురువులు-

**కర్మభ్రష్టాః క్షమానష్టా నింద్యతర్కైశ్చ వాదినః ।**
**కామినః క్రోధినశ్చైవ హింస్రాశ్చండాశ్శఠా స్తథా 202**

కర్మభ్రష్టాః - క్షమానష్టాః - నింద్యతర్కైః - చ - వాదినః - కామినః - క్రోధినః - చ - ఏవ - హింస్రాః - చండాః - శఠాః - తథా.

కర్మభ్రష్టాః = సత్కర్మలనుండి భ్రష్టు లయినవారును, క్షమానష్టాః = ఓర్పులేనివారును, నింద్యతర్కైః = కుతర్కములచే వాదినః చ = వాదించువారును. కామినః = కాముకులును, క్రోధినః = కోపము గలవారును, హింస్రాః = ప్రాణిహింసచే జీవించువారును, చండాః చ = కఠినమనస్కులై తీవ్రవృత్తితో నుండువారును, తథా = అట్లే, శఠాః = పరుల కపకారము జేయు స్వభావము గలవారును, ఏవ = దూరమునందే త్యజింపదగినవారు.

తాము చేయవలసిన తపోధ్యానాదులను సత్కర్మలను చేయ నలసులై యున్నట్టి కర్మభ్రష్టులును, సహనము లేనివారును (ఒరులేమి చేసినను సహించుకొను స్వభావముగాని, కామక్రోధాదులయొక్క ప్రకోపము నోర్చుకొను స్వభావముగాని లేనివారును), భక్తి లేకయు, జ్ఞానము లేకయు, చదువు లేకయు తన కిష్టము వచ్చినట్లు కుతర్కములచే వాదించువారును, వృథాలాపులును, విషయలోలురును, క్రోధమూర్ఛితులును, ప్రాణిహింసాస్వభావులును, ఆడంబరము లను పలుకుచు కాఠిన్యమును వహించి భయంకరస్వభావము గలవారును, పరుల కపకారము చేయువారును కారణాంతరములచే లోకములో గురువు లగు చుందురు. కాని వారలు గురువులు గారు. ప్రత్యక్షపిశాచులు.అట్టివారిని విడువ వలయును.

అవ: సేవింపదగిన గురువును తెలుపుచున్నారు.

**జ్ఞానలుప్తా న కర్తవ్యా మహాపాపా స్తథా ప్రియే! ।**
**ఏభ్యో భిన్నో గురుస్సేవ్య ఏకభక్త్యా విచార్య చ ॥ 203**

జ్ఞానలుప్తాః - న - కర్తవ్యాః - మహాపాపాః - తథా - ప్రియే - ఏభ్యః - భిన్నః - గురుః- సేవ్యః - ఏకభక్త్యా - విచార్య - చ.

హే ప్రియే = ఓ ప్రియమైన పార్వతీ, తథా = అట్లు, జ్ఞానలుప్తాః = ఆత్మజ్ఞానము లేనివారును, మహాపాపాః = మహాపాపాత్ములును, న కర్తవ్యాః = గురువులుగా స్వీకరింప బడదగినవారు కారు, ఏభ్యః = వీరందఱికన్నను, భిన్నః = పై తెలుపబడిన దోషములు లేక సర్వవిలక్షణుడైన, గురుః = ఆత్మజ్ఞాన పరిపూర్ణుడగు గురుదేవుడు, ఏకభక్త్యా = పరమభక్తితో, విచార్య చ = బాగుగా విచారించియు, సేవ్యః = పొందదగినవాడు, సేవింపదగినవాడు.

ఇకను జ్ఞానము లేక మహాపాపాత్ము లయిన గురువులను సేవించరాదు. ఇట్లనుటచే పై తెల్పినవారు అనన్తపాపము గలవారని తెలియవలెను. అట్టి వారుగూడ గురువు లయినచో వారి పాపమున కవధి యున్నదా! ఈ ప్రకారము ప్రత్యేకముగా విమర్శించి చెప్పినందుచే దోషములకు విరుద్ధములగు సద్గుణములను గ్రహించ వలయును. ఇట్టి సకలగుణ సంపూర్ణుడై, అఖండ జ్ఞాననిధియై, కర్మయోగ, భక్తియోగ, ధ్యానయోగ, జ్ఞానయోగములచే పూర్ణుడై పై తెలుపబడిన దోషము లొకించుకయు లేక సచ్చిదానంద స్వరూపుడగు పరబ్రహ్మరూపుడైన శ్రీగురుదేవుని పరమభక్తితో నిరంతరము సేవించవలయును. 'విచార్య చ' అని చెప్పుటచే గురువిషయములో ననేకపర్యాయములు విచారించి యే గురువుచే తనకు భవహర మగునో, శాశ్వతశాంతి లభించునో అట్టి గురువును సర్వదా భజింపవలయును.

అవ: శ్రీ గురుతత్త్వ మెవరి కుపదేశించవలయునో తెలుపుచున్నారు.

**శిష్యాదన్యత్ర దేవేశి! న వదేద్యస్య కస్యచిత్ ।**
**నరాణాం చ ఫలప్రాప్తౌ భక్తి రేవ హి కారణమ్ ॥ 204**

శిష్యాత్ - అన్యత్ర - దేవేశి - న - వదేత్ - యస్య - కస్య - చిత్ - నరాణాం - చ - ఫలప్రాప్తౌ - భక్తిః - ఏవ - హి - కారణం.

హే దేవేశి = దేవత లందఱికిని ప్రభురాలవగు నో గౌరీదేవీ !, శిష్యాత్ = శిష్యునికంటె, అన్యత్ర = ఇతరుడయిన, యస్య కస్య చిత్ = ఎవనికైనను, న వదేత్ = ఈ గురుతత్త్వమును వచింపగూడదు, కించ = మఱేమనగా, నరాణాం ఫలప్రాప్తౌ = మనుజులకు జ్ఞానాది ఫలలాభ విషయమై, భక్తిః ఏవ = అనన్యభక్తియే, కారణం = హేతువు, హి = నిశ్చయము.

గురుశుశ్రూషాది కార్యము లొనరించి తన ఆర్తిని బాపికొనుటకై వచ్చిన పరమభక్తు డగువానికే యీ పరమరహస్యమును, నీ గురుస్వరూపమును చెప్ప

వలయును. అట్లుగాక ఓ పార్వతీదేవీ! యేదో ప్రయోజన ముద్దేశించి యొరులకు జెప్పరాదు. యోగ్యున కిచ్చిన విద్యయే ప్రకాశించును. దానిలోని సారము గనుగొని ప్రవర్తించుము. ఎందుకనగా, నరులు జ్ఞానఫలమును పొంది సుఖస్వరూపులు గావలయు నన్నచో భక్తియే కారణ మగుచున్నది. ఆత్మజ్ఞానమునకు పరమ కారణము శ్రీగురుదేవుని యనుగ్రహము. ఆ యనుగ్రహమునకు హేతువు పరమభక్తియే. ఇందులకు భగవద్గీతాప్రమాణము.

**భక్త్యా మామభిజానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః ।**
**తతో మాం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనన్తరమ్ ॥**

ఇట్లు శ్రీగురుశిష్యుల సంప్రదాయ మున్నదని తెలియవలయును.

అవ: పంచవిధ గురువులను జెప్పుచున్నారు:

**గూఢో దృఢశ్చ ప్రీతశ్చ మౌనేన సుసమాహితః ।**
**సకృత్కామగతో వాఽపి పఞ్చధా గురురీరితః ॥** **205**

గూఢః - దృఢ - చ - ప్రీతః - చ - మౌనేన - సుసమాహితః - సకృత్ - కామగతః - వా - అపి - పఞ్చధా - గురుః - ఈరితః.

గూఢః = ఒరులకు తెలియకుండ నుండువాడును, దృఢః చ = ప్రబోధజ్ఞానము గలిగి ప్రబోధకుడై యుండువాడును, ప్రీతః చ = సంతృప్తి గలిగి ప్రసన్నుడై యుండువాడును, మౌనేన = మౌనముతో (సర్వవ్యవహారములు లేక), సుసమాహితః = పరబ్రహ్మమందే యుంచబడిన, మిక్కిలి లయింపజేసిన చిత్తము గలవాడును, సకృత్ కామగతః అపి వా = ఒకేసారి మహాసంకల్పము గలవాడును అని, పంచధా = ఐదు విధములుగ, గురుః = గురువు, ఈరితః = చెప్పబడెను.

1. గూఢుడు, 2. దృఢుడు, 3. ప్రీతుడు, 4. మౌనముతో నుండువాడు, 5. సకృత్కామగతుడు - వీరయిదుగురును గురువులని చెప్పబడుచున్నారు.

1. గూఢుడనగా- తానాత్మజ్ఞాన సమ్పన్ను డైనను, ప్రకటముకాక, ఆశ్రమము లోనో, మఠములోనో యుండువాడు, ఏకాంతప్రదేశమున స్థిరనివాసము గలవాడు, తనదగ్గఱకు వచ్చిన వారికిమాత్రము పరమాత్మ తత్త్వమును బోధించువాడు.

2. దృఢుడనగా- తాను పరిపూర్ణజ్ఞాని యయినను తృప్తిపొందక, దృఢ ప్రబోధము గలవాడగుటచే దీనజనుల నుద్ధరింప సమకట్టినవాడై, యొక చోట నుండక సంచరించువాడు, అందఱికిని విశాలభావముతో పరమాత్మ జ్ఞానామృతము నొసగువాడు.

3. ప్రీతుడు- సర్వదృశ్యములతో సంబంధములేక యేవ్యవహారమును లేనివాడై సంతృప్తి గలిగినవాడై జగన్నాటకమును గాంచి హాస్యము జేయుచుండును, దృష్టిమాత్రమున పరమభక్తులను తరింపజేయువాడు.

4. మౌనముతో సమాహితచిత్తుడు- తనమనస్సును పరబ్రహ్మమందు లయింపజేసి, నిర్వికల్ప సమాధిలో నుండుచు, సర్వవ్యవహారములను మరచి యొకప్పు డాహారములను గూడ పుచ్చుకొనక బ్రహ్మానందామృతమును పానము జేయుచుండువాడు, ధ్యానబలిమిచేతనే ఆశ్రితులను తరింపజేయువాడు.

5. సకృత్ కామగతుడు దృశ్యప్రతీతి పూర్తిగా లేనివాడయినను, ఒకప్పుడు మహాసంకల్పశక్తిచేత లోకోద్ధరణ కార్యమును జేయువాడు. వారి సంకల్పము పడినచో అంతటితో నా పరమభక్తుడున్ను తరించి అఖండవిజ్ఞాని యగుచున్నాడు.

ఇట్లు కొంత భేదముచేత నైదువిధములుగ గురువు లుంటున్నారు. వారందఱును పరమభక్తులను తరింపజేయువారే.

మఱియు గురువులు (1) విహంగమవృత్తి, (2) కూర్మవృత్తి, (3) మత్స్యవృత్తి అను త్రివిధవృత్తులు గలవారై యుందురు.

1. విహంగమ వృత్తియనగా- పక్షి రెక్కలలోపల గ్రుడ్ల నుంచుకొని స్పర్శచేత తనవలెనే పిల్లలను జేయుచున్నది. ఆప్రకార మాత్మబోధస్వరూపుడగు గురువు హస్తమస్తక సంయోగముచే శిష్యుని అజ్ఞానావరణమును తొలగించి తనవలె జ్ఞానసంపన్నునిగ జేయుచున్నాడు.

2. కూర్మవృత్తియనగా- తాబేలు గ్రుడ్ల నెచ్చోటనో ఉంచి మనస్సున సంకల్పించి పిల్లలను జేయుచున్నది. ఆలాగున గురుదేవుడు నెచ్చటనో యున్న శిష్యులను తనవలె నుండ వలయునను దృఢ సంకల్పముచే బ్రహ్మజ్ఞాన

సమ్పన్నులనుగ జేయుచున్నాడు.

3. మత్స్యవృత్తియనగా- చేప తన గ్రుడ్లను చూపుచేతనే పిల్లలనుగ జేయునట్లు గురుమూర్తి తనయొక్క దృష్టిప్రసారముచేతనే శిష్యులను జ్ఞానులనుగ చేయుచుండును.

ఇంతకు చెప్పవలసిన యర్థమేమనగా పైన తెల్పిన గూఢ దృఢ గురువులిద్దరు విహంగమవృత్తి గలిగి శిష్యులను హస్తమస్తక సంయోగముచే తరింపజేయుచున్నారు. ప్రీతుడను గురువు మత్స్యవృత్తిగలవాడై శిష్యులను తనయొక్క వీక్షణముచేతనే జ్ఞానసహితులనుగ జేయచున్నాడు. మౌనేన సమాహితుడు నాల్గవగురువు, కూర్మవృత్తి గలవాడై శిష్యులను ధ్యానబలిమిచేతనే యుద్ధరించుచున్నాడు. సకృత్ కామగతుడును సంకల్పముచేత అందరిని నుద్ధరించుచున్నాడు. ఈలాగున వీరిభేదములను తెలియవలెను.

ఇకను విచారించిన వేదాంతశాస్త్రములో (1) బ్రహ్మవిదుడు, (2) బ్రహ్మవిద్వరుడు, (3) బ్రహ్మవిద్వరీయుడు, (4) బ్రహ్మవిద్వరిష్ఠుడని బ్రహ్మ వేత్తలను నాలుగురీతులుగ జెప్పుచున్నారు.

(1) బ్రహ్మవిదుడు- విజ్ఞానసమ్పన్నుడై శాస్త్రములలో జెప్పినట్లు తానాచరించుచు భక్తులను తరింపజేయుచుండును. ఇతడే గూఢగురువని తెలియవలెను.

(2) బ్రహ్మవిద్వరుడు- సత్కర్మలనుగూడ వదలి కేవలబోధకుడై పరమహంసయై సంచరించుచుండును. ఇతడే దృఢగురువు.

(3) బ్రహ్మవిద్వరీయుడు- సర్వవ్యవహారములు లేనివాడై భోజనాదుల యందుమాత్రము ప్రవృత్తిగలిగి యుండును. ఈయనయే ప్రీతుడు.

(4) బ్రహ్మవిద్వరిష్ఠుడు సర్వదా నిర్వికల్పసమాధిలో నుండువాడు, స్మృతికి వచ్చునప్పు డేదైనను స్వీకరించువాడు. ఈ గురువే మౌనేనసమాహితచిత్తుడు, సకృత్కామగతుడును, మహాసంకల్ప మొకసారిమాత్రము గలవాడు. కనుక నిందులో చేరిన మహనీయుడే. ఇట్లు తెలియుడు.

అవ: సమస్తమును గురువున కర్పణజేయువలయునని చెప్పుచున్నారు.

**సర్వం గురుముఖాల్లబ్ధం సఫలం పాపనాశనమ్ ।**
**యద్యదాత్మహితం వస్తు తత్తద్ద్రవ్యం న వంచయేత్ ॥ 206**

సర్వం - గురుముఖాత్ - లబ్ధం - సఫలం - పాపనాశనం - యత్ - యత్ - ఆత్మహితం - వస్తు - తత్ - ద్రవ్యం - న - వంచయేత్.

గురుముఖాత్ = శ్రీ గురుదేవుని ద్వారా, లబ్ధం = పొందబడిన, సర్వం = సమస్తవస్తు సముదాయము, పాపనాశనం = పాపమును నశింపజేయునదియై, సఫలం = జ్ఞానహేతు వగుటచే ప్రయోజనవత్తగుచున్నది కాన, యత్ యత్ వస్తు = ఏ ఏ వస్తువులు, ఆత్మహితం = తనకు ప్రియములో, తత్ తత్ ద్రవ్యం = ఆయావస్తువులను, న వంచయేత్ = వంచన జేయరాదు.

ఏవస్తువైనను శ్రీ గురుదేవుని కర్పించియే తిరుగా తాను గైకొనవలయును. ఎందువలన ననగా శ్రీ గురుదేవునిద్వారా వచ్చినందుచే, శ్రీ గురుదేవుని దృష్టి పూత మయినందుచే మహాపవిత్రము, సర్వపాపనాశకమునై ఏదోషములను గలిగించదు గనుక జ్ఞానహేతుకమై సఫల మగుచున్నది. అందుచే తనకెద్ది ప్రియ మైనదో, దానిని దాచక దానినంతయు శ్రీ గురుదేవుని కర్పించవలయును. తరువాత తాను స్వీకరించవలయును.

**పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి ।**
**తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః ॥**

అని భగవద్గీతయు పత్రపుష్పాదులు భగవంతుని కర్పితములు గావలయునని తెలుపుచున్నది.

మఱియొక అర్థము: శ్రీ గురువుద్వారా వచ్చినదియు, సర్వపాపభంజక మయి నదియు, తనకు హితమును గలిగించున దేదియో దానినంతయు నలక్ష్య ముజేయదగదని భావము. అంతయు గురుస్వరూపమని భావించవలయును.

అవ: ఈశ్వరుడు పార్వతీదేవితో నీ గురుతత్త్వమును పరమభక్తితో భద్రముగా నుంచవలయునని చెప్పుచున్నాడు.

**గురుదేవార్పణం వస్తు తేన తుష్టోఽస్మి సువ్రతే ।**
**శ్రీగురోః పాదుకాం ముద్రాం మూలమన్త్రం చ గోపయేత్ ॥ 207**

గురుదేవార్పణం - వస్తు - తేన - తుష్టః - అస్మి - సువ్రతే - శ్రీగురోః - పాదుకాం- ముద్రాం - మూలమన్త్రం - చ - గోపయేత్.

వస్తు = ఏ వస్తువు, గురుదేవార్పణం - శ్రీగురుదేవున కర్పిత మగుచున్నదో, తేన=అట్టి సర్వవస్తు సముదాయముచేత, సువ్రతే = మంచివ్రతనిష్ఠ గల ఓ పార్వతీ!, తుష్టోఽస్మి = సంతృప్తిని జెందినవాడ నగుచున్నాను, శ్రీగురోః = శ్రీ గురుదేవునియొక్క, పాదుకాం = పాదుకను (పాదస్మరణరూప స్తోత్రమును), ముద్రాం = జ్ఞానముద్రను (చిన్ముద్రను), మూలమన్త్రం చ = మూలమన్త్రమునున్ను, గోపయేత్ = సంరక్షించుకొనవలయును (ఎవరికైన నిచ్చి చెడగొట్టకూడదు).

ఓ వ్రతనిష్ఠ గల పార్వతీదేవి! భక్తుడెద్దాని నైనను శ్రీ గురుదేవుని కర్పించినచో దానిచే నేను మిగుల సన్తుష్టచిత్తుడ నగుచున్నాను. ఇకను భక్తుడు శ్రీ గురుదేవునికి సంబంధించిన పాదుకాస్తవమును, జ్ఞానముద్రను, మూల మంత్రమును సంరక్షించవలయును. భద్రముగ హృదయములో నెల్లప్పుడుంచు కొనవలయును. భక్తి లేనివారికి, శ్రద్ధాశూన్యులకు ప్రమాదవశముచే నైనను వచింపరాదని భావము. పరమపవిత్ర వస్తువైన నద్దానిని గైకొని పరమపవిత్రులు గావలయునను కోరిక గలవారికే యొసంగవలయును. అట్టి విద్య సురక్షితమై యావత్కాల ముండును. లేనిచో నా విద్య సామాన్య మయినదివలె కానుపించును. రత్నమైనను దాని విలువ తెలియనివారు వీథిలో పడవేయుదురు. రాయి యనియే తలంతురు. దానియొక్క మూల్యము తెలిసినవారు భద్రముగా నుంచి యుప యోగపెట్టుకొనుదురు. అట్లే మన్త్ర మనగా దానియొక్క ధాత్వర్థమునుబట్టి గోప్యముగా నుంచి రక్షించదగినదని మహోపదేశము.

అవ: శ్రీ గురుదేవుని పాదుకాస్మరణఫలమును తెలుపుచున్నారు.

**నతాఽస్మి తే నాథ పదారవిన్దం**
**బుద్ధీన్ద్రియప్రాణమనోవచోభిః ।**

**యచ్చిన్త్యతేభావిత(మా)ఆత్మయుక్తౌ**
**ముముక్షుభిః కర్మమయోపశాంతయే 208**

నతా - అస్మి - తే - నాథ - పదారవిన్దం - బుద్ధీన్ద్రియప్రాణమనోవచోభిః - యత్ - చిన్త్యతే - భావితఆత్మయుక్తౌ (భావితం - ఆత్మయుక్తౌ) ముముక్షుభిః - కర్మమయోపశాన్తయే.

ముముక్షుభిః = ముక్తికాములచేత, భావిత ఆత్మయుక్తౌ - భావిత = భావింపబడిన, ఆత్మ = ఆత్మయొక్క,యుక్తౌ = యోగమునందు (స్వస్వరూప ధ్యానయోగమునందు లేక, (ఆత్మయుక్తౌ = ఆత్మానుసంధానమందు, భావిత = పరబ్రహ్మ స్వరూపముగ ధ్యానింపబడినదై), కర్మమయోపశాంతయే - కర్మమయ = కర్మస్వరూప అజ్ఞానముయొక్క, ఉపశాంతయే = మిక్కిలి నాశనముకొఱకై, యత్ = ఏ దివ్యస్వరూపవస్తువు, చిన్త్యతే = స్మరింపబడుచున్నదో, తత్ = సర్వకర్మ భంజక దేదీప్యమాన స్వయంప్రకాశమాన జ్ఞానస్వరూప పరవస్తు వయిన. తే పదారవిన్దం = నీ యొక్క జ్ఞానమకరంద విశిష్టమగు చరణకమలమును, హే నాథ = ఓ స్వామీ !, బుద్ధీన్ద్రియ ప్రాణమనోవచోభిః = నమస్కరించుదాన నగుచున్నాను.

ఇక నుత్తరత్ర శ్లోకములో ముద్రామన్త్రములను తెలియపరచెదరు. హృదయకమలమున నిత్యము శ్రీగురుపాదారవింద స్మరణము నెట్టి ప్రయోజనము కలిగించునో దానిని చెప్పుచున్నారు. ఓ స్వామీ! నీయొక్క సర్వదా జ్ఞాన మకరందప్రవన్తీ నిష్యందిత పదారవిందమును ముక్తిని గోరువారు సర్వకర్మ రూపమగు తాపత్రయాభీలమగు నజ్ఞానముయొక్క సమూలనాశనమునకై స్వరూపజ్ఞానమం దాత్మానుసంధానమందు పరబ్రహ్మస్వరూపముగ భావించి నిరంతరము సంస్మరించుచున్నారు. వారి హృదయము నధిష్ఠించిన యది దేదీప్యమాన దివ్యప్రకాశముతో స్వయంప్రకాశమై యున్నది. అట్టి భవదీయ పాదారవిందమును బుద్ధిలో నిశ్చయించి, మనస్సున స్మరించి, ప్రాణమగు నాత్మరూపముగ నమ్మి అనగా బుద్ధిని, ప్రాణమును, మనస్సు నేకము జేసి ధ్యానించి వాక్కుతో 'తదేవ శరణం మమ' అని స్తుతించుచు సర్వేన్ద్రియములతో (సాష్టాంగ మున) నమస్కరించుచున్నదానను. ఇట్లు పార్వతీదేవి మహేశునికి నమస్కరించెను. ఇదియే శ్రీ గురుపాదుకాస్మరణము. ఈ శ్లోకమున శ్రీగురు పాదారవింద స్మరణము బుద్ధి, మనస్సు మొదలగు నన్తరింద్రియములకును, బాహ్యేన్ద్రియము లకును శుద్ధికరమై జ్ఞానప్రకాశ చైతన్యముల నిచ్చుచున్నదని వివరింపబడెను.

అవ: శ్రీగురుదేవుని దివ్యచరణకమల ధ్యానపూర్వక నమస్కారముయొక్క ప్రయోజనమును తెలుపుచున్నారు.

**అనేన యద్భవేత్కార్యం తద్వదామి తవ ప్రియే! ।**
**లోకోపకారకం దేవి! లౌకికం తు వివర్జయేత్ ॥ 209**

అనేన - యత్ - భవేత్ - కార్యం - తత్ - వదామి - తవ - ప్రియే - లోకోపకారకం- దేవి - లౌకికం - తు - వివర్జయేత్.

అనేన = ఈ శ్రీ గురుపదారవిన్ద స్మరణపూర్వక నమస్కారముచే, యత్ = ఏ, కార్యం = మహత్తగు ప్రయోజనము, భవేత్ = సిద్ధించునో, తత్ = ఆ విషయమును, తవ = నీ కొఱకు, హే ప్రియే = ప్రియమైన గౌరీదేవీ !, వదామి = చెప్పుచున్నాను, హేదేవి = ఓ దేవీ !, కిం తు = మరేమనగా, లోకోపకారకం = జనుల కుపకారమును గలిగించున దైనను, లౌకికం = ఆత్మబాహ్యమగు వ్యాపారములను, వివర్జయేత్ = వదలవలయును (క్రమముగా ధ్యానబలిమిచే స్వయముగ వ్యాపారము లన్నియు సన్నగిల్లునని యర్థము).

ఓ దేవీ! శ్రీ గురుస్మర ణపూర్వక నమస్కారముచే మహాప్రయోజనము సిద్ధించు చున్నది. దానిని జెప్పుచున్నాను వినుము. ధ్యానించువాడు లోకసంబంధ కార్యములను పవిత్రము లయినను, జనుల కుపకారజనకము లయినను వదలవలయును. అవి దృశ్యముతో గూడినవి; కేవల స్వరూపానుసంధానమునకు భంగకరము లయినవి. ఇందుచేతనే శ్రీ గురుదేవులు ధ్యానమునకు నాటంకములగు సత్కార్యములనుగూడ విసర్జించవల యునని చెప్పెడి మహోపదేశము. సర్వదా రత్నముల వ్యాపారము చేయువాడు చిల్లరదుకాణము పెట్టుకొనునా! శ్రీగురు పాదారవింద స్మరణము కేవలము చైతన్యము, దృశ్యాతీతము, మహోత్తమము, సర్వకర్మవర్జితమగు పరబ్రహ్మము, అనేకకోటి జన్మకృత సుకృతరాశికి పరాకాష్ఠ యయినది. ఇంతయేల, అట్టిధ్యానము చేయుచుండిన స్వయముగా సర్వ దృశ్యములు నశించి ఆత్మారాము డగుచున్నాడు. ఇది శ్రీగురువర్యుని పాదారవింద స్మరణపూర్వక నమస్కారప్రయోజనము.

అవ: ముముక్షువునకు విహితావిహితములు.

**లౌకికాద్ధర్మతో యాతి జ్ఞానహీనో భవార్ణవే ।**
**జ్ఞానభావే చ యత్సర్వం కర్మనిష్కర్మ శామ్యతి ॥ 210**

లౌకికాత్ - ధర్మతః - యాతి - జ్ఞానహీనః - భవార్ణవే - జ్ఞానభావే - చ - యత్ - సర్వం - కర్మ - నిష్కర్మ - శామ్యతి.

లౌకికాత్ = లోకసంబంధమైన, ధర్మతః = ధర్మకార్యమువలన, జ్ఞానహీనః = జ్ఞానము లేనివాడై, భవార్ణవే = సంసారసాగరములో, యాతి = సంచరించుచున్నాడు, జననమరణ రహిత జ్ఞానమును పొందజాలడు, జ్ఞానభావే చ = జ్ఞానోదయము గలుగగా, సర్వం కర్మ యత్ = సమస్తమైన కర్మ యేదియో, తత్ సర్వం కర్మ = ఆ సకలకర్మయు, నిష్కర్మ = కర్మరహితమై, శామ్యతి = పూర్తిగా నశించిన దగుచున్నది.

లోకసంబంధ కార్యములు ధర్మముతో గూడినను జ్ఞానమును గలిగింప జాలవని చెప్పుచున్నారు. ధర్మకార్యము లయినను, లోకమున కంతటికిని మహోపకారమును జేయునవి యయినను బ్రహ్మాది దేవతలకును దుర్గమ మయిన, మహోత్తమ మగు నిత్య సుఖస్వరూప మయిన స్వరూపధ్యానమునకు ప్రతికూలము లగుటచే ముక్తికాముడు వానినెల్ల వదలివేయవలయును.

దృశ్యకార్యములవలన స్వరూపముయొక్క విస్మృతి గలుగుచున్నది. అదియే యజ్ఞానము. భవసాగరములో మునుంగుటయు నదియే. చీకటిని నెవ్వరైనను వాంఛింతురా! జ్ఞానమునే కోరుదురు. ఆత్మజ్ఞాన మనగా దృశ్యభావనను తనలో ప్రవేశింపనీయకయు, ఆత్మభావనను మరుపు గలుగనీయకయు చూచుచుండుట యగుచున్నది. ఇట్టి ధ్యానము నిరంతర ముండినచో అదియే జ్ఞానము. కావున దృశ్యవాసనా రూపములగు లౌకికధర్మములు స్వరూపవిస్మృతిహేతువు లగుటచే విసర్జించవలయును. అట్లాచరించుటచే జ్ఞానోదయము గలుగుచున్నది. జ్ఞానాగ్ని ప్రజ్వరిల్లగా సర్వ కర్మకాష్ఠములు దగ్ధము లగుచున్నవి. శమించిపోవుచున్నవి. అవశిష్ట మయినది నిష్కర్మమగు పరబ్రహ్మయే యగుచున్నది. కావున సాధకు లగువారు స్వరూపవిస్మృతి లేక నాత్మధ్యానమందే రమించుచుండవలయును. ఇంతకన్న నుత్తమ మయినది మఱియొండు లేదు. అట్టి శక్తి లేనివారు సత్కర్మలను దైవార్పితముగ జేయుచు క్రమముగా పరిశుద్ధులై జ్ఞానవంతు లగుదురు.

ధ్యానవిషయమున ప్రమాణము:

**నాస్తి ధ్యానసమం తీర్థం నాస్తి ధ్యానసమం తపః ।**
**నాస్తి ధ్యానసమో యజ్ఞ స్తస్మాద్ధ్యానం సమాచరేత్ ॥**

ఇచ్చట జ్ఞానముద్రా రక్షణము తెలుపబడెను.

అవ: శ్రీగురుగీతామాహాత్మ్యమును తెలుపుచున్నారు. ఈ శ్లోకము మొదలుకొని యీఅధ్యాయాన్తము వరకు మాహాత్మ్యమనియే తెలియవలయును.

**ఇమాన్తు భక్తిభావేన పఠేద్వై శృణుయాదపి ।**
**లిఖిత్వా యత్ప్రదానేన తత్సర్వం ఫలమశ్నుతే ॥ 211**

ఇమాం - తు - భక్తిభావేన - పఠేత్ - వై - శృణుయాత్ - అపి - లిఖిత్వా - యత్ - ప్రదానేన - తత్ - సర్వం - ఫలం - అశ్నుతే.

ఇమాం తు = ఈ గురుగీత నయితే, యః = ఏ పురుషుడు, భక్తి భావేన = పరమభక్తితో, పఠేత్ = చదువునో, శృణుయాత్ అపి = శ్రవణమునైన జేయునో, (సః = అట్టి పరమభక్తుడు), లిఖిత్వా = పరమాదరముతో శ్రీ గురుస్వరూప భావముతో వ్రాసి, ప్రదానేన = పరమభక్తునకు నొసగుటచేత. యత్ = ఎట్టి ఫలము లభించునో, తత్ సర్వం ఫలం = అటువంటి సకల ఫలమును, అశ్నుతే = పొందుచున్నాడు.

ఏ ధన్యాత్ము డీ గురుగీతను శ్రీగురుస్వరూప భావముతో పరమభక్తితో జదువుచున్నాడో, లేక అట్లే శ్రవణము చేయుచున్నాడో అట్టి మహాభక్తుడు (పఠించువాడు, శ్రవణము జేయువాడును) శ్రీగురుగీతను నేకమనస్కుడై భక్తిభావముతో వ్రాసి పరమభక్తునకు నిచ్చినచో నెట్టిఫలమును పొందునో, అట్టి సర్వఫలమును బడయుచున్నాడు. అనగా శ్రీగురుగీతను పరమభక్తితో పఠించిన వారును, శ్రవణముజేయువారును, వ్రాసినవారును, మఱియొక భక్తునకు నిచ్చిన వారును సమస్తఫలములను కోరిన కోరికల నన్నిటిని "యో యదిచ్ఛతి తస్య తత్" అన్నట్లు పొందుచున్నారు. శ్రీగురుదేవుని పరమభక్తు లగుచున్నారు. తద్ద్వారా జ్ఞానస్వరూపు లగుచున్నారు. ఇందులకు శ్రీభగవద్గీతాప్రమాణము-

**శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః ।**

**సోఽపిముక్తశ్శుభాంల్లోకాన్ప్రాప్నుయాత్ పుణ్యకర్మణామ్ ॥**

ఈ శ్రీగురుగీతను తాము తెలిసికొనడమేకాక పరమభక్తులకు నొసంగి గురుతత్త్వమును బోధించవలయును. అందుచే శ్రీ గురుపరమాత్మ సంతుష్ట హృదయు డగుచున్నాడు.

అవ: గురుగీతాజప ఫలము:

**గురుగీతామిమాం దేవి! హృది నిత్యం విభావయ ।**
**మహావ్యాధిగతైర్దుఃఖైస్సర్వదా ప్రజపేన్ముదా ॥ 212**

గురుగీతాం - ఇమాం - దేవి - హృది - నిత్యం - విభావయ - మహావ్యాధిగతైః - దుఃఖైః - సర్వదా - ప్రజపేత్ - ముదా.

హే దేవి = ఓ పార్వతీ, ఇమాం = ఈ, గురుగీతాం = గురుగీతను, హృది = మనస్సునందు, నిత్యం = ఎల్లప్పుడును, విభావయ = విశేషముగ ధ్యానించుము, మహావ్యాధిగతైః = చాలకాలమువరకు వెనువెంట నంటియున్న తీవ్రవ్యాధులను పొందినట్టి, దుఃఖైః = దుఃఖములచేతను (అట్టి సమయములలోను), ముదా = సంతోషముతో, ప్రజపేత్= బాగుగ జపించవలయును.

ఓ పార్వతీదేవీ! యీ గురుగీతను హృదయమునందు గురుస్వరూపమును దెలిసి నిత్యము ధ్యానించుము. సర్వశుభములు కలుగును. గురుస్వరూప బ్రహ్మతత్త్వము మిగుల ప్రకాశించును. ఒకవేళ మహావ్యాధులచే దుఃఖములు సంభవించినను, ఏది నశించినను గురుస్వరూపము నాశము గాదు. అట్టి గురుతత్త్వము తనయొక్క స్వరూపమయి యున్నందుచే మిగుల సంతోషముతో నీ గురుగీత నెప్పుడును పరమభక్తితో బాగుగ జపించవలయును. ఈ గీతయొక్క జపముచే సకలవ్యాధి దుఃఖములు, తాపములు తత్క్షణమే నశించుచున్నవి. అట్టి సమయములో నిది మహారక్షయై యున్నది. కాన సర్వదా జపించవలయును.

అవ: గురుగీతలోని ఏకైకాక్షరమే ఒక్కొక్కమంత్రము:

**గురుగీతాక్షరైకైకం మన్త్రరాజమిదం ప్రియే! ।**
**అన్యే చ వివిధాః మన్త్రాః కలాం నార్హన్తి షోడశీమ్ ॥ 213**

గురుగీతాక్షరైకైకం - మన్త్రరాజం - ఇదం - ప్రియే - అన్యే - చ - వివిధాః - మన్త్రాః-కలాం - న - అర్హన్తి - షోడశీం.

హేప్రియే = ప్రేమస్వరూపిణి యగు నో పార్వతీ. ఇదం = ఈ, గురుగీతాక్షర ఏకైకం-గురుగీతా = శ్రీ గురుగీతయందలి, అక్షర = అక్షరములలో, ఏకైకం = ఒక్కొక వర్ణమున్ను, మన్త్రరాజం = మన్త్రశ్రేష్ఠ మగుచున్నది, వివిధా = అనేకము లయిన, అన్యే మన్త్రాః = ఇతరమన్త్రములు, షోడశీం = అక్షరములో పదియారవదగు, కలాం చ = అంశమును, న అ = తగవు.

ఈ శ్రీగురుగీతయందున్న శ్లోకములలోని యొక్కొక్క యక్షరమును మన్త్రము గాదు. మన్త్రములలో శేష్ఠమయిన మహామన్త్రమునుగా ఓ పార్వతీ! తెలియుము. అట్టి ఏకై కాక్షర మహామన్త్రముతో నానావిధములగు ఇతర యంత్రముద్రాదు లతోగూడిన మన్త్రము లన్నియును పదియారవదగు నంశమును పొందజాలవు. అనగా ఏకైకాక్షర మహామన్త్రము యొక్క పదియారవదగు భాగమునకు నెట్టి ఫలితము చెప్పబడెనో, ఆ ఫలమునకు నీ మన్త్రము లన్నిటియొక్క ఫలము సరిపోవునది గాదు. అప్పటికిని చాలకనే యున్నదని భావము. ఇట్లు ఈ శ్రీగురుగీతాక్షరములలోని యొక్కొక్క యక్షరముయొక్క ఫలమును తెలియ వలెను. అనగా నీగురుగీత యొక్కటియే అనన్త జ్ఞానఫలము నొసంగునదిగ నున్నది. తక్కిన మన్త్రము లన్నియు చిత్తభ్రమ కారణములని తెలియవలెను. కనుక ఇది మహాపవిత్రము, జ్ఞానస్వరూపము, సకలసౌఖ్యదము, అమందానంద పరిపూర్ణము, శివము, శాంతము.

అవ: గురుగీత జపఫలము.

**అనన్తఫలమాప్నోతి గురుగీతాజపేన తు ।**
**సర్వపాపహరా దేవి! సర్వదారిద్ర్యనాశినీ ॥ 214**

అనన్తఫలం - ఆప్నోతి - గురుగీతాజపేన - తు - సర్వపాపహరా - దేవి - సర్వదారిద్ర్యనాశినీ.

గురుగీతాజపేన = శ్రీ గురుగీతా జపమువలన, అనన్తఫలం , అనన్త = అపరిమితమైన, ఫలం = ఫలమును (నాశములేని జ్ఞానఫలమును), ఆప్నోతి = పొందుచున్నాడు. కిం తు =

మరేమనగా ఈ గురుగీత, హే దేవి = ఓ పార్వతీ, సర్వపాపహరా = సమస్తపాపములను హరించునదియు, సర్వదారిద్ర్యనాశినీ = సకల దారిద్ర్యములను నశింపజేయు నదియు నగుచున్నది.

శ్రీ గురుగీతను సర్వదా జపించువాడు పరిమితిలేని, యింతయని వచింప సాధ్యముగాని ఫలమును జెందుచున్నాడు. అంతమాత్రమే గాదు, శ్రీగురుతత్త్వము కనుగొని నిరంతరము జపమాచరించువాడు ఎప్పుడును నాశములేని జ్ఞానఫలము నవశ్యముగ బడయు చున్నాడు. ఇక నిది చేయరాని కార్యములను జేసి మహా పాపాత్ముడైనను అట్టివాని పాపముల ధ్వంస మొనరించి మహాపరిశుద్ధాత్ముని చేయుచున్నది. మఱియు నెప్పుడును దారిద్ర్యబాధతో దుఃఖించువానియొక్క దారిద్ర్యమును పూర్తిగా నశింపజేసి వాని తీవ్రవేదనను బాపుచున్నది. వానిని సకల సమ్పత్తులతో తులదూగునట్లు చేయుచున్నది. కావున గురుగీతను జపించువాడు సర్వఫలముల నేకొరంతలేక పొందుచున్నాడు. అందుచే గురుభక్తి కలిగిన వాడు తరించుచున్నాడు.

అవ: గురు జపఫలమునే ఇంకను వివరించుచున్నాడు.

**అకాలమృత్యుహరా (హరణా) చైవ సర్వసంకటనాశినీ ।**
**యక్షరాక్షసభూతాదిచోరవ్యాఘ్రవిఘాతినీ ॥ 215**

అకాలమృత్యుహరా - చ - ఏవ - సర్వసంకటనాశినీ - యక్షరాక్షస భూతాదిచోర వ్యాఘ్రవిఘాతినీ.

(ఇయం = ఈ శ్రీగురుగీత), అకాలమృత్యుహరా చ ఏవ = అకాలమృత్యువును హరించు నదియును, సర్వసంకటనాశినీ = సమస్తకష్టములను నశింపజేయు నదియును, యక్ష ... ... విఘాతినీ = యక్షులు, రాక్షసులు, భూతములు మొదలయినవియు; దొంగలు, పెద్దపులులు వీనినన్నిటిని ధ్వంస మొనరించు నదియు నగుచున్నది.

మఱియు నీ గురుగీత అకాలమృత్యు భయమును హరించునదియు, నెట్టి కష్టములు సంభవించినను స్మరించినంత మాత్రమున వానినన్నిటిని నశింపజేయు నదియు, పఠించినంతమాత్రమున యక్షులను, రాక్షసులను, భూత ప్రేత పిశాచా దులను, తస్కరులను, వ్యాఘ్రాదులను దరిజేరనీయనిదియు, వాని భయముల

నెల్ల పారదోలునదియు నగుచున్నది.

అవ: గురుసాన్నిధ్యఫలము

**సర్వోపద్రవకుష్ఠాదిదుష్టదోషనివారిణీ ।**
**యత్ఫలం గురుసాన్నిధ్యాత్తత్ఫలం పఠనాద్భవేత్ ॥ 216**

సర్వోపద్రవకుష్ఠాదిదుష్టదోష నివారిణీ - యత్ - ఫలం - గురుసాన్నిధ్యాత్ - తత్ - ఫలం - పఠనాత్ - భవేత్.

సర్వోపద్రవ... ... నివారిణీ - సర్వోపద్రవ = సర్వకష్టములను, కుష్ఠాది = కుష్ఠు మొదలైన వ్యాధులయొక్క, దుష్టదోష = ప్రబలదోషములను, నివారిణీ = నివారించునదియు నగుచున్నది, గురుసాన్నిధ్యాత్ = శ్రీగురుదేవునియొక్క సమీపములో నుండుటవలన, యత్ = ఏ, ఫలం= జ్ఞానఫలము గలుగుచున్నదో, తత్ ఫలం = అట్టి ప్రయోజనము, పఠనాత్ = గురుగీతా పఠనమువలన, భవేత్ = కలుగును.

మఱియు నీ గురుగీతాశాస్త్ర పఠనాదులవలన భక్తుని సర్వకష్టములు నాశము లగుచున్నవి. కుష్ఠు, బొల్లి మొదలయిన మహావ్యాధులయొక్క దుర్నివార్యము లగు ప్రబలదోషములున్ను హరింపబడుచున్నవి. శ్రీగురుసన్నిధానమున నివసించుటచే నెట్టి పవిత్రజ్ఞానము, భక్తి, వైరాగ్యము మొదలగునవి గలుగునో అట్లే ప్రతిదిన మీగురుగీతను శ్రద్ధతో పఠించిన వైరాగ్యాదులు గలుగును.

అవ: జపాసన ఫలితములు

**మహావ్యాధిహరా సర్వవిభూతేస్సిద్ధిదా భవేత్ ।**
**అథవా మోహనే వశ్యే స్వయమేవ జపేత్సదా ॥ 217**

మహావ్యాధిహరా - సర్వవిభూతేః - సిద్ధిదా - భవేత్ - అథవా - మోహనే - వశ్యే - స్వయం - ఏవ - జపేత్ - సదా.

(ఇయం = ఈ గురుగీత), మహావ్యాధిహరా = ఏ ఉపాయములచేతను నశించని మహావ్యాధినిగూడ హరించునదియు, సర్వవిభూతేః = సమస్త ఐశ్వర్యములయొక్క, సిద్ధిదా = సిద్ధి నిచ్చునదియు నగుచున్నది, అథవా = లేకపోయినచో, మోహనే = మోహనకర్మయందును, వశ్యే = వశీకరణమునందును, స్వయమేవ = తానే, సదా = ఎల్లప్పుడు, జపేత్ = ఈ గురుగీతా

మంత్రమును జపించవలెను.

మరియు నీ గురుగీతాశాస్త్రము మహాపుణ్యక్షేత్రాదులను సేవించియు, నౌషధములను బుచ్చుకొనియు తీరని తీవ్రవ్యాధులనుగూడ భక్తితో పఠించినంత మాత్రమున హరించుచున్నది. సకలైశ్వర్యముల నొసగునదిగ నున్నది. అట్లుగాక పోయిన మరియు నీ గీతాశాస్త్రము మోహనమందును, వశీకరణమందును నుపయోగపడుచున్నది. దీనిని జపించినంతమాత్రమున మోహన వశీకరణాది కార్యములును నెరవేరుచున్నవి. ఆ కార్యములకై స్వయముగా నెప్పుడైన నీ గురుగీతామంత్ర ముపయోగపెట్టుకొనవచ్చును. ఇట్లు మంత్రముయొక్క మోహనాది అష్టక్రియలును నీ గురుగీతా జపముచే గలుగనని చెప్పబోవుచున్నారు.

అవ: గురుగీతా జపవిధానాసనములు.

**కుశదూర్వాసనే దేవి! హ్యాసనే శుభ్రకంబళే ।**
**ఉపవిశ్య తతో దేవి జపేదేకాగ్రమానసః ॥ 218**

కుశదూర్వాసనే - దేవి - హి - అసనే - శుభ్రకంబళే - ఉపవిశ్య - తతః - దేవి - జపేత్ - ఏకాగ్రమానసః.

హే దేవి = ఓ పార్వతీదేవీ, కుశదూర్వాసనే - కుశ = దర్భలయొక్క, దూర్వా = గరికలయొక్క, ఆసనే = అసనమునందును, శుభ్రకంబళే ఆసనే = పరిశుద్ధమగు తెల్లని కంబళాసనమునందు, ఉపవిశ్య = కూర్చొని, తతః = తరువాత, హే దేవి = ఓ భవానీ, ఏకాగ్రమానసః = ఏకాగ్రచిత్తము గలవాడై, జపేత్ = జపించవలయును, హి = నిశ్చయము.

జపవిధానమునకై ఆసనములను జెప్పుచున్నారు. దర్భాసనమందుగాని, గరికలయొక్క ఆసనమందుగాని, పరిశుద్ధమగు ధవళకంబళాసనమునందుగాని కూరుచుండి ఓ పార్వతీదేవీ! విషయములయందు మనసును బోనీయక, నేకాగ్రమానసముతో నీ గురుగీతను జపించవలయును.

అవ: పై విషయమును ఇంకను వివరించుచున్నాడు.

**శుక్లం సర్వత్ర వై ప్రోక్తం వశ్యే రక్తాసనం ప్రియే ।**
**పద్మాసనే జపేన్నిత్యం శాన్తివశ్యకరం పరమ్ ॥ 219**

శుక్లం - సర్వత్ర - వై - ప్రోక్తం - వశ్యే - రక్తాసనం - ప్రియే - పద్మాసనే - జపేత్ - నిత్యం - శాన్తివశ్యకరం - పరం.

సర్వత్ర = అన్ని శాస్త్రములలోను (అన్ని కార్యములందును), శుక్లం = తెల్లనైన ఆసనము, వై = ప్రసిద్ధముగ, ప్రోక్తం = చెప్పబడినది, వశ్యే = వశీకరణమునందు, రక్తాసనం= ఎఱ్ఱనైన ఆసనము, ప్రోక్తం = చెప్పబడినది, హే ప్రియే = ప్రియమైన పార్వతీ! పద్మాసనే = పద్మాసనమందు, నిత్యం = ఎల్లపుడును, జపేత్ = జపించవలయును (అందుచే), పరం = శ్రేష్ఠమైన, శాన్తివశ్యకరం = శాంతిని వశ్యము చేయునట్టి కార్యము సిద్ధించుచున్నది.

తెల్లనైన ఆసనము సకలకార్యములను సిద్ధింపజేయునదని సర్వశాస్త్రములు వచించుచున్నవి. జనవశ్యమందు ఎఱ్ఱనైన ఆసనముపయోగపడుచున్నది. ఇవి కూరుచుండు ఆసనములు. సిద్ధాద్యాసనములలో జేరిన పద్మాసనమందు ఆసీనుడై నిత్యము జపము గావించిన మనశ్శాంతియు, సర్వజన వశ్యమును సిద్ధించుచున్నవి.

అవ: జపాసనాల ఫలితములు.

**వస్త్రాసనే చ దారిద్ర్యం పాషాణే రోగసంభవః ।**
**మేదిన్యాం దుఃఖమాప్నోతి కాష్ఠే భవతి నిష్ఫలమ్ ॥ 220**

వస్త్రాసనే - చ - దారిద్ర్యం - పాషాణే - రోగసంభవః - మేదిన్యాం - దుఃఖం - ఆప్నోతి - కాష్ఠే - భవతి - నిష్ఫలమ్.

వస్త్రాసనే = వస్త్రాసనమందు, దారిద్ర్యం = దారిద్ర్యము గలుగుచున్నది, పాషాణే = రాతియందు, రోగసంభవః = రోగముయొక్క పుట్టుక గలుగుచున్నది, మేదిన్యాం = భూమియందు, దుఃఖం = దుఃఖమును, ఆప్నోతి = పొందుచున్నాడు, కాష్ఠే = దారుపీఠమందు, నిష్ఫలం = ప్రయోజనము లేనిది, భవతి = అగుచున్నది.

కేవలము వస్త్రాసనమందు జేయు జపము దారిద్ర్యమును, అట్లే పాషాణముపై జేయు జపము రోగమును కలిగించును. భూమిమీదమాత్ర మాచరించునట్టి యనుష్ఠానము దుఃఖమును గలిగించును. మరియు దారునిర్మిత పీఠమునందు చేయుజపము వ్యర్థమగుచున్నది.

అవ: చర్మాద్యాసన జపముల ఫలితములు

**కృష్ణాజినే జ్ఞానసిద్ధిః మోక్షశ్రీర్వ్యాఘ్రచర్మణి**
**కుశాసనే జ్ఞానసిద్ధి స్సర్వసిద్ధిస్తు కంబళే ॥ 221**

కృష్ణాజినే - జ్ఞానసిద్ధిః - మోక్షశ్రీః - వ్యాఘ్రచర్మణి - కుశాసనే - జ్ఞానసిద్ధిః - సర్వసిద్ధిః - తు - కంబళే.

కృష్ణాజినే = నల్లజింక చర్మమందు, జ్ఞానసిద్ధిః = బ్రహ్మజ్ఞానప్రాప్తియు, వ్యాఘ్రచర్మణి= పులిచర్మమందు, మోక్షశ్రీః = మోక్షలక్ష్మియు, కుశాసనే = దర్భాసనమందు, జ్ఞానసిద్ధిః = ప్రజ్ఞాశక్తిసిద్ధియు, కంబళే తు = తెల్లని కంబళమునందైతే, సర్వసిద్ధిః = పైన తెలిపిన సిద్ధులన్నియు గలుగుచున్నవి.

కృష్ణాజినాసనమందు చేయుజపము బ్రహ్మజ్ఞానసిద్ధిని, పులిచర్మమందలి అనుష్ఠానము మోక్షలక్ష్మిని, దర్భాసనమందలి ధ్యానము ప్రజ్ఞాశక్తిని గలిగించు చున్నది. పరిశుద్ధమగు తెల్లని కంబళియందు కూర్చొని యాచరించు జపము పైన తెల్పిన సిద్ధుల నన్నిటి నొసగుచున్నది. ఈ విషయమున "నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరం" అని దర్భాసనము, జింకచర్మము, వస్త్రము మూటిని చేర్చి భగవద్గీత చెప్పుచున్నది.

అవ: ఆసనములను నిరూపించి యే దిక్కునకు నెదురుగా కూర్చొని జపించిన, నేమేమి ఫలితము గలుగునో క్రమముగ చెప్పుచున్నారు.

**ఆగ్నేయ్యాం కర్షణం చైవ వాయవ్యాం శత్రునాశనమ్ ।**
**నైరృత్యాం దర్శనం చైవ ఈశాన్యాం జ్ఞానమేవ చ ॥ 222**

ఆగ్నేయ్యాం - కర్షణం - చ - ఏవ - వాయవ్యాం - శత్రునాశనమ్ - నైరృత్యాం - దర్శనం - చ - ఏవ - ఈశాన్యాం - జ్ఞానం - ఏవ - చ.

ఆగ్నేయ్యాం = ఆగ్నేయపు దిక్కులందు, కర్షణం ఏవ చ = సర్వజనాకర్షణమున్ను, వాయవ్యాం = వాయవ్యమూలయందు, శత్రునాశనమ్ = శత్రుసంహారమున్ను, నైరృత్యాం = నైరృతి మూలయందు, దర్శనం చ ఏవ = దేవతాదర్శనమున్ను, ఈశాన్యాం = ఈశాన్యమూలయందు, జ్ఞానమేవ = బ్రహ్మజ్ఞానమున్ను కలుగుచున్నవి.

ఆగ్నేయమూల కెదురుగా గూర్చుండి జపముచేయుటచేత సర్వజనా

కర్షణము గలుగుచున్నది. వాయవ్యమూలగ కూర్చొని చేయు జపమువలన శత్రుసంహారము గలుగుచున్నది. నైర్ఋతిమూల ముఖముగ గూర్చొని మంత్రమును జపించుటచే మంత్రాధిష్ఠాన దేవతాదర్శనము గలుగుచున్నది. ఈశాన్యమూల కెదురుగ నాసీనుడై ధ్యానించుటచేత బ్రహ్మజ్ఞానము కలుగుచున్నది.

అవ: ఆ యర్థమునే ఇంకను వివరించుచున్నాడు.

**ఉదఙ్ముఖః శాంతిజాప్యే వశ్యే పూర్వముఖ స్తథా ।**
**యామ్యే తు మారణం ప్రోక్తం పశ్చిమే చ ధనాగమః ॥ 223**

ఉదఙ్ముఖః - శాంతిజాప్యే - వశ్యే - పూర్వముఖః - తథా - యామ్యే - తు - మారణం - ప్రోక్తం - పశ్చిమే - చ - ధనాగమః.

శాంతిజాప్యే - శాంతి = మనశ్శాంతికొరకు, జాప్యే = జపమునందు, ఉదఙ్ముఖః = ఉత్తరముఖము గలవాడుగను, తథా = అట్లే, వశ్యే = దేవతా వశ్యమునందు, పూర్వముఖః = తూర్పుముఖము గలవాడుగను, (భవేత్ = కావలయును), యామ్యే తు = దక్షిణదిక్కునందలి జపమునందు, మారణం = మరణము కలిగించడము, ప్రోక్తం = చెప్పబడినది, పశ్చిమే చ = పడమరదిక్కునందలి జపమునందు, ధనాగమః చ = ధనప్రాప్తియు, (ప్రోక్తం = చెప్పబడెను).

ఆత్మజ్ఞానముకొరకును, మనశ్శాంతికొరకు నుత్తరదిక్కునకు నభిముఖుడై మంత్రమును జపించవలయును. ఇష్టదేవతా వశ్యమునకై తూర్పుదిక్కునకు మరలి జపించవలయును. శత్రుమారణప్రయోగమును చేయదలంచువాడు దక్షిణ దిక్కునకు నెదురుగా గూర్చుండి జపించవలయును. ధనప్రాప్తిని బడయగోరువాడు పడమరదిక్కున కెదురుగా కూర్చొని జపముచేయవలయును.

ఇట్లు జపించుటకు అష్టదిక్కులు చెప్పబడియున్నవి. ఈ దిక్కులలో ఉత్తరదిక్కు, తూర్పుదిక్కు అను రెండును పరమశ్రేష్ఠములు. భక్తులు, జ్ఞానులు వైరాగ్యాదులను గోరి యీదిక్కులయందే కూర్చొని జపముచేయవలయును. ఇందు నాయాదిక్కులలో కూర్చొని జపించు విధికి కారణము నితరశాస్త్రముల ద్వారా తెలిసికొనవలయును. ఒక్కొక్క దిక్కునుగూర్చి యొక్కొక విశేషకార్యము సిద్ధించునని యిచట తెల్పిరి.

ముఖ్యముగా జ్ఞానులకు నుత్తరముఖమే కడుశ్రేష్ఠము. అట్లు కూర్చున్నపుడు దక్షిణమూర్తి భక్తుల కెదురై జ్ఞానము నొసగుచున్నాడనియు, నందులకే ఆ దేవుడుత్తరదిక్కున దక్షిణముఖుడై దక్షిణదిక్కు చూచుచున్నాడనియు, నందులకే దక్షిణామూర్తియని నామధేయము వచ్చినదనియు సామాన్యముగ శాస్త్రములు చెప్పుచున్నవి. ముఖ్యముగ నేదిక్కున గూరుచుండినను కూర్చుండవచ్చును. కాని దక్షిణదిక్కు మిగుల పరిత్యాజ్యము. అందుచే యమదర్శనమే వీరికి కలుగును. ఇంకొక విశేషమున్నది. అదేమనగా నిరంతరము ధ్యానమగ్నులై సర్వత్ర భగవంతుడున్నాడని తెలుసుకొన్న వారికి దిక్కులయొక్క నియమము లేదు.

అవ: గురుగీతా జపఫలితము.

**మోహనం సర్వభూతానాం బన్ధమోక్షకరం పరమ్**
**దేవరాజప్రియకరం రాజానం వశమానయేత్ ॥ 224**

మోహనం - సర్వభూతానాం - బన్ధమోక్షకరం - పరమ్ - దేవరాజప్రియకరం - రాజానం - వశం - ఆనయేత్.

(ఈ గురుగీతా స్మరణము) సర్వభూతానాం = సకల ప్రాణులకు, మోహనం = మోహనము గలుగజేయునదియు (వశ్యమైనదియు), పరమ్ = మిక్కిలి, బంధమోక్షకరం = బంధమునుంచి విముక్తి గలుగజేయు నదియు (భక్తి లేనివారికి బంధమును, భక్తులకు మోక్షమును కలుగజేయు నదియు), దేవరాజప్రియకరం = దేవేంద్రునికి ప్రీతిని కలుగజేయునదియునై, రాజానం = రాజును, వశం = స్వాధీనమైన వానినిగా, ఆనయేత్ = పొందించును.

ఈ గురుగీతా జపము సమస్తభూతములను తనకు వశమగునటుల జేయుచు, నందరికి నాశ్చర్యకరమై యున్నది. భక్తులను బంధమునుండి విముక్తులనుగా జేయుచున్నది. తదితరులను కర్మబద్ధులను జేయుచున్నది. దేవేంద్రుడు జపము చేయుచున్నందుచేతనే సకలైశ్వర్యములను పొంది దేవత లందరికిని ప్రభువై ప్రకాశించుచున్నాడు. ఈ గురుగీతా భక్తునకు రాజులు గూడ స్వాధీను లగుచున్నారు

అవ: ఇదియు గురుగీతా జపఫలితమే.

**ముఖ స్తంభకరం చైవ గుణానాం చ వివర్ధనమ్**
**దుష్కర్మనాశనం చైవ తథా సత్కర్మసిద్ధిదమ్ ॥ 225**

ముఖస్తంభకరం - చ - ఏవ - గుణానాం - చ - వివర్ధనమ్ - దుష్కర్మనాశనం - చ - ఏవ - తథా - సత్కర్మసిద్ధిదం.

(ఈ గురుగీతా జపము) ముఖస్తంభకరం చ ఏవ = వాక్స్తంభనమును గలిగించుచున్నది, గుణానాం చ = సత్యశాంత్యాది గుణములకును, వివర్ధనమ్ = అభివర్ధకమై యున్నది, దుష్కర్మనాశనం చ ఏవ = సకల పాపకర్మలకు వినాశకమై యున్నది, తథా = అట్లు, సత్కర్మసిద్ధిదం = దైవధ్యానాది సత్కర్మలయొక్క సిద్ధిని గలుగజేయుచున్నది.

ఈ గురుగీతామంత్ర జపమును గావించిన మహానుభావుని దర్శించునపుడు మహాపండితులుగూడ నేమియు పలుకక వాఙ్మౌనముద్రను వహించి యవివేకులవలె నుంటున్నారు. ఇదియే ముఖస్తంభనమని తెలియవలయును. భక్తి జ్ఞాన వైరాగ్యాది గుణముల నభివృద్ధి జేయునదిగ నున్నది. సకల పాపకర్మధ్వంసకమై సకల సత్కర్మల ఫలము నొసగునదిగ నున్నది. ఇట్లు సకలగుణసంపన్న మైనది ఈ గురుగీతా జపమని తెలిసికొనవలెను.

అవ: ఈ గురుగీతా జపఫలమునే చెప్పుచున్నారు.

**అసిద్ధం సాధయేత్కార్యం నవగ్రహభయాపహమ్ ।**
**దుస్స్వప్ననాశనం చైవ సుస్వప్నఫలదాయకమ్ ॥ 226**

అసిద్ధం - సాధయేత్ - కార్యం - నవగ్రహభయాపహం - దుస్స్వప్ననాశనం - చ - ఏవ - సుస్వప్నఫలదాయకం.

అసిద్ధం = సిద్ధించని, కార్యం = కార్యమును, సాధయేత్ = సాధించును, నవగ్రహభయాపహం = శనిరాహ్వాది నవగ్రహ భయమును పోగొట్టునదియు, దుస్స్వప్ననాశనం చ ఏవ = చెడ్డకలలను రానీయకుండ చేయునదియు, సుస్వప్నఫలదాయకం = మంచివి యగు స్వప్నములయొక్క ఫలముల నిచ్చునదియు నగుచున్నది.

లోకములో నెప్పుడును సిద్ధింపని కార్యము లేవేవి గలవో వానినెల్ల క్షణములోపల సిద్ధించునట్లు చేయుచున్నది. అసాధ్యకార్యము లన్నిటిని

సాధించుచున్నది. ఇంతయేల, బ్రహ్మవిద్య మహాసూక్ష్మాతిసూక్ష మయినది. దాని నీ గురుగీతాజపము క్షణములోపల నవగాహన మగునట్లు చేయుచున్నది. నవగ్రహభయము తొలగుటకై శాంతిహోమములను జేయుచుందురు. అందుచే అకాలమృత్యుభయము మొదలయినవి దొలంగుచుండును. అట్టి మహాభయము లనుగూడ నీ గురుగీతా మన్త్రజపము పూర్తిగా నాశనము చేయుచున్నది. మఱియు చిత్తవికార హేతువులగు మహాభయంకర దుష్టస్వప్నములు చిత్తకాలుష్యముచే జనులకు గలుగుచుండును. వానినన్నింటి నీ జపము హతమార్చిన చిత్త ప్రసాదమును గలిగించును. పరుండక మునుపు గురుగీతాజపము గావించి పరుండిన దుస్స్వప్నములు నశించడమే గాకుండ తన కిష్టదేవతాదర్శనాది సుస్వప్నములు గలిగించి మనస్సును ప్రసన్నముగ జేసి మహానందమును గలిగించు చున్నది. ఇట్లు శ్రీ గురుగీతాజప మన్ని కార్యములను సాధించునదిగా నున్నది. సకలార్థదము.

అవ: శ్రీగురుగీతాశాస్త్ర ప్రయోజనము-

**మోహశాన్తికరఞ్చైవ బన్ధమోక్షకరం పరమ్ ।**
**స్వరూపజ్ఞాననిలయం గీతాశాస్త్రమిదం శివే ॥ 227**

మోహశాన్తికరం - చ - ఏవ - బన్ధమోక్షకరం - పరం - స్వరూపజ్ఞాననిలయం - గీతాశాస్త్రం - ఇదం - శివే.

హే శివే = మంగళస్వరూపిణి యగు నో పార్వతీ, ఇదం గీతాశాస్త్రం = ఈ గురుగీతా శాస్త్రము, మోహశాన్తి కరం చ ఏవ = సర్వభ్రాన్తులను శమింపజేయు నదియు, బన్ధమోక్ష కరం= బన్ధములనుండి విడిపించునదియు (బంధమోక్షములను గలిగించునదియు), పరం= పరవిద్యయగు బ్రహ్మవిద్యను బోధించున దగుటచే మహాశ్రేష్ఠ మయినదియు, స్వరూప జ్ఞాననిలయం - స్వరూప = పరబ్రహ్మస్వరూపమగు నాత్మస్వరూపజ్ఞానమునకు స్థానమయి నదియు (అఖండాతీన్ద్రియ జ్ఞాననిధియు) నగుచున్నది. కేవల శివము.

మంగళస్వరూపిణివగు నోగౌరి! యీ గీతాశాస్త్ర మనన్తఫలద మగుటచే నికను నాలింపుము. సర్వమోహనములను, భ్రాన్తులను నజ్ఞానజనితములగు సర్వానర్థములను పోగొట్టి పరమశాంతిహేతుక మగుచున్నది. సకలబంధములను

పటాపంచలుచేసి విముక్తులనుగ, పరమభక్తులనుగ జేయుచున్నది. పరావిద్య యనగ పరిపూర్ణ పరబ్రహ్మమును బోధించునది. అట్టి బ్రహ్మవిద్యను నొసగుటచే సర్వోత్కృష్టమయి యుంటున్నది. ఇంతగ వచింపనేల, ఆమహాశాస్త్రముయొక్క స్వరూప మనుపమ, మఖండవిజ్ఞానరూపము. కాన స్వస్వరూపమగు పరబ్రహ్మము యొక్క జ్ఞానమునకు నిలయమై యున్నది. ఇట్లాగీతాశాస్త్రము సర్వులకును ముక్తిదాయక మఖండ పరిపూర్ణ జ్ఞానసర్వస్వము.

అవ: శ్రీగురుగీతాశాస్త్ర ప్రయోజనము:

**యం యం చిన్తయతే కామం తం తం ప్రాప్నోతి నిశ్చయమ్ ।**
**నిత్యం సౌభాగ్యదం పుణ్యం తాపత్రయకులాపహమ్ ॥ 228**

యం - యం - చిన్తయతే - కామం - తం - తం - ప్రాప్నోతి - నిశ్చయం - నిత్యం-సౌభాగ్యదం - పుణ్యం - తాపత్రయకులాపహమ్.

(ఈ గురుగీతా శాస్త్రాధ్యాయి) యం యం = ఏ ఏ, కామం = ఈప్సితమును, చిన్తయతే = ధ్యానించుచున్నాడో (కోరుచున్నాడో), తం తం = ఆయా మనోరథమును, నిశ్చయం= సందేహము లేకుండ, ప్రాప్నోతి = పొందుచున్నాడు (కావున నీ గీతాశాస్త్రము), నిత్యం = నిత్యము, సౌభాగ్యదం = మహాభాగ్యము నిచ్చునదియు, పుణ్యం = పుణ్య మయినదియు, తాపత్రయకులాపహం - తాపత్రయ = ఆధ్యాత్మికాది త్రివిధతాపములయొక్క, కుల = సమూహమును, అపహమ్ = పోగొట్టునదియు నగుచున్నది.

"యో యదిచ్ఛతి తస్య తత్" అను నుపనిషత్తును బట్టి యీ గురుగీతా శాస్త్రమును ధ్యానించు యోగిపురుషుడు దేనిదేని నిచ్ఛయించునో ఆ సర్వస్వమును బడయు చున్నాడు. ఆ మహాపురుషుడు సకల మహాసమృద్ధులతోను, సర్వ విభూతియగు జ్ఞానవైరాగ్యాది మహాభాగ్యములతోను, సమస్త విద్యలతోను పరిపూర్ణుడై తులతూగుచున్నాడు. ఈ విషయమందు సందియము పనిలేదు. ఇది నిత్యమగుటచే నెల్లప్పుడును నిత్యమంగళమునే యొసంగుచున్నది. మహాపవిత్ర మయినది. అఖండపుణ్యారాశి. అనగా ధ్యాతలను మహాపవిత్రులుగను పుణ్యాత్ము లుగను జేయుచున్నది. ఆధ్యాత్మికాది తాపత్రయముయొక్క సకలదుఃఖ నికుంజములను దగ్ధముగ జేయుచున్నది. కేవల సుఖస్వరూపము, శివము,

పరిపూర్ణము, ఆనందము.

అవ: మఱియు నీగీతాశాస్త్ర మహిమను బేర్కొనుచున్నారు.

**సర్వశాంతికరం నిత్యమిదం వంధ్యాసుపుత్రదమ్ ।**
**అవైధవ్యకరం స్త్రీణాం సౌభాగ్యస్య వివర్ధనమ్ ॥ 229**

సర్వశాన్తికరం - నిత్యం - ఇదం - వంధ్యాసుపుత్రదం - అవైధవ్యకరం - స్త్రీణాం - సౌభాగ్యస్య - వివర్ధనమ్.

ఇదం = ఇది (మఱియు నీ గీతాశాస్త్రము) నిత్యం ఎప్పుడును, సర్వశాంతికరం - సర్వ = అందఱికి, శాంతి = పరమశాంతిని, కరం = చేయునదియు, వంధ్యాసుపుత్రదం - వంధ్యా = బిడ్డలు లేక గొడ్డురాలుగ నున్న స్త్రీకి, సుపుత్రదం = సుపుత్రుల నిచ్చునదియు, స్త్రీణాం = స్త్రీకి, అవైధవ్యకరం = విధవాత్వము లేకుండుటను చేయునదియు, సౌభాగ్యస్య = సకల మంగళములతో గూడియుండుటయొక్క, వివర్ధనమ్ = మిగుల నభివర్ధకర మైనదియు నగుచున్నది.

దీనిని పఠించువారు, జపించువారు, వినువారు పరమశాంతిని పొందు చున్నారు. తాపత్రయాది సకల దుఃఖములు నశించి జ్ఞానస్వరూపు లగుచున్నారు. కాన ఇది సర్వులకును పరమశాంతి నొసంగునదిగ నున్నది. దీని మహిమ నేమని చెప్పగలము! అనేక వ్రతములను, దానములను, పూజలను, తీర్థస్నానములను, మహాత్ముల సందర్శనమును జేసియు పుత్రులు గలుగక గొడ్రాలుగా నుండు స్త్రీలు గురుగీతాశాస్త్రమును పరమభక్తితో నాశ్రయించినచో, వారికవశ్యముగ సుపుత్రులు గలుగుచున్నారు. కావున నిది వంధ్యాసుపుత్రదాయిగ నున్నది. ఇకను స్త్రీలు సర్వదా మాంగల్యముతో గూడియుందురు. వితన్తువులు గారు. ఆ వితన్తుభయమును పొందక నిత్య మభయమునే పొందుచున్నారు. అంతమాత్రమే కాకుండ సర్వసౌభాగ్యపూర్ణులై మహాసుఖములను బడయుచున్నారు. ఇట్లు ఈ గురుగీతాశాస్త్రము సర్వసౌఖ్యదాయిగ నున్నది, సర్వులకును మహారక్షకముగ నున్నది; నిశ్చయము.

అవ: స్త్రీలకు గురుగీతా పఠన మాహాత్మ్యము:

**ఆయురారోగ్యమైశ్వర్యం పుత్రపౌత్రవివర్ధనం ।**
**నిష్కామజాపీ విధవా పఠేన్మోక్షమవాప్నుయాత్ ॥ 230**

ఆయుః - ఆరోగ్యం - ఐశ్వర్యం - పుత్రపౌత్రవివర్ధనమ్ - నిష్కామజాపి - విధవా - పఠేత్ - మోక్షం - అవాప్నుయాత్.

(ఈ గురుగీతా శాస్త్రము) ఆయుః = దీర్ఘాయుస్సును, ఆరోగ్యం = సంపూర్ణారోగ్యమును, ఐశ్వర్యం = సమ్పత్తును, (జనయతి = కలిగించుచున్నది), పుత్రపౌత్రవివర్ధనమ్= పుత్రపౌత్రుల నభివృద్ధిజేయుచున్నది, విధవా = వితన్తువు, నిష్కామజాపీ- నిష్కామ = విషయాభిలాష లేకుండుటచేత, జాపీ = జపము చేయుచున్నదై, పఠేత్ = చదివినచో, మోక్షం= ముక్తిని, అవాప్నుయాత్ = పొందును.

ఈ గురుగీతాశాస్త్రము దీర్ఘాయుస్సును, సంపూర్ణారోగ్యమును, సర్వ సమ్పత్సమృద్ధిని గలుగజేయుచున్నది. పుత్రులను, పౌత్రులనుగూడ నొసగుచున్నది. పుత్రపౌత్రులు గలుగువరకును జీవింతురు. ఈ గురుగీతాశాస్త్రము నాశ్రయించిన వా రీప్రకారము సర్వకామములను పొందుచున్నారు.

మఱియు నిది వితన్తువులకు మహారక్షకమై యున్నది. విధవాస్త్రీలును దీనిని పరమభక్తితో నిష్కాములై పఠించుచుండినచో, నిత్యము పారాయణము గావించుచుండినచో వారి సర్వదృశ్యాభిలాషలు నశించి అజ్ఞాన తిమిరము ధ్వంసమై బ్రహ్మజ్ఞాన సంపూర్ణులై నిరతిశయానందరూప శాశ్వతముక్తిని పొందుచున్నారు. ఇంతకన్న భాగ్యము వేరుకలదా! అద్దానినిగూడ దీనులగు వారికిచ్చి మహాధైర్యశాలురుగ జేయుచున్నది.

అవ: ఇక నావిషయమునే తెలుపుచున్నారు.

**అవైధవ్యం సకామా తు లభతే చాన్యజన్మని ।**
**సర్వదుఃఖమయం విఘ్నం నాశయేత్తాపహారకమ్ ॥ 231**

అవైధవ్యం - సకామా - తు - లభతే - చ - అన్యజన్మని - సర్వదుఃఖమయం - విఘ్నం - నాశయేత్ - తాపహారకం.

సకామా తు = అభిలాషతో గూడిన దాయెనేని, అన్యజన్మని = మఱియొక జన్మయందు,

అవైధవ్యం = మాంగళ్యమును (సపతిత్వమును), లభతే = పొందుచున్నది, కిం చ = మఱియు, సర్వదుఃఖమయం = సకల దుఃఖరూప మయిన, విఘ్నం = మహావిఘ్నమును, నాశయేత్ = నాశమొనరించుచున్నది, తాపహారకం = సకల తాపములను పోగొట్టునదిగ నగుచున్నది.

కామనాబుద్ధి నశించక సౌఖ్యము లనుభవించవలయునను కోరిక లుండినచో గురుగీతాశాస్త్రము నాశ్రయించిన స్త్రీ మఱుజన్మములో తనయొక్క మాంగళ్యమును సుస్థిరముగా పొందుచున్నది. దీర్ఘాయుస్సు గలిగి భర్తతో గూడనుండి సర్వసౌఖ్యములను పొందుచున్నది. జీవితము అనేకదుఃఖ భూయిష్ఠ మగుటచే ననేక బాధలు గలిగి పరితపించువారు నీ గురుగీతాశాస్త్రమును శరణుపొందిన సకలతాపములు నశించి మహాశాంతిని పొందుచున్నారు. అపుడు వారు సర్వవిఘ్నములు తొలగి జీవితమును శ్రీగురుమయముగ, అమృత మయముగను గడుపుచున్నారు.

పై జెప్పిన శ్లోకములోని పరమసారాంశము: కుంకుమశోభిత లగువారు మాత్రము గాదు, విధవాస్త్రీలు, దీనులు మొదలయిన వారెవరైన నీ గురుగీతా శాస్త్రమును పారాయణము చేయవచ్చును, జపించ వచ్చును, ధ్యానింపవచ్చును; శ్రీగురుతత్త్వమును బడయవచ్చును. ఇట్లీ గురుగీతా బ్రహ్మవిద్యావిశిష్టులై శాశ్వత సౌఖ్యమును పొందుచున్నారు.

అవ: గురుశాస్త్రము పురుషార్థదాయకము.

**సర్వపాపప్రశమనం ధర్మకామార్థమోక్షదమ్ ।**
**యం యం చిన్తయతే కామం తం తం ప్రాప్నోతి నిశ్చితమ్ ॥ 232**

సర్వపాప ప్రశమనం - ధర్మకామార్థమోక్షదం - యం - యం - చిన్తయేత్ - కామం - తం - తం - ప్రాప్నోతి - నిశ్చితం.

(సర్వదమగు నీ గురుశాస్త్రము) సర్వపాపప్రశమనం = సకలపాపములను శమింపజేయునదియు, ధర్మకామార్థమోక్షదం = ధర్మము, కామము, అర్థము, మోక్షము అను చతుర్విధ పురుషార్థముల నిచ్చునదియు నగుచున్నది (ఇట్లు), యం యం = ఏయే, కామం= కోరికను, చిన్తయతే = చింతించుచున్నాడో (కోరుచున్నాడో), తం తం = ఆయా మనోరథమును,

నిశ్చితం = నిశ్చయముగ, ప్రాప్నోతి = పొందుచున్నాడు.

మఱియు నీ గురుగీతాశాస్త్ర పఠనజపాదులు క్షణములో సకలపాపములను పూర్తిగా శమింపజేయుచున్నవి. ధర్మ, కామ, అర్థ, మోక్షములను చతుర్విధ పురుషార్థముల నొసగుచున్నవి. ఇహపరలోక సుఖములను గోరినవారి కిచ్చుచున్నవి. ఈప్రకార మెవరు దేని దేనిని వాంఛించుచున్నారో నిశ్చయముగ నా మనోరథము లన్నిటిని పొందుచున్నారు. తలంచినంత మాత్రమున నన్నియు సిద్ధము లగు చున్నవి. కావున నీ గురుగీతాశాస్త్రమును పారాయణజేయవలయును, జపము జేయువలయును, ధ్యానించవలయును-అనగా నీగురుగీతా శాస్త్రముయొక్క పారాయణమును శ్రీగురుమన్త్రమును, శ్రీగురుస్వరూప ధ్యానమును, శ్రీగురుసేవా పూజాదులను నిత్యమనుష్ఠించు చుండినచో చతుర్విధ పురుషార్థ సమ్పన్నులై శాశ్వతా నందము ననుభవించుచున్నారని సారము.

అవ: మహాపవిత్రమగు నీ గురుగీతాశాస్త్రము మహామహిమ సమ్పన్నమై, స్వర్గలోకమలో నున్న కల్పవృక్షము, కామధేనువు, చింతామణియు కోరికల నొసగునట్లు సకల మనోరథముల నిచ్చుచున్నవని తెలుపుచున్నారు.

**కామ్యానాం కామధేనుర్వై కల్పతే కల్పపాదపః ।**
**చిన్తామణిశ్చిన్తితస్య సర్వమంగళకారకమ్ ॥ 233**

కామ్యానాం - కామధేనుః - వై - కల్పతే - కల్పపాదపః - చిన్తామణిః - చిన్తితస్య - సర్వమంగళకారకం.

(ఈ గురుగీతా మన్త్రశాస్త్రము) చిన్తితస్య = ధ్యానించినవారియొక్క, కామ్యానాం = కోరికలను, కామధేనుః = కామధేనువై, కల్పపాదపః = కల్పవృక్షమై, చిన్తామణిః = చిన్తామణియై, కల్పతే = సర్వదానసమర్థ మగుచున్నది (ఈ ప్రకారము), సర్వమంగళకారకం = సకల శుభములకు హేతువుగ నున్నది.

నిరంతరము నీ గురుగీతాశాస్త్రమును ధ్యానించినవారికి స్వర్గలోకములోని కల్పవృక్షాదులతో నేమియు ప్రయోజనము లేదు. ఇచ్చటనే ప్రత్యక్షముగ కోరిన దంతయు నొసగుచున్నది. కల్పవృక్షము, కామధేనువు, చింతామణి - అశ్రయించిన వారికే, దగ్గఱనుండిననే సకలకామ్యముల నొసగుచున్నవి. ఈ శాస్త్రమటుగాక

ధ్యానించువా రెచ్చోటనుండినను శ్రీగురుసన్నిధానములో లేకపోయినను సకల శుభముల నొసంగుచున్నది. ఇట్లు సామాన్యముగా దీనియర్థము తెలియవలెను.

కల్పవృక్షాదులు జ్ఞానము నివ్వజాలవు. అవి యెట్లు కామ్యప్రయోజనము లనన్తముగా నొసంగుచున్నవో అట్లనంతముగా కామ్యాతీతము, నాశరహితమునైన బ్రహ్మజ్ఞానము నీ గురుగీతాశాస్త్ర మొసగుచున్నది.

అవ: గురుగీతాశాస్త్ర ప్రయోజనము

**లిఖిత్వా పూజయేద్యస్తు మోక్షశ్రియమవాప్నుయాత్ ।**
**గురుభక్తిర్విశేషేణ జాయతే హృది సర్వదా ॥ 234**

లిఖిత్వా - పూజయేత్ - యః - తు - మోక్షశ్రియం - అవాప్నుయాత్ - గురుభక్తిః - విశేషేణ - జాయతే - హృది - సర్వదా.

యః తు = ఏ భక్తుడయితే, (ఈగురుగీతాశాస్త్రము) లిఖిత్వా = వ్రాసి, పూజయేత్ = పూజించుచున్నాడో, సః = ఆ పరమభక్తుడు, మోక్షశ్రియం = మోక్షలక్ష్మిని, అవాప్నుయాత్ = పొందును, (మఱియు, తస్య = వానియొక్క), హృది = హృదయమునందు, సర్వదా = ఎల్లప్పుడును, గురుభక్తిః = గురుభక్తి, విశేషేణ = అధికముగా, జాయతే = కలుగుచున్నది.

శ్రీగురువునందలి పరమభక్తిచేతనే మోక్షము గలుగును గాన నారెంటిని తెలిపి గ్రంథాధ్యాయమును పూర్తిగావింపబోవుచున్నారు. మఱియు నీ గురుగీతా శాస్త్రమును ఎవడు శ్రద్ధతోవ్రాసి మహాప్రాణప్రదమని విశ్వసించి పరమభక్తితో నిరంతరము పూజించుచున్నాడో, ధ్యానించుచున్నాడో, అట్టి పరమభక్తుడు మహాజ్ఞాన సమ్పన్నుడై మోక్షలక్ష్మిని బడయుచున్నాడు, శాశ్వతపదవి నధిష్ఠించుచున్నాడు. అంత మాత్రమే గాదు, తనకట్టి జ్ఞానసమ్పత్తు శ్రీ గురుదేవునియందలి అనన్యభక్తిచేతనే గలిగినది కావున వాని హృదయమందు శ్రీగురుస్వరూపమునే తలంచుచు పరమభక్తితో నుండును. ఇట్లు జ్ఞానము గలిగినను, కృతజ్ఞుడై నందున వానికి పరమభక్తి వృద్ధిజెందుచునే యుండును. అందుచే వాని హృదయములో జ్ఞానప్రకాశము సర్వదా విరాజిల్లుచుండును.

అవ: శ్రీ గురుదేవుని యనుగ్రహము లేక ఎవరు నేవిద్యను గ్రహింపజాలరు.

అందఱు శ్రీగురుదేవు నాశ్రయించి తత్తన్మతానుయాయు లయిరను విషయమును తెలిపి ఈ యధ్యాయమును పూర్తిజేయుచున్నారు.

**జపన్తి శాక్తాస్సౌరాశ్చ గాణాపత్యాశ్చ వైష్ణవాః ।**
**శైవాః పాశుపతాస్సర్వే సత్యం సత్యం న సంశయః ॥ 235**

జపన్తి - శాక్తాః - చ - గాణాపత్యాః - చ - వైష్ణవాః - శైవాః - పాశుపతాః - సర్వే - సత్యం - సత్యం - న - సంశయః.

(ఈ గురుగీతాశాస్త్రమును) శాక్తాః = శాక్తేయులును, సౌరాః చ = సూర్యోపాసకులును, గాణాపత్యాః = గణపత్యుపాసకులును, వైష్ణవాః చ =విష్ణుమతము నవలంబించినవారును, పాశుపతాః = పశుపతి మతమును స్వీకరించినవారును, శైవాః = శివార్చకులును, సర్వే = వీరందఱును, జపన్తి = జపించుచున్నారు. పైన దెల్పినవారందఱును శ్రీగురుదేవు నాశ్రయించియే యాయామతములను స్వీకరించిరి. ఇది, సత్యం = సత్యము ఇది, సత్యం= సత్యము, సంశయః = సందేహము, న = లేదు.

శక్తినే పరమదైవమని మన్త్రయన్త్రాదులలో ధ్యానించు శాక్తేయులును, త్రిసంధ్యలయందును సూర్యభగవాను నారాధించు సౌరులును, సర్వవిద్యాధిపతియు సర్వవిఘ్నహరుడగు శ్రీ గణపతి నుపాసించు గాణాపత్యులును, విష్ణువునే సకల జగదాధారుడనియు సర్వవ్యాపకుడనియు తలంచి యుపాసించు వైష్ణవులును, పశుపతినే సర్వపాలకుడని తలంచు పాశుపతులును, శివదేవాలయములో నర్చకులై యుండు శివార్చకులును, ఆ మతముల నవలంబించిన వారందఱును నీ గురుగీతా శాస్త్రమును సర్వదా జపించుచున్నారు. కనుక ఎవరైనను శ్రీగురువునే శరణుపొంది, సేవించి, స్మరించి, ధ్యానించి పరమముక్తిని పొంది నిరతిశయానందస్వరూపులు, అఖండ పరిపూర్ణులు నగుచున్నారు.

ఇతి శ్రీ స్కాన్దపురాణే ఉత్తరఖండే ఉమామహేశ్వరసంవాదే శ్రీ గురుగీతాయాం
ధ్యానాదివిధినిర్వాణస్వరూప కథనో నామ ద్వితీయోఽధ్యాయః

మహర్షి శ్రీ సద్గురు మలయాళస్వామివర్యాణాం గురుపుత్రవర్గప్రవిష్టేన శివచరణనామధేయేన
విదుషా లిఖిత పదచ్ఛేద టీకా తాత్పర్య సహితః ద్వితీయోఽధ్యాయస్సమాప్తః.

---

ఓం

శ్రీ సద్గురుచరణారవిందాభ్యాం నమః

ఓం నమో భగవతే వేదవ్యాసాయ

# అథ తృతీయోఽధ్యాయః

అవ: ఈ అధ్యాయయునందు జపమాచరించు విధానము, శ్రీగురుదేవుని యథార్థస్వరూపము గురువులయొక్క భేదము మొదలగు విషయములను సంగ్రహముగ నిరూపించబోవుచున్నారు. అందు కామ్యజపస్థాన ప్రదేశములను తెలుపుచున్నాడు.

**అథ కామ్యజపస్థానం కథయామి వరాననే! ।**
**సాగరాన్తే సరిత్తీరే తీర్థే హరిహరాలయే ॥ 236**

అథ - కామ్యజపస్థానం - కథయామి - వరాననే - సాగరాన్తే - సరిత్తీరే - తీర్థే - హరిహరాలయే.

అథ = ధ్యానవిధిని తెలిసికొనిన తరువాత, కామ్య జపస్థానం - కామ్య = కామ్యములగు సంకల్పములయొక్క సిద్ధికై, జపస్థానం = జపముయొక్క ప్రదేశమును, హేవరాననే = ఓ పార్వతీదేవి, కథయామి = చెప్పుచున్నాను, సాగరాన్తే = సముద్రముయొక్క తీరమునను, సరిత్తీరే = నదీతీరమునను, తీర్థే = పుణ్యతీర్థమునందును, హరిహరాలయే - హరి = విష్ణువుయొక్క, హర = ఈశ్వరునియొక్క, హరిహర = శివకేశవులయొక్క, ఆలయే = దేవాలయమందును జపమాచరించవలెను.

ఓ పార్వతీదేవి! ధ్యానవిధిని, నిర్వాణస్వరూపమును ముందధ్యాయములో జెప్పితిని. ఇప్పు డీయధ్యాయములో సకలకామ్య సంకల్పములు సిద్ధినొందుటకై యెచ్చోట జపమాచరించిన నే యే సిద్ధులు గలుగు చున్నవో, ఆ యా జప స్థానములను పేర్కొనుచున్నాను, సముద్రతీరము, నదీతీరము, పుణ్యతీర్థములు, శివదేవాలయము, విష్ణుదేవాలయము, శివకేశవు లిరువురు కలిసిన దేవాలయము మొదలగునవి జపమాచరించుటకు తగిన ప్రదేశములు.

జపమాచరించుటకు సిద్ధులు సిద్ధిని బొందిన స్థలము మహాశ్రేష్ఠము.

అందుచేత సముద్రతీరము, నదీతీరము మొదలైనవి సిద్ధులు తపమాచరించు ప్రదేశములని తెలియవలెను. సముద్రతీరము చెప్పినందుచే నిట్టిభావము గలుగుచున్నది: సాగరములో ననేక నదులు వచ్చి పడుచున్నను సముద్ర మేమాత్రము కలతనొందుట లేదు. అపారముగా నున్నది. దానిలో నితరపదార్థము లెవ్వియుండినను వానినెల్ల తన కెరటములచే బయటికి త్రోయుచున్నది. ఆ ప్రకారము ధ్యానించు సాధకుడు ప్రకృతిసంబద్ధములగు వాసనాగుణములు ఉత్పన్నము లగుచుండినను వానిచే చలించక నా దోషము లన్నిటిని దూరీ కరించుచు నపరిచ్ఛిన్నమగు పరబ్రహ్మతత్త్వమునే భావించుచుండవలెను.

గంగాతీరమును గాంచినప్పుడు గంగానది మహాపవిత్రమై యెట్టి పాపాత్ముల నైనను పుణ్యాత్ములనుగా జేయుచు సముద్రమునకు ప్రయాణము జేయుచునే యుండును. ఆ ప్రకారముగనే యోగనిష్ఠాపరుడు, అనుష్ఠాన బలిమిచే పవిత్రుడై ఆశ్రయించిన వారిని జాతి మతభేదములేక పవిత్రాత్ములనుగ జేయుచు నా గంగానదివలె పుష్పములచే పూజలకు ద్రవ్యాది దానములను గణించక తనయొక్క లక్ష్యమును జేరువరకు సంతృప్తిని బొందక తీవ్రధ్యానానుష్ఠానము చేయుచునే యుండవలయును.

శివకేశవుల దేవాలయములు చెప్పబడినందుచే పరమాత్మయొక్కడే, మఱి భేదము లేదను నభేదజ్ఞానసిద్ధికై ఏర్పడినవని తెలియవలెను. ఈ ప్రకారము ఆ యా పుణ్యతీర్థములను గాంచినప్పుడు భావించి, ధ్యానించి సిద్ధత్వము నొంద వలయును.

అవ: మఱియు కొన్ని పవిత్రప్రదేశములను దెలుపుచున్నారు.

**శక్తి దేవాలయే గోష్ఠే సర్వదేవాలయే శుభే ।**
**వటస్య ధాత్ర్యా మూలే వా మఠే బృందావనే తథా ॥ 237**

శక్తిదేవాలయే - గోష్ఠే - సర్వదేవాలయే - శుభే - వటస్య - ధాత్ర్యాః - మూలే - వా - మఠే - బృందావనే - తథా.

శక్తిదేవాలయే = పార్వతి మొదలైన దేవీ దేవాలయములయందును, గోష్ఠే = గోవులు

నివసించు ప్రదేశమందును, శుభే = పవిత్రములగు, సర్వదేవాలయే = గణపతి మొదలగు సర్వదేవాలయములందును, వటస్య = మఱ్ఱిచెట్లుయొక్క, ధాత్ర్యాః = నెల్లి (ఉసిరిక) చెట్టుయొక్క, మూలే వా = క్రిందయందుగాని, మఠే = మఠమందుగాని, తథా = అట్లే, బృందావనే = తులసీబృందావనమునందుగాని జపమాచరించవలెను.

పార్వతి, జ్ఞానాంబ, ప్రసూనాంబ, లక్ష్మీదేవి మొదలగు దేవీ దేవాలయములు, గోవులను కట్టివేయు ప్రదేశము, పవిత్రములగు గణపత్యాది దేవాలయములు, వటవృక్షమూలము, ఉసిరికచెట్లయొక్క క్రిందిభాగము, మఠము, తులసీవనము, బిల్వవనము మొదలగు పవిత్రవనములు జపించుటకు అనువగు సిద్ధిదాయకములగు ప్రదేశములని యెరుంగవలెను. భూతప్రేతపిశాచాదులు లేక దేవతలయొక్క ప్రతిబంధము లేకయుండు స్థలము లన్నియు శీఘ్రముగ జ్ఞానదాయకము లగుచున్నవి. పైన దెలిపిన ప్రదేశము లన్నియు నట్టి మహా పవిత్రములని తెలియవలెను.

అవ: జపాచరణ కుపయుక్త ప్రదేశములు:

**పవిత్రే నిర్మలే దేశే నిత్యానుష్ఠానతోఽపి వా ।**
**నిర్వేదనేన మౌనేన జపమేతత్సమారభేత్ ॥ 238**

పవిత్రే - నిర్మలే - దేశే - నిత్యానుష్ఠానతః - అపి - వా - నిర్వేదనేన - మౌనేన - జపం - ఏతత్ - సమారభేత్.

పవిత్రే = పవిత్రమగు, నిర్మలే దేశే వా = పరిశుద్ధ ప్రదేశమందుగాని, నిత్యానుష్ఠానతః= నిత్యము ననుష్ఠించుటవలనగాని, నిర్వేదనేన = కష్టమును చెందని, మౌనేన = సర్వేంద్రియముల వ్యాపారోపరమ మను మౌనముతో, ఏతత్ జపం = ఈ గురుమంత్ర జపమును, సమారభేత్= ప్రారంభించవలెను.

పైన తెలుపబడిన నదీతీరాదులు లభించక పోయినప్పుడు పవిత్రమగు నిర్మలప్రదేశములందుగూడ ఆసీనుడై జపమాచరించవచ్చును. ఈ ప్రకారము పుణ్యతీర్థాది ధ్యానయోగ్య ప్రదేశములయందు దృఢనిష్ఠతో నాసీనుడై నిత్యానుష్ఠానమునందు నేకష్టమును జెందక దినదినముత్సాహ మధికరించగా సర్వేంద్రియ వృత్తుల నడంచుట యను పరమమౌనముతో నీ గురుమంత్రమును జపించ

వలయును.

అవ: ప్రదేశములను వచించి జపఫలమును తెలుపుచున్నారు.

**జాప్యేన జయమాప్నోతి జపసిద్ధిం ఫలం తథా ।**
**హీనం కర్మ త్యజేత్సర్వం గర్హితస్థానమేవ చ ॥ 239**

జాప్యేన - జయం - ఆప్నోతి - జపసిద్ధిం - ఫలం - తథా - హీనం - కర్మ - త్యజేత్ - సర్వం - గర్హితస్థానం - ఏవ - చ.

జాప్యేన = పైన దెల్పిన పవిత్రప్రదేశములందు జపము చేయుటచేత, జయం = జయమును, ఆప్నోతి = పొందుచున్నాడు (సర్వకార్యములు సిద్ధించుచున్నవి), తథా = అట్లు, జపసిద్ధిం = జపముయొక్క సిద్ధిని, ఫలం = ఇష్టదేవతానుగ్రహ ఫలమును, ఆప్నోతి = పొందుచున్నాడు, హీనం = నీచమైన, సర్వం కర్మ = సమస్తకర్మలను, త్యజేత్ = వదలవలయును, తథా = అట్లు, గర్హితస్థానం చ = నిందితమగు ప్రదేశమునుగూడ (అపవిత్రప్రదేశమును), త్యజేత్ ఏవ = తప్పక వీడవలయును.

జపము చేయుచు రాగా రాగా మహత్తరమగు ధైర్యము కలుగుచున్నది. ఈ ప్రపంచ మంతయు తనకు వశమై, తనయొక్క యాజ్ఞకు లోబడియే యుండునను భావన కలుగుచున్నది. తా దలంచిన పవిత్రకార్యములు క్షణములో సఫలము లగుచున్నవి. సర్వలోకజయము కలుగుచున్నది. చాలాకాలము జపించి నందుచేత నక్షరశః మంత్రసిద్ధి ఏర్పడుచున్నది. అందుచే మంత్రాధిష్ఠాన దేవత వశ్యమగుచున్నది. నిరంతరము దైవానుగ్రహఫలము లభించుచున్నది. అందుచే సాధకుడు కోరిన కోరిక లన్నియును శీఘ్రముగా ఫలించుచుండును.

ఇట్లు చెప్పి హీనకర్మలు చేయగూడనివని తెలుపుచున్నారు. అపవిత్రములగు కర్మల నాచరించుటచేత మంత్రము ఫలించకపోవుచున్నది. దానిశక్తి తగ్గిపోవు చున్నది. దైవము దూరమగుచున్నది. జపమాచరించి పవిత్రాత్ముడై సిద్ధులను కోరక జ్ఞానార్జనమును చేసి ధన్యాత్ముడు కావలయును. మరియు జపమునకు నప విత్రములగు, మహాదూషితములగు ప్రదేశములను త్యజించ వలయును. లేనిచో తనజపము ప్రతిబంధము లేక సిద్ధించదు. పవిత్రభావముచే మనశ్శాన్తియు, మనశ్శుద్ధియు, జ్ఞానసిద్ధియు గలుగుచున్నవి. తా గర్వించి యన్నిటికిని బహు

నీచములగు మారణాది కార్యములను, పరహింసాది కృత్యములను చేయగూడదు. సత్కర్మలచే,సుక్షేత్రములయందు జపము త్వరలో సిద్ధిని గాంచునని భావము.

అవ: జపమున కనువగు వృక్షములు:

**శ్మశానే బిల్వమూలే వా వటమూలాంతికే తథా ।**
**సిద్ధ్యన్తి కానకే మూలే చూతవృక్షస్య సన్నిధౌ ॥ 240**

శ్మశానే - బిల్వమూలే - వా - వటమూలాన్తికే - తథా - సిద్ధ్యన్తి - కానకే - మూలే - చూతవృక్షస్య - సన్నిధౌ.

శ్మశానే = శ్మశానభూమియందుగాని, బిల్వమూలే వా = బిల్వవృక్షవన మందుగాని, వటమూలాన్తికే = వటవృక్షముయొక్క మూలప్రదేశ మందుగాని, కానకేమూలే = కానుగవృక్షమూలమందును, చూతవృక్షస్య సన్నిధౌ = మామిడిచెట్టుయొక్క సమీపమందును, సిద్ధ్యన్తి = సిద్ధిని పొందుచున్నవి.

పవిత్రమగు మనసుతోను, నిర్మలభావముతోను, శీతలమగు వాతావరణములోను చేయు జపము శీఘ్రముగా సిద్ధించుచున్నది. అట్టిభావముల నిచ్చోట విశదీకరించుచున్నారు. శ్మశానము మహేశ్వరు డుండుచోటని శాస్త్రములు తెలుపుచున్నవి. మిగుల వైరాగ్యము గలవారు శ్మశానమునం దిప్పటికిని సంచరించుచున్నారు. అచ్చోట కూర్చొని జపము చేయుటచే ప్రాణిసహజమగు మరణభీతి స్వయముగ తొలంగిపోవుచున్నది. జగత్తంతయు నాశప్రాయమను భావము నిరంతరము సుస్థిర మగుచున్నది. అత్యధిక వైరాగ్యభాగ్యము జనించుచున్నది. ఈశ్వరుని యనుగ్రహముచే జితేంద్రియు డగుచున్నాడు.

బిల్వవనమూకూడ నీశ్వరునికి ప్రియమగు స్థానము. అచ్చోట జపించుటచే వాతావరణ మెంతగనో యనుకూల మగును. పవిత్రముగను నుంటున్నది. బిల్వపత్రములచే నీశ్వరుడు సదా తృప్తినొందుచున్నాడు. అట్టి మహాపవిత్రమగు బిల్వవనము జపమున కెంతో శ్రేష్ఠమైనది. శీఘ్రముగా సిద్ధిద మగుచున్నది.

వటవృక్షముగూడ మహాపవిత్రమని తెలియువలెను. వట (మఱ్ఱి) వృక్షముక్రింద మహావైరాగ్య తత్పరుడై జ్ఞానముద్రను సనకాదుల కొసంగిన

దక్షిణామూర్తి తపమాచరించు చున్నాడని వేదాంతశాస్త్రములు చెప్పుచున్నవి. అందుచే దక్షిణామూర్తి యనుగ్రహము గలిగి జ్ఞానము సుస్థిర మగునని వటవృక్షమూలము జపమునకు ప్రశస్తమై యున్నది.

కానుగచెట్లయొక్క వనముగూడ మిక్కిలి శ్రేష్ఠమైనది. ఎంత ధ్యానించినను నుష్ణత్వము కలుగనీయక శీతలత్వము నొసంగుచున్నది. మనస్సును ప్రశాంతముగ జేయుచున్నది. శ్రీమన్నారాయణుని స్వరూపము తమాలశ్యామలము. అనగా తమాలవనమువలె (కానుగవనమువలె) శ్యామల మైనదని వర్ణించుచున్నారు. అందుచే నిది విష్ణుదేవునకు నిలయమని తెలియవలయును. అట్టి పవిత్రభావము మనసున కలుగునని యభిప్రాయము. తమాలవనముకూడ జపయోగ్యస్థానమై యున్నది.

మామిడిచెట్లయొక్క సమీపముకూడ మహాపవిత్ర మైనది. చూతవృక్షము యొక్క గుణమేమనగా దానిలో మాధుర్య ముంటున్నది. ఆ ప్రకారము జ్ఞాన మాధుర్యము కలుగునను నభిప్రాయముతో నా చూతవృక్షము యొక్క మూలము పేర్కొనబడినది. సిద్ధించిన యర్థ మేమనగా, జపమునకు పవిత్రత్వము, నిర్మల త్వము, శీతలత్వము మొదలగునవి ముఖ్యములు కనుక అట్టిభావములు పైన దెలిపిన వృక్షములక్రింద సిద్ధించును. అందుచే సకలకార్యములు త్వరలో సిద్ధించుచున్నవి.

అవ: వర్ణాసనముల ప్రయోజనము.

**పీతాసనం మోహనే తు హ్యసితం చాభిచారికే ।**
**జ్ఞేయం శుక్లం చ శాంత్యర్థం వశ్యే రక్తం ప్రకీర్తితమ్ ॥ 241**

పీతాసనం - మోహనే - తు - హి - అసితం - చ - అభిచారికే - జ్ఞేయం - శుక్లం - చ - శాంత్యర్థం - వశ్యే - రక్తం - ప్రకీర్తితం.

మోహనే తు = లోకముయొక్క మోహనమందైతే, పీతాసనం = ఆకుపచ్చని రంగుగల ఆసనమున్ను, అభిచారికే = పరులకు హింసాకరములగు మారణాది ప్రయోగములందు, అసితం చ = నల్లనైన ఆసనమున్ను, శాంత్యర్థం = మనశ్శాన్తికొరకు, శుక్లం చ = తెల్లనైన ఆసనమున్ను,

వశ్యే = జనులయొక్క వశీకరణమందు, రక్తం = ఎఱ్ఱనగు నాసనమున్ను, ప్రకీర్తితం = చెప్పబడినది, (ఇతి = ఇట్లని), హి = నిశ్చయముగా, జ్ఞేయం = తెలియదగినది.

జనులను ముగ్ధులనుగా మోహపరవశులనుగా జేయుటకు పచ్చనిరంగు గల ఆసనము,మారణాది ప్రయోగములందు నల్లనివర్ణము గల ఆసనము, మనశ్శాన్తికొరకు ధవళాసనము, పరవశీకరణమునకు రక్తాసనమును శాస్త్రములలో చెప్పబడినవి. ఈ ప్రకారము నిశ్చయముగా తెలియవలెను. సర్వదా మనకు గోరదగినది పరిశుద్ధమైన శుభ్రాసనము. దానిలో నన్ని సిద్ధు లుంటున్నవి. ఈ విషయములలో స్వయముగా శాస్త్రములను చదివినమాత్రముగాక, మంత్ర స్వీకరణము లందును, జపానుష్ఠానము లందును, ఆసనములందును నను భవజ్ఞులగు మహాత్ములకడ రహస్యమును తెలిసికొని యాచరించవలయును.

అవ: గురుగీతా జప ప్రయోజనము:

**జపం హీనాసనం కుర్వన్ హీనకర్మాఫలప్రదమ్ ।**
**గురుగీతాం ప్రయాణే వా సంగ్రామే రిపుసంకటే ॥ 242**

జపం - హీనాసనం - కుర్వన్ - హీనకర్మ - అఫలప్రదమ్ - గురుగీతాం - ప్రయాణే- వా - సంగ్రామే - రిపుసంకటే.

**జపన్ జయమవాప్నోతి మరణే ముక్తిదాయికా ।**
**సర్వకర్మాణి సిద్ధ్యన్తి గురుపుత్రే న సంశయః ॥ 243**

జపన్ - జయం - అవాప్నోతి - మరణే - ముక్తిదాయికా - సర్వకర్మాణి - సిద్ధ్యన్తి - గురుపుత్రే - న - సంశయః.

హీనాసనం = ఆసనము లేనట్టి, జపం = జపమును, కుర్వన్ = చేయుచు, అఫలప్రదమ్= ఫలము నియ్యని జపము పొందుచున్నాడు, హీనాసనం = నీచమగు అసనము గల, జపం = జపమును, కుర్వన్ = చేయుచు, హీనకర్మ = నీచమగు కర్మను పొందుచున్నాడు, ప్రయాణే వా = ప్రయాణమందుగాని, రిపుసంకటే = శత్రువులచే సంకులమగు, సంగ్రామే = యుద్ధమందుగాని, గురుగీతాం = గురుగీతను, జపన్ = జపించువాడు, జయం = జయమును, అవాప్నోతి = పొందుచున్నాడు. మరణే = అవసానకాలమందు (ఈ గీత స్మరింపబడినదై), ముక్తిదాయికా = ముక్తి నొసగునదిగా నగుచున్నది, గురుపుత్రే = గురుపుత్రునియందు,

సర్వకర్మాణి = సకల మనోరథములు, సిద్ధ్యన్తి = ఫలించుచున్నవి, సంశయః = సందేహము, న = లేదు.

ఆసనము లేక జపించువారు జపఫలితము నొందజాలరు. నీచాసనము నందు మంత్రజప మాచరించువాడు నీచాత్ముడే; నీచకృత్యములనే చేయుచున్నాడు. ప్రయాణములో తానొంటరిగ పోవుచున్న వాడైనను గురుగీతను పఠించినచో భయములేక అనేకజన సముదాయములో ప్రయాణము గావించుచున్నట్లు తోచుచున్నదై ఎన్నోవిధములుగ రక్ష గలవాడుగ నగుచున్నాడు. అనేక శత్రువులతో గూడి యుద్ధములో పోరునప్పుడు గురుగీతను జపించుచున్నవాడే తప్పక జయమును పొందుచున్నాడు, యుద్ధములో ననేకు లనేక ప్రార్థనలు గావించి వచ్చుచున్నారు; పోరుచున్నారు. కాని గురుప్రార్థన చేసినవారికే జయమని తెలియవలెను. ఈ విషయములో భారతమున నర్జునుడే దృష్టాంతము.

అవసానకాలమందు శ్రీసద్గురు పరబ్రహ్మముయొక్క స్మరణమే ముక్తి దాయకమై యున్నది. ఈవిషయమును "తతః కిం తతః కిం తతః కిం" అను గుర్వష్టకము నిస్సంశయముగ ప్రతిపాదించుచున్నది. శ్రీగురుశుశ్రూష చేసి మంత్రో పదేశము పొందిన గురుపుత్రునియందు సర్వకార్యములు సిద్ధించుచున్నవి. భక్తులలో గురుభక్తుడే అప్రతిహత జ్ఞానతేజోమూర్తియై, గ్రహములలో సూర్య గ్రహమువలెను, నక్షత్రములలో చంద్రునివలెను వెలుగొందుచున్నాడు; సందియము లేదు.

అవ: గురుమంత్రప్రభావమును నుడువుచున్నారు.

**గురుమన్త్రో ముఖే యస్య తస్య సిద్ధ్యన్తి నాన్యథా ।**
**దీక్షయా సర్వకార్యాణి సిద్ధ్యన్తి గురుపుత్రకే ॥ 244**

గురుమన్త్రః - ముఖే - యస్య - తస్య - సిద్ధ్యన్తి - న - అన్యథా - దీక్షయా - సర్వకర్మాణి - సిద్ధ్యన్తి - గురుపుత్రకే.

యస్య = ఏ భక్తునియొక్క, ముఖే = వక్త్రమునందు, గురుమన్త్రం = గురుమన్త్రము (ఉన్నదో), తస్య = అట్టి గురుభక్తునకు, సిద్ధ్యన్తి = కార్యము లన్నియు సఫలము లగుచున్నవి, అన్యథా = వేరువిధముగా, న సిద్ధ్యన్తి = సిద్ధించవు, దీక్షయా = మన్త్రదీక్షచేత, సర్వకర్మాణి = సకల కర్మలు, గురుపుత్రకే = గురుపుత్రునియందు, సిద్ధ్యన్తి = సిద్ధినొందుచున్నవి.

ఎవడు నిరంతరము శ్రీ గురుస్వామిని మరువక ముఖమందు గురు మంత్రము నుచ్చరించుచుండునో, జపించుచుండునో అట్టి మహాభక్తుడు గురుమన్త్రజపము జేసి ఏ కార్యములు మొదలిడినను విఘ్నములు లేక అన్నియు సఫలము లగుచున్నవి. అనగా భక్తిజ్ఞాన వైరాగ్యాది తపోధ్యానాది సర్వపరిపూర్ణుడై జనులను తరింపజేయుచున్నాడు. ఆశ్రమములు, దేవాలయములు, పాఠశాలలు మొదలగు సత్కర్మ లన్నియు గురుపుత్రునికి సంకల్పమాత్రమున నెఱవేరుచున్నవి. ఇందులో గురుభక్తిని విడిచి మరియొక్క మార్గములేదు. శ్రీ గురుదేవునిదగ్గర మంత్రదీక్షను గైకొన్న వానికి నెచ్చోట నేలాంటి ప్రతిబంధకమును కలుగదని ముఖ్యతాత్పర్యము.

మన్త్రదీక్ష యనగా మన్త్రమును గ్రహించి అధమపక్షము మూడు సంవత్స రము లైనను తదేకదీక్షతో నెచ్చోటను జనక నిస్సంకల్పుడై మంత్ర సిద్ధికొఱకును, ఆత్మసిద్ధికొఱకును, సకల పాపప్రశమనముకొరకును, నిష్టదైవాను గ్రహము కొఱకును జపమాచరించవలయును. ఇదియే మంత్రదీక్ష యగును. మంత్రదీక్షవలె గురుదీక్ష యనియు శాస్త్రములో చెప్పబడుచున్నది. ఈ గురుదీక్ష స్పర్శదీక్ష యనియు, ధ్యానదీక్ష యనియు, దృగ్దీక్ష యనియు మూడు విధములుగా నున్నది. ఈ దీక్షాప్రకరణము ముఖ్యమని సంగ్రహముగ క్రింద వ్రాయబడుచున్నది.

**వీక్షణధ్యానసంస్పర్శైః మత్స్యకూర్మవిహంగమాః ।**
**పోషయన్తి స్వకాన్పుత్రాన్ తద్వత్సణ్డితవృత్తయః ॥**

చేపలు వీక్షణముచేతను, కూర్మము ధ్యానముచేతను, పక్షులు స్పర్శము చేతను తమతమ సన్తానములను తమరూపములుగా జేయుచు పోషించుచున్నవి. ఆ ప్రకారము జ్ఞానవంతులగు గురువులయొక్క వృత్తులను తెలియవలయును. వానిలో **స్పర్శదీక్ష యనగా-**

**యథా పక్షీ స్వపక్షాభ్యాం శిశూన్ సంవర్ధయేచ్ఛనైః ।**
**స్పర్శదీక్షోపదేశస్తు తాదృశః కథితః ప్రియే! ॥**

పార్వతీదేవికి పరమశివు డుపదేశించుచున్నాడు. పక్షి తనరెండు రెక్కలలోపల

తగులునట్లు గ్రుడ్లనుంచుకొని పొదిగి పిల్లలను జేయుచు పోషించుచున్నది. అట్లే శ్రీ గురుదేవుడు శిష్యునియందలి పరమదయతో ననుగ్రహమూర్తియై హస్తమస్తక సంయోగము గావించి వానియొక్క యజ్ఞానావరణమును పూర్తిగా తుడిచివైచి జ్ఞానోపదేశముచే నజ్ఞానమును నిర్మూలన మొనరించి ధన్యునిగ జేయుచున్నాడు. పిల్లలు కాకముందు అండములు చైతన్యములు లేనివై యుండినవి. తరువాత ప్రాణము గలవాయెను. అట్లే శిష్యుడును జడు డైనను గురూపదేశముచే చైతన్యుడాయెను. **ధ్యానదీక్ష యనగా-**

**స్వాపత్యాని యథా కూర్మీ ధ్యానమాత్రేణ పోషయేత్ ।**
**వేత్థ దీక్షోపదేశస్తు మనసస్స్యాత్తథావిధః ॥**

ఓ భవానీ ! కూర్మ మేప్రకారము గ్రుడ్ల నెచ్చోటనో యుంచి మనస్సులో స్మరించినంతమాత్రమున దానిగ్రుడ్లు పగిలి పిల్లలు పుట్టుచున్నవో, అవి తమ రూపమును పొందుచున్నవో ఆ ప్రకారమాత్మనిష్ఠ గల శ్రీ సద్గురుదేవుడు నెచ్చోట నుండినను పరమభక్తులను మనస్సులో ధ్యానించుటచేత చైతన్యవంతులనుగా, జ్ఞానవంతులనుగా జేసి కృతార్థులను చేయుచున్నాడు. **దృగ్దీక్ష యనగా-**

**యథా మత్స్యీ స్వతనయాన్ వీక్షణేనైవ పోషయేత్ ।**
**దృగ్దీక్షాభ్యుపదేశస్తు తాదృశః కథితః ప్రియే ॥**

ఓ గౌరి! మత్స్యము గ్రుడ్లను గావించి తనదృష్టి నిగిడ్చి చూచుచుండుటచేత నవన్నియు పిల్లలగుచున్నవి. దృష్టి తప్పిపోయిన వగుట లేదు. ఇది ప్రత్యక్షము గదా! అట్లే శ్రీగురుదేవుడు పరమభక్తులను, శిష్యులను తనయొక్క యనుగ్రహదృష్టిచేతనే జన్మరహితమగు జ్ఞానవంతులనుగా జేసి కృతాకృత్యులనుగా జేయుచున్నాడు. గురువుయొక్క యనుగ్రహములేని వారు జడులుగనే యున్నారని తెలియవలెను.

**భ్రమరకీటక న్యాయరూప దీక్ష**యు మరొకటి కలదు. ఇది మన్త్రదీక్షయనియు తెలియ నగును. ఇది భృంగవృత్తి యగును. ఈ ప్రకారము శ్రీ గురుదేవునియొక్క యనుగ్రహమును తెలిసికొను పరమభక్తులు తరించవలయును.

కొందరు గురువులు పైన దెలిపిన చతుర్విధ దీక్షలతో గూడుకొన్నవారై సర్వదక్షులై పరమకృపతో శిష్యులను సంసారసముద్రమునుండి తరింపజేసి జ్ఞానతీరమున స్థిరప్రతిష్ఠ గలవారినిగా జేయుచున్నారు.

అవ: శ్రీగురుతత్త్వము నెఱింగిన పరమభక్తుడు సదా శ్రీగురుగీతా గంగానదిలో నిత్యము స్నానము చేయువా డగుటచే పరమనిర్మలుడై యుంటున్నాడని తెలుపుచున్నారు.

**భవమూలవినాశాయ చాష్టపాశనివృత్తయే ।**
**గురుగీతామ్భసి స్నానం తత్త్వజ్ఞః కురుతే సదా ॥ 245**

భవమూలవినాశాయ - చ - అష్టపాశనివృత్తయే - గురుగీతామ్భసి - స్నానం - తత్త్వజ్ఞః - కురుతే - సదా.

భవమూలవినాశాయ = సంసారమునకు మూలకారణ మయిన మూలాజ్ఞానముయొక్క సమూలనాశముకొఱకును, అష్టపాశవృత్తయే చ = కులబలాది అష్టపాశములయొక్క నివృత్తికొఱకును, గురుగీతామ్భసి = గురుగీతయను జపమునందు, స్నానం = స్నానమును, సదా = ఎల్లప్పుడును - తత్త్వజ్ఞః = తత్త్వవేత్త, కురుతే = చేయుచున్నాడు.

స్నానము చేయుటచే బాహ్యమలముమాత్రము పోవుచున్నది. తిరుగా మరుసటి దినము స్నానమాచరించవలయును. ఇట్లు నిత్యము స్నానమాచరించుటచేతనే బాహ్యమలము పోవుచున్నది. జ్ఞానమయమగు, నమృతమయమగు నీ గురుగీతా సలిలమం దొకసారి స్నానమాచరించిన తిరుగా మాయామాలిన్యమంటదు. కావున శ్రీగురుగీతాతత్త్వమగు స్వస్వరూపమును మరువకుండువా డగుటచే నిత్యము తత్త్వస్నానము చేసినవా డగుచున్నాడు. కావున నట్టి శ్రీగురుగీతా తత్త్వస్నాన మహిమచే ననాదిగా నున్నట్టియు సకలానర్థ దాయకమగు సంసారమునకు మూలమైనట్టియు నగు మూలాజ్ఞానమను మహామాలిన్యము పూర్తిగా పోవుచున్నది. అందుచే నవిద్యాకార్యములగు కుల బలాదులను అష్టపాశములు నివృత్తము లగుచున్నవి. ఇట్లు వివేకి యగువాడు శ్రీగురుగీతాతత్త్వ స్వరూపు డగుచున్నాడు. స్నానమాచరించుట యనగా పూర్తిగా మునుంగుట యని యర్థము. అందుచే సర్వేంద్రియములును పరిశుద్ధము లగుచున్నవి. అట్లే శ్రీగురుగీతాస్నానమాచరించిన పరమభక్తుడు గురుగీతా జ్ఞానములో మునింగిపోయి యున్నాడు.

అందువల్ల వాని బాహ్యాభ్యన్తర సర్వేన్ద్రియములు ప్రసన్నము లగుచున్నవి, జ్ఞానమయము లగుచున్నవి.

అవ: లోకమున కంతటికి గురువగు మహాత్ముని లక్షణమును దెలుపుచున్నారు.

**స ఏవ సద్గురుస్సాక్షాత్ సదసద్బ్రహ్మవిత్తమః ।**
**తస్య స్థానాని సర్వాణి పవిత్రాణి న సంశయః ॥ 246**

సః - ఏవ - సద్గురుః - సాక్షాత్ - సదసద్బ్రహ్మవిత్తమః - తస్య - స్థానాని సర్వాణి - పవిత్రాణి - న - సంశయః.

యః = ఏమహాత్ముడు, సదసద్బ్రహ్మవిత్తమః - సత్ = సద్రూపమైన, అసత్ = అసద్రూప మయిన జగత్తైన, బ్రహ్మ = పరబ్రహ్మమును, విత్తమః = తెలిసినవారిలో శ్రేష్ఠుడయిన తత్త్వజ్ఞుడో, స ఏవ = పరిపూర్ణ బ్రహ్మమును గుర్తెఱింగి అఖండస్వరూపు డయిన ఆ పరిపూర్ణ జ్ఞానియే, సాక్షాత్ సద్గురుః = ప్రత్యక్షముగా నున్న పరబ్రహ్మస్వరూపి యగు గురుదేవుడు, తస్య = ఆ మహాత్మునియొక్క, సర్వాణి స్థానాని = నివసించు ప్రదేశము లన్నియు, పవిత్రాణి= పవిత్రము లగుచున్నవి (మహాతీర్థము లగుచున్నవి), సంశయః న = సందేహము లేదు.

సత్తైనట్టియు, జగత్తంతయు బ్రహ్మవిస్ఫూర్జితము గనుక నసత్తగు జగద్రూపమయిన పరబ్రహ్మమును దెలిసికొని, యఖండస్వరూపియై పరిపూర్ణుడగు బ్రహ్మజ్ఞానియే ప్రత్యక్షపరమాత్మ యయిన శ్రీసద్గురుదేవుడు. ఆ మహాత్ముడు పదమిడిన ప్రదేశము లన్నియు మహాతీర్థము లగుచున్నవి, పవిత్రము లగుచున్నవి, ఆశ్రమము లగుచున్నవి. సర్వజ్ఞాన సమ్పత్తి గల మహాత్ము లచ్చోట తపస్సు గావించుదురు. సకల సమ్పత్తులు నాప్రదేశములో తులతూగుచుండును. కేవలము నిర్గుణ పరబ్రహ్మలోకమై శ్రీగురుస్థాన మానంద నిలయమై విరాజిల్లును. ఇందులో సందేహ మిసుమంతయు లేదు. అంతయు సద్గురుమయమై యుండును.

**సర్వశుద్ధః పవిత్రోఽసౌ స్వభావాద్యత్ర తిష్ఠతి ।**
**తత్ర దేవగణాస్సర్వే క్షేత్రపీఠే చరన్తి చ ॥ 247**

సర్వశుద్ధః - పవిత్రః - అసౌ - స్వభావాత్ - యత్ర - తిష్ఠతి - తత్ర - దేవగణాః - సర్వే - క్షేత్రపీఠే - చరన్తి - చ.

సర్వశుద్ధః = మిక్కిలి విశుద్ధతత్త్వముతో గూడుకొని మహాపరిశుద్ధు డయినవాడును, పవిత్రః = పరిపూతు డయిన వాడును నగు, అసౌ = కేవల శుద్ధ పరబ్రహ్మస్వరూపియగు శ్రీ గురుదేవుడు, యత్ర = ఏ క్షేత్రమందు, స్వభావాత్ = సహజముగా (నిత్యము), తిష్ఠతి = నివసించుచున్నాడో, తత్ర క్షేత్రపీఠే = ఆ క్షేత్రరాజ ప్రదేశమందు, సర్వే దేవగుణాః చ = సకల దేవసమూహములు, చరన్తి = సంచరించుచున్నాడు.

శ్రీగురుదేవుని మహిమను వర్ణించుచున్నారు. త్రిగుణముల నతిక్రమించి కేవలశుద్ధతత్త్వములో నుండుచు శుద్ధాతిశుద్ధుడై మహాపవిత్రుడై సకలమును పవిత్రముగ జేయుచు విజ్ఞానమయుడగు శ్రీగురుమూర్తి సహజముగా తానిచ్ఛగించి నిత్యము నివసించు ప్రదేశము సకల లోకములలోని పుణ్యక్షేత్రములలో మిక్కిలి శ్రేష్ఠమైన పుణ్యక్షేత్రరాజమై విలసిల్లుచున్నది. అచ్చోట తాము పవిత్రు లగుటకు బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలును సంచరించు చుందురు. శ్రీ సద్గురుమూర్తి దర్శనము గోరి నిత్యము నిరీక్షించుచుందురు. అట్టి నిర్గుణతత్త్వమునకై కడు నానందము జెంది కృతార్థు లగుదురు.

అవ: శ్రీ గురు జపమహిమనే ప్రకారాన్తరముగ వచించుచున్నారు.

**ఆసనస్థాశ్శయానా వా గచ్ఛన్తస్తిష్ఠతోఽపి వా ।**
**అశ్వారూఢా గజారూఢా సుషుప్తా జాగ్రతోఽపి వా ॥ 248**

ఆసనస్థాః - శయానాః - వా - గచ్ఛన్తః - తిష్ఠతః - అపి - వా - అశ్వారూఢాః - గజారూఢాః - సుషుప్తాః - జాగ్రతః - అపి - వా.

**శుచిర్భూతా జ్ఞానవన్తో గురుగీతాం జపన్తి యే ।**
**తేషాం దర్శనసంస్పర్శాద్దివ్యజ్ఞానం ప్రజాయతే (పునర్జన్మ న విద్యతే) ॥**

శుచిః - భూతాః - జ్ఞానవన్తః - గురుగీతాం - జపన్తి - యే - తేషాం - దర్శనసంస్పర్శాత్-దివ్యజ్ఞానం - ప్రజాయతే - (పునః - జన్మ - న - విద్యతే).

ఆసనస్థాః = ఆసనమందు కూర్చున్న వారైనను, శయానాః వా = పరుండియున్న వారైనను, గచ్ఛన్తః = నడచుచున్న వారైనను, తిష్ఠతః అపి వా = నిలుచున్న వారైనను, అశ్వారూఢాః= గుఱ్ఱముల నెక్కిన వారైనను, గజారూఢాః = ఏనుగుల నెక్కిన వారైనను (వాహనారూఢు లైనను), సుషుప్తాః = నిద్రలో నున్న వారైనను, జాగ్రతః అపి వా =

మేలుకొనినవారైనను (ఇట్లు సర్వకాల సర్వావస్థలయందు), శుచిః భూతాః = ఏలాటి యితర సంకల్పములు లేక గురుబ్రహ్మమందే మనస్సును లయింపజేసి పరిశుద్ధులయినవారు, జ్ఞానవన్తః= శ్రీ గురుతత్త్వము నెఱింగినవారై, గురుగీతాం = శ్రీ గురుగీతను, యే = మహాత్ములు, జపన్తి = జపించుచున్నారో (శ్రీగురువునే శరణుపొందిన ధన్యాత్ములో), తేషాం = అట్టి మహామహిమ సమ్పన్న తత్త్వజ్ఞానులయొక్క, దర్శనసంస్పర్శాత్ = దర్శించుటవలనను, స్పృశించుటవలనను, దివ్యజ్ఞానం = నాశరహితమగు సకల వస్త్వవగాహియగు నాత్మజ్ఞానము, ప్రజాయతే = విశేషముగ గలుగుచున్నది (అందుచే), పునర్జన్మ = తిరుగా పుట్టుట, న విద్యతే= లేదు.

శ్రీ గురుతత్త్వమయులు, శ్రీ గురుపాదారవిన్ద నిత్యజీవులు నగు నేపరమభక్తులు ఆసనముల నధిష్ఠించు నప్పుడును, కూరుచుండు నప్పుడును, కాళ్లుచేతులు చాచి పరుండు నప్పుడును, నడచుట, నిలుచుట, అశ్వాదివాహనముల నెక్కుట, నిద్రించుట, స్వప్నము గాంచుట, మేల్కాంచుట- మొదలగు సర్వకాల సర్వావస్థలయందును, సర్వేన్ద్రియ వ్యాపారములందును, నిర్వ్యాపారస్థితియందును శుచిర్భూతులై యేలాంటి యితరసంకల్పములు లేక తదేకధ్యాన నిష్ఠాపరులై శ్రీ గురుతత్త్వమునే తెలిసికొని భావించుచు తన్మయుడై శ్రీగురుగీతను జపించు చున్నారో; శ్రీగురుదేవుడను పరవస్తువు తప్ప మఱియొకటి భావింపనివారై, తదేకశరణులై, యేకాంతభక్తులై యుంటున్నారో; అట్టి యఖండ పరిపూర్ణ జ్ఞానస్వరూప పరమైకాన్త గురుభక్తులను సందర్శించినందువల్లను లేక స్పృశించి నందువల్లను (దర్శన స్పర్శనములే చాలును) దివ్యమగు నాత్మజ్ఞానము గలుగు చున్నది. జన్మరహిత మగు స్థితిని పొందుచున్నారు. వారి దర్శన స్పర్శ నాదులు ముక్తిహేతువులని భావము: దీనినే భగవద్గీతయందు ఇట్లు దెలిపి యున్నారు:

**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్ అశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్ ।**
**ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ॥**

**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్ ।**
**బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతి యః॥**
**లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా ॥**

అట్టి మహాత్ములు సర్వకిల్బిష రహితులు కాబట్టి వారి దర్శనస్పర్శనాదులు దుర్లభములు. లభించినవా రవశ్యముగ తరింతురు.

అవ: మహావాక్యలక్ష్యార్థమును వివరించుచున్నారు.

**సముద్రే వై యథా తోయం క్షీరే క్షీరం జలే జలమ్ ।**
**భిన్నే కుమ్భే యథాఽఽకాశం తథాఽఽత్మా పరమాత్మని ॥ 250**

సముద్రే - వై - యథా - తోయం - క్షీరే - క్షీరం - జలే - జలం - భిన్నే - కుమ్భే - యథా - ఆకాశం - తథా - ఆత్మా - పరమాత్మని.

తోయం = నదుల జలము, సముద్రే = సముద్రమునందు, యథా వై = ఎట్లు ప్రసిద్ధముగ లీనమగుచున్నదో, క్షీరం = పాలు, క్షీరే = పాలలోను, జలం = ఉదకము, జలే = సలిలమందును, యథా = ఏ విధముగ నభేదముతో కలిసిపోవుచున్నవో, భిన్నే = పగిలిపోయిన, కుమ్భే = కడవయందు, ఆకాశం = ఆకాశము, యథా = మహాకాశములో జేరిపోవుచున్నదో, తథా = ఆ ప్రకారముగానే, ఆత్మా = శుద్ధజీవుడు, పరమాత్మని = పరమాత్మయందు కలిసి యేకత్వమును జెందుచున్నాడు; పరబ్రహ్మ మగుచున్నాడు.

కేవల శ్రీ సద్గురు స్వరూప మిట్టిదని తెలిసి యుపాసించు వారెట్టి స్థితిని పొందుచున్నారో ఆ విషయము నిట ప్రతిపాదించుచున్నారు. శ్రీ సద్గురుతత్త్వము నెఱింగిన పరమభక్తులయొక్క ఆత్మ పరిశుద్ధమై, జ్ఞానరూపమై, స్వస్వరూపస్థితమై పరబ్రహ్మములో నైక్యమును పొందుచున్నది. అట్టి జ్ఞానసమ్పన్నులు నిరుపాధిక పరమాత్మస్వరూపు లగుచున్నారు. ఎటులనగా నదు లన్నియు మహావేగముతో ప్రవహించుచు వచ్చి సముద్రములో కలసి సాగరరూపము లగుచున్నవి. వానియొక్క రూపనామము లుండవు. అప్పుడవి సముద్రముగానే యగుచున్నవి. అట్లే జీవులు సంసారగతి ననుసరించి గమనముజేయుచున్నారు. అయినను తపోధ్యానాదులచే లక్ష్యమగు పరబ్రహ్మమును జేరినప్పు డాస్వరూపు లగుచున్నారు. వారియొక్క నామరూపములు పోవుచున్నవి. పరబ్రహ్మ మగుచున్నారు.

మఱియు జలము జలములో గలసి యేకత్వమును జెందుచున్నది. పాలు పాలలో నేకత్వమును జెందుచున్నది.ఆయాపదార్థములు నేకస్వరూపమై కలియుచున్నవి. పాలలో నీళ్ళు, నీళ్లలో పాలు కలసిన విభిన్నతయు నేర్పడుచునే

యున్నది. ఆలాగున పరిశుద్ధాత్మ పరిశుద్ధమగు పరబ్రహ్మములో గలియుచున్నది. కల్మష ముండిన కలియజాలదు. లక్ష్యార్థమగు, శుద్ధచైత న్యాత్మకమగు నాత్మ పరబ్రహ్మముకన్న వేరుగాక నభేదముతో నున్నది.

కుమ్భము భిన్నము కాగా నందులో నున్న యాకాశము మహాకాశములో చేరుచున్నది. అంతకు ముందది ఘటాకాశము, జలాకాశము ననుపేర్లతో నుండెను. పరిచ్ఛిన్నమై బద్ధమైనట్లు కానుపించెను. ఇప్పుడది యపరిచ్ఛిన్నమై మహాకాశమై సర్వవ్యాపక మాయెను. అట్లే జీవోపాధి ఈశ్వరోపాధులు దొలంగినచో నొకే చైతన్య మాత్ర మవశిష్టమై యున్నది. అదియే అఖండము, పరిపూర్ణము. ఈ ప్రకారము శుద్ధాత్మ నిరుపాధికమై పరబ్రహ్మ మగుచున్నాడు. ఘటాశ మహాకాశ దృష్టాన్తములచే నుపాధులు కల్పితము లనియు, వానిచే భేదము భాసించు ననియు, ఆకాశ మెప్పుడు నన్నిచోట్ల నేకముగానే యున్నదనియు, దానికి బంధమోక్షములు లేవనియు తెలియునట్లు పరబ్రహ్మమునకు నీ యుపాధులును వ్యవహార కల్పితములే. ఉన్నది భాసించునది పరబ్రహ్మ మొకటి యనియే తెలియవలెను.

అవ: ముందుశ్లోకములో జెప్పిన విషయమునే దార్ఢ్యమునకై తిరుగా తెలుపుచున్నారు.

**తథైవ జ్ఞానవాన్జీవః పరమాత్మని సర్వదా ।**
**ఐక్యేన రమతే జ్ఞానీ యత్ర కుత్ర దివానిశమ్ ॥ 251**

తథా - ఏవ - జ్ఞానవాన్ - జీవః - పరమాత్మని - సర్వదా - ఐక్యేన - రమతే - జ్ఞానీ - యత్ర - కుత్ర - దివానిశం.

తథా ఏవ = ముందు ప్రకారముగానే, జ్ఞానవాన్ = పరిశుద్ధజ్ఞానము గల, జీవః = జీవుడు, సర్వదా = ఎప్పుడును, పరమాత్మని = పరమాత్మయందు, ఐక్యేన = అభేదముతో, రమతే = క్రీడించుచున్నాడు, కావున, జ్ఞానీ = ఆత్మజ్ఞాని యగు మహాత్ముడు, యత్ర కుత్ర = ఏ ప్రదేశమందైనను, దివానిశం = రాత్రింబవళ్లు, రమతే = పరమాత్మయం దైక్యభావముతో నుంటున్నాడు.

పరిశుద్ధ జ్ఞానస్వరూపుడగు జీవుడు పరమాత్మలో నెప్పుడు నేకత్వమును పొందుచున్నాడు. ఉపాధిభేదములచే ఘటజలము, నదీజలము మొదలగు

వ్యవహారము లుంటున్నవి. అవన్నియు సాగరమునుండియే వచ్చినవి. తిరుగా సముద్రమునకే పోయి లయించుచున్నవి. ఆ ప్రకారము జీవశివ వ్యవహారము లుపాధినిబట్టియే గలుగుచున్నవి. ఒకే పరమాత్మనుండియే యేర్పడినవి. తిరుగా నా పరమాత్మను జేరుచున్నవి. ఇట్టి పరిపూర్ణ బ్రహ్మజ్ఞానము గలవాడు రాత్రింబవళ్లు ఏ ప్రదేశమందైనను పరబ్రహ్మముతో రమించుచున్నాడు. పండు తొడిమెయొక్క సమ్బన్ధము పోవునప్పుడు కాలనియమము, దేశనియమము లేక పడిపోవుచున్నది. ఆ ప్రకారము జీవుడు పరిపక్వమునకు వచ్చినప్పుడు కర్మబన్ధము వీడి దేశ కాల జాత్యాది నియమములు లేక బ్రహ్మమందైక్యమును జెంది పరబ్రహ్మ మగు చున్నాడు. దీనికి ప్రమాణము-

**న కాలనియమో యత్ర న దేశస్య స్థలస్య చ ।**
**యత్రాస్య రమతే చిత్తం తత్ర ధ్యానేన కేవలమ్ ॥**

ఎచ్చోట కాలనియమము లేదో, దేశనియమము లేదో, అట్టి పరబ్రహ్మము నందు జీవబ్రహ్మైక్యధ్యానముచేత నిరంతరము క్రీడించుచున్నాడు. ఈ మహాత్ముడే ధ్యానయోగి, ఆత్మజ్ఞాని, పరమగురుభక్తుడు. ఇట్లు పరమాత్మైక్యమును తెలియుడు.

**ఏవం విధో మహాయుక్తః సర్వత్ర వర్తతే సదా ।**
**తస్మాత్సర్వప్రకారేణ గురుభక్తిం సమాచరేత్ ॥ 252**

ఏవంవిధః - మహాయుక్తః - సర్వత్ర - వర్తతే - సదా - తస్మాత్ - సర్వప్రకారేణ - గురుభక్తిం - సమాచరేత్.

ఏవంవిధః = ఇటువంటి జ్ఞానస్వరూపుడైన, మహాయుక్తః = గొప్పవాడైన, జీవబ్రహ్మైక్య యోగముతో కూడుకొన్నవాడైన అఖండజ్ఞాని, సదా = ఎప్పుడు సర్వత్ర = అన్నిచోట్లను, వర్తతే= పరబ్రహ్మస్వరూపియై యున్నాడు. తస్మాత్ = అందువలన, సర్వప్రకారేణ = సకలవిధముల చేతను, గురుభక్తిం = గురువునందలి భక్తిని, సమాచరేత్ = బాగుగా చేయవలెను.

పైన తెలిపిన జ్ఞానస్వరూపి యగు మహాత్ముడు జీవబ్రహ్మైక్య యోగముతో గూడుకొనినవాడై సర్వత్ర యెప్పుడును పరబ్రహ్మస్వరూపుడై ప్రకాశించుచున్నాడు, ఇదంతయు శ్రీ గురుదేవుని కటాక్షవీక్షణముచే గలుగుచున్నది. కాన అన్ని విధములుగా నిరంతరము శ్రీ గురుదేవునియందు పరమభక్తితో నుండవల యును.

అవ: గుర్వనుగ్రహ ఫలము:

**గురుసంతోషణాదేవ ముక్తో భవతి పార్వతి! ।**
**అణిమాదిషు భోక్తృత్వం కృపయా దేవి! జాయతే ॥ 253**

గురుసంతోషణాత్ - ఏవ - ముక్తః - భవతి - పార్వతి - అణిమాదిషు - భోక్తృత్వం - కృపయా - దేవి - జాయతే.

గురుసంతోషణాదేవ = గురుదేవునియొక్క సంతోషమువల్లనే, ముక్తః = ముక్తుడుగా, హే పార్వతి! = ఓ పార్వతీదేవీ!, భవతి = అగుచున్నాడు, అణిమాదిషు = అణిమాద్య ష్టైశ్వర్యములందు, భోక్తృత్వం = భోక్తయగుట, కృపయా = శ్రీ గురుకృపచేత, జాయతే= కలుగుచున్నది.

ఓ పార్వతీదేవీ! శిష్యుడు గురుదేవునకు సంతోషము కలుగునట్లు భక్తి జ్ఞాన వైరాగ్యాదులచే ప్రవర్తించుచుండిన వారి యనుగ్రహాతిశయముచే భవబంధ విముక్తుడై జీవన్ముక్తస్థితిని బొందుచున్నాడు. మరియు నణిమాది సిద్ధులను బడసి శ్రీ గురుకృపతో గూడివాడై విరాజిల్లుచున్నాడు.

అవ: నిరుపాధిక పరబ్రహ్మస్వరూపమునే పదేపదే నిర్ణయించి చెప్పుచున్నారు.

**సామ్యేన రమతే జ్ఞానీ దివా వా యది వా నిశి ।**
**ఏవంవిధో మహామౌనీ త్రైలోక్యసమతాం వ్రజేత్ ॥ 254**

సామ్యేన - రమతే - జ్ఞానీ - దివా - వా - యది - వా - నిశి - ఏవం విధః - మహామౌనీ - త్రైలోక్యసమతాం - వ్రజేత్.

జ్ఞానీ = ఆత్మజ్ఞాని, దివా వా = పగటియందుగాని, నిశి వా = రాత్రియందు గాని, సామ్యేన = సమమగు పరబ్రహ్మమును పొందుటను సమత్వముతో, రమతే యది = క్రీడించుచున్నవా డైనట్లయితే, ఏవం విధః = ఇటువంటి మహామౌని మిక్కిలి మననశీలుడైన పరబ్రహ్మమందు విశ్రమించిన పరిపూర్ణజ్ఞానియై, త్రైలోక్యసమతాం = మూడులోకములయందు సమభావమును బ్రహ్మైక్యమును, వ్రజేత్ = పొందును.

ఆత్మవస్తు వన్నియెడల సమముగా పరిపూర్ణముగ వ్యాపించియున్నది. అట్టి యాత్మవస్తువును నెరింగిన బ్రహ్మజ్ఞాని రాత్రింబవళ్ళు సమముగ పరబ్రహ్మ

తత్త్వముతో క్రీడించు చున్నాడు. అట్టి విజ్ఞాని బ్రహ్మమును మననముచేసి యఖండ స్థితిని బొందినవాడై మూడులోకములందును పరిపూర్ణబ్రహ్మస్వరూపుడై యుంటున్నాడు.

అవ: ఈ గురుగీతాజపము గృహస్థు లందరికిని పరమరక్ష యని తెలుపుచున్నారు.

**అథ సంసారిణః సర్వే గురుగీతా జపేన తు ।**
**సర్వాన్ కామాంస్తు భుఞ్జన్తి త్రిసత్యం మమ భాషితమ్ ॥ 255**

అథ - సంసారిణః - సర్వే - గురుగీతాజపేన - తు - సర్వాన్ - కామాన్ - తు - భుఞ్జన్తి - త్రిసత్యం - మమ - భాషితమ్.

అథ = మరియు, సంసారిణః సర్వే = సంసారు లందరును, గురుగీతాజపేన తు = గురుగీతయొక్క జపముచేతనైతే, సర్వాన్ కామాంస్తు = సమస్త మనోరథములను, భుంజన్తి= అనుభవించుచున్నారు, మమభాషితమ్ = నాయొక్క వాక్యము, త్రిసత్యం = ముమ్మారు సత్యము.

గృహస్థు లందరు ధర్మార్థ కామములను గోరుచుందురు. తద్వారా మోక్షమును గూడ గావలయు నందురు. అట్టి గృహస్థులు పరమభక్తిశ్రద్ధలతో నీ గురుగీతాజపమును గావించినచో నేకొఱంతయు లేక సర్వసౌభాగ్యములతో పూర్ణులై సుఖముగా నుంటున్నారు. వారెద్ది గోరినను నది ఫలించును. ఈ విషయము సత్యము, సత్యము, సత్యము.

అవ: గురుగీతాస్తోత్ర మాహాత్మ్యము:

**సత్యం సత్యం పునః సత్యం ధర్మసారం మయోదితం ।**
**గురుగీతాసమం స్తోత్రం నాస్తి తత్త్వం గురోః పరమ్ ॥ 256**

సత్యం - సత్యం - పునః - సత్యం - ధర్మసారం - మయా - ఉదితం - గురుగీతాసమం- స్తోత్రం - న - అస్తి - తత్త్వం - గురోః - పరం.

మయా = నాచేత, ఉదితం = చెప్పబడిన, ధర్మసారం = ధర్మరహస్యము, సత్యం = యథార్థము, సత్యం = నిజము, పునః = మరల, సత్యం = తథ్యము, గురుగీతాసమం = గురుగీతతో సమానమైన, స్తోత్రం = స్తోత్రము, నాస్తి = లేదు, గురోః = గురువుకంటె, పరం=

శ్రేష్ఠమైన, తత్త్వం = యథార్థస్వరూపము, నాస్తి = లేదు.

ఓ దేవీ ! నేనిదివరకు జెప్పిన సకలవేదాన్తసారమగు, ధర్మరహస్యమగు శ్రీగురుదేవునియొక్క తత్త్వము, వారియొక్క జ్ఞానసంపత్తి, మాహాత్మ్యము మొదలగు విషయజాత మంతయు సత్యము, సత్యము, మరియు సత్యము. విచారించినచో గురుగీతతో సమమగు స్తోత్రము లేదు. శ్రీ గురుపరబ్రహ్మ స్వరూపముకన్న యథార్థతత్త్వము మరియొకటి లేదు. జన్మ తరింప శ్రీగురువునే శరణుబొందవలయును.

అవ: గురువే సర్వస్వము, సర్వాధికము.

**గురుర్దేవో గురుర్ధర్మో గురౌ నిష్ఠా పరం తపః ।**
**గురోః పరతరం నాస్తి త్రివారం కథయామి తే ॥ 257**

గురుః - దేవః - గురుః - ధర్మః - గురౌ - నిష్ఠా - పరం - తపః - గురోః - పరతరం - న - అస్తి - త్రివారం - కథయామి - తే.

గురుః = గురుదేవుడు, దేవః = నిరంతరము ప్రకాశించు దేవుడు, గురుః = గురువు, ధర్మః = సంసారకూపమున పడువారిని నుద్ధరించు ధర్మము, గురౌ = గురుపర బ్రహ్మస్వరూపమందు, నిష్ఠా = నిలకడ, పరం తపః = శ్రేష్ఠమగు తపస్సు, గురోః = గురువుకన్నను, పరతరం = శ్రేష్ఠమగు నితరమగు నదెద్దియు, నాస్తి = లేదు, త్రివారం = ముమ్మారు, తే = నీకు, కథయామి = చెప్పుచున్నాను.

శ్రీ గురుదేవుడే నిత్యము ప్రకాశించు దేవుడు, దైవము. శ్రీ గురుమూర్తియే సంసారకూపమునుండి యుద్ధరించు పరమధర్మము. శ్రీ గురుదేవునియొక్క స్వస్వరూప పరబ్రహ్మమందు స్థిరనిష్ఠయే శ్రేష్ఠమగు తపస్సు. గురువుకన్నను నుత్కృష్టమగు మరియొకవస్తువు లేదు. సకలము శ్రీ గురుస్వరూపము. ఈ విషయమును ఓ పార్వతీ ! నీకు ముమ్మారు చెప్పుచున్నాను. నమ్ముమని తాత్పర్యము. ఈ శ్లోకమున బ్రహ్మప్రాప్తికి సాధనమగు ధర్మనిష్ఠాదులు గురుస్వరూపములే, ప్రాప్యము గురుపరబ్రహ్మమే యని చెప్పుటచే గురువుకన్న మరియొకటి లేదని తెలియవలెను.

అవ: మరియు నీ గురుభక్తునియొక్క మహిమను నుడువుచున్నారు.

**ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులోద్భవః ।**
**ధన్యా చ వసుధా దేవి! యత్ర స్యాద్గురుభక్తతా ॥ 258**

ధన్యా - మాతా - పితా - ధన్యః - గోత్రం - ధన్యం - కులోద్భవః - ధన్యా - చ - వసుధా - దేవీ - యత్ర - స్యాత్ - గురుభక్తతా.

యత్ర = ఏ మహానుభావునియందు, గురుభక్తతా - గురు = శ్రీ గురువునందలి, భక్తతా = పరమభక్తి గలిగియుండుట, స్యాత్ = ఉంటున్నదో, తస్య = ఆ మహానుభావునియొక్క, మాతా = జనని, ధన్యా = ధన్యురాలు, పితా = తండ్రి, ధన్యః = కృతార్థుడు, గోత్రం = గోత్రము, ధన్యం = పవిత్రమైనది, కులోద్భవః = ఆ మహాత్ముని కులములో బుట్టుటయు, ధన్యః = మహాపవిత్రము, హే దేవి! = ఓ పార్వతీ !; వసుధా = భూమియు, ధన్యా చ = పరమపవిత్ర మైనది.

ఓ పార్వతీ! గురువునందు పరమభక్తి ఏ మహాత్మున కున్నదో, అట్టి మహామహిమశాలియగు పరమభక్తునియొక్క తల్లిదండ్రులు ధన్య లగుచున్నారు. గోత్రము మహాపవిత్ర మగుచున్నది. వానికులములో పుట్టుకయు పుణ్యవంతమైనది. భూమికూడ శాంతివంత మగుటచే నెంతగనో పుణ్యముచేసి పరమపవిత్ర మగుచున్నది.

**నృత్యంతి పితరస్సర్వే సంతుష్టాస్తస్య వంశజాః ।**
**దేవాశ్చ ఋషయస్తృప్తాః ప్రయాన్తి పరమం పదమ్ ॥**

భక్తుని జన్మమును జూచి దేవతలు సంతోషింతురు. ఋషులు తృప్తు లగుదురు. ఆ వంశములో జన్మించిన సమస్త పితరులు నానందముతో నృత్యము జేతురు. వారికి సంబంధించిన వారందరు నుత్తమలోకమును పొందుచున్నారు అని వరాహ పురాణము.

అవ: శ్రీ గురుదేవునియొక్క సంతోషమే పరమకాష్ఠయని తెలుపుచున్నారు.

**ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః ।**
**తాస్సర్వాః సఫలా దేవి! గురుసంతోషమాత్రతః ॥ 259**

ఆకల్పజన్మకోటీనాం - యజ్ఞవ్రత తపఃక్రియాః - తాః - సర్వాః - సఫలాః - దేవి - గురుసంతోషమాత్రతః.

హే దేవి ! = ఓ గౌరీ !, గురుసంతోషమాత్రతః = గురుదేవునియొక్క సంతోష మాత్రమువలన, ఆకల్పజన్మకోటీనాం - ఆకల్ప = ప్రళయమువరకు, జన్మకోటీనాం = అనేకకోట్ల జన్మలలోని, యజ్ఞవ్రత తపఃక్రియాః = యజ్ఞములు, వ్రతములు, తపస్సులు, దానాదిక్రియలు, (ఏవిగవో), తాః సర్వాః = అవి యన్నియు, సఫలాః = ప్రయోజనవంతము లైనవి.

ఓ పార్వతీదేవీ ! కల్పపర్యన్తముగల యనేకకోట్ల జన్మములలో యజ్ఞములు, వ్రతములు, తపస్సులు, దానాది క్రియ లేవేవి చేయబడినచో అవన్నియు శ్రీగురుదేవుడు సంతోషించినంతమాత్రమున సఫలము లగుచున్నవి. శ్రీగురు పరమాత్మకు సంతృప్తి గలిగినచో మూలాజ్ఞానము నశించి ఆత్మైక్యజ్ఞానము కలుగుచున్నది. కఠోపనిషత్తు: "యమేవైష వృణుతే తస్యైష ఆత్మా వృణుతే తనూం స్వాం" = భగవంతుని దయచే ఆత్మస్వరూపము తెలియబడుచున్నది.

అవ: శ్రీగురువే సర్వస్వము, మహిమ

**శరీరమిన్ద్రియం ప్రాణమర్థం స్వజనబన్ధుతా ।**
**మాతృకులం పితృకులం గురురేవ న సంశయః ॥ 260**

శరీరం - ఇన్ద్రియం - ప్రాణం - అర్థం - స్వజనబన్ధుతా - మాతృకులం - పితృకులం- గురుః - ఏవ - న - సంశయః.

శరీరం = దేహము, ఇంద్రియం = ఇంద్రియములు, ప్రాణం = ప్రాణము, అర్థం = ధనము, స్వజనబన్ధుతా = తనకు సంబంధించిన జనులు బన్ధువులయొక్క సమూహము, మాతృకులం = తల్లియొక్కవంశము, పితృకులం = తండ్రియొక్క వంశమున్ను, పరం = శ్రేష్ఠమైన, గురురేవ = శ్రీ సద్గురుదేవుడే, సంశయః న = సందేహము లేదు.

శరీరత్రయము, దశేంద్రియములు, దశవిధప్రాణవాయువులు, అంతఃకరణ చతుష్టయము, ధనము, సహోదరులు, బన్ధువులు, పితృవంశము, మాతృవంశము- అంతయు గురుదేవుడే. అనగా సమస్తము శ్రీ గురుదేవుడగు పరమాత్మయొక్క కైంకర్యమునకై వినియోగించవలయును. వానిలో నున్న ఆత్మయు గురుస్వరూపమే యని వారికి బోధ కలుగజేసి వారినిగూడ యథార్థ గురుస్వరూపముగ జేసి

సర్వాభిమానమును వదలి దృశ్యరహితుడై తాను శ్రీ గురుపరబ్రహ్మస్వరూపమని అఖండవిజ్ఞానముతో నుండవలయును. ఇందులో సందియము లేదు. ఇట్లు గురుమహిమ దెలియుడు.

అవ: గురుభక్తిలేనివారి గతిని తెలుపుచున్నారు.

**మన్దభాగ్యా హ్యశక్తాశ్చ యే జనా నానుమన్వతే ।**
**గురుసేవాసు విముఖాః పచ్యన్తే నరకేఽశుచౌ ॥ 261**

మన్దభాగ్యః - హి - అశక్తాః - చ - యే - జనాః - న - అనుమన్వతే - గురుసేవాసు-విముఖాః - పచ్యన్తే - నరకే - అశుచౌ.

గురుసేవాసు = శ్రీ గురుదేవుని శుశ్రూషలందు, విముఖాః = ఆసక్తి లేని, యే జానాః= ఏ అవివేకిజనులు, మన్దభాగ్యః = భాగ్యము లేనివారై, అశక్తాః చ = అలసత్వముచే సామర్థ్యము లేనివారై, న అనుమన్వతే = శ్రీ గురుస్వరూపమును స్మరించరో, తే = అట్టి మూఢాత్ములు, అశుచౌ = శుచిలేని (అపరిశుద్ధమగు), నరకే = నరకమునందు, పచ్యన్తే = వండబడుచున్నారు.

శ్రీగురుసేవయందు తత్పరులుగాక యెవరు పరాఙ్ముఖులై యుంటున్నారో అట్టి అవివేకులు భాగ్యహీనులు. సోమరితనము గలిగి దేహమును పెంచుకొని అసమర్థు లయిన పాపాత్ములు. శ్రీగురుస్వరూపమును తలంచువారు గారు. అట్టి మూఢాత్ము లంద అపరిశుద్ధమగు నరకమందు యమభటులచే పాకము చేయ బడుచున్నారు. గురుభక్తి లేనివారికి నరకప్రాప్తి తప్పదని భావము.

అవ: గురుకృపా మాహాత్మ్యమును వివరించుచున్నారు.

**విద్యా ధనం బలం చైవ తేషాం భాగ్యం నిరర్థకమ్ ।**
**యేషాం గురుకృపా నాస్తి అధో గచ్ఛన్తి పార్వతి! ॥ 262**

**బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ దేవాశ్చ పితృకిన్నరాః ।**
**సిద్ధచారణయక్షాశ్చ అన్యే చ మునయో జనాః ॥ 263**

విద్యా - ధనం - బలం - చ - ఏవ - తేషాం - భాగ్యం - నిరర్థకం - యేషాం - గురుకృపా - న - అస్తి - అధః - గచ్ఛన్తి - పార్వతి - బ్రహ్మా - విష్ణుః - చ - రుద్రః - చ-

దేవాః - చ - పితృకిన్నరాః - సిద్ధచారణయక్షాః - చ - అన్యే - చ - మునయః - జనాః.

హే పార్వతి = ఓ పార్వతీ, యేషాం = ఎవరికి, గురుకృపా = శ్రీగురుదేవుని యనుగ్రహము, నాస్తి = లేదో, తేషాం = అట్టి గురుకృపాదూరులయొక్క,విద్యా = వేదాధ్యయనాదులు, ధనం = సమ్పత్తు, బలం చ = శక్తిగూడ, భాగ్యం = అదృష్టము, నిరర్థకం ఏవ = ప్రయోజనము లేనిదగుచున్నది, తే = అట్టివారు, అధః గచ్ఛన్తి = క్రింది లోకమును పొందుచున్నారు, బ్రహ్మ = బ్రహ్మదేవుడు, విష్ణుః చ = విష్ణుభగవంతుడును, రుద్రః చ = మహేశ్వరుడును, దేవాఃచ = దేవతలును, పితృకిన్నరాః = పితృదేవతలును, కిన్నరులును, సిద్ధచారణయక్షాః చ = సిద్ధులును, చారణులును, యక్షులును, అన్యే చ మునయః = ఇతర మునులును (గురుకృపా దూరు లయినచో అధోగతిని పొందుచున్నారు. మఱియొక యర్థము: బ్రహ్మాదిదేవత లందరికి గురువై యున్నాడు. గురుకృప తప్పినచో వారందఱి కృపయు తప్పిపోవుచున్నదని యర్థము.)

ఎవరికి శ్రీగురుదేవుని కృప లేదో, వారియొక్క వేదాధ్యయనాదులు వ్యర్థములు. చదువు లన్నియు పరమాత్మజ్ఞానముకొఱకై యేర్పడి యున్నవి. గురుదయ లేక జ్ఞానము సిద్ధము గాదు. కావున నవి వ్యర్థములే. ధనము, బలము, అదృష్టము మొదలయినవి యాత్మజ్ఞానము గలుగజేయజాలవు. అందుచే నవి సుస్థిరసుఖమును గలిగింపవు. అవన్నియు నిరర్థకములు. అంత మాత్రమే గాదు, గురుభక్తి లేనివారు ఓ పార్వతీ! అధఃపతితు లగుచున్నారు. ఉన్నతమార్గమును పొందజాలరు. వీరు వారననేల, బ్రహ్మ విష్ణుమహేశులు, దేవతలు, పితృదేవతలు, కిన్నరులు, సిద్ధులు, చారణులు, యక్షులు, మునీశ్వరులును, గురుభక్తి లేనివారున్ను శ్రీగురుపరమాత్మయొక్క యనుగ్రహము లేనివారైనచో వారి వారియొక్క పదవులనుండి భ్రష్టులై అధోగతికి పాలగుచున్నారు. లేక వారందఱును గురుస్వరూపులై యున్నారు. శ్రీ గురుదేవుని కృప లేకపోయినచో నెట్టి మనుజులును జ్ఞానమును పొందక నరకమునే పొందుచున్నారు.

అవ: గురుస్వరూప ధ్యాన మాహాత్మ్యము:

**గురుభావః పరం తీర్థమన్యతీర్థం నిరర్థకమ్ ।**
**సర్వతీర్థమయం దేవి! శ్రీగురోశ్చరణామ్బుజమ్ ॥ 264**

గురుభావః - పరం - తీర్థం - అన్యతీర్థం - నిరర్థకం - సర్వతీర్థమయం - దేవి - శ్రీగురోః - చరణామ్బుజం.

గురుభావః = శ్రీగురుస్వరూపము, పరం = శ్రేష్ఠమయిన, తీర్థం = తీర్థము, అన్యతీర్థం = ఇతర పుణ్యతీర్థములు, నిరర్థకం = వ్యర్థము లయినవి, హే దేవి ! = ఓ పార్వతీదేవీ, శ్రీగురోః = పరబ్రహ్మస్వరూపుడగు శ్రీగురుపరమాత్మయొుక్క, చరణామ్బుజం = పాదారవిన్దము, సర్వతీర్థమయం = సకలతీర్థస్వరూప మగుచున్నది.

ఓ పార్వతీ ! శ్రీగురుపరమాత్మ స్వరూపచిన్తనమును గావించుచుండిన నితరతీర్థములు సేవింప నవసరము లేదు. అన్ని తీర్థములు శ్రీగురుస్వరూప ధ్యానముచేతనే లభించుచున్నవి. తీర్థములను సేవించినచో జ్ఞానము గలుగదు. కొంతపుణ్యముమాత్రము లభించును. సకలతీర్థమయమైన శ్రీగురుపరమాత్మ పాదారవిన్దమును సేవించినచో ననన్తసుకృతవిశేషము లభ్యమగుటయే గాక నాత్మజ్ఞానమును గలుగుచున్నది. కాన శ్రీగురుపాదారవిందములను సేవించు చుండిన మఱియొక యే పుణ్య క్షేత్రమునకును జన నవసరము లేదు. శ్రీగురుస్వరూపధ్యానమే పరమతీర్థము, సుఖప్రద మానందజనకము.

అవ: గురుతత్త్వమహత్త్వము:

**కన్యాభోగరతా మన్దాః స్వకాన్తాయాః పరాఙ్ముఖాః ।**
**అతః పరం మయా దేవి! కథితం న మమ ప్రియే ॥ 265**

కన్యాభోగరతాః - మన్దాః - స్వకాన్తాయాః - పరాఙ్ముఖాః - అతః - పరం - మయా - దేవి - కథితం - న - మమ - ప్రియే.

కన్యాభోగరతాః = కన్యకలతో విషయభోగమం దాసక్తులయిన, మందాః = అవివేకులు, స్వకాంతాయాః = తనయొుక్క భార్యనుండి పరాఙ్ముఖాః = విముఖులైన వారును (పరస్త్రీ సంగమనాభిలాషులును), (యే భవన్తి = ఎవరు అగుచున్నారో అట్టివారికి), అతః = ఇందువలన, మమ= నాకు, ప్రియే = ప్రేమస్వరూపిణియగు, హే దేవి = ఓ పార్వతీ !, మయా = నాచేత, కథితం = చెప్పబడిన గురుతత్త్వము, పరం = ఇష్టమయినది శ్రేష్ఠమయినది, న = కాదు.

కన్యాభోగమందాసక్తి గలిగిన విషయలమ్పటులును, పరస్త్రీగమనముచేయు మహాపాపులు నుంటున్నారు. అట్టివారికొరకు ఓ ప్రియమగు పార్వతీ! నే జెప్పిన

గురుతత్త్వము శ్రేష్ఠమయినది కాదు, ప్రియమయినది గాదు. అట్టివారికీ పరమరహస్య గురుతత్త్వము వచింపరాదు.

మఱియొక యర్థము: పైన తెల్పిన పాపాత్ములును శ్రీగురుదేవుని కరుణను సంపాదించినచో పవిత్రాత్ము లగుచున్నారు. ఇంతకన్న నేనెక్కువ చెప్పనవసరము లేదు. గురుకరుణకు నందఱు నర్హులే యని తాత్పర్యము.

అవ: ఒక రహస్య విషయము-

**ఇదం రహస్యమస్పష్టం వక్తవ్యం చ వరాననే! ।**
**సుగోప్యం చ తవాగ్రే తు మమాత్మప్రీతయే సతి ॥ 266**

ఇదం - రహస్యం - అస్పష్టం - వక్తవ్యం - చ - వరాననే - సుగోప్యం - చ - తవ - అగ్రే - తు - మమ - ఆత్మప్రీతయే - సతి.

హే సతి = ఓ సతీదేవీ !, ఇదం = ఈ చెప్పబోవునట్టి, రహస్యం = రహస్యమయిన, అస్పష్టం = స్పష్టము గాని, సుగోప్యం చ = రక్షింపదగిన విషయము, తవ = నీయొక్క, అగ్రేతు = ముందఱయితే, మమ = నాయొక్క, ఆత్మప్రీతయే = ఆత్మ తృప్తికొఱకు, వరాననే= పద్మముఖీ, వక్తవ్యం చ = చెప్పదగినది యునై యున్నది.

పరమేశ్వరుడొక రహస్యవిషయమును పార్వతీదేవికి వచింపబోవుచున్నాడు ఓ పార్వతీ సతీ! నీ దగ్గఱ నా యాత్మప్రీతికొఱకు జెప్పదగిన విషయ మొకటి యున్నది. అది మిగుల రహస్య మయినది. స్పష్టము గాకయు నున్నది. సర్వదా ఆత్మలో నుంచదగినది. దానిని చెప్పబోవుచున్నాను; వినుము.

**స్వామిముఖ్యగణేశాద్యాన్ వైష్ణవాదీంశ్చ పార్వతి! ।**
**న వక్తవ్యం మహామాయే పాదస్పర్శం కురుష్వ మే ॥ 267**

స్వామిముఖ్య గణేశాద్యాన్ - వైష్ణవాదీన్ - చ - పార్వతి - న - వక్తవ్యం - మహామాయే - పాదస్పర్శం - కురుష్వ - మే

స్వామిముఖ్యగణేశాద్యాన్ - స్వామి = ఈశ్వరునకు, ముఖ్య = ప్రధానులయిన, గణేశ= గణపతి, ఆద్యా = మొదటివాడుగా గలిగిన నందికేశ్వరాదులను గురించియు, వైష్ణవాదీ చ = విష్ణుదేవునే ప్రధానముగా గల విష్ణుభక్తులగు విష్వక్సేన గరు డాదులను గూర్చియును, హే

పార్వతి = ఓ పార్వతీ (ఈ గురుతత్త్వము), న వక్తవ్యం = చెప్పదగినది గాదు, హే మహామాయే= శక్తిస్వరూపిణివగు నో దేవీ, మే = నాయొక్క, పాదస్పర్శం = పాదములయొక్క తాకుటను, కురుష్వ = చేయుమా (నా పాదముల ఒట్లు పెట్టుకొనుమా).

ఈశ్వరుడు తనపాదములను తాకి శపథము చేయ నొక్కి వచించు చున్నాడు. ఓ పార్వతీదేవీ! ఈ గురుతత్త్వము మహేశ్వరునకు ముఖ్యులగు నందికేశ్వర గణపత్యాదులకును, విష్ణుదేవునకు, ప్రధానులగు విష్వక్సేన గరుత్మంతులు మొదలయిన వారికిని జెప్పదగినది కాదు. నేను నిరంతర మట్టి శ్రీగురుతత్త్వమగు పరబ్రహ్మమునకే నమస్కరించుచున్నాను. ఇదియే నీవడిగిన నమస్కారమునకు కారణము. ఈ విషయ మొరులకు జెప్పనని నా పాదములను పట్టుకొని సాక్షిగా జేసికొని శపథము (ఒట్టుపెట్టుకొనుట) జేయుమా ! అని పార్వతీదేవినిగూర్చి చెప్పెను. శ్రీ గురుతత్త్వ మట్టి పరమపవిత్ర మనియు, పరమరహస్య మనియు, సకలజన సంతారణహేతు వనియు తెలియవలెను. శ్రీగురుమూర్తియే సకల శరణ్యము.

అవ: గురుగీతా రహస్యము:

**అభక్తే వంచకే ధూర్తే పాషండే నాస్తికాదిషు ।**
**మనసాఽపి న వక్తవ్యా గురుగీతా కదాచన ॥** **268**

అభక్తే - వంచకే - ధూర్తే - పాషండే - నాస్తికాదిషు - మనసా - అపి - న - వక్తవ్యా - గురుగీతా - కదా - చన.

అభక్తే = భక్తిలేనివాని విషయమందును, వంచకే = మోసముజేయువాని విషయములోను, ధూర్తే = దుర్మార్గుని విషయమునను, పాషండే = వేదబాహ్యుడగువాని విషయమునను, నాస్తికాదిషు = నాస్తికుడు, చార్వాకుడు మొదలగువారి విషయమునను, గురుగీతా = పరబ్రహ్మస్వరూప శ్రీగురుతత్త్వ ప్రకాశమగు నీ గురుగీత, మనసా అపి = మనస్సుచేతను, కదాచన = ప్రమాదము వలనను, న వక్తవ్యా = చెప్పదగినది గాదు.

గురుభక్తి లేక నిందించువారికిని, పరులను వంచించు స్వభావము గలవారి కిని, క్రూరకర్మల నాచరించు పరమదుర్మార్గులకును, వేదబాహ్యాచారము లగు నిషిద్ధకర్మలను జేయుచున్న వేదనిందితులకును, నాస్తికులకును, చార్వాకుల కును

ఈ ప్రకార మయోగ్యు లయిన గురుభక్తివర్జితులకు నెప్పుడును ప్రమాదవశమునను మనస్సులోగూడ కేవల నిర్గుణపరబ్రహ్మ శ్రీగురుతత్త్వ స్వరూపమగు నీ గురుగీతా తత్త్వమును చెప్పవలయునని తలంపవలదు. సంసార తరణమును గోరుచు నన్యశరణము లేక పరితపించునట్టి మహాపవిత్రు లయిన గురుభక్తులకు మాత్రమే యీ గురుగీతా శాస్త్రాధికారము గలదని భావము.

అవ: యథార్థమగు గురువరేణ్యుడు మహాదుర్లభుడని తెలుపుచున్నారు.

**గురవో బహవస్సన్తి శిష్యవిత్తాపహారకాః ।**
**తమేకం దుర్లభం మన్యే శిష్యహృత్తాపహారకమ్ ॥ 269**

గురవః - బహవః - సన్తి - శిష్యవిత్తాపహారకాః - తం - ఏకం - దుర్లభం - మన్యే - శిష్యహృత్తాపహారకం.

(లోకములో) శిష్యవిత్తాపహారకాః = శిష్యుని ధనము నపహరించునట్టి, బహవః = అనేకులయిన, గురవః = గురువులు, సన్తి = ఉంటున్నారు, శిష్యహృత్తాపహారకం - శిష్య = శిష్యులయొక్క, హృత్ = హృదయమునందలి, తాప = సంసార తాపముయొక్క, అపహారకం = అపహారకు డయిన, తం = అట్టి దయామయు డయిన, జ్ఞానస్వరూపి యయిన, ఏకం = ఒక్కగురుదేవుని, దుర్లభం = దుష్ప్రాప్యునిగా, మన్యే = తలంచుచున్నాను.

'వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః' అను గీతావచనమున్ను పై విషయమునే దృఢీకరించుచున్నది. లోకములో గురువులని చెప్పుకొనుచు గురువేషమునుమాత్రము ధరించి వాచావేదాంతమును మాత్రము ప్రకటించుచు కేవలానుభవజ్ఞానము గలవారివలె నటించుచు వేనవేలు ప్రజలకు నుపదేశముల నొసగుచు పరులను వంచించి అదియే జీవనమని తలంచి శిష్యులయొక్క ధనమును గైకొను గురువు లనేకులుంటున్నారు. అమాయకప్రజలు కొందఱు వారిని విశ్వసించి దరిగానక యున్నారు. ఈ మోసమంతయు గురువులదే గనుక వారి పాపమంతయు నీ గురువుల నెత్తిమీదనే యున్నది. గురువు నన్వేషించి యన్వేషించి శ్రోత్రియబ్రహ్మనిష్ఠుని పొందవలయును. ఇదే విషయము -

**దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహహేతుకమ్ ।**
**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుషసంశ్రయః ॥**

అని వివేకచూడామణి తెలుపుచున్నది. పర్వతమునందు రాళ్లనేకము లున్నవి. రత్నములవలె నుండు పాషాణములున్ను గలవు. కాని రత్నములు దొరకుట కడుదుర్లభము. వానిని తెలియు వారును దుర్లభులు. అట్లే లోకములో ననేకగురువు లుంటున్నారు. కాని వారిని కనుగొనుట మిగుల కష్టము. రత్నపరీక్షకులవలె తాము జ్ఞానరత్నవిషయమును తెలిసియుండిన మాత్రముననే యథార్థజ్ఞాన గురువులయొక్క మహిమను దెలియగలరు. శిష్యుల ననేకవిధములుగ శిక్షించి జ్ఞానోపదేశములను జేసి నిరంతరము శిష్యులయొక్క భవరోగములను పరీక్షించుచు వైద్యులవలె జ్ఞానౌషధము నిచ్చి రక్షించు దయామూర్తులు కడుంగడు దుర్లభులు.

గురుశిష్యభావము సామాన్యమైనది గాదు. శిష్యునకు హృదయపారిశుద్ధ్యము, గురువునకు హృదయ నిష్కాపట్యము లెంతో యవసరములు. విగ్రహమును తయారుచేయువాడు సుత్తితో రాతిని కొట్టికొట్టి బాగుగా మలిచియు అంగములను చెడకుండగ తయారుచేయుచున్నాడు. పిమ్మట నాశిల దేవుడై నానావిధ భూషణములతో గూడుకొని పుష్పహారములతో పూజింపబడుచున్నది.ఆ ప్రకారము శ్రీ గురుదేవుని దగ్గఱ శుశ్రూష జేయుచు మానాభిమానములను వీడి నిరంతర తపోధ్యానాదులను గావించి దుర్జయములగు నింద్రియములను జయించి బాగుగా మలిచిన శిలవలె పరిశుద్ధాత్ముడై దేవుడగుచున్నాడు. అప్పుడందరు పూజింతురు.

మఱియు నట్లే కంచు, బంగారు మొదలగువానిని కరగించి మూసలో పోసి శ్రీ రామాది విగ్రహములను తయారుచేయుచున్నారు. ఆ ప్రకారము శ్రీ గురుదేవుడు శిష్యునియొక్క హృదయమును జ్ఞానాగ్నిలో కరిగించి, వేదాంతమను మూసగట్టి ఆత్మరూపమునుగ జేయుచున్నాడు. అట్టి మహాత్ముడు జనులకు లభించుట కడుంగడు దుర్లభము, పూర్వజన్మ సుకృతవిశేషము. ఒకానొకడు నదిలో గొట్టుకొనిపోవుచున్నాడు. ప్రాణహాని గలుగుట నిశ్చయమై యున్నది. అట్టి సమయమున నీదునట్టివాడు దయతో వానిని సంరక్షించుచున్నాడు. అదేవిధముగ సంసారమను మహావైతరణియను నదిలో పడి కొట్టుకొనిపోవుచున్న జీవులను జ్ఞానమను నీదుటను తెలిసిన మహాపురుషు డాయనర్థమునుండి తత్త్వోపదేశముచే గాపాడుచున్నాడు. ఇట్లనేకదృష్టాంతములు గలవు.

**సారాంశము:** శిష్యుల విత్తాపహారముకొరకు గురుస్వాములు చాలమంది కలరు గాని శిష్యుని హృత్తాపమును పోగొట్టి జ్ఞానానందము నిచ్చు గురువరుడు మిక్కిలి దుర్లభుడు. ప్రపంచమున గ్రీష్మకాలములో ననేకజీవు లెండచే తపించి దాహముచే పీడింపబడి సరస్సున్న వనమును జొచ్చి దాహము పోగొట్టుకొని విశ్రమించుచున్నవి. ఆ తీరున సంసారమను గ్రీష్మకాలములో తాపత్రయమను నెండచే పరితప్త హృదయులగు జీవులు శోకమోహములను నాకలిదప్పులచే బాధింపడి జ్ఞానమను హ్రదముతో గూడుకొన్నట్టి ఆశ్రమములను ప్రవేశించి జ్ఞానామృతమును ద్రావి శ్రీగురుపాదారవిందమను ఛాయను ఆశ్రయించి పరబ్రహ్మమందు నిరంతరము విశ్రమించుచున్నారు. ఇందుకై "ఆశ్రమాః శ్రమనాశకా" అన్నట్లు ఆశ్రమము లేర్పడినవి. ఇచ్చట యోగాభ్యాసము నభ్యసించి పరమాత్మతత్త్వము నొంద వలయును.

అవ: సంసారపతిత జనుల నుద్ధరించు సామర్థ్యము నెవనికి గలదో అట్టి మహనీయాత్ముడే గురువను విషయమును తేటపరచుచున్నారు.

**చాతుర్యవాన్ వివేకీ చ అధ్యాత్మజ్ఞానవాన్ శుచిః ।**
**మానసం నిర్మలం యస్య గురుత్వం తస్య శోభతే ॥ 270**

చాతుర్యవాన్ - వివేకీ - చ - అధ్యాత్మజ్ఞానవాన్ - శుచిః - మానసం - నిర్మలం - యస్య - గురుత్వం - తస్య - శోభతే.

చాతుర్యవాన్ = ఆత్మతత్త్వబోధయందు చాతుర్యము గలవాడును, వివేకీ = సూక్ష్మమగు బుద్ధిగలవాడును, అధ్యాత్మజ్ఞానవాన్ = పరమాత్మ జ్ఞానము గలవాడు, శుచిః = బాహ్యాభ్యంతరములందు పరిశుద్ధుడును, యస్య = ఎవనియొక్క, మానసం = మనస్సు, నిర్మలం = కాపట్యమను మాలిన్యముచేత రహితమై శుద్ధమైనదో, తస్య = అట్టి మహనీయాత్మునకు, గురుత్వం = గురుత్వము, శోభతే = ప్రకాశించుచున్నది.

శ్రీ సద్గురుమూర్తియొక్క లక్షణములు: తాను వేదాంతార్థముల జక్కగ జదివి, యనుష్ఠానము జేసి, భక్తులయొక్క తరతమభావమును గుర్తెఱింగి, ఆత్మతత్త్వమును బహుసూక్ష్మబుద్ధితో సులభమగు నటుల బోధించు సామర్థ్యము, సకల విషయములను స్పష్టముగ శీఘ్రముగ గ్రహించు వివేకజ్ఞానము, నిరంతరము

స్వస్వరూపనిష్ఠ గలిగి పరమార్థజ్ఞానమును గలిగి యుండుటయు, శుద్ధమగు ఆచారము, బాహ్యాభ్యన్తర శుచిత్వము, సర్వేంద్రియ ప్రసన్నత్వము, హృదయమున నిష్కాపట్యభావము, సకల జనులను తరింపజేయవలయునని పరమదయతో గూడుకొన్న దృఢసంకల్పము- ఈ మొదలగు శ్రీ సద్గురుదేవునియొక్క లక్షణములు గలవాడే లోకమునకు గురువగును. ఆమహాత్ము నెల్లరును స్వయముగ గురువునుగా చేసికొని పూజింతురు. జనులెల్లరు వారి పాదధూళిని చల్లుకొనుటకై నిరీక్షించుచుందురు. అట్టి గురువు భాస్కరునివలె భాస్వద్దీప్తుడై ప్రకాశించుచున్నాడు. అట్టి మహాత్మునకే గురుపదార్థత యున్నది.

అవ: గురువులయొక్క స్వభావమును నిర్ణయించుచున్నారు:

**గురవో నిర్మలాశ్శాంతాః సాధవో మితభాషిణః ।**
**కామక్రోధవినిర్ముక్తాః సదాచారా జితేన్ద్రియాః ॥ 271**

గురవః - నిర్మలాః - శాంతా - సాధవః - మితభాషిణః - కామక్రోధ వినిర్ముక్తాః - సదాచారాః - జితేన్ద్రియాః.

గురవః = గురువులు, నిర్మలాః = మాలిన్యము లేనివారును, శాంతాః = శాంతి నొందినవారును, సాధవః = సాధుస్వభావము గలవారును, మితభాషిణః = మితముగ సంభాషించువారును, కామక్రోధవినిర్ముక్తాః = కామక్రోధములచే విడువబడినవారును, సదాచారాః = మంచి ఆచారము గలవారును (సత్తగు పరమాత్మ యందంతటను చరించువారును), జితేన్ద్రియాః = జితేంద్రియులును, (భవన్తి = అగుచున్నారు).

గురువు లనగ అజ్ఞానతమమును బాపి జ్ఞానతేజస్సు నొసగువారను ముఖ్యార్థ మిదివరకే తెలుప బడెను. మూలాజ్ఞానము నిశ్శేషముగ నశించిన వారగుటచే నే మాలిన్యదోషము లేనివారును, సకలమనోవృత్తు లుపశమించుటచే పరబ్రహ్మమందు విశ్రమించి పరమశాంతిని పొందినవారును, సకలసాధనలను జేసి సాధుప్రవర్తన గలవారును, వాక్సంయమముగలిగి సర్వలోక హితముగను, మితముగను, సత్యముగను సంభాషించువారును, కామక్రోధాది దుర్గుణములు లేనివారును, జ్ఞానవైరాగ్యాది సద్గుణభూషితులై సదాచార సంపన్నులై సచ్చిదానంద పరబ్రహ్మమందు నిరంతరము రమించు ఆత్మారాములై యుండువారును,

సకలేంద్రియములను జయించినవారు నగుచున్నారు. అనగా, అజ్ఞాన నాశకత్వ, జ్ఞానప్రదాయకత్వ, మాలిన్యరహితత్వ, పరిశుద్ధత్వ, వృత్తిరహితత్వ, పరమశాంతిత్వ, సాధనాపరత్వ, హితమిత సత్యభాషిత్వ, కామక్రోధవర్జితత్వ, వైరాగ్యాది గురు భూయిష్ఠత్వ, సదాచారసంపన్నత్వ, జితేంద్రియత్వము-లు శ్రీగురుదేవుని లక్షణము లని తెలియవలెను.

అవ: సద్గురు భేదాలు:

**సూచకాదిప్రభేదేన గురవో బహుధా స్మృతాః ।**
**స్వయం సమ్యక్ పరీక్ష్యాథ తత్త్వనిష్ఠం భజేత్సుధీః ॥ 272**

సూచకాదిప్రభేదేన - గురవః - బహుధా - స్మృతాః - స్వయం - సమ్యక్ - పరీక్ష్య - అథ - తత్త్వనిష్ఠ - భజేత్ - సుధీః.

సూచకాదిప్రభేదేన = సూచకుడు మొదలగు వారియొక్క భేదముచేత, గురవః = గురువులు, బహుధా = అనేకవిధములుగ, స్మృతాః = చెప్పబడిరి, స్వయం = స్వయముగా, సమ్యక్ = బాగుగా, పరీక్ష్య = పరీక్షించి, సుధీః = వివేక జ్ఞానము గలవాడు, తత్త్వనిష్ఠం = జ్ఞాననిష్ఠ గలవానిని, భజేత్ = పొందవలయును.

లోకములో గురువులు సూచక వాచకాది భేదములచే నేడువిధములుగ నున్నారు. భ్రమరము పరిమళగంధవిశిష్టమై మకరందప్రపూరిత పుష్పములనే ప్రవేశించునట్లు వివేకజ్ఞానము గల సాధకుడు తత్త్వజ్ఞానామృతముచే పూర్ణుడైన వేదాన్తార్థ పరిమళ విశిష్టుడైన నిష్ఠాగరిష్ఠుని బాగుగా పరిశోధించి తాపశాంతికై శరణుపొందవలయును.

అవ: సూచకగురు లక్షణము:

**వర్ణజాలమిదం తద్వద్బాహ్యశాస్త్రన్తు లౌకికమ్ ।**
**యస్మిన్దేవి! సమభ్యస్తం స గురుస్సూచకస్స్మృతః ॥ 273**

వర్ణజాలం - ఇదం - తద్వత్ - బాహ్యశాస్త్రం - తు - లౌకికం - యస్మిన్ - దేవి - సమభ్యస్తం - సః - గురుః - సూచకః - స్మృతః.

ఇదం = ఈ, వర్ణజాలం = అక్షరములయొక్క సమూహము, తద్వత్ = ఆ

ప్రకారముగనే, లౌకికం = లోకమునకు సమ్బన్ధించిన, బాహ్యాశాస్త్రం తు = బాహ్యాశాస్త్రములును, యస్మిన్ = ఏ గురుపుదగ్గఱ, సమభ్యస్తం = లెస్సగ నభ్యసింపబడినవో, సః = ఆ శాస్త్రాధ్యాపకుడు, హే దేవి = ఓ దేవీ, సూచకః గురుః = సూచక గురువుగ, స్మృతః = చెప్పబడెను.

ఓ న మాలు మొదలుకొని యక్షరములనెల్ల నేర్పి ఆత్మబాహ్యాము లయిన తర్క వ్యాకరణాది శాస్త్రముల నధ్యయనమును లెస్సగా చేయించినట్టి యధ్యాపకుడు శాస్త్రోపాధ్యాయుడు సూచకగురువని యో పార్వతీ ! తెలియుము. "సూచయతీతి సూచకః" విద్యలను నేర్పువాడు గనుక సూచక గురువని చెప్పబడుచున్నాడు.

అవ: వాచకగురు లక్షణము:

**వర్ణాశ్రమోచితాం విద్యాం ధర్మాధర్మవిధాయినీం ।**
**ప్రవక్తారం గురుం విద్ధి వాచకన్త్వితి పార్వతి! ॥ 274**

వర్ణాశ్రమోచితాం - విద్యాం - ధర్మాధర్మవిధాయినీమ్ - ప్రవక్తారం - గురుం - విద్ధి - వాచకం - తు - ఇతి - పార్వతి.

హే పార్వతి = ఓ పార్వతీ, కిం తు = మఱియును, ధర్మాధర్మవిధాయినీమ్ = ధర్మాధర్మములను తెలుపునట్టియు, వర్ణాశ్రమోచితాం = జాతికి, బ్రహ్మచర్యాద్యాశ్రమములకు నుచితమయిన, విద్యాం = విద్యను, ప్రవక్తారం = చెప్పునట్టి, గురుం = గురువును, వాచకం = వాచకునిగ, విద్ధి = తెలియుము.

పార్వతీదేవీ! మఱియు వినుము. బ్రాహ్మణాది వర్ణములయొక్కయు, బ్రహ్మచర్యాద్యాశ్రమములయొక్కయు ధర్మములను, అధర్మములను తెలుపునట్టి విద్యను, అట్టి శాస్త్రములను ప్రవచించు గురువు (కులగురువు) వాచకగురువని తెలియము. ఇతడు ఉపనయనాది కార్యములను చేయువాడు నగుచున్నాడు. "వచతీతి వాచకః" కులాశ్రమోచిత విద్యలను చెప్పువాడు వాచకుడగును.

అవ: ఇది మొదలుకొని జ్ఞానసాధన యోగములను తెలుపు గురువులను తెలుపుచున్నారు.

**పంచాక్షర్యాది మన్త్రాణాముపదేష్టా తు పార్వతి! ।**
**స గురుర్బోధకో భూయాదుభయోరయముత్తమః ॥ 275**

పంచాక్షర్యాదిమన్త్రాణాం - ఉపదేష్టా - తు - పార్వతి - సః - గురుః - బోధకః - భూయాత్ - ఉభయోః - అయం - ఉత్తమః

హే పార్వతి = ఓ దేవీ, (యః = ఎవడు), పంచాక్షర్యాది మన్త్రాణాం = పంచాక్షరి, అష్టాక్షరి మొదలగు మహాపవిత్ర మన్త్రములయొక్క, ఉపదేష్టా తు = ఉపదేశకు డయితే యగుచున్నాడో, సః గురుః = మన్త్రయోగము నుపదేశించు ఆ గురువు, బోధకః = బోధకగురువుగ, భూయాత్ = ఆగును, ఉభయోః = ఆ సూచక వాచక గురువులలో, అయం= ఈ బోధక గురువు, ఉత్తమః = ఉత్తముడు.

ఓ గౌరీదేవీ! "బోధయతీతి బోధకః" అనుటచే పంచాక్షరీ, అష్టాక్షరీ, ద్వ్యక్షరీ, ఏకాక్షరీ మొదలగు మహామన్త్రముల నుపదేశించు గురువు బోధకగురుని తెలియుము. ముందు చెప్పబడిన సూచక వాచక గురువులలో నీ గురువు శ్రేష్ఠుడగుచున్నాడు. ఎందుకనగా జ్ఞానసిద్ధికి, అన్తఃకరణసిద్ధికి మన్త్రయోగము ముఖ్యమైనది. అందుచే దైవానుగ్రహముచే త్వరలో నాత్మజ్ఞాన సమ్పన్నుడగు చున్నాడు. పవిత్రములగు మన్త్రగురువు ఉత్తము డగును.

అవ: ముందు పవిత్రమన్త్రోపదేశములను చేయు బోధకునికి విరుద్ధ స్వభావము గల దుర్మన్త్రప్రయోగజ్ఞుడగు పైశాచిక వృత్తిగల గురువును దెలుపుచున్నారు.

**మోహమారణవశ్యాదితుచ్ఛమన్త్రోపదేశినమ్ ।**
**నిషిద్ధగురురిత్యాహుః పండితాస్తత్త్వదర్శినః ॥ 276**

మోహమారణవశ్యాదితుచ్ఛమన్త్రోపదేశినమ్ - నిషిద్ధగురుః - ఇతి - ఆహుః - పండితాః- తత్త్వదర్శినః.

తత్త్వదర్శినః = తత్త్వజ్ఞానులైన, పండితాః = బుధులు, మోహమారణ ... ... దేశినమ్- మోహమారణవశ్యాది = మోహనము, మారణము, వశ్యము, స్తంభనము మొదలగు, తుచ్ఛమన్త్ర= నీచమన్త్రములను, ఉపదేశినం = ఉపదేశించు వానిని, నిషిద్ధగురుః = నిషిద్ధగురుడు, ఇతి = అని, ఆహుః = చెప్పుచున్నారు.

మోహనము, మారణము, వశీకరణము, స్తంభనము, (అగ్నిస్తంభన, జలస్తంభన, వాయు స్తంభనములును) ఉచ్చాటనము, విమోచనము వీనియొక్క ప్రయోగమునకు సంబన్ధించిన బద్ధాదరుడై ప్రత్యక్షరాక్షసునివలె నుండువాడు

'నిషిద్ధానాం గురుః' అనుటచే నిషిద్ధగురువని, కేవల పాపకారకుడని తత్త్వజ్ఞానులగు పండితులు చెప్పుచున్నారు.

అవ: జ్ఞానమునకు సంబన్ధించిన గురువును జెప్పుచున్నారు.

**అనిత్యమితి నిర్దిశ్య సంసారం సంకటాలయమ్ ।**
**వైరాగ్యపదదర్శీ యః స గురుర్విహితః ప్రియే ॥ 277**

అనిత్యం - ఇతి - నిర్దిశ్య - సంసారం - సంకటాలయం - వైరాగ్యపదదర్శీ - యః - సః - గురుః - విహితః - ప్రియే.

హే ప్రియే ! = ప్రియమగు నో పార్వతీ !, సంకటాలయమ్ = సుఖదుఃఖాది ద్వన్ద్వతాపములను కష్టములకు నిలయమైన, సంసారం = సంసారమును, అనిత్యమితి = స్థిరము గాదని, నిర్దిశ్య = దృష్టాంత యుక్తులతో నిరూపించి, యః = ఏ విరక్తుడు, వైరాగ్యపదదర్శీ = వైరాగ్యమార్గమును జూపువాడో, సః = అట్టి నిస్పృహుడు, విహితః గురుః = విహితగురువుగ (చెప్పబడెను).

ఆత్మజ్ఞానమునకు ముఖ్యకారణము పునాది వైరాగ్య మగుచున్నది. విరక్తి లేనిచో జ్ఞానము గలిగి స్థిరముగా నుండజాలడు.

**అసారమేవ సంసారం జ్ఞానీ సారదిదృక్షయా ।**
**ప్రవృత్తిహేతుకం కర్మ జ్ఞానం నిర్వృత్తిహేతుకమ్ ॥**

ఇత్యాద్యమృత మయములగు మహోపదేశములజేసి దుర్గుణకంటకావృతమైన దుఃఖవితతి సమ్మర్దజనిత సంకటసమూహ నిలయముగ సారము లేని సంసార మనిత్యమని చూచుచున్నారా! జగత్తులోని ప్రాణులు మడియుచున్నారు. సంసారము నీటిబుడగవంటిది. విషలిప్త అమృతలేశమువంటిది. మధుసిక్తఖడ్గధార వంటిది. మలినకర్దమముతో గూడుకొని వరాహమునకువలె నజ్ఞానిజనులకు ప్రీతికరమైనది. సుఖలేశ మిందు గానబడదు. మరుమరీచికలవలె నాశగొల్పుచున్నది. ఇట్లనేక దృష్టాంతములను జూపి ఇహసుఖముల నుండియు, 'పరలోకములును శాశ్వతములు గావు. దేవేన్ద్రాదుల దుఃస్థితులను గాంచితిరా ! వారును విషయ లంపటులయ్యే యున్నారు' ఇట్లుపదేశించి పరలోక సుఖములనుండియు శిష్యులను

విముఖులనుగ జేసి పరాపరవైరాగ్యమార్గమును బోధించు మహానుభావుడే 'విశేషేణ హితః యస్య సః' అనుటచే విహితగురువని పార్వతీదేవీ ! తెలియుము. విహిత గురువనగా సాధన చతుష్టయ సంపత్తిని శిష్యునకు దృఢీకరించువాడు. ఇట్టివాడు తత్త్వజ్ఞానాధికారి యగును.

అవ: జీవబ్రహ్మాభేదతత్త్వము నుపదేశించునట్టి బ్రహ్మజ్ఞానగురువును తెలుపు చున్నారు.

**తత్త్వమస్యాది వాక్యానాముపదేష్టా తు పార్వతి**
**కారణాఖ్యో గురుః ప్రోక్తో భవరోగనివారకః ॥ 278**

తత్త్వమస్యాది వాక్యానాం - ఉపదేష్టా - తు - పార్వతి - కారణాఖ్యః - గురుః - ప్రోక్తః - భవరోగనివారకః.

తత్త్వమస్యాది వాక్యానాం = తత్త్వమసి మొదలగు నాలుగు మహావాక్యములయొక్క, ఉపదేష్టా తు = బోధించునట్టి మహనుభావుడైతే, హే పార్వతి ! = ఓ పార్వతీదేవీ !, భవరోగనివారకః = సంసారవ్యాధిని పోగొట్టునట్టి, కారణాఖ్యః గురుః = కారణ గురువుగ, ప్రోక్తః = చెప్పబడెను.

'తత్త్వమసి, అహంబ్రహ్మాస్మి, ప్రజ్ఞానం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ' అను చతుర్విధ మహావాక్యములయొక్క లక్ష్యార్థమగు నీశ్వరచైతన్య రూపజీవ బ్రహ్మైక్యమును బోధించి యనాదిగా జీవబ్రహ్మాభేదముచే వెనువెంటవచ్చుచు నానాజనన మరణముల నొసగు తీవ్రమహావ్యాధిని నిశ్శేషముగ నశింపజేయు మహాత్ముడు 'కారణస్య గురుః' బ్రహ్మజ్ఞాన కారకు డగుటచే కారణగురువని ఓ పార్వతీ! తెలియుమా.

అవ: సర్వగురువులలో శ్రేష్ఠగురువును నిరూపించుచున్నారు.

**సర్వసందేహ సందోహ నిర్మూలన విచక్షణః ।**
**జన్మమృత్యుభయఘ్నో యః స గురుః పరమో మతః ॥ 279**

సర్వసందేహ సందోహ నిర్మూలన విచక్షణః - జన్మమృత్యు భయఘ్నః - యః - సః - గురుః - పరమః - మతః.

సర్వ ... ... విచక్షణః-సర్వసందేహ = సకల సంశయములయొక్క, సందోహ = సమూహముయొక్క, నిర్మూలన = పూర్తిగ నశింపజేయుటయందు, విచక్షణః = సమర్థుడును, జన్మమృత్యుభయఘ్నః = జనన మరణ భయమును హనన మొనర్చిన మహాజ్ఞాన సంపన్నుడైన, యః = యే దివ్యపురుషుడో, సః = ఆ మహనీయాత్ముడు, పరమః గురుః = పరమగురువని, మతః = ఇష్టము.

కేవల దివ్యజ్ఞాన స్వరూపుడు సాక్షాదీశ్వరుడు పరమగురువు. శాస్త్రముల చేతను, ననేకయుక్తులచేతను, దృష్టాంతములచేతను, అవాఙ్మానస గోచరమగు జీవబ్రహ్మైక్య తత్త్వము బోధపడునది కాదు. అటులనే తపోధ్యానాదుల చేతను నాతత్త్వము గోచరము కాదు. ఇట్లు దురవగాహమగు పరమతత్త్వమును సకల సందేహములు పరంపరగా వచ్చి పడుచున్నను వానినెల్ల క్షణములో జ్ఞానముద్ర యగు చిన్ముద్రచేత నశింపజేసి బోధించునట్టి మహానుభావుడును, అఖండ దివ్యజ్ఞానమూర్తియు, నిశ్శేషముగ జననమరణ భయనాశకుడైన తత్త్వజ్ఞాని యగు మహనీయాత్ముడు అనగా చిన్ముద్రచేత శిష్యులయొక్క జీవబ్రహ్మైక్య విషయములోగల సకల సందేహములను నిర్మూలన మొనరించి శిష్యుల నఖండపరిపూర్ణ జ్ఞాన సంపన్నులనుగా జేయువాడు 'పరమః గురుః' సర్వవిలక్షణ మహోత్కృష్ట పరమతత్త్వోపదేశికు డగుటచే పరమగురువని తత్త్వజ్ఞులయొక్క సమ్మతమగు మతమై యున్నది.

లోకమునం దిట్టి పరమగురువు గానుపించుట లేదు. ముందు తెలుప బడినట్టి యీ సప్తగురువులలో మహాపాపియగు నిషిద్ధగురువును విడనాడి మిగిలిన ఆరుగురు గురువులును స్వీకరింపదగినవారలే. వారిచేత శిష్యు లున్నస్థితికి వచ్చుచున్నారు. అందుచే వారియందు కృతజ్ఞతా బుద్ధిని జూపుచునే యుండ వలయును. అయినను నీ యార్గురు గురువులలో నొక్కరికన్న మరియొకడు శ్రేష్ఠు డగుచున్నారు. వారిలోను విహిత కారణగురువులు కోటిరెట్లధికులని తలంచవచ్చును.

పరమగురుడు మాత్రము సర్వజ్ఞుడు. సర్వేశ్వర స్వరూపుడు. ఈ పరమగురుస్థానము శ్రీ దక్షిణామూర్తి యొకరికి మాత్రమే గలదని వేదాంతశాస్త్రజ్ఞుల

నిర్ణయము. పైనదెల్పిన ప్రకారము గురువులను విచారించి తమయొక్క యజ్ఞానము నేగురువుచే క్షయ మొందునో యాతడే ప్రత్యక్ష పరమగురువు, సాక్షాదీశ్వరుడు, పరబ్రహ్మస్వరూపము. సత్యము; ముమ్మారు సత్యము.

అవ: సకల కర్మబన్ధములను ఛేదించి జ్ఞాన మొసంగు పరమగురుడు మహా దుర్లభుడని తెలుపుచున్నారు.

**బహుజన్మకృతాత్పుణ్యాల్లభ్యతేఽసౌ మహాగురుః ।**
**లబ్ధ్వాఽముం న పునర్యాతి శిష్యస్సంసారబన్ధనమ్ ॥ 280**

బహుజన్మకృతాత్ - పుణ్యాత్ - లభ్యతే - అసౌ - మహాగురుః - లబ్ధ్వా - అముం - న - పునః - యాతి - శిష్యః - సంసారబన్ధనమ్.

అసౌ = ఈ సత్యస్వరూపుడగు, మహాగురుః = పరమగురువు, బహుజన్మకృతాత్ = అనేక జన్మములం దాచరించబడిన, పుణ్యాత్ = సుకృత విశేషమువల్ల, లభ్యతే = పొందబడుచున్నాడు, అముం = ఈ పరమగురువును, లబ్ధ్వా = పొంది, శిష్యః = శిష్యుడు, పునః = మరల సంసారబన్ధనమ్ = సంసారమను బన్ధనమును, న యాతి = పొందడు (పునర్జన్మరహితు డగుచున్నాడని యర్థము)

పరమజ్ఞాన స్వరూపుడగు పరమగురు వనేకజన్మలనుంచి చేసినట్టి యనన్త పుణ్యరాశులచేతనే లభించుచున్నాడు. ఎందుకనగా ననేకజన్మలనుంచి వచ్చుచున్న యనేక వాసనా జాలములతో గూడుకొన్న ప్రబల సంసారబన్ధనము నేమహామహుని యపారకరుణా కటాక్షవీక్షణముచే శిష్యుడు తిరుగా పొందుట లేదో, శిష్యుడును కేవల పరబ్రహ్మ స్వరూపు డగుచున్నాడో, అట్టి పరమగురువును బడయుట మహాదుర్లభము. అట్టి మహాత్ముని శరణు పొందినచో త్రిలోకములందును భయము లేదు. అంతయు చైతన్యమాత్రుడై యుంటున్నాడు.

అవ: గురు పరిగణనము:

**ఏవం బహువిధా లోకే గురవస్సన్తి పార్వతి! ।**
**తేషు సర్వప్రయత్నేన సేవ్యో హి పరమో గురుః ॥ 281**

ఏవం - బహువిధాః - లోకే - గురవః - సన్తి - పార్వతి - తేషు - సర్వప్రయత్నేన -

సేవ్యః - హి - పరమః - గురుః.

ఏవం = పైన తెల్పిన ప్రకారము, బహువిధాః = అనేకవిధములైన, గురవః = గురువులు, లోకే = లోకమునందు, సన్తి = ఉంటున్నారు, హే పార్వతి = ఓ పార్వతీ !, తేషు = ఆ గురువులలో, పరమః గురుః = మహాశ్రేష్ఠుడగు సకల జన్మబంధములను సులభముగ నశింపజేయు గురువరుడు, సర్వప్రయత్నేన = అన్ని విధములచేత, హి = నిశ్చయముగా, సేవ్యః = సేవించదగినవాడు.

లోకములో ననేకవిధములైన గురువు లుంటున్నారు. ఓ పార్వతీ ! యందఱిని సేవింప రాదు. సర్వశ్రేష్ఠ డయిన అజ్ఞానధ్వంసకు డయిన పరమగురువే యన్నివిధముల సేవింపదగినవాడు.

అవ: నిషిద్ధగురు సేవాఫలితమును తెలుపుచున్నారు.

**నిషిద్ధగురుశిష్యస్తు దుష్టసంకల్పదూషితః ।**
**బ్రహ్మప్రళయపర్యన్తం న పునర్యాతి మర్త్యతామ్ ॥ 282**

నిషిద్ధగురుశిష్యః - తు - దుష్టసంకల్పదూషితః - బ్రహ్మప్రళయపర్యన్తం - న - పునః- యాతి - మర్త్యతాం.

కిం తు = మరేమనగా, నిషిద్ధగురుశిష్యః = మారణాది ప్రయోగములను జేయు నిషిద్ధగురువుయొక్క శిష్యుడు, దుష్టసంకల్పదూషితః = క్రూరములగు భావములతో కూడిన దోషయుక్త హృదయము గలవాడు గనుకనే, బ్రహ్మప్రళయపర్యన్తం = బ్రహ్మదేవుని ప్రళయమువరకును, పునః = మరల, మర్త్యతాం = మనుష్యత్వమును, న యాతి = పొందడు.

ముందు పరమగురువుయొక్క సేవాఫలిత మేమనగా తిరుగా జన్మింప కుండుట, అఖండానందము నొందుటయు నగుచున్నది. దానికి విరుద్ధముగా మారణ వశీకరణాది మన్త్ర ప్రయోగములను జేసి మహాక్రూరు డయిన నిషిద్ధ గురువు యొక్క శిష్యుడును మహా హింసాకర భావములతో మిగుల దూషిత హృదయము గలవాడు గనుకనే యిక నెన్నిటికిని మనుష్యజన్మమును పొందజాలడు. పరమగురుశిష్యునకు ముక్తియను నివృత్తిమార్గమును, నిషిద్ధగురుశిష్యునకు పాపభూయిష్ఠమగు నరకమను నివృత్తిమార్గములు లభించుచున్నవి. వీడు నఖండదుఃఖములను పొందుచున్నాడు. మనుష్యజన్మము వదలి భయంకర

పిశాచాదుల జన్మలను ధరించును. వానిచే తిరుగా పాపజన్మములనే పొందును. పవిత్ర మానవజన్మ మికరాదు. అదెంతవర కనగా బ్రహ్మదేవుడు మేలు కొన్నప్పుడును సృష్టి జరుగుచున్నది. నిద్రించునప్పుడు ప్రళయము సంభవించు చున్నది. ఇటుండగా నట్టి బ్రహ్మప్రళయమునకు నెన్నిప్రళయములు గావలయునో చెప్ప వీలుకాదు. అంతవరకును మనుష్యుడు కాడు. అనగా నిక మనుష్యజన్మము రాదని యర్థము.

**ఏవం శ్రుత్వా మహాదేవీ! మహాదేవవచస్తదా ।**
**అత్య న్తవిహ్వలమనాశ్శంకరం పరిపృచ్ఛతి ॥ 283**

ఏవం - శ్రుత్వా - మహాదీవీ - మహాదేవవచః - తదా - అత్యన్తవిహ్వలమనాః - శంకరం - పరిపృచ్ఛతి.

మహాదేవీ = పార్వతీదేవి, ఏవం = ఈ ప్రకారము, మహాదేవవచః = మహేశ్వరుని వాక్యమును, శ్రుత్వా = విని, తదా = అప్పుడు, అత్యన్తవిహ్వలమనాః = మిక్కిలి వ్యధను జెందిన మనస్సు గలదై, శంకరం = మహేశుని, పరిపృచ్ఛతి = అడుగుచున్నది.

మర్త్యుడు నిషిద్ధగురువును సేవించినచో తిరుగా మనుష్యజన్మమునకు రాడను మహాదేవుని వాక్యమును వినినదై పార్వతీదేవి మిక్కిలి దయాస్వరూపురా లగుటచే మిగుల మనోవ్యథతో గూడినదై మహేశ్వరుని ప్రశ్నించుచున్నది.

**పార్వత్యువాచ = పార్వతీదేవి పలికెను -**

**నమస్తే దేవదేవాత్ర శ్రోతవ్యం కిఞ్చిదస్తి మే ।**
**శ్రుత్వా త్వద్వాక్యమధునా భృశం స్యాద్విహ్వలం మనః ॥ 284**

నమః - తే - దేవదేవ - అత్ర - శ్రోతవ్యం - కిం - చిత్ - అస్తి - మే - శ్రుత్వా - త్వద్వాక్యం - అధునా - భృశం - స్యాత్ - విహ్వలం - మనః

హే దేవదేవ = ఓ దేవాదిదేవా !, తే = మీకు, నమః = నమస్కారము, అత్ర = తమరు చెప్పిన విషయములో, శ్రోతవ్యం = వినదగినది, కించిత్ = కొంచెము, మే = నాకు, అస్తి = కలదు, అధునా = ఇప్పుడు, త్వద్వాక్యం = మీ వాక్యమును, శ్రుత్వా = విని, భృశం = మిక్కిలి, మనః = నా మనస్సు, విహ్వలం = వివశమైనదిగ (భయముతో గూడినదిగ),

స్యాత్ = అగును.

ఓ దేవదేవా! ప్రభో! మీకొఱకు నమస్కారము. తమరానతిచ్చిన విషయములో నడుగదగినది కొంచెమున్నది. తమవాక్యమును విని నామనస్సు చాల భయగ్రస్తమై వ్యథను జెందుచున్నది.

అవ: పార్వతీదేవి ప్రశ్నను తెలుపుచున్నారు.

**స్వయం మూఢా మృత్యుభీతాస్సుకృతాద్విరతిం గతాః ।**
**దైవాన్నిషిద్ధగురుగా యది తేషాన్తు కా గతిః ॥ 285**

స్వయం - మూఢాః - మృత్యుభీతాః - సుకృతాత్ - విరతిం - గతాః - దైవాత్ - నిషిద్ధగురుగాః - యది - తేషాం - తు - కా - గతిః.

స్వయం మూఢాః = స్వయముగా నేమియు దెలియనివారును, మృత్యుభీతాః = మరణముచే భయముఁ జెందినవారును, సుకృతాత్ = పుణ్యమునుండి, విరతం = విరక్తిని, గతాః = పొందినవారును, పాపాత్ములు నయినవారు, దైవాత్ = దైవయోగమువలన, సిషిద్ధగురుగాః = నిషిద్ధగురువును పొందినవారుగ, యది = అయినచో, తేషాం = వారియొక్క, గతిః తు = గతి యయితే, కా = ఏమి?

స్వయముగా మూఢాత్ములును, పుణ్యమిసుమంతయు జేయనివారును, మరణభయమును పొందువారును, దైవవశాత్తుగా నిషిద్ధగురువును పొందిన వారైనచో వారి గతియేమి? మనుష్యజన్మ రాదని తెలిపితిరి గదా? ఇంతవరకు పుణ్యముచేసి మనుష్యజన్మ మెత్తినందులకు లాభమేమి? వారు సహవాసదోషముచే మూఢాత్మ లయిరి. వారెన్ని జన్మముల కయినను మానవజన్మను ధరించరనియు చెప్పుచున్నారు. వారికేదైనను గతిగలదా? అని పార్వతి ప్రశ్నించెను.

**శ్రీమహాదేవ ఉవాచ = జ్ఞానప్రకాశ స్వరూపుడగు మహేశ్వరుడు పలికెను:-**

అవ: శ్రీ పార్వతీదేవి నిషిద్ధగురుదేవులను గురించి ప్రశ్నించెను గదా. అద్దానికి నీశ్వరుడు సమాధాన మొసగుచున్నాడు.

**శృణు తత్త్వమిదం దేవి యదా స్యాద్విరతో నరః ।**
**తదాఽసావధికారీతి ప్రోచ్యతే శ్రుతిమస్తకైః ॥ 286**

శృణు - తత్త్వం - ఇదం - దేవి - యదా - స్యాత్ - విరతః - నరః - తదా - అసౌ - అధికారీ - ఇతి - ప్రోచ్యతే - శ్రుతిమస్తకైః.

హే దేవి = ఓ దేవి!, ఇదం తత్త్వం = ఈ యథార్థ తత్త్వమును, శృణు = వినుము, నరః = నిషిద్ధగురువును సేవించు మనుజుడు, యదా = ఎప్పుడు, విరతః = నిషిద్ధగురువును సేవించుటనుండి విరమించుచున్నాడో, తదా = అప్పుడు, అసౌ = ఈ నరుడు, అధికారీ ఇతి = బ్రహ్మవిద్యాధికారియని, శ్రుతిమస్తకైః = వేదశిరస్సులగు నుపనిషత్తులచేత, ప్రోచ్యతే= చెప్పబడుచున్నాడు.

దయామతియగు పార్వతీదేవి యందఱికిని గతి కల్పించినది కాన ఎట్టి పాపాత్ము లయినను తరింపవచ్చును. ఉపాయము గలదు. భయపడ నవసరము లేదు. ఆ తరణోపాయమునే తెలుపుచున్నారు. విశాలభావముతోగూడిన శాస్త్రము లన్నియు నీలాగుననే వచించుచున్నవి. రోగగ్రహస్తులకు నౌషధాదులు, వైద్యు లేర్పడినట్లు భవరోగవ్యాపితు లందఱికిని శాస్త్రములు, గురువు లవసరము. భగవంతుని శరణు పొందినచో నెట్టి పాపాత్ముడైనను పునీతుడై జ్ఞానవంతు డగుచున్నాడు. ఇదే విషయమును:-

**మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।**
**స్త్రియో వైశ్యాస్తథాశూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్ ॥**

అను భగవద్గీతా వాక్యము స్పష్టపరచుచున్నది. అట్టి విషయమునే మహాదేవు డిచ్చోట నుపదేశించుచున్నాడు. ప్రకాశస్వరూపురాలగు నోదేవీ! యిక జెప్పబోవు యథార్థతత్త్వమగు విషయమును వినుము. నీవు ప్రశ్నించిన వారికిని తప్పక గతి కలదు. ఎట్లనగా, నిషిద్ధగురువును సేవించు వాడైనను వివేకము గలిగి ఆ గురువును వదలి ఆ నీచమన్త్రములను గంగపాలుచేసి సకల పాపకర్మలనుండి విరమించినవా డెప్పుడగునో, అప్పుడే బ్రహ్మవిద్యాధికారి యగును. మఱియొక ఆత్మజ్ఞుడగు గురువరుని సేవించి ధన్యాత్ముడు కావచ్చును. ఇట్లు ఉపనిషత్తులును చెప్పుచున్నవి. ఒకానొకడు బావిలో మలినములో బురదలో పడినప్పు డట్లే యుండవలయు ననియు, వానిగతియంతే యనియు నేశాస్త్రము వచింపదు. అట్టిశాస్త్రముండి నద్దానిని విసర్జించవలయును. అయితే యోగ్యతమాత్ర ముండవలయును.

పాపబుద్ధిని వదలవలయును. జితేన్ద్రియుడై శుద్ధాత్ముడౌ శ్రవణ మనన నిది ధ్యాసములచే క్రమముగ ముక్తాత్ము డగుచున్నాడు. కఠోపనిషత్తు-

**నావిరతో దుశ్చరితాన్నాశాంతో నాసమాహితః ।**
**నాశాంతమానసో వాऽపి ప్రజ్ఞానేనైవ సమాప్నుయాత్ ॥**

దుశ్చరిత్రనుండి విరమించనివాడును, రాగద్వేషాదులు నశించని వాడును, నిశ్చల మనస్సు లేనివాడును, శాంతించిన చిత్తము లేనివాడును నాయాత్మను పొంద జాలడు. మరెట్టివాడు పొందుననగా, సకలపాపకృత్యముల నుండియు విరమించిన వాడును, రాగద్వేషాదులు నశించినవాడును, సకలేన్ద్రియవృత్తుల నణంచినవాడును, పరబ్రహ్మమందు మనస్సును సుస్థిరముగ నుంచినవాడును, పరమశాంతిని పొందినవాడును నయిన పవిత్రాత్ముడు "ప్రజ్ఞానం బ్రహ్మ" అను ప్రజ్ఞచేతనే పరమాత్మను పొందుచున్నాడు. కావున హృదయ పారిశుద్ధ్యమును సంపాదింపుడు. ఇందులకు మఱియొక ప్రమాణము-

**ప్రక్షీణాశేషపాపానాం జ్ఞానే ధ్యానే భవేన్మతిః ।**
**పాపోపహతబుద్ధీనాం తద్వార్తాऽపి సుదుర్లభా ॥**
**జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్ పాపస్య కర్మణః ॥**

పురుషులకు సమస్తపాపములు నశించినప్పుడు జ్ఞానముదయించునని శాస్త్రము చెప్పుచున్నది. పైన దెల్పినదియు నిదియే.

అవ: గురువనగా నెట్టివాడో వచించుచున్నారు.

**అఖండైకరసం బ్రహ్మ నిత్యముక్తం నిరామయమ్ ।**
**స్వస్మిన్సన్దర్శితం యేన స భవేదస్య దేశికః ॥ 287**

అఖండైకరసం - బ్రహ్మ - నిత్యముక్తం -నిరామయం - స్వస్మిన్ - సన్దర్శితం - యేవ - సః - భవేత్ - అస్య - దేశికః.

నిరామయం = ఏ మాలిన్యమును లేక భవరోగరహితమై పరిశుద్ధ మైనదియు, నిత్యముక్తం = సర్వదా బంధరహిత మైనదియు, అఖండైకరసం - అఖండ = పరిచ్ఛిన్నముగాని, పరిపూర్ణమయిన, ఏకరసం = అమృతైకరస స్వరూప మయినదియు నగు, బ్రహ్మ = పరబ్రహ్మ,

యేన = ఏ మహాపురుషునిచేత, అస్య = ఈ శిష్యునకు, స్వస్మిన్ = తన ఆత్మయందే, సందర్శితం = బాగుగా జూపింపబడెనో, సః = ఆ మహనీయాత్ముడే, దేశికః = గురువగుచున్నాడు.

నిత్యనిర్మలమును, భవరోగవర్జితమును, నిత్యసర్వబంధను, రహితమును, ముక్తమును, అపరిచ్ఛిన్నమును, పరిపూర్ణమును, కేవలామృతరసమునైన పరబ్రహ్మము తనలోనే నిత్యము ప్రకాశించుచున్నదని యే మహాత్ముడు శిష్యునకు సాక్షాత్కరింప జేసెనో ఆ మహనీయాత్ముడే దేశికేంద్రస్వామి యని తెలియ వలయును. దేశికుడనగా, పరబ్రహ్మతత్త్వము నుపదేశించువాడని యర్థము. అట్టి నిర్గుణ తత్త్వమును శిష్యుడును పొంది నిత్యముక్తుడును, నిరామయుడును కేవలా ద్వైత తత్త్వామృతరస స్వరూపుడును నగు పరమాత్మయొక్క స్వరూపమును సాక్షాత్కరించుచు పరమానంద పరిపూర్ణు డగుచున్నాడు; సచ్చిత్సుఖ స్వరూపు డగుచున్నాడు. గురూపదేశము లేనప్పుడు తాను పరితపించుచుండెను.

ఒకానొక దరిద్రుడు తనయింటిలో నిధియున్నను తెలిసికొనక దారిద్ర్య బాధచే పీడితు డగుచుండెను. నిధిజ్ఞుడు వచ్చి నిధిని జూపి, యెత్తి యిచ్చెను. అప్పుడు వానికి గలుగు నాశ్చర్యమునకు నానందమునకు నంతు గలదా ! అట్లే తనహృదయములో నున్న పరబ్రహ్మమును శ్రీ గురుదేవుడు శిష్యునకు సాక్షాత్కరింపజేసెను. అప్పు డాశిష్యుడు శ్రీ గురుదేవుని జేయు స్తోత్రములకు, వానికి జనించిన పరమానందమునకు పరిమితి లేకపోయెను. అహో నా యజ్ఞాన మేమనవచ్చును! నాయందున్న పరమాత్మను జూడజాలకుంటిని గదా యని ఆశ్చర్యపడును. గురుదేవునియందు పరమకృతజ్ఞుడై యుండును. కాన పరమ తత్త్వోపదేశికుడే దేశికవరుడని తెలియవలెను.

అవ: పరమప్రాప్యమగు గురువరేణ్యుని తెలుపుచున్నారు.

**జలానాం సాగరో రాజా యథా భవతి పార్వతి! ।**
**గురూణాం తత్ర సర్వేషాం రాజాఽయం పరమో గురుః ॥ 288**

జలానాం - సాగరః - రాజా - యథా - భవతి - పార్వతి - గురూణాం - తత్ర - సర్వేషాం - రాజా - అయం - పరమః - గురుః.

హే పార్వతి = ఓ భవానీ, సాగరః = సముద్రుడు, జలానాం = సలిలములకు, రాజా= రాజుగ, యథా = ఎట్లు, భవతి = అగుచున్నాడో, తథా = అప్రకారముగనే, తత్ర = ఆ సప్తవిధ గురువులలో, సర్వేషాం గురూణాం = సర్వగురువులకును, అయం పరమః గురుః = ఈ సకలసందేహ నివృత్తిపూర్వక చిన్ముద్రాసందర్శిత బ్రహ్మతత్త్వము గల పరమగురువు, రాజా= రాజు.

ఓ పార్వతీ ! వినుము. జలము లన్నిటికిని ఆశ్రయమై రాజై సముద్రము న్నది. నదులలోనికిగాని, వేనికిగాని, యుదకము సముద్రముల ద్వారానే వచ్చుచున్నది, అచ్చటనే చేరుచున్నవి. అట్లే ప్రజలు సర్వదా సంతోషపెట్టు రాజు నాశ్రయించి యుంటున్నారు. ఆ ప్రకార మజ్ఞాననాశనము గావించి పరతత్త్వమును బోధించి పరమానందమును గావించు శ్రీగురుదేవుడే గురూణాం గురువై, పరమగురుడని చెప్పబడుచున్నారు. అట్టి మహాత్ముని గురువులెల్లరు నాశ్రయించి యున్నారు.అచ్చట నుండియే, పరమగురువుయొక్క అనుగ్రహము బడసియే పరతత్త్వము గైకొనుచున్నారు. కాన పరమగురువనగా సత్యపరబ్రహ్మస్వరూపుడై గురువుల కెల్లను రాజై యున్నాడు.

అవ: పరమగురు లక్షణము:

**మోహాదిరహితశ్శాన్తో నిత్యతృప్తో నిరాశ్రయః**
**తృణీకృతబ్రహ్మవిష్ణువైభవః పరమో గురుః ॥ 289**

మోహాదిరహితః - శాన్తః - నిత్యతృప్తః - నిరాశ్రయః - తృణీకృతబ్రహ్మవిష్ణువైభవః - పరమః - గురుః.

మోహాదిరహితః = మోహము శోకము మొదలగు దోషములు లేనివాడును, శాన్తః = శాంతుడును, నిత్యతృప్తః = సర్వదా తృప్తుడును, నిరాశ్రయః = ఆశ్రయము లేనివాడును, తృణీ .... వైభవః - తృణీకృత = తృణముగ జేయబడిన (తిరస్కరింపబడిన), బ్రహ్మవిష్ణు = బ్రహ్మదేవ విష్ణుదేవులయొక్క, వైభవః = సమ్పత్తు గలవాడును నగువాడు, పరమః గురుః = పరమగురువు.

మూలాజ్ఞానమునకు పరమకారణములగు శోకమోహాదులను రహిత మొనర్చినవాడును, అనగా నిశ్శేషముగ మూలాజ్ఞానమగు తూలావిద్యనుగూడ

ధ్వంస మొనర్చినవాడును, విశుద్ధత త్త్వస్వరూపుడును, సకలచి త్తేన్ద్రియప్రవృత్తులను శమింపజేసినవా డగుటచే పరమశాంతుడును, సకలతృప్తుల నిలయమైన పరమవిశ్రాంతిధామమైన పరబ్రహ్మమందు నిరంతరము రమించువా డగుటచే నిత్యతృప్తుడును, ఏ ఆశ్రయములేక సర్వాధారుడై, సర్వాధిష్ఠానమై యుండువాడును, త్రిగుణములను గూడ నతిక్రమించి నిర్గుణ నిరుపాధికవేదాంత త త్త్వవైభవములు గలవాడగుచు కొంతకాలమునకు నశించునట్టి బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్థానములను గూడ తృణీకరించినవాడును, వేదాతీత కాలాతీతమగు నఖండజ్ఞాన వైభవో పేతుడును, కేవల దక్షిణామూర్తి స్వరూపుడునగు దివ్యతేజోమూర్తియే పరమగురు వనబడుచున్నాడు. అట్టి మహాత్ముని శరణ్యము లభించినచో పరబ్రహ్మపదవి మఱియొకటి లేదు. అదియే యనంతసుఖస్వరూప పరమానందపదవి.

అవ: పరమగురుస్వరూపమునే నిర్ణయించుచున్నారు.

**సర్వకాలవిదేశేషు స్వతంత్రో నిశ్చలస్సుఖీ ।**
**అఖండైకరసాస్వాదతృప్తో హి పరమో గురుః ॥ 290**

సర్వకాలవిదేశేషు - స్వతంత్రః - నిశ్చలః - సుఖీ - అఖండైకరసాస్వాదతృప్తః - హి - పరమః - గురుః.

సర్వకాలవిదేశేషు - సర్వ = సమస్తములైన, కాల = కాలములందును, విదేశేషు = దూరదేశములందును, స్వతంత్రః = స్వాతంత్ర్యము గలవాడును, నిశ్చలః = అచలుడును, సుఖీ = సుఖియును, అఖండైకర సాస్వాదతృప్తః - అఖండః = పరిపూర్ణమైన, ఏకరస = బ్రహ్మామృతరసముయొక్క, ఆస్వాద = పానముచేత, తృప్తః = తృప్తుడైన మహాత్ముడు, హి= నిశ్చయముగ, పరమః గురుః = పరమగురువని చెప్పబడుచున్నాడు.

సర్వకాల సర్వావస్థలయందు స్వాతంత్ర్యము గలవాడును అనగా సర్వ కాలము లకును, సర్వదేశములకును నతీతుడై స్వతంత్రుడై ప్రకాశించు వాడును, అచలుడును, నిత్యసుఖియును, కేవల పరబ్రహ్మానందామృత రసాస్వా దముచే తృప్తుడైన వాడును, పరతత్త్వమును నెరింగినవాడు నగు సర్వశ్రేష్ఠుడు పరమగురువని తత్త్వజ్ఞులు పలుకుచున్నారు. కఠోపనిషత్ :"ఆసీనో వ్రజతి శయానో యాతి దూరతః"

అవ: పరమగురుని లక్షణము మరొకటి.

**ద్వైతాద్వైతవినిర్ముక్తః స్వానుభూతిప్రకాశవాన్**
**అజ్ఞానాంధతమశ్ఛేత్తా సర్వజ్ఞః పరమో గురుః ॥ 291**

ద్వైతాద్వైతవినిర్ముక్తః - స్వానుభూతి ప్రకాశవాన్ - అజ్ఞానాంధతమః - ఛేత్తా - సర్వజ్ఞః- పరమః - గురుః.

ద్వైతాద్వైతవినిర్ముక్తః = ద్వైత అద్వైత మతములచేత విడువబడినవాడును, స్వానుభూతిప్రకాశవాన్ = స్వానుభవముయొక్క ప్రకాశము గలవాడును, అజ్ఞానాంధతమశ్ఛేత్తా- అజ్ఞాన = అజ్ఞానమను, అంధతమః = గ్రుడ్డిని గలిగించు చీకటిని, ఛేత్తా = ఛేదించువాడును, సర్వజ్ఞః = సర్వజ్ఞుడును నగు నఖండజ్ఞాని, పరమః గురుః = పరమగురువు.

ఆ పరబ్రహ్మము ద్వంద్వవర్జిత మగుటచే తమః ప్రకాశములకును, సత్యాసత్యములకును విలక్షణమైనదను తత్త్వమును పొందించిన వాడును గనుక ద్వైతాద్వైత మతములు లేనివాడును, స్వానుభవజ్ఞాన తత్త్వప్రకాశముచే సకల మతములను ప్రకాశింప జేయుచు నేమతము లేనివాడును, అజ్ఞానరూప తమస్సునకు భాస్కరుడై జనుల యజ్ఞానమును ధ్వంస మొనరించు వాడును, సర్వము నెఱుంగు నిరతిశయ జ్ఞాననిధియు నగు పరమాత్మస్వరూపుడు పరమగురువని తెలియవలెను.

అవ: పరమగురువును దర్శించినంతమాత్రముననే తెలియవచ్చునని చెప్పు చున్నారు.

**యస్య దర్శనమాత్రేణ మనసః స్యాత్ప్రసన్నతా ।**
**స్వయం భూయాత్ ధృతిశ్శాంతిః స భవేత్ పరమో గురుః ॥ 292**

యస్య - దర్శనమాత్రేణ - మనసః - స్యాత్ - ప్రసన్నతా - స్వయం - భూయాత్ - ధృతిః - శాంతిః - సః - భవేత్ - పరమః - గురుః.

యస్య = యే మహాత్మునియొక్క, దర్శనమాత్రేణ = దర్శించినంత మాత్రముచేతనే, మనసః = చిత్తమునకు, ప్రసన్నతా = నిర్మలత్వము, స్యాత్ = అగునో, స్వయం = స్వయముగ, ధృతిః = ధైర్యము, శాంతిః = వృత్తిశూన్యత్వము, భూయాత్ = కలుగునో, సః = అట్టి మహిమసంపన్నుడు, పరమః గురుః = పరమగురువుగ, భవేత్ = అగును.

పరమప్రసన్నుడై పరమశాంతిని నిర్భయస్థితికి జెందిన ఏ మహానుభావుని

యొక్క దర్శనముచేత సర్వేంద్రియములును ప్రసన్నములై, అప్రాకృతస్థితిలో ప్రవేశించినవాడై, నిర్భయత్వము, ప్రకృతిజయధైర్యము, చిత్తశాంతియును స్వయముగ గలుగుచున్నవో, అట్టి మహిమసంపన్నుడగు మహాత్ముడు అట్టిస్థితిని పొందిన వాడగుటచే నాప్రకార మాశ్రితులు శాంతులనుగ జేయు మహనీయుడు పరమగురువని చెప్పుచున్నారు.

అవ: పరమగురువుయొక్క వైరాగ్యాతిశయమును నిరూపించుచున్నారు.

**సిద్ధిజాలం సమాలోక్య యోగినాం మన్త్రవాదినామ్ ।**
**తుచ్ఛాకారమనోవృత్తిః యస్యాసౌ పరమో గురుః ॥ 293**

సిద్ధిజాలం - సమాలోక్య - యోగినాం - మన్త్రవాదినామ్ - తుచ్ఛాకారమనోవృత్తిః - యస్య - అసౌ - పరమః - గురుః.

మన్త్రవాదినామ్ = మంత్రములను జపించునట్టి, యోగినాం = యోగులయొక్క, సిద్ధిజాలం = అణిమాది సిద్ధులయొక్క సమూహమును, సమాలోక్య = బాగుగా చూచి, యస్య= ఏ వీతరాగునకు, తుచ్ఛాకార మనోవృత్తిః = వానిపై నీచమగు మనోవ్యాపారము గలుగుచున్నదో, అసౌ = ఇట్టి పరిపూర్ణవైరాగ్య భాగ్యశాలి, పరమః గురుః = పరమగురువు.

నానావిధములగు మహామంత్రములను వానియొక్క అష్టక్రియలను తెలిసికొని, ఆయా యధిష్ఠాన దేవతలను వశపరచుకొని మంత్రశక్తియే మహా గొప్పదని వాదించు మంత్రయోగులయొక్క అణిమాది సిద్ధులనుగాంచి, వాన నన్నింటిచే జ్ఞానముగాని, పరమశాంతిగాని, నిర్విషయస్థితిగాని గలుగలేమిచే, నా మహిమలపై తుచ్ఛబుద్ధి యేమహావైరాగ్యశాలికి గలుగచున్నదో అట్టి జ్ఞానసంపన్న వైరాగ్య ధురంధర యోగీశ్వరుడు పరమగురువని యెరుంగవలయును.

అవ: పరమగురులక్షణము మరొకటి.

**స్వశరీరం శవం పశ్యన్ తథా స్వాత్మానమద్వయమ్ ।**
**యస్స్త్రీకనకమోహఘ్నః స భవేత్పరమో గురుః ॥ 294**

స్వశరీరం - శవం - పశ్యన్ - తథా - స్వాత్మానం - అద్వయమ్ - యః - స్త్రీ కనకమోహఘ్నః - సః - భవేత్ - పరమః - గురుః.

యః = ఏ విరక్తుడు, స్త్రీ కనకమోహఘ్నః =కామినీ కాంచనములందలి భ్రాంతిని చంపినవాడై, తథా = అట్లు, స్వశరీరం = తనయొక్క దేహమును, శవం = పీనుగనుగా, పశ్యన్ = చూచుచున్నవాడై, అద్వయమ్ = అద్వితీయమైన, స్వాత్మానం = స్వస్వరూపమును, పశ్యన్ = చూచుచున్నవా డగుచున్నాడో, సః = అట్టి స్వస్వరూపమును గాంచు వీతరాగుడు, పరమః గురుః = పరమగురువుగ, భవేత్ = అగును.

పరమగురువు యొక్క వైరాగ్యమునే వర్ణించుచున్నారు. లోకములో "కామినీకాంచనాభ్యాం నిగళితో యం ప్రపంచ", "వేధా భ్రమం చక్రే కాంతాసు కనకేషు చ" అన్నట్లు కామినీ కాంచనములు లోకములో వివేకజ్ఞానము లేని వారందరికిని మధురపదార్థములు. ఇవి అనుభవముచేతనైనను తృప్తిని గలిగించు నవిగావు. ఆశనే గొల్పునవి. ప్రాక్పశ్చిమ భవార్ణవముల వంటివి. వీనిలో మునింగిన వారు పైకి లేచుట దుస్తరము.

**శ్రియం త్యక్త్వా జగ త్త్యక్తం జగత్ త్యక్త్వా సుఖీ భవేత్ ।**
**స్త్రియం త్యక్త్వా జగత్త్యక్తం జగత్త్యక్త్వా సుఖీ భవేత్ ॥**

అన్నట్లు స్త్రీని, శ్రీని పూర్తిగా జయించినవాడును,

**"అహిమివ జనయోగం సర్వదా వర్జయేద్యః**
**కుణపమివ స నారీం త్యక్తకామో విరాగీ"**

**"సమలోష్టాశ్మకాంచనః"**- అను శ్రుతిస్మృతుల ప్రకారము, కామినీ కాంచనములయందు నిశ్శేషముగ భ్రాంతిని చంపినవాడును, తన దేహమంతయు సప్తధాతువులలో గూడుకొని, అసహ్యమై చేతనారహితమై యున్నందున శవమునువలె గాంచుచు, ప్రపంచమును అనిత్యమని తలంచి స్వస్వరూపమునే శాశ్వతమని నిర్ణయించినవాడై, అద్వయమగు స్వస్వరూపమును సాక్షాత్కరించుచు, పరతత్త్వ ప్రపూర్ణుడైన మహనీయాత్ముడు పరమగురువని తెలియవలెను.

అవ: తత్త్వజ్ఞుల భేదములు:

**మౌనీ వాగ్మీతి తత్త్వజ్ఞో ద్విధాఽభూచ్ఛృణు పార్వతి! ।**
**న కశ్చిన్మౌనినాం లోభో లోకేఽస్మిన్భవతి ప్రియే ॥** 295

మౌనీ - వాగ్మీ - ఇతి - తత్త్వజ్ఞః - ద్విధా - అభూత్ - శృణు - పార్వతి - న - కః - చిత్ - మౌనినాం - లోభః - లోకే - అస్మిన్ - భవతి - ప్రియే.

హే ప్రియే = ప్రియమగు నో పార్వతీ!, తత్త్వజ్ఞః = తత్త్వ జ్ఞానము గలవాడు, మౌనీ = మౌని, వాగ్మీ = వాగ్మి, ఇతి = అని, ద్విధా = రెండువిధములుగ, అభూత్ = ఆయెను, శృణు= వినుము, అస్మిన్ = ఈ, లోకే = ప్రపంచమునందు, మౌనినాం = ప్రపంచాతీతు లయిన నిర్విషయ నిర్వ్యవహారము గల మహాత్ములకు, కశ్చన = ఒకానొక, లోభః = అసక్తి ,న భవతి= లేదు.

బ్రహ్మతత్త్వజ్ఞానము గలవారు రెండువిధములుగ నున్నారు. ఓ పార్వతి! వినుము. సర్వేన్ద్రియవృత్తు లుపశమించి ప్రపంచప్రవృత్తి లేక యుండువారు మౌనులనియును, కేవలము పరబ్రహ్మమందు రమించు వారైనను మహాప్రజ్ఞతో లోకమునకు బోధించువారు వాగ్మ్మలనియును తెలియము. మఱియు మౌనులగు మునివరులకు నీ ప్రపంచముతోటి సమ్బన్ధము లేనందుచే నొకానొక ఆసక్తిగాని, సంకల్పముగాని ప్రపంచములో వారికి లేదు. ప్రపంచమును మరచి నివృత్తిస్థితిలోనే వారుందురు. వారు బోధించున దేమియు లేదు. వారి స్థితినిబట్టి మనమట్లు ప్రవర్తించవలసినదేగాని వేరుపాయము లేదు. అయితే వీరియొక్క దర్శనస్పర్శ నాదులచే ననేకులు తరింతురు. ఈ ద్వివిధ తత్త్వజ్ఞులకు స్వరూపభేద మేమియు లేదు. కాని మౌనులు కేవల నివృత్తిలోనే నిర్వికల్ప సమాధిలోనే యుందురు. వాగ్మ్మలు ప్రజ్ఞతో బోధింతురు. వీరు దృశ్యము శాశ్వతము గాదని నమ్మి దాని నంటకనే యుందురు.

అవ: మౌనియను తత్త్వజ్ఞుని స్వరూపము నిరూపిత మాయెను. ఇక వాగ్మియను తత్త్వజ్ఞునియొక్క స్వరూపమును నిరూపించుచున్నారు.

**వాగ్మీ తూత్కటసంసారసాగరోత్తరణక్షమః ।**
**యతోఽసౌ సంశయచ్ఛేత్తా శాస్త్రయుక్త్యనుభూతిభిః ॥ 296**

వాగ్మీ - తు - ఉత్కట సంసార సాగరోత్తరణక్షమః - యతః - అసౌ - సంశయచ్ఛేత్తా- శాస్త్రయుక్త్యనుభూతిభిః.

యతః = ఎందువలన, ఉత్కటసంసార సాగరోత్తరణక్షమః - ఉత్కట = భయంకరమైన,

అధికమయిన, సంసారసాగర = సంసారసముద్రముయొక్క, ఉత్తరణ = తరింప జేయుటయందు, క్షమః = సమర్థుడై, శాస్త్రయుక్త్యనుభూతిభిః = శాస్త్రము, యుక్తి, అనుభవము- వీనిచేత, సంశయచ్ఛేత్తా = సర్వసందేహములను ఛేదించువా డగుచున్నాడో, అసౌ తు = ఇట్టి మహాబోధకు డయితే, వాగ్మీ ఇతి = వాగ్మి అని తెలియవలెను.

వాగ్మి యనగా బోధకుడని యర్థము. మహాభయంకరమైన, అపారమయిన సంసారమను సముద్రమునుండి ఆర్తులను తరింపఁజేయుటయందు మహాసమర్థుడైనటువంటిన్ని, శాస్త్రప్రమాణములచేతను, యుక్తులచేతను, స్వానుభవముచేతను జీవబ్రహ్మైక్యము నందుగల సర్వసంశయములను దూరీకరించునట్టి మహనీయాత్ముడు వాగ్మి యని తెలియవలెను. పరోత్తరణమే వారి నైజమై యున్నది. అప్పుడు వారికి మహాసంతోషము. తామెంత కష్టము నయినను భరింతురుగాని యొకానొకజీవి తరించినచో నెంతగనో సంతోషింతురు. అనేకజన్మల నయినను ధరింతురు. అందులకై బద్ధకంకణులై యుందురు. అపారదయానిధులు, సర్వతన్త్ర స్వతన్త్రులు మాయను స్వాధీనము చేసికొని జన్మమెత్తి పరుల నుద్ధరింతురు.

**"ఆత్మా క్షేత్రజ్ఞసంజ్ఞో ఽయం సంయుక్తః ప్రాకృతైర్గుణైః ।**
**తై రేవ విగతశ్శుద్ధః పరమాత్మేత్యుదాహృతః ॥**

**జీవశ్శివశ్శివో జీవస్స జీవః కేవలశ్శివః ।**
**తుషేణ బద్ధో వ్రీహిస్స్యాత్ తుషాభావేన తండులః ॥**

**ఏవం బద్ధస్తథా జీవః పాశముక్తస్సదాశివః ।**
**పాశబద్ధస్తథా జీవః పాశముక్తస్సదాశివః ॥**

**"వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం"** ఇత్యాది శాస్త్ర ప్రమాణములచేతను, మట్టికుండ మొదలగు దృష్టాన్తములగు యుక్తులచేతను, ఆత్మానుభవముచేతను గురువరుడు తమ శిష్యులయొక్క సందేహములను పూర్తి చేయుచున్నాడు.

**ముఖ్యసారము:** గురుదేవు డొనరించు బోధ ఆత్మానుభవమునకును, శాస్త్ర ప్రమాణమునకును సరిపోవునదై యుక్తులతో గూడుకొనియుండవలయును. షడ్విధ ప్రమాణములతోను, షడ్విధలింగములతోనుగూడి నిశ్చయరూపమై యుండ

వలయును. శిష్యునకు గలుగు నపరోక్షజ్ఞానము నట్లే యుండవలయును. అప్పుడే సంశయములు నివృత్తములై అఖండజ్ఞానము నిశ్చయముగ దృఢముగ గలుగుచున్నది.

అవ: శ్రీగురునామ జపమహిమ:

**గురునామజపాద్దేవి! బహుజన్మార్జితాన్యపి ।**
**పాపాని విలయం యాన్తి నాస్తి సందేహమణ్వపి ॥ 297**

గురునామజపాత్ - దేవి - బహుజన్మార్జితాని - అపి - పాపాని - విలయం - యాన్తి - న - అస్తి - సందేహం - అణు - అపి.

హే దేవి = ఓ పార్వతిదేవీ, గురునామజపాత్ = శ్రీ గురుదేవుని నామస్మరణవలననే, బహుజన్మార్జితాని అపి = అనేక జన్మలనుంచి సంపాదింపబడిన వయినను, పాపాని = పాపములు, విలయం = నాశమును, యాన్తి = పొందుచున్నవి (ఈ విషయములో), సందేహం = సంశయము, అణుఅపి = అణుమాత్రముగూడ, నాస్తి = లేనేలేదు.

ఓ పార్వతీ ! శ్రీ గురుదేవుని నామజపమహిమను వినుము. 'గురు' అను నామమును జపించినంతమాత్రమున కొండలవలె నుండు పాపరాశు లన్నియు ననేకజన్మముల నుంచి యనుబంధము గలవైనను అగ్నిచే దూదియొక్క రాశులవలె దగ్ధము లగుచున్నవి. పాపమేఘములు గురునామజప ఝంఝా మారుతముచే ఛిన్నాభిన్నములై నశించిపోవుచున్నవి. ఈ విషయమునందు సందేహ మేమాత్రము వలదు. శ్రీ గురునామజపము అనాదిసంసార బన్ధకుఠారము, అజ్ఞానతమో భాస్కరము, జ్ఞానామృతనిష్యన్ది ప్రవాహము, కేవల సుఖస్వరూప గమకము.

అవ: శ్రీగురుదేవునియొక్క సర్వోత్కృష్టతను, సామర్థ్యమును నుడువుచున్నారు.

**శ్రీ గురోస్సదృశం దైవం శ్రీ గురోస్సదృశః పితా ।**
**గురుధ్యానసమం కర్మ నాస్తి నాస్తి మహీతలే ॥ 298**

శ్రీగురోః - సదృశం - దైవం - శ్రీగురోః - సదృశః - పితా - గురుధ్యానసమం - కర్మ - న - అస్తి - న - అస్తి - మహీతలే.

మహీతలే = భూప్రదేశమందు, శ్రీ గురోః = జ్ఞానసమృద్ధి గల శ్రీ గురుదేవునకు,

సదృశం = సమానమైన, దైవం = దైవము, నాస్తి = లేదు, శ్రీ గురోః = ప్రకాశమాన స్వరూపుడగు శ్రీ గురుదేవునకు, సదృశః = సమానుడైన, పితా = రక్షకుడు, నాస్తి = లేడు, గురుధ్యానసమం = శ్రీ గురుపరబ్రహ్మ ధ్యానమునకు సదృశ మయిన, కర్మ = కార్యము, నాస్తి = లేదు.

దైవమే సకలమునకు నాదిభూతుడై యాధారమై యున్నాడు. అట్టి దైవమే ప్రత్యక్షమగు గురుదేవుడై యున్నాడు. సర్వలోక రక్షకుడు, పితయు శ్రీగురునాథుడై యున్నాడు గురుపరబ్రహ్మధ్యానముకన్న వేరు నిష్కామకర్మ యోగము లేదు. కావున శ్రీ గురుపరమాత్మ కేవిషయములోను సమానమైనది యీ భూలోకమున లేనే లేదు. అంతయు శ్రీగురుపరబ్రహ్మమై యున్నది. అన్యశరణ్యము లేదు. శ్రీగురుదేవపాదారవిన్దమే సర్వలోకశరణ్యము శాంతికరము.

అవ: గురువొక్కడే సంరక్షించువాడని తెలుపుచున్నారు.

**కులం ధనం బలం శాస్త్రం బాన్ధవాస్సోదరా ఇమే ।**
**మరణే నోపయుజ్యన్తే గురురేకో హి తారకః ॥ 299**

కులం - ధనం - బలం - శాస్త్రం - బాన్ధవాః - సోదరాః - ఇమే - మరణే - న ఉపయుజ్యన్తే - గురుః -ఏక - హి - తారకః.

కులం = వంశము, ధనం = ధనము, బలం = దేహబలము, శాస్త్రం = శాస్త్రము, బాన్ధవాః = బన్ధువులు, సోదరాః = సహోదరులు, ఇమే = ఇవన్నియు, మరణే = మరణమునందు, న ఉపయుజ్యన్తే = ఉపయోగపడునవిగావు, ఏకః గురుః = గురువొక్కడే, తారకః = ఆ సమయమున తరింపజేయువాడు, హి = నిశ్చయము.

తాను మహోన్నత కులములో పుట్టినను, ఆ మహోన్నత వంశమున, మహాధనము గొప్పబలము, వ్యాకరణాది శాస్త్రములు, బన్ధువులు, సోదరులు, మిత్రులు- మొదలయిన వారెవ్వరును మృత్యుకాలమునందు తోడై రారు. అందుచేతనే " న హి న హి రక్షతి డుకృఞ్ కరణే" అని భజగోవిందము చెప్పుచున్నది. కాన వారిచే నేయుపయోగము నా సమయమునందు లభించదు. శ్రీగురుదేవు డొక్కడే అట్టి మృత్యుభయమును బాపి సంరక్షించ సమర్థు డగుచున్నాడు. వేరుగతి లేదు. అనగా తాను మహోత్తమ వంశములో పుట్టినను, మహైశ్వర్య సమ్పన్ను

డయినను, శారీరకబలము గలవాడైనను, వ్యాకరణాది శాస్త్రములంజదివి పండితుడైనను, సకలబంధువులు మిత్రులు మొదలగు వారితో గూడియున్నను ఏమియు ప్రయోజనము లేదు. ప్రాణపటుత్వము గలిగి యున్నప్పుడు వీరితో నెంతో ప్రయోజన ముండచ్చును. ధనాదులు తన్ను రక్షించునను గర్వముతో గూడి మెలంగిన వాడైనను, మృత్యుకాల మాసన్న మైనప్పుడు వానియందలి యాశచే కొట్టుకొనుచున్నాడు. తప్పించువారు లేక యేడ్చుచున్నాడు. వానిచే ఆ సమయమున నే యుపయోగమును లేకపోయెను. ప్రాణమున్నంతవరకు శాశ్వతములని నమ్మిన వస్తుజాలము రక్షించకపోయెను. కావున "సర్వం వ్యర్థం మరణసమయే సాంబ ఏకస్సహాయః" అన్నట్లు జ్ఞానముతో గూడిన మహేశ్వరు డయిన శ్రీగురుదేవుడే యవసానకాలమందు రక్షించుచున్నాడు. శ్రీ గురుబ్రహ్మస్మరణ మొక్కటియే సకల సంసారభయములను బాపి తరింపజేయుచున్నది. అదియే నిత్యము. జీవిత మున్నప్పుడే భగవంతుని స్మరింపవలయును.

**కృష్ణ త్వదీయపదపంకజపంజరాన్త:**
**అద్యైవ మే విశతు మానసరాజహంసః ।**
**ప్రాణప్రయాణసమయే కఫవాతపిత్తైః**
**కంఠావరోధనవిధౌ స్మరణం కుతస్తే ॥** - అని ముకుందమాల.

అవ: శ్రీగురుదేవునియొక్క మహిమను జెప్పుచున్నారు.

**కులమేవ పవిత్రం స్యాత్ సత్యం స్వగురుసేవయా ।**
**తృప్తాస్స్యుస్సకలా దేవా బ్రహ్మాద్యా గురుతర్పణాత్ ॥ 300**

కులం - ఏవ - పవిత్రం - స్యాత్ - సత్యం - స్వగురుసేవయా - తృప్తాః - స్యుః - సకలాః - దేవాః - బ్రహ్మాద్యాః - గురుతర్పణాత్.

స్వగురుసేవయా - స్వగురు = ఆత్మ గురువుయొక్క, సేవయా = శుశ్రూషచే, కులం ఏవ = కుల మంతయును, పవిత్రం = పునీత మైనదిగ, స్యాత్ = అగును, సత్యం = సత్యము, గురుతర్పణాత్ = శ్రీ గురుదేవుని సంతృప్తివలన, బ్రహ్మాద్యాః = బ్రహ్మదేవుడు మొదలుగా గల, సకలా దేహాః = సమస్త దేవతలును, తృప్తాః స్యుః = తృప్తు లగుచున్నారు.

ఆత్మజ్ఞు డయిన తనకు నాత్మతత్త్వమును నిస్సందిగ్ధముగ బోధించినట్టి

ఆత్మగురువరునియొక్క నిరన్తర శుశ్రూషచేతనే పరమభక్తుని వంశమంతయు మహాపావనమై భక్తిభరితమై జ్ఞానచేతో విరాజిత మగుచున్నది. సందియము లేదు. ఇదెంతేని సత్యము.

**షష్టిం కులాన్యతీతాని షష్టిమాగామికాని చ ।**
**కులాన్యుద్ధరతే ప్రాజ్ఞః ధన్యోఽసౌ గురుభక్తితః ॥**

"గురువును సేవించి పరమభక్తితో నుండుచు ప్రాజ్ఞుడయిన ధన్యాత్ముడు తత్క్షణముననే గడచిన 60 తరములవారిని, రాబోవు 60 తరములవారిని - అంతం 120 తరముల వంశీయుల నుద్ధరించుచున్నాడు" అని శాస్త్రప్రమాణము చెప్పుచున్నది. శ్రీగురుదేవుని శుశ్రూషజేసి శ్రీగురువును తృప్తిపరచినచో, శిష్యుని జ్ఞానవిశిష్టతను గాంచి గురువు సంతోషపడినచో, నట్టి శ్రీగురుదేవుని సంతర్పణ వలన, మూలమున జలసేచనము గావించిన వృక్షమంతయు సారముతో గూడినదై మొదలునుంచి శాఖాగ్రమువరకును చిగురించి కాయలుకాచి ఫలముల నొసంగు నట్లు, సకల బ్రహ్మాది దేవతలును సంతృప్తిని జెంది శ్రీగురుభక్తునకు సకలజ్ఞాన ఫలముల నొసంగుచున్నారు. ఇట్లు వచించుటచే వృక్షముకన్న చిగురుటాకులు, కొమ్మలు మొదలగున వేవిగాని వేరు గానట్లు శ్రీగురుదేవునికన్నను వేరుగా నే దేవతలును, బ్రహ్మ విష్ణు మహేశ్వరులును లేరు. అంతయు శ్రీ గురుస్వరూపమే. అట్టి శ్రీగురుపరమాత్మను సేవించిన, ధ్యానించిన, కీర్తించిన ధన్యు లగుచున్నారు. ఇదంతయు సత్యము.

అవ: శ్రీగురుదేవు డొక్కడే తత్త్వమార్గ దర్శకుడై జ్ఞాన మొసగుచున్నాడని తెలుపుచున్నారు.

**గురురేకో హి జానాతి స్వరూపం దైవమవ్యయమ్ ।**
**తద్జ్ఞానం యత్ప్రసాదేన నాన్యథా శాస్త్రకోటిభిః ॥ 301**

గురుః - ఏకః - హి - జానాతి - స్వరూపం - దైవం - అవ్యయం - తత్ - జ్ఞానం - యత్ప్రసాదేన - న - అన్యథా - శాస్త్రకోటిభి.

గురుః ఏకః = గురుదేవు డొక్కడే, అవ్యయం = నాశరహిత మయిన, దైవం స్వరూపం=

ప్రకాశమాన స్వస్వరూపమును (దైవ స్వరూపమును), హి = నిశ్చయముగ, జానాతి = తెలియు చున్నాడు, యత్ప్రసాదేన - యత్ = ఏ గురుదేవునియొక్క, ప్రసాదేన = అనుగ్రహముచేత, తత్ జ్ఞానం = ఆ అవ్యయమయిన, స్వస్వరూప దైవరూప జ్ఞానము (గలుగుచున్నదో), అన్యథా= శ్రీగురువరుని కృప లేకయు, శాస్త్రకోటిభిః = అనేకశాస్త్రములచేత, న = అట్టి జ్ఞానము గలుగదు.

పరబ్రహ్మతత్త్వమును దెలియ తానును పరబ్రహ్మస్వరూపుడుగా వల యును. శ్రోత్రియబ్రహ్మనిష్ఠుడే బాగుగా స్వయంప్రకాశమాన స్వస్వరూపమైన అవ్యయమైన దైవస్వరూపమును నిశ్చయముగ ననుభవ పూర్వకముగ దెలిసి స్వానుభూతిభూమా స్వరూపు డగుచున్నాడు. లెస్సగా జదివిన వానిదగ్గఱ జదువ వలయును. తదితరుల సమీపమున పఠించినచో నేమిగల్గును? కాలమును వృథా చేయుచున్నారు. అట్లే ఆత్మజ్ఞాని దగ్గఱనే శుశ్రూష పొందవలయును, శరణు పొందవలయును.

తదితరుల సన్నిధానముచే నేమి ప్రయోజనము? తాపశాంతి గలుగదు. తనయొక్క దాహము తీర్చుకొను శక్తిలేనివా డితరుల దాహతాప మడంపలేడు. కావున శ్రీగురువరుడే పరబ్రహ్మస్వరూపు డగుటచే శ్రీగురుపరమాత్మతత్త్వమును దెలియుచున్నాడు. అట్టి మహనీయాత్ముని యపారకరుణను సంపాదించుటచేతను అవ్యయమగు శాంతిరూపమగు స్వయంప్రకాశమాన స్వస్వరూపజ్ఞానము గలుగు చున్నది. అందుచే శాశ్వతానందము లభించుచున్నది. జడములగు శాస్త్రాధ్య యనములను కోట్లకొలదిగ జేసినను ఫలము లేదు. జ్ఞానవంతుడు గావలయుననిన శ్రీగురుదేవునే శరణుపొంది వారి దయను బడయవలయును. శ్రీగురుదేవుని స్వరూపము, వారి మహిమను వినుడు:

**ఆశ్రమీ ధ్యాననిరతః సంశయచ్ఛిత్ సుబుద్ధిమాన్ ।**
**నిత్యానుష్ఠానసంయుక్తస్త్వాచార్యః పరికీర్తితః ॥**

**ఆచారాద్విచ్యుతో విప్రో న వేదఫలమశ్నుతే ।**
**ఆచారేణ తు సంయుక్తస్సంపూర్ణఫలభాగ్భవేత్ ॥**

**యేన నారాధితో దేవో యస్య నో గుర్వనుగ్రహః ।**
**న వశ్యం హృదయం యస్య తస్య శాన్తిర్న సిద్ధ్యతి ॥**

శ్రీ గురుదేవుల యనుగ్రహము బడసి అన్తఃకరణశుద్ధి యయిన వానియొక్క హృదయములోనే ఆత్మజ్యోతి వెలిగి అజ్ఞానాంధకారము నశించి పరమశాంతి గలుగును. కనుక శ్రీగురుదేవుని యనుగ్రహమే పరతత్త్వమునకు గారణము.

అవ: తత్త్వజ్ఞానము లేకుండినచో నేమియు ప్రయోజనము లేదని తెలుపు చున్నారు.

**స్వరూపజ్ఞానశూన్యేన కృతమప్యకృతం భవేత్ ।**
**తపోజపాదికం దేవి సకలం బాలజల్పవత్ ॥ 302**

స్వరూపజ్ఞానశూన్యేన - కృతం - అపి - అకృతం - భవేత్ - తపోజపాదికం - దేవి - సకలం - బాలజల్పవత్.

హే దేవి = ఓ గిరిజాదేవీ, స్వరూపజ్ఞాన శూన్యేన - స్వరూపజ్ఞాన = తనయొక్క రూపమగు పరబ్రహ్మముయొక్క, జ్ఞాన = జ్ఞానముచే, శూన్యేన = రహితు డయినవానిచేత, సకలం = సమస్తమైన, తపోజపాదికం = తపస్సు, జపము, ధ్యానము మొదలయినవి, కృతం అపి = బాగుగా ననుష్ఠింపబడినను, బాలజల్పవత్ = బాలునియొక్క భాషితమువలె, అకృతం భవేత్ = చేయబడనిదిగనే యగును.

ఒకానొకడు పరీక్షలం దుత్తీర్ణుడైనను ఉద్యోగము దొరకి తత్ఫలిత మను భవింపకున్న, ధనవ్యయము చేసిన దంతయు వ్యర్థమగు చున్నది గదా. ఒకడాకలిచే పరితప్తుడై సామగ్రి నంతయు సమకూర్చుకొని, పచనము జేసియును, తాను భుజింపకున్న ఆకలి తీరునా, శాంతినొందునా ! అట్లే తపస్సు, ధ్యానము, వ్రతము, సమాధివరకు గల అష్టాంగయోగములు, ఈ పారాయణలు, స్తోత్రములు మొదలయినవి బాగుగా ననుష్ఠించినను, తాను బ్రహ్మజ్ఞానమును, పరమశాంతిని పొందుటకై యవన్నియు నాచరించినను, వానికి నాత్మజ్ఞానము గలుగనందుచే నవన్నియు బాలుడు ఎన్నివిధములుగ నపశబ్దము లుచ్చరించినను, గణనకు రాని యట్లు, లెక్కకు రాక చేయబడిన విధముగనే యగుచున్నవి. కాన జ్ఞానమే పరాకాష్ఠ, దానిచేతనే ముక్తి లభించుచున్నది.

శ్రోత్రియుండు వేదాధ్యయనము మాత్రము చేయుచున్నాడు. అట్లే వ్యాకరణాది శాస్త్రములను పఠించుచున్నాడు. అర్థము పూర్తిగా దెలియదు. దానిచే

ప్రయోజనము గలదా? ఏమి విషయ మనినచో తెలియదని సమాధాన మిచ్చుచున్నాడు. ఆతీరుననే స్వస్వరూప జ్ఞానము లేకుండిన అవివేకము మిగిలి అజ్ఞానము నశించదు. అయితే బాహ్యములగు తపోధ్యానాదులును బహిరంగసాధనలగుచున్నవి; చూడుడు. శబ్దము లేనిచో నర్థము వచ్చునా? తపోధ్యానాదులు లేనిచో, ప్రమిద వత్తి మొదలైనవి లేకున్న దీపజ్యోతి వెలుగనట్లు, ఆత్మజ్యోతి యగు జ్ఞానజ్యోతియు ప్రకాశించదు. ఈ విషయమును గూడ జ్ఞప్తియందుంచుకొనవలయును.

**సిద్ధార్థ మేమనగా-** జ్ఞానము గలిగినప్పుడే, జలము పడినప్పుడే బావిత్రవ్వుట సఫల మయినట్లు, సకలాభ్యాసములు వేదాధ్యయనాదులు శ్రీగురుశుశ్రూషాదులు ఫలవంతము లయినవని తెలియవలెను. తన గన్తవ్యమగు లక్ష్యమును జేరక గమనమునే చేయుచుండిన ప్రయోజనము లేదు. కావున లక్ష్యమగు పరబ్రహ్మ స్వరూపమును శ్రీ గురుదేవుని తత్త్వోపదేశముచే నిస్సందేహముగా దెలిసి ధ్యానాదులు గావింప వలయును. తప్పక జ్ఞానఫలము లభించును. దానియొక్క యనుభవముచే, నఖండామృత రసాస్వాదముచే సంతృప్తుడై అమరజీవి యగుచున్నాడు. శాశ్వతానందమును పొందుచున్నాడు. ఇందులకు భగవద్గీతా ప్రమాణము-

**" యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।**
**తదా గన్తాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥**
**యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే ।**
**తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥**

ఈ మొదలగు వాక్యములు పై విషయమునే తెలుపుచున్నవి.

అవ: శ్రీ గురుపరబ్రహ్మమే సర్వవ్యాపియనియు, నట్టి గురుపరమాత్మనే యుపాసింపవలయు ననియు వివరించుచున్నారు.

**శివం కేచిద్ధరిం కేచిత్ విధిం కేచిత్తు కేచన ।**
**శక్తిం దైవమితి జ్ఞాత్వా వివదన్తి వృథా నరాః ॥** **303**

శివం - కే - చిత్ -హరిం -కే - చిత్ - విధిం - కే - చిత్ - తు - కే - చన - శక్తిం - దైవం - ఇతి - జ్ఞాత్వా - వివదన్తి - వృథా - నరాః.

కేచిత్ = కొందఱు, శివం = మహేశ్వరుని, దైవం ఇతి = దైవమనియు, కేచిత్ = ఇక గొందఱు, హరిం = విష్ణుదేవుని, దైవం ఇతి = దైవమనియు, కేచిత్ తు = మఱికొందఱయితే, విధిం = బ్రహ్మదేవుని, దైవం ఇతి = దైవమనియు, కేచన = ఇతరులు కొందఱు, శక్తిం = పరాశక్తిని, దైవం ఇతి = దైవమనియు, జ్ఞాత్వా = ఆయా గురువుల ద్వారా తెలిసికొని ఉపాసించి, నరాః = మానవులు, వృథా = వ్యర్థముగా, వివదన్తి = వివాదమును జేసికొనుచున్నారు.

శైవులు శివునే దైవమునుగ నెంచి మా దేవుడే గొప్పవాడని చెప్పుచు నితర దేవతలను నిందించుచున్నారు. వైష్ణవులును విష్ణుదేవునే దైవమని తలంచి యుపాసించుచు వేరు దైవములను దూషించుచున్నారు. శాక్తేయులు మా పరాశక్తియే మహామహిమ గలదని ఆ శక్తిస్వరూపమునే దైవమని ఎంచి భిన్నదైవములందు పరాకుచేయుచున్నారు. ఈ ప్రకారము వారివారి దైవములు పెద్దవనియు, శ్రేష్ఠములనియు పలుకుచు సంకుచిత బుద్ధిగలవారై పరిచ్ఛిన్నులై వారిబుద్ధితో దేవుని నిర్ణయించుచు కొలుచుచు దేవునిగూడ పరిచ్ఛిన్నుని జేయుచు వాదించు చున్నారు. ఇదంతయు సర్వాన్తర్యామి యగు దేవుడొక్కడే యను జ్ఞానము లేకపోవుటచే గలుగునట్టి యనర్థములు; వేరుగాదు.

ఎవరికిని దేవుడొక్కడే. వారి బుద్ధితో నింతమాత్రమే యని గణించి అపరిచ్ఛిన్నునిగ, ప్రాకృత పురుషునిగ జేయుచున్నారు. ఇదియే గొప్పదగు దోషము. అందుచే వివాదములు పెరుగుచున్నవి. శివుని ఉపాసింతురు గాక, విష్ణువు నుపాసింతురు గాక, పరాశక్తిని ధ్యానింతురు గాక దోషము లేదు. వారివారి యిష్టదైవముల నుపాసించుచు దైవగుణములు గలిగి, భగవంతుడొక్కడే యన్ని రూపములుగ నున్నాడని తెలిసి, సమత్వబుద్ధితో మెలంగినచో అఖండజ్ఞానము గలుగుచున్నది. వాదములు నశించుచున్నవి. అట్టి అఖండజ్ఞానము నద్వైతము బోధించుచున్నది. అట్టి అద్వైతులందఱును శివవిష్ణ్వాదులకు నాధారభూతమగు పరబ్రహ్మమును నుపాసించి యథార్థతత్త్వమును పొందుచున్నారు; నామరూప రహిత శాశ్వతతత్త్వమును దెలిసి పరిపూర్ణులగు చున్నారు. అట్టి పరబ్రహ్మము యొక్క చైతన్యమే శివకేశవాదు లనియు తెలియవలెను.

**ముఖ్యార్థమేమనగా-** నేదేవు నుపాసించినను సర్వవ్యాపియనియు, పరిపూర్ణు డనియు, సచ్చిదానంద స్వరూపు డనియును బాగుగా తెలిసినచో అఖండా భేదజ్ఞానము గలుగుచున్నది. ఇట్టిదే గురుతత్త్వమని తెలియవలెను. అద్వయస్వరూప శ్రీ గురుపరబ్రహ్మను నుపాసించిన వారు నేభేదమును లేక జీవబ్రహ్మైక్యముగూడ గలిగి జ్ఞానమూర్తు లగుచున్నారు. ఇట్లాత్మజ్ఞానమహిమనుగూర్చి తెలిపిరని యెఱుంగవలయును.

**"యం శైవాస్సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాన్తినో**
**బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః ।**
**అర్హన్నిత్యథ జై నశాసనరతాః కర్మేతి మీమాంసకాః**
**సోఽయం వో విదధాతు వాఞ్ఛితఫలం త్రైలోక్యనాథో విభుః ॥"**

ఈ ప్రకార మాచైతన్య పరబ్రహ్మగురుస్వరూప మొకటియై ప్రకాశించుచున్నది.

అవ: బ్రహ్మజ్ఞానము లేనివాడు ద్విపాదపశు వనియే చెప్పవచ్చునని తెలుపు చున్నారు.

**న జానన్తి పరం తత్త్వం గురుదీక్షాపరాఙ్ముఖాః ।**
**భ్రాన్తాః పశుసమా హ్యేతే స్వపరిజ్ఞానవర్జితాః ॥ 304**

న - జానన్తి - పరం - తత్త్వం - గురుదీక్షాపరాఙ్ముఖాః - భ్రాన్తాః - పశుసమాః - హి - ఏతే - స్వపరిజ్ఞానవర్జితాః.

యే = ఎవరు, గురుదీక్షాపరాఙ్ముఖాః = శ్రీగురుదేవునియొక్క స్పర్శాది దీక్షా త్రయమందు విముఖు లయినవారై, పరంతత్త్వం = శ్రేష్ఠమగు గురుపరబ్రహ్మస్వరూపమును, న జానన్తి = తెలియక యుంటున్నారో, ఏతే = ఈ అవివేకులయిన, స్వపరిజ్ఞానవర్జితాః - స్వ= ఆత్మయొక్క, పరిజ్ఞాన = విశేషజ్ఞానముచేత, వర్జితాః = విడువబడినవారు, భ్రాన్తాః = భ్రాన్తిని జెంది సంసారారణ్యములో సంచరించుచున్నవారై, హి = నిశ్చయముగ, పశుసమాః = పశువులతో సమానులు (అగుచున్నారు).

స్పర్శదీక్ష, ధ్యానదీక్ష, దృగ్దీక్ష, మన్త్రదీక్ష- అను ఈదీక్షలలో నేదేని యొక దీక్షను శ్రీగురువుద్వారా గ్రహించక పరతత్త్వమును దెలియజాలడు. శ్రీ గురుదేవుని

భక్తిశ్రద్ధలతో సేవించి శ్రీగురుదీక్షను గైకొనవలయును. సూర్యోదయమునకు పూర్వమెట్లు అరుణోదయ ముంటున్నదో అట్లు శిష్యునకు జ్ఞానోదయమునకు ముందు గురుదీక్ష ముఖ్యావసరమైయున్నది. అరుణోదయము లేకుండిన భాస్కరోదయము గలుగనట్లును శ్రీగురుదీక్ష లేకుండిన జ్ఞానోత్పత్తి గాజాలదు. గురుదీక్షతో కూడనే జ్ఞానోదయము ప్రారంభ మగును. అయితే అరుణోదయ మగుచుండగా చీకటి నశించుచునే యున్నది, కాంతి ప్రసరించుచునే యున్నది. కట్టకడకు సూర్యుడు దేదీప్యమానుడై వెలుగుచున్నాడు. ఆ ప్రకారము శ్రీ గురుదేవుని పవిత్రసన్నిధానమున జేరి దీక్షను పొందినప్పుడే మూలాజ్ఞానము నశించును. క్రమముగా స్వస్వరూపజ్ఞాన ముదయించి మహాప్రవృద్ధమై మధ్యందిన ప్రచండ మార్తాండునివలె సర్వవ్యాపకమై చిదాకాశమం దఖండతేజో రూపమై భాసిల్లును.

అట్లుగాక శ్రీగురుదీక్షను పొందక, శ్రీగురుదేవు నుపాసించక యుండువాడు బ్రహ్మస్వరూపమగు నాత్మజ్ఞానానుభవము లేనివా డగుటచే పశుసదృశుడు. పశువేలాగున కర్మబద్ధమై అస్వతంత్రమై భయనిద్రాదులతో గూడుకొని సంచరించుచుండునో, జ్ఞానహీనుడును కర్మవశుడై భయనిద్రా సుఖాదులతో జేరుకొని సంసారాటవిలో భ్రమించుచున్నాడు. తనయొక్క గమ్యస్థానమును తెలియుట లేదు. తానెవ్వడనియు నెఱుంగుట లేదు. కావున నాత్మజ్ఞానము లేనివాడొక వన్యపశువని తెలియవలెను. జ్ఞానము లేనిచో పశువునకును తనకును భేదము లేదని తెలియవలెను. ఇందులకు ప్రమాణము-

**"అవిజ్ఞాతః పశుస్సో హి సృష్టిధర్మసమాశ్రితః ।**
**విజ్ఞాతశ్శాశ్వతశ్శుద్ధస్స శివో నాత్ర సంశయః ॥"**

జంతువుల సృష్టిధర్మము ననుసరించి జ్ఞానతత్త్వవిరహితుడు పశువు. ఆత్మతత్త్వము దెలిసిన మహానుభావుడు పరిశుద్ధుడు, పశుపతియగు సాక్షాదీశ్వరుడు. సందియము లేదు. ఈప్రకారము జ్ఞానముయొక్క ముఖ్యత్వమును దెలియవలెను. ఇది అన్తరంగసాధనము.

అవ: గురువునుగూర్చియు, జ్ఞానమునుగూర్చియు తిరుగా జెప్పుచున్నారు.

**తస్మాత్కైవల్యసిద్ధ్యర్థం గురుమేవ భజేత్ప్రియే! ।**
**గురుం వినా న జానన్తి మూఢాస్తత్పరమం పదమ్ ॥ 305**

తస్మాత్ - కైవల్యసిద్ధ్యర్థం - గురుం - ఏవ - భజేత్ - ప్రియే - గురుం - వినా - న- జానన్తి - మూఢాః - తత్ - పరమం - పదం.

తస్మాత్ = జ్ఞానమే ముఖ్యకారణము. ఆజ్ఞానము గురువుచేతనే లభించునను కారణమువలన, హే ప్రియే = ఓ పార్వతీ! గురుం ఏవ = శ్రీ సద్గురుమూర్తినే, భజేత్ = భజించవలయును, మూఢాః = మూఢులు, గురుం వినా = గురువు లేకపోయినచో, తత్ = ఆ దురవగాహనమగు, పరమం పదం = శ్రేష్ఠస్థానమైన పరబ్రహ్మతత్త్వమును, న జానన్తి = తెలియరు.

శ్రీగురువులేక ఆత్మజ్ఞానము గలుగదు. ఆ జ్ఞానము లేకుండిన మోక్షము లభించదు. కావున శ్రీ గురుదేవుని శరణుపొంది నిరంతరము భజించలయును. ఎంత పండితు లయినను బ్రహ్మజ్ఞానము లేకుండిన మూఢులనియు, అవి వేకులనియు, పామరులనియు వేదాంతశాస్త్రము చెప్పుచున్నది. పండితులనగా నాత్మతత్త్వజ్ఞానము గలవారని యర్థము. అందుచేతనే "పశ్యన్తి జ్ఞానచక్షుషః" "పశ్యన్తి సూరయః" అని ప్రయోగములు తత్త్వశాస్త్రములలో నున్నవి. పండితులే మూఢులనగా పామరుల విషయము జెప్పవలయునా? సామాన్య లౌకికవిద్యలకే గురువవసరమై యుండగా నిక నత్యంతదురవగాహమగు బ్రహ్మజ్ఞానమందు శ్రీగురుదేవు డవసరము లేకుండినచో నేమి తెలియగలరు? కావున శ్రీగుర్వను గ్రహము లేకుండినచో నీ జ్ఞానవిద్య పట్టువడదు. గమ్యమగు నాపరమపదమగు బ్రహ్మమును తెలియజాలరు. శ్రీగురుదేవునిచే జ్ఞానతత్త్వము నెఱింగి శిష్యులు తరించ వలయును. సందియము లేదు. ఇందులకు ప్రమాణము-

**సద్ధర్మశాసకో నిత్యం సదాచారనియోజకః ।**
**సంప్రదాయీ కృపాపూర్ణః విరాగీ గురురుచ్యతే ॥**

**ఉక్తలక్షణసమ్పన్నమాచార్యం సర్వవేదినమ్ ।**
**కర్మణా మనసా వాచా శివవత్పూజయేద్గురుమ్ ॥**

**పతిహీనా యథా నారీ మాతృహీనో యథా శిశుః ।**
**గురుహీనస్తథా ప్రాణీ తస్య జన్మ నిరర్థకమ్ ॥**

**తం త్యక్త్వా తాదృశం దేవం యస్సేవ్యేతాన్యదేవతామ్ ।**
**స హి భాగీరథీం త్యక్త్వా కాంక్షతే మృగతృష్ణికామ్ ॥**

సంప్రదాయానుసారముగ వచ్చినవాడును, ధర్మమును శాసించువాడును, దయాపూర్ణుడగు శ్రీ గురుదేవుని శివునివలె త్రికరణశుద్ధిగ పూజించవలెను. భర్త లేని స్త్రీలును, తల్లి లేని శిశువులును, గురువు లేని శిష్యులును శోభించరు. వారిజన్మ వ్యర్థము. మహామహిమసమ్పన్నుడై జ్ఞానవంతుడగు గురువును వదలి యితర దేవతలను సేవించుట దగ్గఱనున్న పవిత్ర గంగానదిని విడచి దూరములో నున్న యెండమావులను సేవించి నట్లగును. భ్రాన్తియే మిగులును. కావున ఆత్మజ్ఞాని యగు గురువును సేవించిన సర్వము సులభముగా లభించును.

అవ: శ్రీగురుదేవుని కరుణాదృష్టియొక్క మహిమను దెలుపుచున్నారు.

**భిద్యతే హృదయగ్రన్థిః ఛిద్యన్తే సర్వసంశయాః ।**
**క్షీయన్తే సర్వకర్మాణి గురోః కరుణయా శివే ॥** **306**

భిద్యతే - హృదయగ్రన్థిః - ఛిద్యన్తే - సర్వసంశయాః - క్షీయన్తే - సర్వకర్మాణి - గురోః - కరుణయా - శివే.

హే శివే = ఓ మంగళస్వరూపిణీ !, గురోః = పరబ్రహ్మస్వరూపుడగు శ్రీ గురుదేవునియొక్క, కరుణయా = అమృతమయ మగు కరణాదృష్టిచేత, హృదయగ్రన్థిః = హృదయముయొక్క వాసనారూపగ్రన్థి, భిద్యతే = భేదింపబడుచున్నది, సర్వకర్మాణి = సమస్తకర్మలు, క్షీయన్తే = నశించుచున్నవి, సర్వసంశయాః = సకల సందేహములు, ఛిద్యన్తే = ఛేదింపబడుచున్నవి.

"తస్మిన్దృష్టే పరావరే" అను చతుర్థపాదము మాత్రము వేరుగా నున్నది. మిగత అంతయు ముండకోపనిషత్తు. దీనియర్థమును వచించుచున్నారు. బహుకాలము శ్రీగురుదేవుని సన్నిధానమున నివసించి శుశ్రూష గావించు చున్నందుచే నపారకరుణామయదృష్టి శిష్యునిమీద ప్రసరించుచున్నది. ఆ

దయామయదృష్టి కేవలామృతమయము, సర్వసంతాపనాశకము. వర్షముచే దావానలము క్షణములో చల్లారునట్లు సంసారదావానల ముపశమించుచున్నది. ఆత్మజ్ఞానమను బడబాగ్ని సంసార సముద్రమును నిశ్శేషముగ పానమును జేయుచున్నది.

భూమిలో నున్న బీజము వర్షసేచనముచే భూమిని భేదించి, యంకురించి, పల్లవించి, మహావృక్షమై, పుష్పఫలములతో నొప్పారునట్లు; హృదయములో నున్న జ్ఞానబీజము శ్రీగురుదేవుని యందలి పరమభక్తి యను జలసేచనముచే హృదయభూమి మెల్లగా భేదింపబడుచున్నది. తరువాత మహావాక్యార్థవిచారణ యను పోషకద్రవ్యముచే నాత్మజ్ఞానమను వృక్షమనంతార్థ శాఖోపశాఖలతో నొప్పుచు నంతటను వ్యాపించుచున్నది. ఆనందఫలములతోను భరిత మగుచున్నది.

అనాదినుంచి హృదయమునం దజ్ఞానముచే నేర్పడినట్టి వాసనాగ్రంథి (ముడి) గురుకరుణచే భేదింపబడుచున్నది. సకల సంకల్పములు నశించుచున్నవి. జ్ఞానమను ఖడ్గముచే హృదయగ్రంథి నాశమగు చున్నదని భావము. తపోధ్యానాదుల చేత హృదయము లోని వృత్తులు నశించినందుచే, సూర్యోదయముచే పుండరీకము వికసించునట్లు, జ్ఞానోదయమై హృదయపుండరీకము వికసించుచున్నది. అందులో మాధుర్యము, పరిమళము, సుకుమారత్వము, మృదుత్వము, విశాలభావమను పరిమళము నేర్పడుచున్నవి. ఈ ప్రకారము జ్ఞానాగ్నిచే హృదయములోని పాపవాసన లన్నియు దగ్ధములై జ్ఞానతేజస్సు ప్రజ్వరిల్లుచున్నది.

ఆత్మతత్త్వ స్వరూపజ్ఞానమను హవిస్సుచే ప్రజ్ఞానమను హోమాగ్ని వృద్ధి నొందుచునే యుండును. ఇకను సకలసంశయములను నావరణములు భేదింప బడుచున్నవి. సూర్యుడు మేఘమండలముచే నావృత మైనను వాయువుచే ఛిన్నాభిన్నములుగ మేఘమండలము చేయబడి నప్పుడు సూర్యుడు ప్రకాశించు నట్లు, శ్రీగురుభగవంతుని కరుణాదృష్టియను వాతసంఘాతములచే సకలసంశయావరణలను మేఘము లన్నియు ఛిన్నాభిన్నములుగ చేయబడినవి. ప్రజ్ఞాన సూర్యోదయమైనది. సకల కర్మములను కట్టెలు జ్ఞానమను మహాగ్నిలో దగ్ధము లైనవి. ఈ ప్రకారము శ్రీ గురుదేవుని యపారమగు సర్వతేజోమయమగు

పరిపూర్ణమగు నానందస్వరూపమగు కరుణాదృష్టి హృదయగ్రంథి విచ్ఛేదకమై సర్వసంశయ నివర్తకమై సకలకర్మ ధ్వంసకమై అఖండజ్ఞానరూపమై ప్రకాశించు చున్నది. శ్రీ గురుదేవుని కరుణయను నొకటి లభించిన సమస్తాజ్ఞానపటలము ధ్వంస మైనదనియే, ఆనందప్రాప్తి గలిగినదనియే వచింపవలయును. గురు శబ్దార్థ మును విచారించిన శ్రీ గురుదేవుని మహిమ విస్ఫుట మగును. చూడుడు; శ్రుతి:

**"అవిద్యాహృదయగ్రంథి బంధమోక్షో భవేద్యతః ।**
**తమేవ గురురిత్యాహుః గురుశబ్దార్థవేదినః ॥"**

దీనియర్థము స్పష్టము.

**"యదా సర్వే ప్రభిద్యన్తే హృదయస్యేహ గ్రన్థయః ।**
**అథ మర్త్యోఽమృతో భవత్యేతావద్ధ్యనుశాసనమ్ ॥**

అను కఠోపనిషత్తు ప్రమాణము.

అవ: గురుభక్తుని విశేషము:

**కృతాయా గురుభక్తేస్తు వేదశాస్త్రానుసారతః ।**
**ముచ్యతే పాతకాద్ఘోరాత్ గురుభక్తో విశేషతః ॥** **307**

కృతాయాః - గురుభక్తేః - తు - వేదశాస్త్రానుసారతః - ముచ్యతే - పాతకాత్ - ఘోరాత్ - గురుభక్తః - విశేషతః.

గురుభక్తః = గురుభక్తుడు, వేదాశాస్త్రానుసారతః = వేదశాస్త్రములయొక్క అనుసరణమువలన, కృతాయాః = ఆచరింపబడిన, ఘోరాత్ = మహాభయంకరమగు, పాతకాత్ = అజ్ఞానమను మహాపాతకమునుండి (బ్రహ్మహత్యాది మహాపాతకముల నుండియు), విశేషతః = మిక్కిలి, ముచ్యతే = విడువబడుచున్నాడు.

తానెంతపాపబుద్ధి గలవాడైనను పుణ్యసంకల్పము గలిగినప్పుడు పాపము నకు వినాశ మేర్పడుచున్నదని తెలియవలెను. ఆరణ్యములో నొక్కప్రక్కన దావాగ్ని ప్రజ్వరిల్లు చుండినచో నాయరణ్యము క్రమముగా దగ్ధమగునట్లు ఎంచవలెను. దూదిరాశికి నగ్నిసంబంధము గలిగిన వెంటనే యది దహింప బడుచున్నది. ఇట్లు

వారివారి యంతఃకరణము ననుసరించి పాపనాశము గలుగుచున్నదని యెంచ వలెను. శ్రీ గురుదేవుడు ప్రత్యక్షదేవుడు గనుక వారిని శరణుజొచ్చినచో, తన పాపబుద్ధుల నన్నిటిని కనిపెట్టి శిక్షించి పరిశుద్ధునిగా జేయుచున్నాడు. ఆ ప్రకార మిష్టదైవ మైనను జేయునా! మనస్సులో నాలోచించు కొనుడు. గురువే దైవము. అట్టి గురువుదగ్గరకు శిష్యుడు పాపము నశించు చున్నందుచేతనే చేరుచున్నాడు. అంతమాత్రముచేతనే సకల భయంకర పాపములు నశించుచున్నవి.

హృదయక్షేత్రము పరిశుద్ధమైనది. విషయసంకల్పము లంకురింపవు. అయితే మిగిలినది జ్ఞానాంకురోద్భేదము. అజ్ఞాన భూమి విదారణము. అజ్ఞానమను నదియే సకల పాపబుద్ధికి మూలకారణము గనుక అదియే మహాఘోరపాతక మనబడు చున్నది. ఇట్టి యజ్ఞానమహాఘోర పాపము నుండి గురువుచే శిక్షితు డగుచున్నందుచే గురుభక్తుడు పరమభక్తియొక్క ప్రాబల్యమువలన వేదశాస్త్ర సారమైన శరణాగత రూపప్రపత్తివలన శీఘ్రముగా విడువబడుచున్నాడు. స్వస్వరూపజ్ఞానముచే ముక్తు డగుచున్నాడు. ఇదియే పరమభక్తి యొక్క పరమప్రయోజనమని యెరుంగవలెను.

అవ: గురూపదేశదీక్షకు నధికారిని నిరూపించుచున్నారు.

**దుస్సంగం చ పరిత్యజ్య పాపకర్మ పరిత్యజేత్ ।**
**చిత్తచిహ్నమిదం యస్య తస్య దీక్షా విధీయతే ॥308**

దుస్సంగం - చ - పరిత్యజ్య - పాపకర్మ - పరిత్యజేత్ - చిత్తచిహ్నం - ఇదం - యస్య- తస్య - దీక్షా - విధీయతే.

దుస్సంగం = దుష్టసాంగత్యమును, పరిత్యజ్య = వదలి, పాపకర్మ చ = పాపాచరణము నుగూడ, పరిత్యజేత్ = విసర్జించవలయును (పాపబుద్ధిని పూర్తిగా నశింపజేయవలయును), ఇదం = ఈ, చిత్తచిహ్నం = పరిశుద్ధమనస్సుయొక్క గుఱుతు, యస్య = ఎవరికి గలుగునో, తస్య = వానికే, దీక్షా = గురుమన్త్రదీక్ష, విధీయతే = విధింపబడుచున్నది.

మొదట మానవుడు దుష్టుల సాంగత్యముచేత దుర్విషయములలో ప్రవేశించుచున్నాడు. "సహవాసదోషేణ గుణా భవన్తి" అను వాక్యానుసారముగా సహవాసముచే దుర్గుణములు గలుగుచున్నవి. అందుచే నేమియు తెలియక అట్లాచరించుటయే శుభమని యానందమని తలంచి హింసాకృత్యములను

జేయుచున్నాడు. "హసతా క్రియతే కర్మ రుదతా చానుభూయతే " అన్నట్లు నవ్వుచు నెట్టి పాపకర్మనైనను జేయుచున్నాడు. తరువాత నేడ్చుచు ననుభవించు చున్నాడు.

**"పుణ్యస్య ఫలమిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః ।**

**న పాప ఫలమిచ్ఛన్తి పాపం కుర్వన్తి మానవాః"॥** అను విధముగ పుణ్య ఫలమగు సుఖమును గోరుచున్నారు కాని పుణ్యకర్మలను జేయురు. పాపముయొక్క ఫలమగు దుఃఖమును గోరరుకాని పాపమునుమాత్రము చేయుచునే యున్నారు.

ఇదంతయు దుష్టసంగమమువలననే సులభముగ పట్టుబడుచున్నది. సజ్జనసాంగత్యము సత్కర్మలు సులభములు గావు. మఱియొక యర్థమేమనగా, దుర్వృత్తులలో పడద్రోయ దుర్మానసేన్ద్రియాదులు జన్మజన్మలనుంచి వెనువెంటనే వచ్చుచున్నవి. జీవుని దుఃఖములపాలు చేయుచున్నవి. ఇది దుష్టసంగమమే యగును. సద్వృత్తులతో నున్న నిర్మలమానసేన్ద్రియాదుల సహవాసము దుర్లభము. కావున దుష్టుల సహవాసము మాని పాపపుపనులనుగూడ పూర్తిగా వర్జింప వలయును. ఇదియే చిత్తముయొక్క పరిశుద్ధికి చిహ్న మగుచున్నది.

పాపబుద్ధినిగూడ నిశ్శేషముగా నశింపజేయవలయును. అట్లే దుష్టములగు మానసేంద్రియముల సంగమము మానివేయవలయును. సుప్రసన్నములగు దయాశాంత్యాదులతో గూడిన నిర్మల చిత్తేన్ద్రియములతో సహవాసము జేయ వలయును. "ప్రక్షీణాశేషపాపానాం జ్ఞానే ధ్యానే భవేన్మతిః" అన్నట్లు పాపనాశ మగునప్పుడు జ్ఞానసంపాదనయందును, ధ్యానమందును బుద్ధి ప్రవర్తించును. అనగా దుష్టబుద్ధిని వదలుటయే చిత్తపారిశుద్ధ్యచిహ్న మగుచున్నది. ఇట్టి యన్తః కరణవృత్తుల నుపశమింపజేయ తలంపుగలవాడే గురూపదేశార్హుడు. శ్రీగురువు దగ్గఱ మన్త్ర దీక్షను గైకొన నర్హు డగుచున్నాడు. అట్టి వానికే మంత్రదీక్ష నొసంగ వలయును. ఆకలి గొన్నవానికి నాహార మమృతమువలె నుండును. భోజనము లేక జీవింప జాలడు. ఆ ప్రకారము పుణ్యబుద్ధి గలవాడు తరణోపాయమగు శ్రీగురుమన్త్ర దీక్ష లేక యుండజాలడు. కావున పవిత్రబుద్ధి జనించిన వానికి

గురుమన్త్రోపదేశము తగినదని వేదాంతశాస్త్రములు వచించుచున్నవి. ఇదే విషయమును

**సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వమ్ ।**
**నిర్మోహత్వే నిశ్చలతత్త్వం నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః ॥**

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులు భజగోవిందములో తెలిపియున్నారు.

**తపోభిః క్షీణపాపానాం శాన్తానాం వీతరాగిణామ్ ।**
**ముముక్షూణామపేక్ష్యోఽయమాత్మబోధో విధీయతే ॥**
**ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా ।**
**మహాభయపరిత్రాణాత్ ద్విత్రాణాముపజాయతే ॥**

ఇట్టివారికే శ్రీగురూపదేశార్హత యని తెలియవలెను.

అవ: దీక్షాధికారిత్వమునే నిరూపించుచున్నారు.

**చిత్తత్యాగనియుక్తశ్చ క్రోధగర్వవివర్జితః ।**
**ద్వైతభావపరిత్యాగీ తస్య దీక్షా విధీయతే ॥** **309**

చిత్తత్యాగనియుక్తః - చ - క్రోధగర్వవివర్జితః - ద్వైతభావపరిత్యాగీ - తస్య - దీక్షా - విధీయతే.

యః = ఎవడు, చిత్తత్యాగనియుక్తః - చిత్తత్యాగ = చిత్తనాశనమునకై, నియుక్తః = మిక్కిలి యోగముతో కూడుకొన్నవాడును, క్రోధగర్వవివర్జితః = కోపదర్పములచే విడువబడినవాడును, ద్వైతభావపరిత్యాగీ = భేదభావమును పరిత్యజించినవాడును (అగుచున్నాడో), తస్య = అట్టి పవిత్రాత్మునకు, దీక్షా = గురుమన్త్రదీక్ష, విధీయతే = విధింపబడుచున్నది.

ఏ ముముక్షువు మనోనాశనమును వాసనాత్యాగమును జేయదలంచినవాడై, కామక్రోధాదులు లేక పరమశాంతిని వహింప నిచ్ఛగించినవాడై, జీవేశ్వరుల యొక్కయు జగత్ పరబ్రహ్మలయొక్కయు భేదభావమును వర్జింపదలంచినవాడై, దృశ్య నాశనమును కోరి యఖండాద్వితీయ పరబ్రహ్మమునకై ఆత్మానుసంధానము వాంఛించుచున్నాడో, అనగా సాధనచతుష్టయ సంపత్తి గలవాడో అతడే మహామన్త్రోపదేశదీక్షకు దగియున్నాడు. అట్టివానికే శ్రీగురుదేవునియొక్క జీవబ్రహ్మైక్య

ప్రతిపాదక మహావాక్యార్థోపదేశ రూపదీక్షను వేదాన్తశాస్త్ర ముపదేశించుచున్నది. కావున ననాత్మభావనను దూరీకరింప దలంచినవాడు శ్రీగురు వొసంగిన దీక్ష యందు సుస్థిరుడు కావలయును. దీక్షయనగా తాను దలంచిన కార్యము పూర్తి యగువరకు నితరవిషయములలో మనస్సును పోనీయక తదేకనిష్ఠతో నుండుట యని తెలియవలెను. శిష్యలక్షణము శాస్త్రములలో వచించినది చూడుడు:

**విధ్యుక్తకర్మసంయుక్తః కామసంకల్పవర్జితః ।**
**యమైశ్చ నియమైర్యుక్తః సర్వసంగవివర్జితః ॥**
**కృతవిద్యో జితక్రోధః సత్యధర్మపరాయణః ।**
**గురుశుశ్రూషణరతః పితృమాతృపరాయణః ॥**
**స్వాశ్రమస్థస్సదాచారో విద్వద్భిశ్చ సుశిక్షితః ॥** -ఇట్లు సూతసంహిత.

అవ: గురుమన్త్రోపదేశార్హత:

**ఏతల్ల క్షణయుక్తత్వం సర్వభూతహితే రతమ్ ।**
**నిర్మలం జీవితం యస్య తస్య దీక్షా విధీయతే ॥** **310**

ఏతల్లక్షణయుక్తత్వం - సర్వభూతహితే - రతం - నిర్మలం - జీవితం - యస్య - తస్య - దీక్షా - విధీయతే.

ఏతల్లక్షణయుక్తత్వం = ఈ ముందు చెప్పబడిన వైరాగ్యాదులతో కూడుకొని యుండుటయు, సర్వభూతహితే = సకల భూతములయొక్క హితమునందు, రతం = ఆసక్తమైన, నిర్మలం = నిర్మలమైన, జీవితం = ప్రవర్తనయున్న, యస్య = ఎవనికి (గలవో), తస్య = అట్టి ముముక్షువునకు, దీక్షా = గురుమన్త్రదీక్ష, విధీయతే = విధింపబడుచున్నది.

ఎవడు సకల దుస్సంకల్పములను వదలి పాపకర్మలను చేయనివాడై, క్రోధాదిరహితుడై, ద్వైతభావమును వదలవలయునను తలంపుతో నున్నవాడై యుంటున్నాడో, మరియు పై లక్షణములతో గూడుకొని యెవనియొక్క జీవిత మంతయు సకల భూతహితముకొరకు వినియోగింపబడి నిర్మల మగు చున్నదో అట్టి పరిశుద్ధాన్తరంగము గలవానికి శ్రీ గురుమన్త్రోపదేశదీక్షను శాస్త్రములు విధించు చున్నవి. యోగ్యు డగువానికి నొసంగిన విద్యయే శోభించు చున్నది.

**పరిపక్వం మనో యేషాం కేవలోఽయం చ సిద్ధిదః ।**
**గురుదైవతభక్తానాం సర్వేషాం సులభో జవాత్ ॥**

ఎట్టివారు జ్ఞానార్హులో భగవద్గీతను చూడుడు-

**వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।**
**బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥**

**తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।**
**వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥**

ఇంద్రియములను నిగ్రహించినవానికే శ్రీ గురుదీక్ష సుస్థిర మగును.

అవ: ఇప్పుడు మన్త్రదీక్షను గురించిన విషయమును పూర్తిచేయుచున్నారు.

**క్రియయా చాన్వితం పూర్వం దీక్షాజాలం నిరూపితమ్ ।**
**మన్త్రదీక్షాభిధం సాంగోపాంగం సర్వం శివోదితమ్ ॥** **311**

క్రియయా - చ - అన్వితం - పూర్వం - దీక్షాజలం - నిరూపితం - మన్త్ర దీక్షాభిధం- సాంగోపాంగం - సర్వం - శివోదితం.

క్రియయా = అనుష్ఠానవిధానముతో, అన్వితం చ = కూడినదియున్ను, సాంగో పాంగం= అంగ ఉపాంగములతో గూడినదియును, మన్త్రదీక్షాభిధం = మన్త్రదీక్షయను పేరు గలదియును, శివోదితం - శివ = శివుడగు నాచేత, ఉదితం = చెప్పబడినదియు నగు, దీక్షాజాలం = దీక్షయొక్క సముదాయము, నిరూపితం = నిరూపింపబడెను.

మన్త్రదీక్షయొక్క జపవిధానము, జపస్థానములు, ఆసనములు, అధిష్ఠాన దేవత, మన్త్రచైతన్యము - ఇవి మొదలుగా గల ప్రధానమగు అంగములతోను, ఉపాంగములతోను గూడిన మంత్రదీక్షకు సంబంధించిన విషయము లన్నియు ఓ పార్వతీ! నాచే చెప్పబడినవి. బాగుగా నిరూపితము లైనవి. ఈ మన్త్రదీక్షనే భ్రమరకీటక న్యాయము ననుసరించి సోఽహం భావమగు నజపాయన్త్రదీక్షనుగా శాస్త్రములు వచించుచున్నవి. ఇకను నీ జపవిధానము ముఫ్విధములుగ నున్నది; చూడుడు:

**"ఉత్తమం మానసం జాప్యముపాంశుర్మధ్యమం స్మృతమ్ ।**
**అధమం వాచకం ప్రాహుస్సర్వమన్త్రేషు వై ద్విజాః ॥"**

ఇది సామాన్యజపము. ఉత్తమోత్తమజపమును వినుడు:

**క్షణం బ్రహ్మాఽహమస్మీతి యః కుర్యాదాత్మచిన్తనమ్ ।**
**స సర్వపాతకం హన్తి తమస్సూర్యోదయే యథా ॥**

ఇట్లు మన్త్రదీక్షావిషయమును దెలియవలెను.

అవ: గురుదీక్ష లేకపోయిన గురుత్వము శోభించదనియు, అర్హుడు గాడనియు తెలుపుచున్నారు.

**క్రియయా స్యాద్విరహితం గురుసాయుజ్యదాయినీమ్ ।**
**గురుదీక్షాం వినా కో వా గురుత్వాచారపాలకః ॥ 312**

క్రియయా - స్యాత్ - విరహితం - గురుసాయుజ్యదాయినీమ్ - గురుదీక్షాం - వినా- కః - వా - గురుత్వాచారపాలకః.

క్రియయా = క్రియచేత, విరహితాం = శూన్యమైనదియు (నైష్కర్మ్యరూప మైనదియు), గురుసాయుజ్యదాయినీమ్ = గురుదేవునియొక్క ఏకత్వరూపమగు ముక్తి నిచ్చునదియు నగు, గురుదీక్షాం వినా = గురుదీక్షను వదలి, కో వా = ఎవడు, గురుత్వాచారపాలకః స్యాత్ = గురుత్వమను ఆచారమును పాలించు వాడగును?

గురుదీక్ష యనగా జీవబ్రహ్మైక్య రూపజ్ఞానదీక్ష నొసగుట యగును. అది క్రియారహిత మైనది. గురుపరబ్రహ్మ సాయుజ్యము నొసగునది. గురువుతో నైక్యము చేయునది. ఇట్టి గురుదీక్ష లేకుండిన గురుత్వమను ఆచారమును సంరక్షించువాడు కాజాలడు. ఇది సర్వదీక్షలకంటె శ్రేష్ఠమైన జ్ఞానదీక్ష యగును. ఇట్టివాడే యథార్థమగు పరమగురువు; శిష్యులకు జ్ఞానదీక్ష నొసగి రక్షంప సమర్థుడు.

**శివోఽన్యస్స్యహమేవాన్యః పృథగ్భావం వివర్జయేత్ ।**
**యశ్శివస్సోఽహమేవేతి అద్వైతం భావయేత్సదా ॥**

ఇదియే యథార్థమగు గురువుచే నొసగబడు జ్ఞానదీక్ష యగును. ఇట్లు దీక్షా నిరూపణము సమాప్త మాయెను.

అవ: గురుపాద సమాశ్రయణ మహిమ:

**శక్తో న చాపి శక్తో వా దైశికాంఘ్రిం సమాశ్రయేత్ ।**
**తస్య జన్మాస్తి సఫలం భోగమోక్షఫలప్రదమ్ ॥ 313**

శక్తః - న - చ - అపి - శక్తః - వా - దైశికాంఘ్రిం - సమాశ్రయేత్ - తస్య -జన్మ - అస్తి - సఫలం - భోగమోక్షఫలప్రదం.

భోగమోక్షఫలప్రదం = భుక్తి ముక్తి ఫలముల నొసంగు, దైశికాంఘ్రిం = శ్రీ గురుస్వామి పాదారవిన్దమును, శక్తః వా = శక్తుడయినను, న శక్తః అపి = శక్తుడు గాకపోయినను, సమాశ్రయేత్ = మిక్కిలి యాశ్రయించవలెను. భక్తిప్రపత్తులతో శరణు చొచ్చవలెను, తస్య = శరణాగతు డయిన పరమభక్తునియొక్క, జన్మ = జన్మము, సఫలం = ప్రయోజనముతో గూడినదిగ (సార్థక మయినదిగ), అస్తి = అగుచున్నది.

పురుషుడు జన్మించినందులకు శక్తుడైనను, నశక్తుడైనను, సకల సుఖముల నొసంగు అనగా మహాదుఃఖమయమగు సంసారములో మిగుల సుఖమును గలుగజేయు, మరియు భుక్తిని ముక్తిని నొసంగు శ్రీ గురుచరణారవిన్దములను సమాశ్రయించవలెను. భక్తితో వినమ్రుడై శరణాగతుడు కావలయును. వేరు మార్గము లేదు. సాభిమాని యయినచో సంసారసముద్రమును దాటలేడు. ప్రమాణము:

**కర్ణధారం గురుం ప్రాప్య తద్వాక్యం ప్లవవద్దృఢమ్ ।**
**అభ్యాసవాసనాశక్త్యా తరంతి భవసాగరమ్ ॥**

శ్రీగురుదేవుడే నావను నడుపువాడు. వారి యుపదేశమే ఓడగా నున్నది. శరణాగతుడై శ్రీ గురువాక్యము నభ్యసించినచో సులభముగ భవతరణమును పొందుచున్నాడు. ఆ ప్రకారము గురువు నాశ్రయించిన వాని జన్మము జ్ఞానప్రాప్తిని బడసినందుచే సార్థక మగుచున్నది. కావున భవార్ణవతరణమును గోరువారికి శ్రీ గురుపాదారవిన్దము దృఢనౌకగా నున్నది. శ్రీ గురుసమాశ్రయణముచే గలుగు ప్రయోజనమును గాంచుడు:

**"సదాయురారోగ్యమపారమూర్తిం విద్యాం యశస్స్వర్గసుఖం చ మోక్షమ్।**

**ఫలాని సర్వాణి నరస్సమాప్తుం కథం సమర్థో గురుణా విహీనః ॥"**

అన్ని ఫలములును శ్రీ గురుకరుణచే గలుగుచున్నవి.

అవ: అధికారిని గురించియే చెప్పుచున్నారు.

**అత్యన్తచిత్తపక్వస్య శ్రద్ధాభ క్తియుతస్య చ ।**
**ప్రవక్తవ్యమిదం దేవి! మమాత్మప్రీతయే సదా ॥ 314**

అత్యన్తచిత్తపక్వస్య - శ్రద్ధాభ క్తియుతస్య - చ - ప్రవక్తవ్యం - ఇదం - దేవి - మను - ఆత్మప్రీతయే - సదా.

హే దేవి = ఓ పార్వతీదేవీ !, ఇదం = ఈ గురుగీతాశాస్త్రము, అత్యన్త చిత్తప క్వస్య=మాలిన్యము నశించి పరిశుద్ధమై జ్ఞానయోగ్యమగు మనఃపక్వము గల, శ్రద్ధాభక్తియుతస్య= శ్రద్ధాభక్తులతో గూడినట్టి పవిత్రాత్మునకు, మమ = నాయొక్క, ప్రీతయే= సంతృప్తికొఱకు, సదా = ఎల్లప్పుడు, ప్రవక్తవ్యం = చెప్పదగినది.

ఓ పార్వతీ! మలినవృత్తులు నశించి పరిశుద్ధమగు మనఃపక్వము గలిగి శ్రద్ధాభక్తులతో గూడినవాని కీగురుగీతాతత్త్వము బాగుగా బోధించవలయును. క్షేత్రము రాళ్లు కంపలు మిట్టపల్లములు లేక శుద్ధమయినచో నందులో విత్తిన విత్తనము సఫల మగును. అట్లే వేదాంత జ్ఞానబీజము వీతరాగ హృదయక్షేత్రమందే ప్రయోజనవంత మగుచున్నది. అట్టివారికి బోధించినందుచే జ్ఞాన మభివృద్ధి యగును కాన అంతకన్న సంతోషము ప్రీతికరమైన కార్యము మఱియొకటి లేదు. భక్తులందఱు తాము తరించిన చాలదు. అనేక నిర్మలాత్ములకును గురుగీతా తత్త్వమును దెలిపినచో నేను నిత్యమానందభరితు డనదగును. ఈ విషయమునే భగవద్గీతయు చెప్పుచున్నది-

**"య ఇమం పరమం గుహ్యం మద్భ క్తేష్వభిధాస్యతి ।**
**భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః ॥**

**న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః ।**
**భవితా న చ మే తస్మాదన్యః ప్రియతరో భువి ॥**

ఇట్టి విశాలభావముతో పరమభక్తు లుందురని తెలియవలెను.

అవ: ఈ శ్రీగురుగీతా తత్త్వమును బోధించు విషయమును తెలుపుచున్నారు.

**రహస్యం సర్వశాస్త్రేషు గీతా శాస్త్రమిదం శివే ।**
**సమ్యక్ పరీక్ష్య వక్తవ్యం సాధకస్య మహాత్మనః ॥ 315**

రహస్యం - సర్వశాస్త్రేషు - గీతాశాస్త్రం - ఇదం - శివే - సమ్యక్ - పరీక్ష్య - వక్తవ్యం - సాధకస్య - మహాత్మనః.

హే శివే = ఓ మంగళస్వరూపిణీ, సర్వశాస్త్రేషు = సకల జ్ఞానశాస్త్రములందును, రహ్యసం = పారమయిన, ఇదం = ఈ, గీతాశాస్త్రం = గురుగీతాశాస్త్రము, మహాత్మనః = పవిత్రాత్ముడగు, సాధకస్య = ముముక్షువునకు, సమ్యక్ = బాగుగా, పరీక్ష్య = ఆలోచించి, వక్తవ్యం = చెప్పదగినది.

లోకములో ననేకములగు గీతాశాస్త్రము లున్నవి. అయినను నిది సద్యః జ్ఞానము నొసంగున దగుటచే వానినన్నిటిలోను సారవత్తమ మైనది. కాన మిక్కిలి పరిశుద్ధాత్ముడై ఆర్తిని జెందిన జిజ్ఞాసునకును వాని యోగ్యతను బాగుగా పరీక్షించియే యొసంగవలయును. అపాత్రునికి నొసంగిన విద్య ప్రకాశించదని భావము. బురదలో పన్నీరు చల్లిన ప్రయోజనము లేనట్లు పాపపంకిలమగు హృదయమున జ్ఞానపరిమళద్రవ్యము చెడిపోవును. ఈ విషయమునకు ప్రమాణము:

**"అశిష్టాయావిరక్తాయ యత్కించిదుపదిశ్యతే ।**
**తత్ప్రయాత్యపవిత్రత్వం గోక్షీరం శ్వదృతావివ ॥"**

పరిశుద్ధమగు మంత్రమయినను శుచి, ఆచారము లేనివారి కుపదేశించినచో, ఆ మంత్రము పవిత్ర గోక్షీరమును కుక్కయొక్క చర్మమందు పోసినచో నెట్లపవిత్రమై పోవునో, నా ప్రకార మపవిత్రతను జెంది ప్రకాశించక పోవుచున్నది. అగ్ని ప్రజ్వలించు స్వభావము గలదయ్యును జలసేచనముచే చల్లారిపోవుచున్నది. ఆప్రకారము మన్త్రము మహాపవిత్ర మైనదైనను, అపవిత్రత, ఆచారణశూన్యత యను సలిల స్పర్శముచే నిర్వీర్య మగుచున్నది. కాన పవిత్రాత్మునకు నొసంగవలయును.

అప్పుడు మన్త్రశక్తి ప్రతిబంధరహిత మణివలె ప్రకాశించును.

అవ: గురుగీతా ప్రయత్న కారణము:

**సత్కర్మపరిపాకాచ్చ చిత్తశుద్ధిశ్చ ధీమతా ।**
**సాధకస్యైవ వక్తవ్యా గురుగీతా ప్రయత్నతః ॥ 316**

సత్కర్మపరిపాకాత్ - చ - చిత్తశుద్ధిః - చ - ధీమతా - సాధకస్య - ఏవ - వక్తవ్యా - గురుగీతా - ప్రయత్నతః.

ధీమతా = పరిశోధనా బుద్ధిగల గురువరునిచేత, సత్కర్మపరిపాకాత్ = అనేక పుణ్యకర్మలయొక్క ఫలమువలన, చిత్తశుద్ధిః = అన్తఃకరణశుద్ధి (ఎవనికి గలుగుచున్నదో) అట్టి, సాధకస్యైవ = ముముక్షువునకే, ప్రయత్నతః = మిగుల నాదరముతో, గురుగీతా = గురుగీత, వక్తవ్యా = బోధించవలయును.

ఆత్మజ్ఞానోపదేశము చిత్తశుద్ధి గలవారికే యోగ్యమని వేదాంతశాస్త్ర నిర్ణయము. కనుక. ఈ గురుగీతా శాస్త్రము కేవలము జ్ఞానమునే ముఖ్యముగ బోధించు చున్నందున చిత్తముయొక్క పారిశుద్ధ్యము గలిగి పరమభక్తి గల ముముక్షువునకే యీ గురుగీతాతత్త్వ ముపదేశింప వలయును. అట్టివారికి తత్త్వమును దాచక మిగుల ఆదరముతో వచింప వలయును. ఇట్లనుటచే నిష్కామకర్మయోగముచే నన్తఃకరణశుద్ధిని, భక్తియోగముచే నిర్మల నిశ్చల చిత్తత్వమును సంపాదించి ఈ గురుగీతాశాస్త్ర తత్త్వమును (శ్రీ గురుపరబ్రహ్మ తత్త్వమును) గ్రహించవలయునని తాత్పర్యము. ప్రమాణశ్లోకము:

**గురుభక్తివిశుద్ధాన్తఃకరణాయ మహాత్మనే ।**
**సమ్యక్ పరీక్ష్య దాతవ్యం మాసం షణ్మాసవత్సరమ్ ॥**

శిష్యుని ఒకసంవత్సరముగాని, ఆరుమాసములుగాని, కట్టకడకొక మాసముగాని పరీక్షించి మన్త్రోపదేశము చేయవలెనని శాస్త్రము విధించుచున్నది. శిష్యుడు ముందుగనే సకల సంకల్పములను నశింపజేసికొని ఆ గురుదేవుని శరణు పొంద వలయును.

అవ: గురుబోధ కనర్హులను నిరూపించుచున్నారు.

**నాస్తికాయ కృతఘ్నాయ దామ్భికాయ శఠాయ చ**
**అభక్తాయ విభక్తాయ న వాచ్యేయం కదాచన ॥ 317**

నాస్తికాయ - కృతఘ్నాయ - దామ్భికాయ - శఠాయ - చ - అభక్తాయ - విభక్తాయ - న - వాచ్యా - ఇయం - కదా - చన.

ఇయం = వేదాన్తార్థప్రతిపాదకమగు నీ గురుగీత, నాస్తికాయ = నాస్తికునికొఱకు, కృతఘ్నాయ = చేసిన మేలు మరచిన దుష్టునికొఱకు, దామ్భికాయ = దంభాచారముగలిగి అహంకృతు డయినవానికి, శఠాయ చ = పరాపకార ధురీణునికొఱకును, అభక్తాయ = భక్తిలేనివానికొఱకును, విభక్తాయ = భేదభావము గలవానికొఱకును (జాతి మత భేదములచే నుపాధినే పెద్దగా దలంచు సంకుచిత మతికొఱకును), కదాచన = ఎప్పుడును (ప్రమాద వశముచేనైనను), న వాచ్యా = చెప్పదగదు.

నాస్తికులకు, కృతఘ్నులకు, దంభాచారముచే నహంకృతు లయిన వారికిని, పరహింసాకార్య ధురీణులకును, భక్తిశూన్యులకును, జాతిమతభేదములచే శరీరోపాధులనే గొప్పగా తలంచి సంకుచితభావముతో నొప్పుచు జీవపరమాత్ముల కును నానాత్వమును వచించు ప్రబలాజ్ఞానుకును కేవలము శ్రీగురుబ్రహ్మమును ప్రతిపాదించు సకల వేదాన్తార్థసార మయినట్టి యీ శ్రీగురుగీతను ప్రమాదవశము చేనైన, నెప్పుడైనను వచింపరాదు. అట్లైనచో నీ శాస్త్రమహిమయే లేకపోవును. ప్రమాణము:

**శాంకరీయం మహాశాస్త్రం న దేయం యస్య కస్యచిత్ ।**
**నాస్తికాయ కృతఘ్నాయ దుర్వృత్తాయ దురాత్మనే ॥**

పరీక్షించి యోగ్యునకే తత్త్వోపదేశమును గురువరుడు చేయవలెను.

అవ: గురుగీతాబోధ కనర్హతలు

**స్త్రీలోలుపాయ మూర్ఖాయ కామోపహతచేతసే ।**
**నిన్దకాయ న వక్తవ్యా గురుగీతా స్వభావతః ॥ 318**

స్త్రీలోలుపాయ - మూర్ఖాయ - కామోపహతచేతసః - నిన్దకాయ - న - వక్తవ్యా - గురుగీతా - స్వభావతః.

స్త్రీలోలుపాయ = స్త్రీలయందాసక్తి గలవాడును, మూర్ఖాయ = మూఢమతి యయిన వాడును, కామోపహతచేతసః - కామ = విషయాభిలాషచే, ఉపహత = ఆక్రమింపబడిన, చేతసః = చిత్తము గలవాడును, నిన్దకాయ = పెద్దలను దూషించు వాడును నయిన వానికి, గురుగీతా = గురుగీత, స్వభావతః = స్వభావముగనే, న వక్తవ్యా = చెప్పగూడదు.

స్త్రీలమ్పటు లయిన వారికిని, పరమమూఢమతి గలవారికిని, విషయాభిలాషచే నాక్రమింపబడిన మనస్సు గలవారికిని, వేదములను సాధువులను దూషించువారికిని స్వభావముగనే యీ గురుగీతాశాస్త్రము వచింపదగదు. బోధించు స్వభావము గలిగి యుండకూడదని యర్థము. ప్రమాణశ్లోకములు:

**అజ్ఞస్య చార్థబద్ధస్య సర్వం బ్రహ్మేతి యో వదేత్ ।**
**మహానరకజాలేషు స తేన వినియోజితః ॥**

అజ్ఞుడై యింద్రియాదులందు తగుల్కొని విరక్తి లేనివానికి నీవే బ్రహ్మమని తత్త్వోపదేశము జేసినచో నట్టి గురువు శిష్యుని మహాపాతకములో పడద్రోసిన వాడగును.

**ఆదౌ శమదమప్రాయైర్గుణైశ్శిష్యం విశోధయేత్ ।**
**పశ్చాత్సర్వగతం బ్రహ్మ శుద్ధస్త్వమితి బోధయేత్ ॥**

మొట్టమొదట ముముక్షు వగువాడు గురువువద్దకు వచ్చునప్పుడు శమదమాది సాధనచతుష్టయ గుణములను శోధించి సర్వగుణ సమ్పన్నుడై యున్నయెడల సర్వాన్తర్యామి యయిన శుద్ధపరబ్రహ్మమే నీ వని మహావాక్యోపదేశము చేయవలెను. లేనిచో నన్తఃకరణశుద్ధికై సాధనలను జూపవలయును.

అవ: గురుగీతాశాస్త్ర మహాఫలము.

**సర్వపాపప్రశమనం సర్వోపద్రవవారకమ్ ।**
**జన్మమృత్యుహరం దేవి! గీతాశాస్త్రమిదం శివే! ॥** **319**

సర్వపాపప్రశమనం - సర్వోపద్రవవారకమ్ - జన్మమృత్యుహరం -దేవి - గీతాశాస్త్రం- ఇదం - శివే.

హే శివే = ఓ పార్వతీదేవీ !, ఇదం = ఈ గీతాశాస్త్రం = గీతాశాస్త్రము, సర్వపాప

ప్రశమనం = సర్వపాపములను నశింపజేయునదియు, సర్వోపద్రవవారకమ్ = సకల కష్టములను నివారించు నదియు, హే దేవి ! = ఓ గౌరీ !, జన్మమృత్యుహరం = జననమరణములను హరించునదియు నగుచున్నది.

ఈ గీతాశాస్త్రము సకలపాపములను హరింప జేయుచున్నది. శ్రీ గురువు దగ్గరజేరి యీ గీతాశాస్త్రమును శ్రవణము కావించినంత మాత్రమున గంగా జలముచే సకల మలినములు నశించి పరిశుద్ధాత్ముడగు విధమున బహుజన్మముల నుండి సంచితరూపమై యున్న పాపపంకిలము ప్రక్షాళిత మగుచున్నది. సకలేంద్రియ ములును శుద్ధములై, అంతఃకరణ పరిశుద్ధతయు నేర్పడుచున్నది. సంసారములో తనకు సంభవించు లాభనష్టములు, సుఖదుఃఖములు నివారింప బడుచున్నవి. మరియు నీ గీతాశాస్త్ర తత్త్వమును మననము జేయుటచే సంసారవిషయములం దాసక్తి నశించి, నిదిధ్యాసముచే జననమరణ రహితమగు నజ్ఞానము నశించి జ్ఞానామృతమును పానము చేయుచున్నారు. అందుచే నమృతపరబ్రహ్మము తానగుచున్నాడు.

**అజ్ఞానసర్పదష్టస్య బ్రహ్మజ్ఞానౌషధం వినా ।**
**కిము వేదైశ్చ శాస్త్రైశ్చ కిము మన్త్రైః కిమౌషధైః ॥**

అజ్ఞానమను సర్పముచే కరువబడినవానికి నీ గురుగీతా బ్రహ్మజ్ఞానా మృతము పరమౌషధ మగుచున్నది. కనుక తరింపదలచినవా డీగురు గీతా శాస్త్రమును శ్రవణ మనన నిదిధ్యాసము- లను గావించి గురుపరబ్రహ్మమును సాక్షాత్కరించవలయును.

అవ: తాను చెప్పుచున్న గురుగీతాశాస్త్రము నుపసంహరించుచున్నారు.

**శ్రుతిసారమిదం దేవి! సర్వము క్తం సమానతః ।**
**నాన్యథా సద్గతిః పుంసాం వినా గురుపదం శివే! ॥ 320**

శ్రుతసారం - ఇదం - దేవి - సర్వం - ఉక్తం - సమానతః - న - అన్యథా - సద్గతిః - పుంసాం - వినా - గురుపదం - శివే.

హే దేవి ! = ఓ గౌరీ!, ఇదం శ్రుతిసారం = వేదసారమైన యీ గురుగీతాశాస్త్రము

సమాసతః = సంగ్రహముగా, సర్వం = సంపూర్ణముగ, ఉక్తం = చెప్పబడెను, పుంసాం = జీవులకు, గురుపదం వినా = గురుస్థానమును వదలి (గురుపాదారవిన్దమును, గురుతత్త్వమును వదలి), అన్యథా = వేరు విధముగా, సద్గతిః = మోక్షమార్గము, హే శివే ! = ఓ మంగళరూపిణీ!, న = లేదు.

ఈ శాస్త్రము ఉపక్రమోపసంహారములతో గూడుకొని సమగ్రముగను సంగ్రహముగను నున్నది. ఇదేవిషయము నీశ్వరుడు పార్వతీదేవి కెరింగించు చున్నాడు. ఓ దేవీ ! యీ గురుగీతాశాస్త్రము సంగ్రహముగ, సామస్త్యముగ నాచే నీకు చెప్పబడెను. ఇది నిఖిలవేదసారమై యున్నది. ఈ గురుగీతాశాస్త్ర ముపదేశించు నట్టి ముఖ్యమగు సారాంశ మేమనగా సంసారసాగరములో మునింగి లేక సంసారదావాగ్నిచే పరితపించుచున్న లేక అజ్ఞానమహోరగముచే సందష్టులై, యున్న లేక అజ్ఞానాంధకారముచే గ్రుడ్డివారైన, లేక భ్రాంతిచే మోహితులైన దీనజనులకు శ్రీ గురుచరణారవింద సేవనము, స్మరణము, ధ్యానము, ఏకత్వము మొదలగునవి మోక్షము నొసంగునవై యున్నవి. శ్రీ గురుచరణారవిందమును శరణుబొంది, శ్రీ గురుతత్త్వము నెరింగి తదేకనిష్ఠులై యుండవలయును. ఇదియే యీ గీతాశాస్త్రముయొక్క రహస్యము. ఇకను సంగ్రహముగ జెప్పవలయు ననినచో అమృతమయ, విజ్ఞానమయ, ఆనందమయ మగు శ్రీ గురుదేవునియొక్క పాదారవిందమే సంతప్తహృదయులకు పరమశరణ్యము.

**గురురాజపదం త్యక్త్వా నాయాత్యాత్మపదం శివమ్ ।**
**తదేవ శరణం పుంసాం భక్తానాం వీతరాగిణామ్ ॥**

దీని యర్థము పైన తెలిపినదే.

అవ: ఈ శ్లోకమున పాపాత్ములకు గతిని చూపించుచున్నారు.

**బహుజన్మకృతాత్పాపాదయమర్థో న రోచతే ।**
**జన్మబన్ధనివృత్త్యర్థం గురుమేవ భజేత్సదా ॥** **321**

బహుజన్మకృతాత్ - పాపాత్ - అయం - అర్థః - న - రోచతే - జన్మబన్ధనివృత్త్యర్థం- గురుం - ఏవ - భజేత్ - సదా.

బహుజన్మకృతాత్ = అనేకజన్మలందు చేయబడిన, పాపాత్ = పాపమువలన, అయం= ఈ గురుగీతా శాస్త్రమందు వచింపబడిన, అర్థః = తత్త్వము, న రోచతే = పాపాత్ములకు రుచింపదు. (అయినను), జన్మబన్ధనివృత్త్యర్థం = పుట్టుట యను బంధముయొక్క నివారణకొరకై (ముక్తికొరకు), గురుమేవ = శ్రీ సద్గురుదేవునే, సదా = ఎల్లప్పుడు, భజేత్ = సేవించవలయును.

చాలాకాలమునుండి వ్యాధిచే పీడింపబడువానికి నౌషధముకూడ రుచింపదు. కాని బలాత్కారించి ఔషధమును సేవింపజేసినచో, తరువాత నాతడు మందును తిని స్వయముగ నారోగ్యవంతు డగుచున్నాడు. అట్లే అనేకజన్మముల నుంచి వచ్చుచున్న పాపాత్ములకు కామక్రోధాదులచే నంతఃకరణ మెంతగానో కలుషితమై యున్నను సత్సాంగత్యముచేత నిష్టము లేకపోయినను తత్త్వ మార్గమందు ప్రవర్తింప జేసినచో పిదప తనంతట తానే పరిశుద్ధాత్ముడై శ్రీగురుతత్త్వమును నెరుంగవలయునను సంకల్పము గలవాడై "స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్" అను గీతావచనము రీతి స్వయముగ శ్రీగురుదేవుని సేవించి జననమరణ రహితస్థితిని బొందుచున్నాడు. కావున శ్రీ సద్గురుమూర్తినే యెల్లప్పుడు భజించవలయును.

**బహుకందర్పదర్పాంధాః న విదన్తి పరం శివమ్ ।**
**గురుతత్త్వాజ్ఞయా సమ్యక్ జానన్త్యేవ న సంశయః ॥**
**అగతీనాం గతిస్సాక్షాత్ మాయాపహృతచేతసామ్ ।**
**గురుమన్త్రం భవత్యేవ తదర్థం యతతాం జనః ॥**

వీని యర్థము పైన తెల్పినదే.

అవ: శివుడే గురునమస్కారము చేయుచున్నాడట:

**అహమేవ జగత్సర్వమహమేవ పరం పదమ్ ।**
**ఏతద్జ్ఞానం యతో భూయాత్తం గురుం ప్రణమామ్యహమ్ ॥ 322**

అహం - ఏవ - జగత్ - సర్వం - అహం - ఏవ - పరం - పదం - ఏతత్ - జ్ఞానం - యతః - భూయాత్ - తం - గురుం - ప్రణమామి - అహం.

అహం ఏవ = గురుబ్రహ్మస్వరూపుడగు నేనే, సర్వం జగత్ = సమస్తలోకమై యున్నాను, అహం ఏవ = ఆత్మస్వరూపుడగు నేనే, పరం పదం = మహోత్కృష్టమగు కైవల్యస్థానము (అగుచున్నాను), యతః = ఏ శ్రీ గురుపరమాత్మవలన, ఏతత్ జ్ఞానం = ఈ అఖండజ్ఞానము, భూయాత్ = సిద్ధించునో, తం = అటువంటి జ్ఞానపురుషుడైన, గురుం = గురువునుగూర్చి, అహం = నేను, ప్రణమామి = నమస్కరించుచున్నాను.

ఈ జగత్తంతయును పరబ్రహ్మస్వరూపమే. నేనును పరిపూర్ణతత్త్వమగు గురుబ్రహ్మస్వరూపమునే. నాయొక్క అఖండజ్ఞాన తత్త్వమే కైవల్యము. ఇట్టి జీవబ్రహ్మైభేద స్వరూపజ్ఞాన మే గురువరునివలన గలుగుచున్నదో అట్టి పరమ దయాళు వగు గురుమూర్తిని సర్వదా నమస్కరించుచున్నాను. మోక్షమునకు సాధనముగను సాధ్యముగ నుండు పరమలక్ష్యమైన బ్రహ్మమును శ్రీ గురుమూర్తి యయ్యే యున్నాడు. అట్లు సాధనసాధ్య కార్యకారణరూప పరబ్రహ్మస్వరూపమును నేను భజించు చున్నాడను. ఇకను విచారించిన నట్టి కార్యకారణభావమునుగూడ నతిక్రమించి శ్రీగురుపరబ్రహ్మస్వరూప మున్నది. శ్రీగురుమహిమను గాంచుడు:

**విజ్ఞాననావం పరిగృహ్య కశ్చిత్**
**తరేద్యదజ్ఞానభవాంబుధిం సదా ।**
**జ్ఞానాసినా యో హి విఛిద్య తృష్ణాం**
**పరం పదం యాతి స ఏవ ధన్యః ॥**

ఎవడైతే అనుభవజ్ఞాన మను నోడను పరిగ్రహించినవాడై అజ్ఞానమయ మగు సంసారసాగరమును దాటునో మరియు ఆజ్ఞానఖడ్గముచే విషవల్లీతృష్ణను ఛేదించి పరమతత్త్వమగు నమృతత్వమును బొందుచున్నాడో వాడే ధన్యుడు. ఇట్టి జ్ఞానము పరమగురువువలన లభించుచున్నది. కనుక నా దేవదేవుని నిరంతరము భజించుచున్నాను.

అవ: శ్రీ గురుదేవుని యనుగ్రహముచేత స్వానుభవరూప దివ్యజ్ఞానము గలుగుచున్నదనియు, అట్టి మహాదేవ గురుస్వరూపమును విస్మరింపగూడదనియు చెప్పుచున్నారు.

**అలం వికల్పైరహమేవ కేవలం**
**మయి స్థితం విశ్వమిదం చరాచరమ్**
**ఇదం రహస్యం మమ యేన దర్శితం**
**స వన్దనీయో గురురేవ కేవలమ్ ॥ 323**

అలం - వికల్పైః - అహం - ఏవ - కేవలం - మయి - స్థితం - విశ్వం - ఇదం - చరాచరం - ఇదం - రహస్యం - మమ - యేన - దర్శితం - సః - వన్దనీయః - గురుః ఏవ - కేవలం.

వికల్పైః = బహుభాషణములచేత ననేక సందేహములచేత, అలం = చాలును, మయి = నాయందు, కేవలం = పరబ్రహ్మస్వరూపమై, ఇదం = ఈ, చరాచరం = స్థావర జంగమాత్మకమైన, విశ్వం = ప్రపంచము, స్థితం = ఉంటున్నది, ఇదం రహస్యం = అంతయు భగవన్మయ మను రహస్యము, మమ = నాకు, యేన = ఏ గురుదేవునిచేత, దర్శితం = చూపింపబడెనో, సః = అట్లు సాక్షాత్కరింపజేసిన, గురురేవ = గురుదేవుడే, కేవలం = మిక్కిలి, వందనీయః = నమస్కరించ దగినవాడు.

అనేక శాస్త్రవచనములచేత ప్రయోజనము లేదు. బహుభాషణములచేతను సందేహములచేత నేలాంటి యుపయోగము లేదు. నే నింతవరకు ఆత్మ వేరు, జీవుడు వేరు, జగత్తు వేరు, బ్రహ్మ మన్యము, దేవుడెచ్చటనో యున్నాడను ఈలాంటి భేదభావములచే తరింపలేక యుంటిని. నాయొక్క పూర్వకృత బహుసుకృత విశేషముచే దయామయుడగు విజ్ఞానస్వరూపుడగు గురుదేవుని దర్శన మాయెను. వారియొక్క బోధాతిశయముచే నాలోనే శ్రీ గురుస్వరూప బ్రహ్మమును సాక్షాత్కరించితిని. ఇప్పుడు నాకన్న భిన్నముగా నేదియును కానుపించుట లేదు. అంతయు నాస్వరూపమే. ఇట్టి శాశ్వతమగు పరిపూతమగు జ్ఞానదృష్టినేగురుదేవునిచే నొసగబడెనో అట్టి సాక్షాన్మహాదేవుడగు శ్రీ గురుదేవుడే నమస్కరించదగినవాడు; ధ్యానింపదగినవాడు. ఈ ప్రకారము శిష్యుడు తనకు గలిగినట్టి స్వానుభవా నందముచే శ్రీ గురుదేవుని స్తుతించుచున్నాడు.

అవ: శ్రీ సద్గురుపరబ్రహ్మము సర్వప్రకృతిధర్మములచే విడువబడి సర్వప్రకృతికి విలక్షణమై యున్నదనుటను విశదపరచుచున్నారు.

**యస్యాన్తం నాదిమధ్యం న హి కరచరణం నామగోత్రం న సూత్రం**
**నో జాతిర్నైవ వర్ణో న భవతి పురుషో నో నపుంసో న చ స్త్రీ।**
**నాకారం నో వికారం న హి జనిమరణం నాస్తి పుణ్యం న పాపం**
**నో ఽతత్త్వం తత్త్వమేకం సహజసమరసం సద్గురుం తన్నమామి ॥ 324**

యస్య - అన్తం - న - ఆది - మధ్యం - న - హి - కరచరణం - నామ - గోత్రం - న - సూత్రం - నో - జాతిః - న - ఏవ - వర్ణః - న - భవతి - పురుషః - నో - నపుంసః - న - చ - స్త్రీ - న - ఆకారం - నో - వికారం - న - హి - జనిమరణం - న - అస్తి - పుణ్యం - న - పాపం - నో - అతత్త్వం - తత్త్వం - ఏకం - సహజసమరసం - సద్గురుం - తం - నమామి.

యస్య = ఏ గురుబ్రహ్మమునకు, అన్తం = అన్తము, ఆది = ఆది, మధ్యం = మధ్యము, న = లేదో, కరచరణం = కాళ్ళు చేతులు, న = లేవో, నామగోత్రం = పేరు గోత్రము, సూత్రం = సూత్రము, న = లేవో. జాతిః = జాతి, నో = లేదో, వర్ణః = వర్ణము, నైవ = లేదో, పురుషః = పురుషుడు, న భవతి = కాదో, నపుంసః = నపుంసకుడు, నో = కాదో, స్త్రీ చ = స్త్రీ యును, న = కాదో, ఆకారం = రూపము, న = లేదో, వికారం = పరిణామము, నో = లేదో, జనిమరణం = జననమరణములు, న = లేవో, పుణ్యం = పుణ్యము, నాస్తి = లేదో, పాపం = పాపము, న = లేదో, అతత్త్వం = ఒకే స్వరూపమైన, సహజసమరసం = స్వభావమైన సమమైన ఏకరసమైన, తం సద్గురుం = అట్టి సద్గురుమూర్తిని, నమామి = నమస్కరించుచున్నాను.

ఆ గురుపరబ్రహ్మమునకు ఆదిమధ్యాంతములు లేవు. ఇట్లనుటచే త్రికాలాతీత మైనదనియు, శాశ్వతమైనదనియు తెలియవలెను. కరచరణములు, గోత్ర సూత్ర నామధేయములు, బ్రాహ్మణాది జాతులు, ధవళపీతాదివర్ణములు గురుపరబ్రహ్మమునకు లేవు.

ఇట్లనుటచే స్థూలదేహధర్మములచే నా పరవస్తువు వర్జితమై యున్నదని తెలియవలెను. ఆ పరబ్రహ్మము పురుషుడును స్త్రీయును నపుంసకుడును కానిది. ఇట్లు వచించుటచే లింగవర్జితము, కేవల సచ్చిదానందమయము. ఇంకను నా పరతత్త్వపదార్థమునకు ఆకారములు, వికారములు, జననమరణములు, పుణ్యాపాపములు లేవు.

ఇందుచే నా గురుపరబ్రహ్మము ద్వన్ద్వాతీతమై సదసద్విలక్షణమై యున్నదని సిద్ధించెను. కేవలము అది సత్యస్వరూపము; ఒకే స్వరూపము; అద్వితీయము; సహజము; సమము; ఏకామృతరసము. అట్టి పరబ్రహ్మముయొక్క స్వరూపమగు శ్రీసద్గురుమూర్తినిగూర్చి నేను నమస్కరించుచున్నాను. శ్రీగురుదేవునిద్వారా స్వానుభవ సాక్షాత్కారసిద్ధిని బడసిన శిష్యు డఖండానందముతో శ్రీగురువు నీలాగున స్తుతించుచున్నాడు. ఇట్లే వివేకచూడామణియు

**జాతినీతికులగోత్రదూరగం నామరూపగుణదోషవర్జితమ్ ।**
**దేశకాలవిషయాతివర్తి యత్ బ్రహ్మతత్త్వమసి భావయాత్మని ॥**

అని తెలుపుచున్నది. దీనియర్థము పైన దెలిపినదే.

అవ: శ్రీ గురుదేవునివలన నాత్మానుభవమును పొందిన శిష్యుడు శ్రీగురుదేవుని స్తుతించుచున్నాడు.

**నిత్యాయ సత్యాయ చిదాత్మకాయ**
**నవ్యాయ భవ్యాయ పరాత్పరాయ ।**
**శుద్ధాయ బుద్ధాయ నిరంజనాయ**
**నమోఽస్తు నిత్యం గురుశేఖరాయ ॥ 325**

నిత్యాయ - సత్యాయ - చిదాత్మకాయ - నవ్యాయ - భవ్యాయ - పరాత్పరాయ - శుద్ధాయ - బుద్ధాయ - నిరంజనాయ - నమః - అస్తు - నిత్యం - గురుశేఖరాయ.

నిత్యాయ = శాశ్వతుడును, సత్యాయ = సత్యస్వరూపుడును, చిదాత్మకాయ = జ్ఞానప్రకాశ కరూపుడును, నవ్యాయ = స్తుతింప దగినవాడును, భవ్యాయ = శుభస్వరూపుడును, పరాత్పరాయ = పరముకంటె పరమైన వాడును, శుద్ధాయ = పరిశుద్ధుడును, బుద్ధాయ = జ్ఞానస్వరూపుడును, నిరంజనాయ = మాయామాలిన్యము లేనివాడును నగు, గురుశేఖరాయ= శ్రేష్ఠుడైన శ్రీగురుదేవునికొరకు, నిత్యం = ఎల్లప్పుడు, నమః = నమస్కారము, అస్తు = అగుగాక.

నిత్యుడును, సత్యస్వరూపుడును, ప్రకాశస్వరూపుడును, స్తుతింప దగినవాడును, సర్వదా నవోదయముతో కూడుకొన్నవాడును, మంగళస్వరూపియు, విష్ణ్వాది పరలోకములకంటే పరుడైనవాడును, పరిశుద్ధుడును, జ్ఞానైకస్వరూపియు, మాయారహితుడును నగు గురువులకు శిరోభూషణమైన అనగా సర్వగురుశ్రేష్ఠుడైన

నా గురుదేవునికొరకు నిత్యము నాయొక్క నమస్కార మగుగాక ! నిత్యము నమస్కరించుచున్నాను.

అవ: శివకృత గురుస్తోత్రము.

**సచ్చిదానందరూపాయ వ్యాపినే పరమాత్మనే ।**
**నమశ్శ్రీగురునాథాయ ప్రకాశానందమూర్తియే ॥ 326**

సచ్ఛిధానంరూపాయ - వ్యాపినే - పరమాత్మనే - నమః - శ్రీ గురునాథాయ - ప్రకాశానందమూర్తయే.

సచ్చిదానందరూపాయ = సత్ చిత్ ఆనందములే స్వరూపముగా గలవాడును, వ్యాపినే = వ్యాపించిన, పరమాత్మనే = పరమాత్మస్వరూపుడైన, ప్రకాశానందమూర్తయే = ప్రకాశానందముల నాకారములుగా గల, శ్రీ గురునాథాయ = శ్రీ గురుదేవునికొరకు, నమః = నమస్కారము.

సచ్చిదానందస్వరూపుడును, సర్వవ్యాపియు, పరమాత్మయు, ప్రకాశానందాకృతియునైన శ్రీగురుదేవునికొరకు నమస్కారము. వేదాంతమున పరమాత్మయొక్క ముఖ్యలక్షణములు సత్తు చిత్తు ఆనందము వ్యాపకత్వము లగు చున్నవి. సత్తుచే అసత్యనిరాకరణము, చిత్తుచే జడత్వనిరాకరణము, ఆనందముచే దుఃఖత్వ దూరీకరణము, వ్యాపకత్వముచే పరిచ్ఛిన్నత్వ నిరాసము- ఇవి గలుగుచున్నవి. అనగా అనృతజడదుఃఖ పరిచ్ఛిన్నాత్మక మగు జగత్తుకన్న సత్ చిత్ ఆనంద వ్యాపక స్వరూపమగు బ్రహ్మము విలక్షణముగా నున్నది. జగత్తు మృతస్వభావము గలది. బ్రహ్మము అమృతము. జగత్తు తమోరూపము. బ్రహ్మము జ్ఞానరూపము.

ఈ ప్రకారము వేదాన్తశాస్త్రము ననుసరించి పరబ్రహ్మముయొక్క విశేషణములు ప్రకృతిధర్మములను నిరాకరించుచున్నవై యున్నవని తెలియవలెను. (అస్థూలమనణుమహ్రస్వం= బ్రహ్మము స్థూలము గానిది, అణువు గానిది, హ్రస్వము గానిది) ఇట్టి నిషేధలక్షణములచే ప్రకృతి వ్యక్తమై స్థూలమై యున్నది. అణురూపమున నున్నది హ్రస్వదీర్ఘములతోగూడియున్నది. పరబ్రహ్మమో అవ్యక్తమై మహాసూక్ష్మమై గగనముకంటెనుగూడ బృహత్తై దీర్ఘ హ్రస్వములు లేనిదై

యున్నది. ఈప్రకారము వేదాన్తశాస్త్రము విచారించి విచారించి బ్రహ్మముయొక్క స్వరూపలక్షణము సచ్చిదానంద మనియు, వ్యాపకమనియు, పరిపూర్ణమనియు నిర్ణయించినది.

ఇకను విచారించిన లక్షణమనగా వ్యావర్తకధర్మ మగుచున్నది. గోవను నప్పుడు, గంగడోలు గలదని యర్థము చెప్పుచున్నారు. అందుచే నది సర్వవిలక్షణ ముగ తెలియబడుచున్నది. కాని అంతమాత్రముచే గోవుయొక్క స్వరూపము పూర్తియగుట లేదు. అట్లే సచ్చిదానంద స్వరూపలక్షణము గూడనున్నది. అందుచేతనే వ్యాపకత్వమును, పరిపూర్ణత్వమును గూడ జేర్చి స్వరూపలక్షణమనిరి. ఈ రెండులక్షణములును పరిచ్ఛిన్నత్వమును ఖండత్వమును నిరాకరించుచున్నవి. పరబ్రహ్మముయొక్క సామస్త్యస్వరూపమును తెలియబరచుటలేదు. ఇట్లు దృష్టాంతీకరించి వచించుట భావనార్థమనియు, నవిద్యానివృత్తి కొరకనియు తెలియవలెను.

ఈప్రకార మేలక్షణమును జూచినను నొకదానిని నిరాకరించు విషయములో తాత్పర్యము గలదై యున్నదిగాని యథార్థస్వరూప నిర్ణయమునకు జాలకనే యున్నది. గోస్వరూపమును నేత్రముతో గాంచినప్పుడే స్పష్టమగునట్లు తాను పరబ్రహ్మస్వరూపమును సాక్షాత్కరించునప్పుడే సర్వము విస్పష్టము. అప్పుడు పరబ్రహ్మముకన్న వేరు లేదు. ఈ విషయమునే "అవ్యవహార్యం" అని శ్రుతి చెప్పుచున్నది. అవాఙ్మానస గోచర మనునదియు నిదియే. అద్వయము, శివము, అలక్షణము, పరిపూర్ణము.

అవ: శ్రీగురుస్తోత్రము:

**సత్యానందస్వరూపాయ బోధైకసుఖకారిణే।**
**నమో వేదాన్తవేద్యాయ గురవే బుద్ధిసాక్షిణే ॥ 327**

సత్యానందస్వరూపాయ - బోధైకసుఖకారిణే - నమః - వేదాన్తవేద్యాయ - గురవే - బుద్ధిసాక్షిణే.

సత్యానందస్వరూపాయ = సత్యానంద స్వరూపుడును, బోధైక సుఖకారిణే - బోధైక=

ఆత్మజ్ఞానమే ముఖ్యముగా గలవాడును, సుఖకారిణే = నిత్యసుఖమును కలుగజేయువాడును, (బోధ = ఆత్మబోధచేత, ఏక = ముఖ్యమైన, సుఖ = సుఖమును, కారిణే = చేయువాడును), వేదాన్తవేద్యాయ = ఉపనిషత్తులచే తెలియదగినవాడును, బుద్ధి సాక్షిణే = బుద్ధికి సాక్షియైన వాడును, గురవే = శ్రీగురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

సత్యానందస్వరూపుడును, "న బోధాత్ పరమం సుఖం" అన్నట్లు ఆత్మ బోధచే పరమసుఖమును జిజ్ఞాసువులకు గలుగజేయువాడును, జ్ఞానైకసుఖ స్వరూపుడును, వేదాంతములగు నుపనిషత్తులచే దెలియందగినవాడును, బుద్ధికి సాక్షియైన వాడును నగు శ్రీ గురుదేవునికొఱకు నమస్కారము. అనగా బుద్ధికిని సాక్షియై సత్యజ్ఞానానంద స్వరూపుడగు శ్రీగురుపరమాత్మ కేవలము ఉపనిషద్వి జ్ఞానము చేతనే దెలియదగినవాడు.

అవ: శ్రీ గురుదేవుని లోకసంరక్షణకై నవతరించు భగవంతునిగ నెంచి శిష్యుడు సంబోధించుచున్నాడు.

**నమస్తే నాథ భగవన్! శివాయ గురురూపిణే ।**
**విద్యావతారసంసిద్ధ్యై స్వీకృతానేకవిగ్రహ ॥ 328**

నమః -తే - నాథ - భగవన్ - శివాయ - గురురూపిణే - విద్యావతారసంసిద్ధ్యై - స్వీకృతానేకవిగ్రహ.

విద్యావతారసంసిద్ధ్యై - విద్యా = జ్ఞానముయొక్క, అవతార = అవతారముయొక్క (అవతరింపజేయుటయొక్క అనగా బోధించుటయొక్క), సంసిద్ధ్యై = సమ్యక్ సంసిద్ధికై స్వీకృతానేకవిగ్రహ, స్వీకృత = ధరింపబడిన, అనేకవిగ్రహ = అనేక దేహములు గల ఓ పరమాత్మ !, హే నాథ = ఓ స్వామీ!, భగవన్ = భగవంతా !, శివాయ = మంగళస్వరూపుడవైన, గురురూపిణే = గురుస్వరూపమును ధరించిన, తే = మీకొఱకు, నమః = నమస్కారము.

లోకములో విజ్ఞానమును బోధింప నరుదెంచిన-

**పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।**
**ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥**

అను భగవద్గీతా ప్రమాణముగా నానావిధావతారముల నెత్తిన మహానుభావా! దశావతారములను ధరించిన నారాయణస్వరూపా! భగవంతా! మంగళ స్వరూపుడ

వైన, గురుస్వరూపుడవైన మీకొరకు నమస్కారము. భగవంతుడు లోకసంరక్షణకై అవతారములు ధరించుచున్నాడు గాన ఇప్పుడు శిథిలమైన జ్ఞానబోధకొరకై గురురూపముగ భగవంతు డవతరించెనని భావము.

**నవాయ నవరూపాయ పరమార్థైకరూపిణే ।**
**సర్వాజ్ఞానతమోభేదభానవే చిద్ఘనాయ తే॥ 329**

నవాయ - నవరూపాయ - పరమార్థైకరూపిణే - సర్వాజ్ఞానతమో భేదభానవే- చిద్ఘనాయ - తే.

నవాయ = స్తుతిరూపు డైనవాడును, నవరూపాయ = సద్యోదితస్వరూపుడును (ఎల్లప్పుడు నూతనముగా నుండువాడును), పరమార్థైకరూ పిణే = కేవల సత్యస్వరూపుడును, సర్వాజ్ఞాన తమోభేదభానవే - సర్వాజ్ఞానతమః = సకలాజ్ఞానమను చీకటియొక్క, భేద = భేదించుటయందు, భానవే = సూర్యుడైన వాడును, చిద్ఘనాయ = ప్రకాశముచే నధికు డైనవాడును, జ్ఞానఘనుడును నైన, తే = మీకొఱకు, నమః = నమస్కారము.

స్తుతిరూపుడై నవనవప్రకాశముచే సదా తేజరిల్లువాడును, సత్య స్వరూపుడును, సర్వాజ్ఞానాంధకార భాస్కరుడును, చిద్ఘనుడునైన పరమాత్మయొక్క స్వరూపమైన మీకొఱకు నమస్కారము.

**స్వతంత్రాయ దయాక్లృప్తవిగ్రహాయ శివాత్మనే ।**
**పరతంత్రాయ భక్తానాం భవ్యానాం భవ్యరూపిణే ॥ 330**

స్వతంత్రాయ - దయాక్లృప్తవిగ్రహాయ - శివాత్మనే - పరతంత్రాయ -భక్తానాం - భవ్యానాం - భవ్యరూపిణే.

స్వతంత్రాయ = స్వతంత్రుడును, దయాక్లృప్తవిగ్రహాయ = దయచే సంగ్రహింపబడిన దేహము గలవాడును, శివాత్మనే = ఈశ్వర స్వరూపుడును, భక్తానాం = భక్తులకు, పరతంత్రాయ= స్వాధీన మైనవాడును, భవ్యానాం = మంగళస్వరూపులకు, భవ్యరూపిణే = మంగళస్వరూపుడును నైన, తే = నీకొఱకు , నమః = నమస్కారము.

సర్వతంత్ర స్వతంత్రుడవైన, దయాస్వరూపుడవైన, శివస్వరూపుడవైన, భక్తులకు స్వాధీనుడవైన, మంగళాత్ములకు శుభస్వరూపుడవైన నీకొఱకు

నమస్కారము.

అవ: శ్రీ గురుస్తోత్రము:

**వివేకినాం వివేకాయ విమర్శాయ విమర్శినామ్।**
**ప్రకాశినాం ప్రకాశాయ జ్ఞానినాం జ్ఞానరూపిణే ॥ 331**

వివేకినాం - వివేకాయ - విమర్శాయ - విమర్శినామ్- ప్రకాశినాం - ప్రకాశాయ - జ్ఞానినాం - జ్ఞానరూపిణే.

వివేకినాం = జ్ఞానవంతులకు, వివేకాయ = జ్ఞానస్వరూపులును, విమర్శినామ్ = ఆత్మవిచారణ గలవారికి, విమర్శాయ = విచారణారూపులును, ప్రకాశినాం = ప్రకాశము గలవారికి, ప్రకాశాయ = ప్రకాశమైనవారును, జ్ఞానినాం = ఆత్మజ్ఞానులకు, జ్ఞానరూపిణే = జ్ఞానస్వరూపులునునైన, తే = మీకొఱకు, నమః = నమస్కారము.

వివేకవంతులలో వివేకముగను, ఆత్మవిచారణా తత్పరులలో ఆత్మవిచారణ ముగను, ప్రకాశవంతులలో ప్రకాశముగను, బ్రహ్మజ్ఞానులో బ్రహ్మజ్ఞానముగను నైన మీ కొరకు నమస్కారము. అనగా ఆ గురుపరబ్రహ్మము శ్రేష్ఠపదార్థరూపమై యున్నదని యర్థము.

అవ: గురునమస్కార విధానము

**పురస్తాత్పార్శ్వయోః పృష్ఠే నమస్కుర్యాదుపర్యధః ।**
**సదా మచ్చిత్తరూపేణ విధేహి భవదాసనమ్ ॥ 332**

పురస్తాత్ - పార్శ్వయోః - పృష్ఠే - నమస్కుర్యాత్ - ఉపరి - అధః - సదా - మచ్చిత్తరూపేణ - విధేహి - భవదాసనమ్.

(అట్టి గురుదేవునికొక్క) పార్శ్వయోః = ప్రక్కలయందును, పురస్తాత్ = ముందు, పృష్ఠే = వెనుకభాగమందును, ఉపరి = పైభాగమందును, అధః = క్రిందిభాగమందును, నమస్కుర్యాత్ = నమస్కరించవలయును, సదా = ఎల్లప్పుడు, భవదాసనం = మీ యొక్క ఆసనము, మచ్చిత్తరూపేణ = నామనోరూపముతో, విధేహి = చేయుము.

స్వామీ! భగవంతా! మీ కొఱకు ప్రక్కభాగమునను, ముందుభాగమునను, వెనుకను, పైనను, క్రిందిభాగమునను ఇట్లు సర్వదిక్కులయందును నేప్రక్కనైనను

సదా నమస్కరించవలయును. నేను నమస్కరించుచున్నాను. స్వామీ! మీయొక్క ఆసనమును నామనస్సునుగా నిరంతరము చేసికొనుడు. అనగా నా మనస్సులో తమరెప్పుడును నివసించవలమును. తమరెప్పుడును మరుపులేక జ్ఞాపకమునకు వచ్చునట్లు చేయుడని యర్థము. ముఖ్యార్థ మేమనగా, భగవత్స్వరూపులగు మీ కొఱకు నమస్కారముజేయు ఫలిత మేమనగా నిరంతరమును శ్రీ గురుపర బ్రహ్మస్వరూపము విస్మృతిలేక సంస్మరించుచునే దృఢప్రజ్ఞ గలిగి యుండ వలయును. ఇట్లు వీనియొక్క ప్రార్థన.

అవ: శ్రీ గురుబ్రహ్మ సన్నిధానమహిమను వచించుచున్నారు.

**శ్రీగురుం పరమానన్దం వన్దే హ్యానన్దవిగ్రహమ్ ।**
**యస్య సన్నిధిమాత్రేణ చిదానన్దాయతే మనః ॥ 333**

శ్రీగురుం - పరమానన్దం - వన్దే - హి - ఆనందవిగ్రహం - యస్య - సన్నిధిమాత్రేణ- చిదానందాయతే - మనః.

యస్య = ఏ శ్రీగురుపరమాత్మయొక్క, సన్నిధిమాత్రేణ = సాన్నిధ్యముచేతనే, మనః= చిత్తము, చిదానందాయతే = చిదానందరూపముగ నాచరించుచున్నదో(నిర్మలపరబ్రహ్మాకార మగుచున్నదో), తం = అటువంటి, పరమానన్దం = కేవలానందమును గలిగించునట్టి, ఆనందవిగ్రహం = ఆనందమూర్తి యయిన, శ్రీగురుం = జ్ఞానశ్రీతో నొప్పు శ్రీగురుపరమాత్మను, వన్దే హి = నమస్కరించుచున్నాను గదా.

శ్రీగురుమూర్తు లనగా ప్రసన్న స్వరూపులు, శాంతులు, దాంతులు, సకలేన్ద్రియ ములును పరిశుద్ధములై కేవలచైతన్యాత్మకములై పరిపూతములై యుండును. **"నానాచ్ఛిద్రఘటోదరస్థితమహాదీపప్రభాభాస్వరం"** అన్నట్లు నానారంధ్రములతో నున్న యీ దేహఘటమునం దాత్మజ్యోతి నిరావరణముగా వెలుగునట్టివారు. కలశములోని దీపము లోపల ప్రకాశించుచు బయటికిని రంధ్రములగుండా ప్రకాశించుచున్నది. అట్లే వారి ఆత్మజ్యోతియును బహిర న్తరములందు ప్రకాశించు చున్నందుచే కేవల చైతన్యస్వరూపులు, లీలామానుష విగ్రహులు, కేవలానందస్వరూపులు. బ్రహ్మానందమే మూర్తిరూపముగ నున్నవారు, అమృత స్వరూపులు. కావున నట్టి మహనీయాత్ములను దర్శించి నంతమాత్రమున

మనస్సు శాంతమై, అప్రాకృతవిషయములో ప్రవేశించినదై, అమృతమయమై చిదానందరూప మగుచున్నది. దృశ్యవిస్మృతి గలుగుచున్నది. ఎంత తాపముండినను గంగానదీ తీరముయొక్క గాలి ప్రసరించగానే సర్వేన్ద్రియములు చల్లబడుచున్నవి. సన్నిధానము నిరంతర బాహ్యాభ్యన్తర సకలతాప నాశకమై యున్నది. ఎట్టివారి మనస్సునుగూడ నినుమును సూదంటురాయి లాగుకొనునట్లు శ్రీ సద్గురుదర్శన మాకర్షించుచున్నది.

శ్రీ రమణమహర్షి మొదలయిన మహాత్ముల దర్శన మిట్టిదని యందఱికిని విదితమై యున్నది. మహాగ్నిలో నుంచబడినట్టి లోహము మెల్లగా నగ్నిమయ మగుచున్నది. ఇకను బంగారు వెండి మొదలయినవి నీరుగా కరగిపోవుచున్నవి. ఏవైనను నగ్నిసమ్బన్ధముచే మార్పును జెందవలసివై యున్నవి. కావున మహాధైర్యశాలురును, కఠినాత్ములును, భక్తులును, భక్తులు గానివారును శ్రీ గురుదేవునియొక్క అఖండ తేజోమయ సన్నిధానమందు మూకు లగుచున్నారు. వారి చిత్తము పరిణామ మొందవలసినదే. వేరుమార్గము లేదు. శ్రీగురుదేవులు తపోధ్యానాదులను గావించి స్ఫుటము వేయబడిన స్వర్ణమువలె నిర్దోషులై జీవత్వము నశించి పరబ్రహ్మాకారులై యున్నందుచే వారి దర్శనమాత్రముచేత పవిత్రు లగుచున్నారు. ఇకను వారివారి చిత్తముయొక్క పరిపక్వము ననుసరించియు నానందస్థితి, పవిత్రత మొదలయిన వానిని పొందుచున్నారు. ఇదియే భగవచ్ఛక్తి తపోమహిమ, జ్ఞానమాహాత్మ్యము. ఇదంతయు మహర్షిదర్శనముచే గలుగు ప్రయోజనములు. కావుననే రాజాధిరాజులును శ్రీ సద్గురు సన్నిధానమును శిరస్సును వంచి మ్రొక్కుచున్నారు.

ఇంత విచారఫలిత మేమనగా- శ్రీ గురుదేవుని యొక్క సాన్నిధ్య మప్రాకృతము, జ్ఞానతేజోవిరాజితము, అమృతమయము. కాన దర్శించువారి నివసించువారి చిత్తముగూడ చిదానందాకార పరబ్రహ్మాకార మగుచున్నది. పాపములు నశించి పవిత్రతను గాంచుచున్నది. పరిశుద్ధమై క్రమముగా జ్ఞానరూపమై పరమశాంతి నొందుచున్నది. ఈ విషయము ననుభవముచే గుర్తెఱింగిన స్పష్టమగును. అట్టి సదానందమును గలిగించు శ్రీ గురుపరమాత్మను నేను

నిరంతరము జ్ఞానసిద్ధికై నమస్కరించుచున్నాను.

అవ: శ్రీగురుస్తోత్రము

**నమోఽస్తు గురవే తుభ్యం సహజానందరూపిణే ।**
**యస్య వాగమృతం హన్తి విషం సంసారసంజ్ఞకమ్ ॥ 334**

నమః - అస్తు - గురవే - తుభ్యం - సహజానందరూపిణే - యస్య - వాగమృతం - హన్తి - విషం - సంసారసంజ్ఞకం.

యస్య = ఏ మహనీయాత్మునియొక్క, వాగమృతం - వాక్సుధారసము, సంసారసంజ్ఞకం = సంసారమను పేరుగల, విషం = విషమును, హన్తి = చంపుచున్నదో, తస్మై = భవదుఃఖధ్వంసమును జేయునట్టి, సహజానందరూపిణే = స్వభావసిద్ధమగు నానందమే స్వరూపముగా గల, గురవే = శ్రీ గురుమూర్తు లయిన,, తుభ్యం = మీకొఱకు, నమః = ప్రణామము, అస్తు = అగుగాక.

శ్రీగురుదేవుని వాక్యసుధారసము సకల సంసారవిషయ కాలకూట విషమును పూర్తిగా చంపుచున్నది. కొందఱి మాన్త్రికులయొక్క నామధేయ శ్రవణము చేతనే కొన్నివిషములు హరించిపోవుచున్నవి. ఇట్లుండగా శ్రీగురుదేవ జ్ఞానమూర్తి యొక్క వాగమృతముచే సంసారమను విషయవిషము నశించుచున్నదని వేరుగా జెప్పవలయునా! అజ్ఞాన సర్పముచే సందష్టులై, సంసార విషయములను మహా విషముచే మోహమూర్ఛజెందినవారికి శ్రీగురుదేవుని వాగమృతము మహౌషధమై యున్నదని యర్థము.. సముద్రములో మహాభయంకర కాలకూటవిషము పుట్టెను. తరువాత మహామధురమగు నమృత ప్రవాహముగూడ జనించెను. రెండు నొకేచోట జనించినవి.

దోషములును గుణములును ఏకాశ్రయములయ్యే యుంటున్నవి. అయితే, హాలాహల సంభవముచే సముద్ర మంతయు నల్లకల్లోల మాయెను. అందరును భయపడిరి. జగద్రక్షకుడగు నీశ్వరుడు దానిని మ్రింగెను. తిరుగా నమృత ముద్భవించినప్పుడు క్షీరసాగర మంతయు నవనీతామృతమయమై అందరును సంతోషించిరి. దేవతలు దాని ద్రాని సంతృప్తిని జెందిరి. ఆ ప్రకారము వారివారి అన్తఃకరణమను సముద్రములో విషయాభిలాషలను మహావిషము గల్గుచున్నది.

అప్పుడు సంసార మంతయు విషమయముగ నుండును. అంతఃకరణ మంతయు శాంతిరహితమై యుంటున్నది. అద్దానిని శ్రీగురుమహేశుడు పానముఁజేసెను. (శ్రీగురుదేవుని స్మరణము విషయమను విషమును హరించెను.) తరువాత నన్తఃకరణసాగరములో జ్ఞానామృత ముద్భవిల్లెను. అప్పుడు అంతఃకరణ మంతయు బ్రహ్మానంద స్వరూప మాయెను. ఇదియే సంసారవిషయ విషజననము, నాశము. అమృతమయానందోద్భవములని తెలియవలెను. ఇట్లే క్షీరసాగరమథన రహస్యమును దీనికన్న విపులముగా వర్ణించెదరు.

ముఖ్యార్థ మేమనగా, అమృతోద్భవముచే విషము నాశమాయెను. శాన్త్యాది గుణవిశిష్ట గురుభక్తులు శ్రీగురుదేవుని జ్ఞానామృతమును గ్రోవి జననమరణ రహితు లగుచున్నారు. వారియొక్క విషయవిషములు నశించుచున్నవి. "సంసారః కిమమృతమయో విషమయో వా" అని ప్రయోగించుచున్నారు. అజ్ఞానులకు నీప్రపంచ మంతయు సుఖదుఃఖమయముగ దోచును. జ్ఞానులకు కేవల మమృతపరబ్రహ్మమయముగ నుంటున్నది. "దృష్టిం బ్రహ్మమయీం కృత్వా సంపశ్యేత్" అని వచించుటకు కారణము విషామృతముల రెంటికిని వారి యన్తఃకరణమే కారణముగ నున్నది. కాన శ్రీగురుదేవుని వాగమృతము భక్తుల చిత్తము నమృతమయముగ, వీతరాగము, శాంతిధామముగ, జ్ఞానరూపముగ, ఆనందమయముగ జేయుచున్నది. అట్టి సహజానంద స్వరూపులగు శ్రీగురుదేవు లయిన మీకొఱకు నమస్కారము. మీమహిమ వచింపదరము గాదు. కేవలము నిర్గుణము, అనిర్వాచ్యము, సదసద్విలక్షణము, ఆనందప్రపూర్ణము, కేవలచైతన్యము. కనుక దాసుడగు నేను మిమ్ములను నిరంతరము నమస్కరించు చున్నాను.

**నానాయుక్తోపదేశేన తారితా శిష్యసన్తతిః ।**
**తత్కృపాసారవేదేన గురుచిత్పదమచ్యుతమ్ ॥** **335**

నానాయుక్తోపదేశేన - తారితా - శిష్యసన్తతిః - తత్కృపాసారవేదేన -గురుచిత్పదం - అచ్యుతం.

నానాయుక్తోపదేశేన - నానా = అనేకవిధము లయిన, యుక్త = తగిన (యోగములో

గూడుకొనిన), ఉపదేశేన = ఉపదేశములు గల, తత్కృపాసార వేదేన - తత్ = ఆ గురుదేవునియొక్క, కృపా = దయయను, సారవేదేన = ఉపనిషద్విజ్ఞానముచేత (పరమదయతో ప్రసాదింపబడిన ఉపనిషద్రహస్యార్థ ప్రతిపాదక పరబ్రహ్మ జ్ఞానముచేత), శిష్యసన్తతిః = శిష్యపరమ్పర, తారితా = తరింపబడినదై (భవసాగరమును దాటినదై), అచ్యుతం = చ్యుతిలేని నాశరహిత మయిన, గురుచిత్పదం - గురు = గురువుయొక్క,చిత్ = జ్ఞానరూప, ప్రకాశరూప, పదం = స్థానమును (శ్రీగురుపరబ్రహ్మమును,) యాతి = పొందుచున్నది.

శ్రీగురుదేవుని శిష్యసంతరణ విషయమును విశదీకరించుచున్నారు. శ్రీగురు దేవులు తన్నాశ్రయించిన పరమభక్తు లయిన శిష్యులయొక్క అజ్ఞాన పటలమును, జీవత్వనాశమును జేయుటకు నానాయోగములను, సాధనల నుపదేశించుచున్నారు. అనేక దృష్టాన్తములతోను శాస్త్రప్రమాణములతోను 'జీవుడనగా పరబ్రహ్మమేను' అను తత్త్వమును నిస్సంశయముగ బోధించుచున్నారు. కట్టకడకు శ్రీపరమ కృపాసార మయిన,అభేదరూపమైన, జీవబ్రహ్మైక్యమును కేవల ఉపనిషత్తులయొక్క విజ్ఞానముచేత తెలిపి, లక్ష్యార్థమునే స్పష్టపరచి శిష్యులకు బోధించుచున్నారు. జీవుని శివుని జేయుచున్నారు. ఇదంతయు పరమ గురువుల యొక్క యనుగ్రహ మాత్రమై యున్నది. శ్రీగురుదేవుని యనుగ్రహ ముండినచో ఉపనిషద్విజ్ఞానమును శిష్యుడు గ్రహించుచున్నారు. ఆతత్త్వమును పొందుచున్నాడు. శ్రీ గురుదేవుని దయాసారమే వేదసారము. దానిచేత పరమభక్తులు కొందఱు శాస్త్రజ్ఞానము లేనివారైనను తరించుచున్నారు. ఇట్లు శ్రీగురుదేవుని యపార కరుణారసముచే సులభముగ భవసాగరమును దాటి శ్రీగురుపదమగు చిన్మయ పరబ్రహ్మమును నిరంతరమును పొందుచున్నారు. శ్రీగురువనగా శిష్యులను తరింపజేయవచ్చిన లీలామానుష విగ్రహుడగు పరమాత్మదేవుడు.

**శిష్యాణాం జ్ఞానదేహాయ లీలయా దేహధారిణే ।**
**సదేహాయ విదేహాయ తస్మై శ్రీగురవే నమః ॥**

వస్తుతః దేహము లేనివాడైనను భక్తులకొఱకు దేహము ధరించినవాడు శ్రీగురువు.

అవ: శ్రీగురుస్తుతిః

**అచ్యుతాయ నమస్తుభ్యం గురవే పరమాత్మనే ।**
**స్వారామోక్తపదేచ్ఛూనాం దత్తం యేనాచ్యుతం పదమ్ ॥ 336**

అచ్యుతాయ - నమః - తుభ్యం - గురవే - పరమాత్మనే - స్వారామోక్తపదేచ్ఛూనాం-దత్తం - యేన - అచ్యుతం - పదం.

యేన = ఏ మహాత్మునిచేత, స్వారామోక్తపదేచ్ఛూనాం - స్వ = తనయందు (బ్రహ్మమందు), ఆరామ = ఉంతట క్రీడించువారిచేత (ఆత్మారాములచేత), ఉక్త = తెలుపబడిన, పద = పదమందు (ముక్తియందు), ఇచ్ఛూనాం = ఇచ్ఛగలవారికి, అచ్యుతం = భ్రంశములేని శాశ్వతమయిన, పదం = ఆత్మజ్ఞానస్థానము (పరబ్రహ్మపదము), దత్తం = ఇవ్వబడెనో (బోధింపబడెనో), తస్మై = అటువంటి, అచ్యుతాయ = చ్యుతిరహితస్థానమును జెందిన, పరమాత్మనే = పరబ్రహ్మస్వరూపు లయిన, గురవే = గురువరులయిన, తుభ్యం = మీకొఱకు, నమః = ప్రణామము.

నిరంతర మాత్మయందు క్రీడించు జ్ఞానులకు ముక్తిపదవిని తెలుపు చున్నారు. అట్టి కైవల్యపదవిని వాంఛించుచున్న పరమభక్తులకు శాశ్వత మయిన భ్రంశములేని పరబ్రహ్మస్థానమును శ్రీగురువరులు బోధించి వారిని పొందునట్లు చేయుచున్నారు. అట్టి పరమదయాశాలురు అచ్యతపదమును పొందిన వారలు పరమాత్మస్వరూపు లయిన శ్రీగురువులగు మీకొఱకు నిత్యము నమస్కారము. నాకును నట్టి పరమస్థానకైవల్య మనుగ్రహించుడు.

అవ: శ్రీగురుస్తుతి:

**నమోఽచ్యుతాయ గురవేఽజ్ఞానధ్వాన్తైకభానవే ।**
**శిష్యసన్మార్గపటవే కృపాపీయూషసిన్ధవే ॥ 337**

నమః - అచ్యుతాయ - గురవే - అజ్ఞానధ్వాన్తైకభానవే - శిష్యసన్మార్గపటవే -

అచ్యుతాయ = విష్ణుస్వరూపుడును, నాశరహితుడును, అజ్ఞానధ్వాన్తైకభానవే - అజ్ఞాన = అజ్ఞానమను, ధ్వాన్త = అంధకారమునకు, ఏక = ముఖ్యమగు, భానవే = సూర్యుడయిన వాడును, శిష్యసన్మార్గపటవే - శిష్య = శిష్యులయొక్క, సన్మార్గ = సత్తగు తత్త్వమార్గమందు, పటవే = సమర్థు డయినవాడును, కృపాపీయూషసిన్ధవే = దయయమృతసాగరు డైన వాడునగు,

గురవే = శ్రీ గురుదేవునికొఱకు, నమః = నమస్కారము.

ఎప్పుడును చ్యుతిలేని వాడును, శాశ్వతుడును, కేవల జ్ఞానానంద స్వరూపుడును, సర్వాన్తర్యామి యగు విష్ణు స్వరూపుడును, అజ్ఞానాంధకారమునకు భాస్కరు డైనవాడును, శిష్యులను తత్త్వమార్గమందు ప్రవేశపెట్టుటకు సమర్థు డయినవాడును, కరుణామృతజలధి యయిన వాడును నగు శ్రీ గురుదేవుని కొఱకు నమస్కారము.

అవ: ఈ శ్లోకము శ్రీగురుధ్యానమును పూర్తిజేయుచున్నారు.

**ఓమచ్యుతాయ గురవే శిష్యసంసారసేతవే ।**
**భక్తకార్యైకసింహాయ నమస్తే చిత్సుఖాత్మనే ॥ 338**

ఓం - అచ్యుతాయ - గురవే - శిష్యసంసారసేతవే - భక్తకార్యైకసింహాయ - నమః - తే - చిత్సుఖాత్మనే.

శిష్యసంసారసేతవే = శిష్యులయొక్క సంసారమహా ప్రవాహమునకు వారధి (వంతెన) యయినవారును, భక్తకార్యైకసింహాయ = భక్తులయొక్క కార్యమందు ముఖ్యసింహ మయిన వారును, చిత్సుఖాత్మనే = చిద్రూపసుఖ స్వరూపులును, అచ్యుతాయ = కేవల బ్రహ్మలక్ష్యమందు చ్యుతిలేక యుండువారును, ఓం = ఓంకార శబ్దవాచ్యులును, గురవే = మద్గురువులును నయిన, తే = మీకొఱకు, నమః = నమస్కారము.

శిష్యులు సదా సంసారమను సముద్రమును దాటుటకు వంతెనవంటి వారును (శ్రీగురుపాద సమాశ్రయణముచే సంసారభయముండదని యర్థము), భక్తులయొక్క మనోరథములను జ్ఞానమును ఫలింపజేయు కార్యములందు సింహమువలె శూరత్వము వహించియున్న వారును (సింహము మహాగజములను భేదించి తృప్తిపొందుచున్నది. అది దానియొక్క కార్యము. ఆప్రకారము మోక్షమార్గమునగల ముముక్షువులయొక్క మహాప్రతిబంధములను నశింప జేయడమే శ్రీగురుకార్యమై యున్నది), చిదానందరూపులును, లక్ష్యమునుండి జారనివారును, గురువులయిన తమకొరకు నమస్కారము.

**గురునామసమం దైవం న పితా న చ బాంధవాః ।**
**గురునామసమస్స్వామీ నేదృశం పరమం పదమ్ ॥ 339**

గురునామనమం - దైవం - న - పితా - న - చ - బాన్ధవాః - గురునామసమః - స్వామీ - న - ఈదృశం - పరమం - పదం.

గురునామసమం = గురునామముతో సమానమగు, దైవం = దైవము, న = లేదు, పితా = తండ్రియు, న = లేడు, బాన్ధవాః = బంధువులు, న = లేరు, గురునామసమః = గురునామముతో సదృశమగు, స్వామీ = ప్రభువు, న = లేడు, ఈదృశం = ఇటువంటి (శ్రీ గురునామముతో సమమగు), పరమం పదం = మోక్షస్థానము, న = లేదు.

శ్రీగురునామస్మరణమే దైవము, రక్షించు తండ్రి, హిత మొనరించు బాంధవులు అగుచున్నారు. శ్రీగురునామ స్మరణతో సమానమగు ప్రభువున్ను లేడు. శ్రీగురునామ స్మరణమే మోక్షస్థానము. శ్రీగురునామస్మరణమే యన్నిటికి మూలమని భావము.

అవ: శ్రీగురుదేవుని విస్మరించిన వానిగతిని విశదపఱచుచున్నారు.

**ఏకాక్షరప్రదాతారం యో గురుం నైవ మన్యతే ।**
**శ్వానయోనిశతం గత్వా చండాలేష్వపి జాయతే ॥ 340**

ఏకాక్షరప్రదాతారం - యః - గురుం - న - ఏవ - మన్యతే - శ్వానయోనిశతం - గత్వా - చండాలేషు - అపి - జాయతే.

యః = ఎవడు, ఏకాక్షరప్రదాతారం - ఏకాక్షర = ఒక యక్షరమగు నోంకారమును, ప్రదాతారం = ఇచ్చునటువంటి (ఏకమగు నాశరహితమైన పరబ్రహ్మమును బోధించునట్టి) మహాత్ముని, గురుం = గురువునుగ, నైవ మన్యతే = తలంచనే తలంచడో, (సః = అట్టి కృతఘ్నుడగు పాపాత్ముడు), శ్వానయోనిశతం = కుక్కలయొక్క జన్మశతమును, గత్వా = పొంది, (శునకజన్మ శతమును బడసి), చండాలేషు అపి = చండాలురయందును, జాయతే= పుట్టుచున్నాడు.

వేదములకును మంత్రములకును శిరస్సై, పరమసారమై, జపించినంత మాత్రమున ప్రాణమును నూర్ధ్వముగ జేయునట్టియు, క్షణములో చిత్తలయమును పొందించు నట్టియు, దృశ్యరహిత మైనట్టియు నగు ప్రణవమును, ప్రణవార్థమగు

శాశ్వతమగు నద్వితీయపరబ్రహ్మము నుపదేశించునట్టి మహాత్మునిగూడ గురువని తలంచక నవజ్ఞజేసిన వాడెవడో, అట్టి కృతఘ్నుడు తనయొక్క పవిత్రమగు మానవజన్మమును చెడగొట్టుకొనిన వాడగుటయే గాక, మహానీచమగు నధమమగు, శునకయోనిలో నూరుసార్లు జన్మించుచున్నాడు. ఇట్లు కుక్కజన్మముల నూరింటిని ధరించియు, తుదకు చండాలురయందు పుట్టుచున్నాడు. ఇదంతయు కృతఘ్నత యొక్క ఫలితమని తెలియవలెను.

**మిత్రద్రోహీ కృతఘ్నశ్చ యశ్చ విశ్వాసఘాతకః ।**
**త్రయస్తే నరకం యాన్తి యావత్ చంద్రదివాకరమ్ ॥**

అని సామాన్యశాస్త్రము పలుకుచుండగా పరంధాముడగు పరమదయాళువగు కేవలచైతన్య బ్రహ్మమును బోధించినట్టి పరమగురువును మరచిన వానినిగురించి చెప్పవలసిన దేమున్నది?

అవ: గురుకృతఘ్నతా ఫలితము.

**గురుత్యాగాద్భవేన్మృత్యుః మంత్రత్యాగాద్దరిద్రతా ।**
**గురుమంత్రపరిత్యాగీ రౌరవం నరకం వ్రజేత్ ॥** **341**

గురుత్యాగాత్ - భవేత్ - మృత్యుః - మంత్రత్యాగాత్ - దరిద్రతా - గురుమంత్రపరిత్యాగీ - రౌరవం - నరకం - వ్రజేత్.

గురుత్యాగాత్ = గురువును మరచుటవలన, మృత్యుః = మరణభయము, భవేత్ = కలుగును, మంత్రత్యాగాత్ = మంత్రమును వదలుటవలన, దరిద్రతా = దారిద్ర్యము గలుగును, గురుమంత్రపరిత్యాగీ = గురువును మంత్రమును వదలినవాడు, రౌరవం నరకం = రౌరవమను నరకమును, వ్రజేత్ = పొందును.

ఓ మహాదేవీ! పరబ్రహ్మస్వరూపుడగు శ్రీగురుమూర్తిని మరచుటవలన నాత్మజ్ఞానము లేక మరణభయముచే భీతిల్లుచున్నాడు. మఱియు గురువుచే నుపదేశింపబడిన మంత్రమును త్యాగ మొనరించుటవలన దారిద్ర్యము సంభవించు చున్నది. ఇకను గురుదైవమందు భక్తిలేకను, మంత్రమునుగూడ విసర్జించినవాడు మహారౌరవ నరకమును పొందుచున్నాడు. ఏదో పూర్వపుణ్య వశముచే

గురుపుత్రులైనవా రీయుపదేశమును సర్వదా జ్ఞప్తిలో నుంచుకొనవలెను.

అవ: గుర్వాజ్ఞ అనుల్లంఘనీయము:

**శివక్రోధాద్గురుస్త్రాతా గురుక్రోధాచ్ఛివో న హి ।**
**తస్మాత్సర్వప్రయత్నేన గురోరాజ్ఞాం న లంఘయేత్ ॥ 342**

శివక్రోధాత్ - గురుః - త్రాతా - గురుక్రోధాత్ - శివః - న - హి - తస్మాత్ - సర్వప్రయత్నేన - గురోః - ఆజ్ఞాం - న - లంఘయేత్.

శివక్రోధాత్ = ఈశ్వరునియొక్క కోపమునుండి, గురుః = గురువు, త్రాతా = రక్షించువా డగుచున్నాడు, గురుక్రోధాత్ = గురువరుని కోపమునుండి, శివః = మహేశ్వరుడు, న త్రాతా = రక్షించువాడు కాడు, హి = నిశ్చయము, తస్మాత్ = అందువలన, గురోః = గురువుయొక్క, ఆజ్ఞాం = ఆజ్ఞను, సర్వప్రయత్నేన = సమస్తప్రయత్నములచేతను, న లంఘయేత్ = దాటకూడదు.

ఒకవేళ మహేశ్వరునికి కోపము వచ్చి శాపగ్రస్తుడైన వానిని శ్రీ గురుదేవుడు ఆ శాపమునుండి రక్షించుచున్నాడు. వానికి తగు నుపాయములను బోధించి వానిని పవిత్రునిగ చేయుచున్నాడు. కాని శ్రీ గురుదేవునికి కోపము గలిగెనేని యది యతిక్రమింప శివునకును సాధ్యము గాదు. అదెట్టిదనగా క్రిందునున్న కోర్టులలో రద్దుచేయబడిన ఫిర్యాదులను పై కోర్టువారు తిరుగ విచారణకు తీసుకొని రావచ్చును. అయితే పార్లమెంటునందు తీర్మానించబడిన విచారణనుగాని, మరి దేనినిగాని రద్దు చేయుట క్రిందికోర్టుకు సాధ్యము గాదు. మఱియు రాజద్రోహులను గూడ తప్పింపనలవి గాదు. అట్లే శ్రీ గురుదేవునియొక్క కోపము నుల్లంఘించి శాపమును త్రిప్పుటకు మరియొకరికిని సాధ్యము గాదు. గురుద్రోహము మహాబలిష్ఠ మైనది. సకలదేవతలును గురుద్రోహిని దూరీకరించుచున్నారు. అందువలన నెప్పుడును శ్రీగురుదేవునియొక్క ఆజ్ఞ నన్నివిధములుగ పాలింపవలయును. అందుచే పరమశ్రేయస్సు గలుగుచున్నది. ఇది నిక్కము.

అవ: "గురు" అను మంత్రముయొక్క స్వరూపమును తెలుపుచు దానిని స్మరించుచున్నారు.

**సంసారసాగరసముద్ధరణైకమంత్రం**
**బ్రహ్మాది దేవమునిపూజితసిద్ధమంత్రమ్ ।**
**దారిద్ర్యదుఃఖభవరోగవినాశమంత్రం**
**వందే మహాభయహరం గురురాజమంత్రమ్ ॥ 343**

సంసారసాగరసముద్ధరణైకమంత్రం - బ్రహ్మాదిదేవమునిపూజిత సిద్ధమంత్రం - దారిద్ర్యదుఃఖ భవరోగవినాశమంత్రం - వందే - మహా భయహరం- గురురాజమంత్రం.

సంసార ... మంత్రం - సంసారసాగర = సంసారసముద్రమునుండి, సముద్ధరణ = బాగుగా నుద్ధరించుటకు, ఏకమంత్రం = ముఖ్యమైన మంత్రమైనదియు, బ్రహ్మ ... మంత్రం - బ్రహ్మాదిదేవ = బ్రహ్మమొదలగు దేవతలచేతను, ముని = మహర్షులచేతను, పూజిత = పూజింపబడిన, సిద్ధమంత్రం = సకల సిద్ధు లొసంగు మంత్ర మైనదియును, దారిద్ర్య ... మంత్రం - దారిద్ర్య = దారిద్ర్యదుఃఖమును, భవరోగ = సంసారవ్యాధిని, వినాశమంత్రం = నశింపజేయు మంత్రమైనదియును, మహాభయహరం = అజ్ఞానజన్యమగు మహాభయమును (మరణభయమును) హరింపజేయునదియు, గురురాజమంత్రం - గురు = 'గురు' అను, రాజమంత్రం = శ్రేష్ఠమగు మంత్రమును (మంత్రస్వరూపుడైన గురుపరమాత్మను) గూర్చి, వందే = నమస్కరించుచున్నాను.

సంసార సముద్రమునుండి దీనజనుల నుద్ధరించుటకు ముఖ్యమగు మంత్ర మైనదియు, బ్రహ్మదేవుడు మొదలగు దేవాదిదేవతలచేతను మహర్షివరుల చేతను సతతము పూజింపబడుచున్నదై సకలసిద్ధుల నొసగు సిద్ధులయొక్క మంత్ర మైనదియు, దారిద్ర్యదుఃఖమును సంసారవ్యాధిని నశింపజేయునట్టి మంత్ర మైనదియు, నిత్యమజ్ఞానముచే జనించు మహాభయమగు మరణభీతిని క్షణములో దూరీకరించు నదియు, సకలమంత్రములలో శ్రేష్ఠమైనదియునగు గురు మంత్ర మును, తన్మంత్రస్వరూపుడగు గురుదేవుని సతతము ప్రణమిల్లుచున్నాను. అన్నివిధములుగ నది యెల్లవేళల రక్షించుగాక! జ్ఞానప్రదాయి యగుగాక! శ్రీగురు కృపచే పరమశాంతి గలుగుగాక!

అవ: జనుల సులభముగ తరించు మహోత్తమ మంత్రమును నుడువుచున్నారు.

**సప్తకోటిమహామంత్రాః చిత్తవిభ్రమకారకాః ।**
**ఏక ఏవ మహామంత్రో గురురిత్యక్షరద్వయమ్ ॥ 344**

సప్తకోటిమహామంత్రాః - చిత్త విభ్రమకారకాః - ఏకః - ఏవ - మహామంత్రః - గురుః- ఇతి - అక్షరద్వయం.

సప్తకోటిమహామంత్రాః = ఏడుకోట్లమహామంత్రములు, చిత్తవిభ్రమ కారకాః = మనోభ్రాంతిని గలిగించునవిగ అగుచున్నవి. గురుః ఇతి = గురువుఅని, అక్షరద్వయం = రెండక్షరములు గల, ఏక ఏవ = ఒక్కటియే, మహామంత్రః = చిత్తశాంతిని గలిగించు మహామంత్రముగ నున్నది.

ప్రత్యక్షముగ నన్నివిధములచే మార్జాలకిశోరన్యాయము ననుసరించి నిరంతరము సంరక్షించుచున్న శ్రీ గురుదేవుడే సాక్షాన్మహేశ్వరుడు. 'శివ' అను మహామంత్ర మువలె 'గురు' అను మహామంత్రము తారకమంత్రమై భక్తులను తనియింపజేయు చున్నది. సప్తకోటి మహామంత్రములుగూడ చిత్తమును జెఱచునవి గాక వానిచే జ్ఞానలేశము శాంతియు లభింపవు. 'గురు' అను ద్వ్యక్షరమంత్రము చిత్తశాంతిని గలిగించి జ్ఞానదాయిగ నున్నది. తరించువారికి నొకేమంత్రము, లక్ష్యార్థము ఒకటియే చాలును; అందుచే నిట్లు చెప్పిరి.

అవ: మహాదేవుడు పార్వతీదేవికి గురుగీతాశాస్త్రమును చెప్పి పూర్తిచేయుచున్నాడు. మరియు విశ్వాసము గలుగుటకై యిట్లు వచించుచున్నాడు.

**ఏవముక్త్వా మహాదేవః పార్వతీం పునరబ్రవీత్ ।**
**ఇదమేవ పరం తత్త్వం శృణు దేవి! సుఖావహమ్ ॥ 345**

ఏవం - ఉక్త్వా - మహాదేవః - పార్వతీం - పునః - అబ్రవీత్ - ఇదం - ఏవ - పరం - తత్త్వం - శృణు - దేవి - సుఖావహం.

మహాదేవః = ఈశ్వరుడు, ఏవం = ఈ ప్రకారము, ఉక్త్వా = చెప్పి, పార్వతీం = పార్వతీదేవినిగూర్చి, పునః = మరల, అబ్రవీత్ = పలికెను, ఇదమేవ = ఈ గురుతత్త్వమే, సుఖావహం = బ్రహ్మానందమునొసగు, పరంతత్త్వం = శ్రేష్ఠమగుతత్త్వ మగుచున్నది, హే దేవి = ఓ మహాదేవీ!, శృణు = దీనిని వినుము.

లోకములో పరమానందము నొసంగునట్టి శ్రేష్ఠమగు తత్త్వము నీ గురుతత్త్వమే యగుచున్నది. ఓ మహాదేవీ!, దీనిని వినుము. అనగా శ్రీ గురుగీతాశ్రవణమును గావింపుము.

అవ: గురుగీతా రహస్యము:

**గురుతత్త్వమిదం దేవి! సర్వముక్తం సమాసతః**
**రహస్యమిదమవ్యక్తం న వదేద్యస్య కస్యచిత్ ॥ 346**

గురుతత్త్వం - ఇదం - సర్వం - ఉక్తం - సమాసతః - రహస్యం - ఇదం - అవ్యక్తం - న - వదేత్ - యస్య - కస్య - చిత్.

హే దేవి = ఓ మహాదేవీ, ఇదం = ఈ, గురుతత్త్వం = గురుస్వరూపము, సర్వం = సమస్తము, సమానతః = సంగ్రహముగ, ఉక్తం = చెప్పబడెను, అవ్యక్తం = ఏ శాస్త్రములోను స్పష్టముగా నుండని, ఇదం = ఈ, రహస్యం = గురుతత్త్వమును, యస్య కస్య చిత్ = ఎవనికిని, న వదేత్ = వచింపగూడదు.

ఓ పార్వతీదేవీ! నే జెప్పవలసిన గురుతత్త్వ మంతయు సంగ్రహముగ వచించితినికాని, ఇది శాస్త్రములలో స్పష్టముగ లేదు. అట్టి రహస్యమగు గురు తత్త్వమును నీ్రమోల విశదపరచితిని. దీనిని భక్తిలేనివారి కెవరికిని బోధింప కూడదు.

అవ: గురుగీతామహిమ:

**న మృషా స్యాదియం దేవి! మదుక్తిః సత్యరూపిణీ ।**
**గురుగీతాసమం స్తోత్రం నాస్తి నాస్తి మహీతలే ॥ 347**

న - మృషా - స్యాత్ - ఇయం - దేవి - మదు క్తిః - సత్యరూపిణీ - గురుగీతాసమం- స్తోత్రం - న - అస్తి - న - అస్తి - మహీతలే.

హే దేవి = ఓ గౌరీదేవీ, ఇయం = ఈ, మదుక్తిః = నావాక్యము, సత్యస్వరూపిణీ = యథార్థస్వరూపము గలది, మృషా = అసత్యముగ, న స్యాత్ = కానేకాదు, మహీతలే = భూమియందు, గురుగీతాసమం = గురుగీతకు సమమగు, స్తోత్రం = స్తోత్రము, నాస్తి నాస్తి = లేదు లేదు.

శివస్వరూపుడనగు నాయొక్క సూక్తి సత్యస్వరూప మైనది. ఓ గౌరీ! నావాక్య మెప్పుడు నసత్యము గాదు. వేయి చెప్పనేల, సకలశాస్త్ర సారభూతమైన కైవల్య దాయియైన ఈ గురుగీతా స్తోత్రములో సమమగు, మహాపవిత్రమగు, సద్యః ఫలదాయి అగు స్తోత్రము ముల్లోకములందు లేదు  లేదు. శ్రీగురుతత్త్వమే

పరమశ్రేష్ఠము, శివము.

అవ: గురుగీతా ప్రయోజనము:

**గురుగీతామిమాం దేవి! భవదుఃఖవినాశినీమ్ ।**
**గురుదీక్షావిహీనస్య పురతో న పఠేత్ క్వచిత్ ॥ 348**

గురుగీతాం - ఇమాం - దేవి - భవదుఃఖ వినాశినీమ్ - గురుదీక్షా విహీనస్య - పురతః - న - పఠేత్ - క్వ - చిత్.

హే దేవి = ఓ భవానీ, ఇమాం = ఈ, భవదుఃఖవినాశినీమ్ = సంసారదుఃఖములను నశింపజేయునట్టి, గురుగీతాం = శ్రీగురుగీతను, గురుదీక్షావిహీనస్య = గురూపదేశదీక్ష లేనివానియొక్క, పురతః = దగ్గర, క్వచిత్ = ఏ ఒకప్పుడైనను, న పఠేత్ = పఠించకూడదు.

ఓ గిరిజాదేవీ! ఈ గురుగీత యనునది సంసారదుఃఖ పాశలవిత్రమై (కొడవలియై) యున్నది. అనగా సర్వదుఃఖములను నశింపజేయునది. ఇట్టి మహాపవిత్రమగు శ్రీగురుగీతాశాస్త్రమును గురుపుత్రుడై మంత్రోపదేశదీక్ష గైకొనని వాని సమీపమున వేమరుపాటు జెందిగాని పఠించకూడదు. అట్టివారికి పారాయణక్రమమునుగూడ వచింపకూడదు.

**రహస్యమత్యన్తరహస్యమేత న్న పాపినా లభ్యమిదం మహేశ్వరి! ।**
**అనేకజన్మార్జితపుణ్యపాకాద్గురోస్తు తత్త్వం లభతే మనుష్యః ॥ 349**

రహస్యం - అత్యన్తరహస్యం - ఏతత్ - న - పాపినా - లభ్యం - ఇదం - మహేశ్వరి- అనేకజన్మార్జితపుణ్యపాకాత్ - గురోః - తు - తత్త్వం - లభతే - మనుష్యః.

హే మహేశ్వరి = ఓ మహేశ్వరీ, ఏతత్ = ఈ గురుగీతాశాస్త్రము, రహస్యం = శాస్త్రములలోను గుప్తమైనది (సారమైనది), అత్యంతరహస్యం = వేదాన్తశాస్త్రములలోను పరమగోప్యమైనది (పరమసార మైనది), ఇదం = ఇట్టి గురుగీతాతత్త్వము, పాపినా = పరమార్థతత్త్వ విముఖుడగు పాపాత్మునిచేత, న లభ్యం = పొందదగినది గాదు, అనేక జన్మార్జిత పుణ్యపాకాత్= అనేకజన్మములనుంచి సంపాదింపబడిన పుణ్యపరిపాకమువలన (అనంతపుణ్య ఫలమువలన), గురోః = శ్రీ సద్గురు పరబ్రహ్మముయొక్క, తత్త్వం తు = యథార్థము నగు జ్ఞానత తత్త్వము నైతే, మనుష్యః = మనుష్యుడు, లభతే = పొందుచున్నాడు.

ఓ మహేశ్వరీ! వినుము. ఈ గురుగీతాశాస్త్రము తత్త్వశాస్త్రములలోను గోప్యమై (స్పష్టము గానిదై) సారమై యున్నది. ఇకను వేదాన్తశాస్త్రములలోను పరమగుప్తమై పరమసారమై యున్నది. అనగా సకలవేదాంతశాస్త్రములలోను నిది శ్రేష్ఠమైన జ్ఞానతత్త్వము. దీనిని పరబ్రహ్మతత్త్వమం దభిరుచిలేక మలి నాంతః కరణము గల పాపాత్ముడు తెలిసికొన జాలడు. వాని కిది లభ్యము గాదు. నానా జన్మలనుంచి పలువిధములగు సత్కర్మల నాచరించి, వానియొక్క ఫలితముచే నంతఃకరణశుద్ధి గలిగిన జిజ్ఞాసు వగువానికి నీ గురుపరబ్రహ్మతత్త్వము ప్రాప్త మగును. అందుచే నతడు ముక్తు డగును.

అవ: శ్రీగురుకృపాస్తోత్రామృతము:

**యస్య ప్రసాదాదహమేవ సర్వం**
**మయ్యేవ సర్వం పరికల్పితం చ ।**
**ఇత్థం విజానామి సదాత్మరూపం**
**తస్యాంఘ్రిపద్మం ప్రణతోఽస్మి నిత్యమ్ ॥** 350

యస్య - ప్రసాదాత్ - అహం - ఏవ - సర్వం - మయి - ఏవ - సర్వం - పరికల్పితం- చ - ఇత్థం - విజానామి - సదాత్మరూపం - తస్య - అంఘ్రిపద్మం - ప్రణతః - అస్మి - నిత్యం.

యస్య = ఏ గురుదేవునియొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, సర్వం = ఈ సమస్తము, అహమేవ = పరబ్రహ్మస్వరూపుడగు నేనుగానే యున్నానో, కిం చ = మఱియు, మయ్యేవ = సర్వాధిష్ఠానమగు పరమాత్మస్వరూపుడగు నాయందే, సర్వం = సమస్తదృశ్యజాతము, పరికల్పితం = కల్పింపబడినదో, ఇత్థం = ఇట్లభేదరూపముగ నేను, సదాత్మరూపం = సత్తగు ఆత్మస్వరూపునిగ (పరబ్రహ్మస్వరూపునిగ), విజానామి = తెలియుచున్నాడో, తస్య = అట్టి గురువరునియొక్క, అంఘ్రిపద్మం = పాదారవిందమునుగూర్చి, నిత్యం = నిరంతరము, ప్రణతః = నమస్కరించు వాడనుగ, అస్మి = అగుచున్నాను.

**మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్ ।**
**మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్ ॥**

అను నఖండజ్ఞానమును కైవల్యోపనిషత్తు బోధించుచున్నది. అట్టి జ్ఞానతత్త్వ

మునే ఇందు నిరూపించుచున్నారు. శ్రీగురుదేవునియొక్క పరమకృపా సారామృత మేదియో దానిని దెలుపుచున్నారు. శ్రీపరమగురుదేవుని యొక్క యనుగ్రహము లేక నేదియు సిద్ధించుదు. జ్ఞానతత్త్వము సిద్ధించువిషయములో వారి కృపాకటాక్ష వీక్షణపాతము లేక గలుగదని మఱిచెప్పవలయునా?

ఏ మహాత్మునియొక్క అనుగ్రహాతిశయముచే దృశ్యజాత మంతయు పరబ్రహ్మస్వరూపుడనగు నాయొక్క చైతన్యస్వరూప మైనదో, ఆ జగమంతయు సర్వాధిష్ఠాన పరమాత్మనగు నాయందు కల్పింపబడినదో, అనగా 'జగత్తంతయు మిథ్యాదృష్టిచే పరికల్పితము; అవశిష్టమైనది పరబ్రహ్మమే; జగత్తనునది లేదు; పరమాత్మ యొక్కడే; జీవుడనువాడు లేడు; నిరుపాధిక తత్త్వమగు శివుడొక్కడే యుంటున్నాడు' - ఇట్టి శ్రీగురుపరబ్రహ్మ పరతత్త్వము నేమహాత్మునిచే నాకు ప్రాప్త మాయెనో, అటువంటి కృపామయ, సుధామయ, జ్ఞానమయ, చైతన్యమయ, శాంతిమయ, నిర్వికార, నిష్కళంక, నిరుపమ, నీరూప, నిరంజన, పరిపూర్ణా నందమయుడు, పరబ్రహ్మస్వరూపుడునైన శ్రీగురుదేవునియొక్క విజ్ఞానమయ పాదారవిందమును నేను నిరంతరము నమస్కరించుచున్నాను; స్మరించుచున్నాను; ధ్యానించుచున్నాను.

శ్రీగురుపాదారవిందమే అనన్యశరణ్యమని నమ్మి సదా యుపాసించుచున్న నాకు వేరొండు భాగ్యము గలదా! శ్రీగురుతత్త్వమే నాకు పరమతత్త్వము, బ్రహ్మానందదాయకము. తత్ సన్నిధానమున నేను ధన్యుడను; కృతార్థుడను; అభయస్వరూడను; కృతకృత్యుడను. శ్రీగురుపదమే శివము; ఆనందము; అద్వయము; కైవల్యము.

**తస్మాత్పరతరం నాస్తి గురుమేవ సదా భజే ।**
**గురుం వినా న జీవామి గురుబ్రహ్మ నమామ్యహమ్ ॥**

అవ: ఈ శ్రీగురుగీతయొక్క సారాంశమును దెలుపునట్టి యీ శ్లోకముచేత గ్రంథపూర్తి చేయుచున్నారు.

**అజ్ఞానతిమిరాన్ధస్య విషయాక్రాన్తచేతసః ।**
**జ్ఞానప్రభాప్రదానేన ప్రసాదం కురు మే ప్రభో ॥ 351**

అజ్ఞానతిమిరాన్ధస్య - విషయాక్రాన్తచేతసః - జ్ఞానప్రభాప్రదానేన - ప్రసాదం - కురు - మే - ప్రభో.

అజ్ఞానతిమిరాన్ధస్య - అజ్ఞాన = ఆత్మస్వరూపమును తెలియక పోవుటను అజ్ఞానమనెడి, తిమిర = తిమిరవ్యాధిచేత (చీకటిచేత) అన్ధస్య = కన్ను కనపడని, విషయాక్రాన్తచేతసః - విషయ = శబ్దాదివిషయములచేత, స్రక్ చందన వనితాది విషయములచేత, విషయాభిలాషచేత, ఆక్రాన్త = ఆక్రమింపబడిన వ్యాపింపబడిన, చేతసః = అన్తఃకరణముగల, మే = నాకొఱకు, జ్ఞానప్రభాప్రదానేన - జ్ఞాన = స్వస్వరూపమగు నాత్మను దెలియటను బ్రహ్మజ్ఞానమనెడు, ప్రభా = ప్రకాశముయొక్క, ప్రదానేన = ఇచ్చుటచేత, హే ప్రభో = దయాళువగు నో స్వామి! జగద్గురో, ప్రసాదం = అనుగ్రహమును, కురు = చేయుమా.

**శ్రీగురుగీతబోధయొక్క ముఖ్యాంశ మేమనగా -** శ్రీగురువుయొక్క అనుగ్రహమును సంపాదించ వలయును. అనుగ్రహము పూర్తిగా గల్గినచో, గురుతత్త్వ స్వరూపమునే పొందనవా డగుచున్నాడు. ఆత్మజ్ఞానముచే సంపూర్ణా ఖండానంద కైవల్యము నిచ్చోటనే పొందుచున్నాడు. కావున శ్రీగురుదేవుని కృపాకటాక్షమునే శిష్యుడు ప్రార్థించుచున్నాడు. ఓ స్వామి! దయామయా! జ్ఞానస్వరూపా! అఖండతేజోనిధీ! నన్నుద్ధరింపుము, నన్నుద్ధరింపుము. నాయొక్క పరిస్థితిని గమనించుడు.

నేను సహజముగా నా స్వరూపమును మరచి అజ్ఞాననిద్రలో నున్నాను. నాకేమియు తెలియుట లేదు. కాచుకొని నెత్తిమీద తాండవమాడు చున్న మృత్యువునుగూడ తెలియను. నిద్రలో సమస్తమును మరచినట్లు నన్ను నేను మరచినాను. ఇంత ప్రమాదములో పడిపోయినాను. అందుచే నజ్ఞానమను తిమిరవ్యాధి ప్రబలమయి యున్నది. తిమిరవ్యాధిచే మానవుడు సమీపములో నున్న వస్తువును దెలియజాలడు. ఒకవేళ కానుపించినచో, ఒక్కవస్తువును రెండునుగా గాంచును. ద్విసూర్యులను ద్విచంద్రులను మసకతో గూడుకొని చూచుచున్నాడు. ఆప్రకారము అజ్ఞాన మనునదియు తనలోనున్న ఆత్మయొక్క దర్శనమును గలిగింపకున్నను విపరీతబుద్ధినిగూడ గలిగించుచున్నది. అందుచేతనే ఒకే పరమాత్మ జీవుడుగను, దేవుడుగను రెండువిధములుగా గానవచ్చుచున్నారు. జగత్తు వేరు, బ్రహ్మము వేరు అను భేదబుద్ధియు ప్రబల మగుచున్నది. తరువాత

ననేకమోహభ్రాన్తులు గలిగి బహువిధములగు ననర్థములకు కారణ మేర్పడుచున్నది. ఇదంతయు నజ్ఞానముయొక్క విలసితముగా నున్నది.

అజ్ఞాన మనగా మాయాన్ధకారము; వేరుగాదు. చీకటియొక్క గుణములు మాలిన్యము అంతట వ్యాపించుట, దేనిని తెలియఁజేయకుండుట, స్థాణువును పిశాచముగ, దొంగగ; త్రాడును సర్పముగ - మొదలగు విధములుగ తోఁపింపజేయు నయథార్థ జ్ఞానరూప సకలానర్థకారక విపరీతబుద్ధిని గలిగించుట మొదలగునవి యగుచున్నవి. అట్లే అజ్ఞానాంధకారము అన్తఃకరణము నంతయు మాలిన్యద్రవ్య లిప్తముగ చేయుచున్నది. చిత్తమును సందులేకుండ వ్యాపించుచున్నది. తనలో నిరంతర మున్టున్న ఆత్మను జీవునిగ భ్రాన్తునిగ దుఃఖినిగ జేయుచున్నది. జగత్తు నిశ్చయముగ నుంటున్నది; పరమాత్మవిషయము సందేహము అను అయథార్థ జ్ఞానమును గలిగించి భేదబుద్ధినే స్థిరము జేయుచున్నది.

ఇట్టి యజ్ఞానముండుటచే నాలోనున్న ఆత్మనే తెలియక యున్నాను. దేవాలయములో గర్భగుడిలో దేవుడున్నాడు కాని ఒక చిన్న దీపము లేనందుచే దేవుని జూడజాలకున్నాను. అట్లే శరీరమను దేవాలయములో జ్ఞానమను దీపము లేనందుచే సోఽహంభావ స్వరూపదేవుని జూడలేకున్నాను. ఇట్టి దుర్గతిని పొందియున్నాను. ఇంతమాత్రమే గాదు. అజ్ఞానకార్యము లనేకములు గలవు. వానిలో విషయాభిలాష యనునది మహాతీవ్ర మయినది. నామనస్సు నంతయు దూషిత మొనరించి చలింపజేయుచున్నది. సంసార సముద్రములో బడబాగ్నివలె నున్నది. తీరని సంతాపమునే గలిగించుచున్నది. విషయము లనగా శబ్ద స్పర్శ రూప రస గంధములు స్రక్ చందన వనితాదులు- ఇవన్నియు అజ్ఞానజనితములు. వీనియందలి యాశ దృశ్యములోనికి నాకర్షించి సంసారసాగరములో ముంచి వేయుచున్నది. అన్తః కరణము శుద్ధము గానిచో దేనిని గాంచగలము? అద్దము మలిన మయిన విముఖ మయిన ప్రతిబింబముగాను గాంచగలమా? అట్లే అన్తఃకరణదర్పణము మలినమై ఆత్మవిముఖ మయినచో నాత్మను దర్శింపగలదా? అజ్ఞానకార్యమును, అందులో విషయాభిలాషయొక్క దౌష్ట్యమును భగవద్గీత వచించుచున్నది. చూడుడు:-

అవ: ఆత్మజ్ఞానావృతావశ్యకము:

**అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జంతవః ।**
**ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా ॥**
**కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ ।**
**పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్ ॥**

కావున అజ్ఞానముచే నన్ను తెలియక విషయబుద్ధిచే నాక్రమింపబడియున్న యీ దీనుని జ్ఞానప్రకాశము నొసగి నన్ననుగ్రహింపుడు, నన్ననుగ్రహింపుడు. మీకొఱకు నమస్కారము. మీకొఱకు నమస్కారము. అజ్ఞానమను చీకటి జ్ఞానప్రకాశము రాగానే నశించుచున్నది. ప్రకాశగుణ మేమనగా పారిశుద్ధ్యము, వస్తువుల నున్నవిధమున ప్రకాశింప జేయుట మొదలగునవి. అట్లే ఆత్మ జ్ఞాన ప్రకాశము. అన్తఃకరణమును పరిశుద్ధముగజేసి, అభిముఖముగను జేసి లోపలనున్న పరమాత్మను జూపుచున్నది. ఏలాంటి భేదభావము లేక జీవబ్రహ్మైక్యమును గలిగించుచున్నది. విపరీతమతులు మడియుచున్నవి. సర్వతోముఖముగ వ్యాపించిన పరిపూర్ణత్వము సిద్ధించుచున్నది. ఆత్మజ్ఞాన మమృతము, యథార్థము, పరిపూర్ణము, శివము, ఆనందము. ఇట్టి జ్ఞానముచేతనే అజ్ఞానతమము పూర్తిగా నశించుచున్న దనుటకు భగవద్గీతా ప్రమాణము:-

**జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।**
**తేషామాదిత్యవద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥**

కావున జ్ఞానమావశ్యకమై యున్నది. అట్టిది శ్రీ గురుదేవుని కరుణచేతనే గలుగుచున్నది. వేరు గతిలేదు. ప్రమాణములు:-

అవ: జ్ఞాన ప్రాధాన్యము:

**సంసారార్ణవమగ్నానాం జంతూనామవివేకినామ్ ।**
**అగతీనాం గతిస్సాక్షాత్ జ్ఞానమేవ హి కేవలమ్ ॥**

సంసారమను సాగరములో మునిగిన వానికిని ఆత్మానాత్మ వివేకజ్ఞానము లేనివానికిని, ఏ సహాయము లేనివానికిని సాక్షాదాత్మజ్ఞాన మొక్కటియే సహాయ

పడును. వేరు సద్గతి మార్గము లేదు.

అవ: జ్ఞానామృత విశిష్టత

**సంసారదుఃఖతప్తానామాత్మజ్ఞానామృతమ్భసా ।**
**తాపశాన్తిర్న చాన్యేన సత్యమేవ న సంశయః ॥**

సంసారతాపత్రయముచే తపించెడి జీవకోట్లకు ఆత్మజ్ఞానామృత జలముచేతనే తాపత్రయ వమనము గలుగునుగాని వేరు శమనమార్గము లేదు. ఇది సత్యము. దీనియందు సందేహమే లేదు. ఇట్టి పరమప్రకాశ రూపజ్ఞానము కలుగవలె నన్నచో శ్రీగురుదేవుని ఆశ్రయించవలయును. శ్రీ గురుదేవుని చరణామ్బుజసేవను జేయుచు, పాదతీర్థమును పుచ్చుకొనుచు, మహాపవిత్రుడై శ్రీగురుదేవుని ఆజ్ఞాపరిపాలకుడై సకలాభిమానములను వదలి శ్రీగురువరుని యొక్క మూర్తిని ధ్యానించుచు, శ్రీగురుతత్త్వమును విచారించుచు శ్రీ గురు స్వరూపమగు నాత్మస్వరూపమును దెలిసి ముక్తుడు గావలయును. శ్రీగురుదేవుని చరణారవిందమునే అనన్యశరణమని విశ్వసించవలయును. సకలాత్మజ్ఞానసిద్ధికై శ్రీగురుదేవుని యనుగ్రహమును బడయవలయును. అదియే సంసారణ్యా కుఠారము; జ్ఞానసింధు పీయూషవీచీపరమ్పర. అందుచే పరమశాంతి నొంది అఖండానంద పరిపూర్ణ పరబ్రహ్మమై, అద్వితీయమై, శివమై భాసిల్లుచున్నాడు.

అవ: గురుపరాకాష్ఠా నిరూపణము:

**గురురేవ పరం బ్రహ్మ గురురేవ పరం ధనమ్ ।**
**గురురేవ పరా విద్యా గురురేవ పరాయణమ్ ॥**

**గురురేవ పరా కాష్ఠా గురురేవ పరం ధనమ్ ।**
**యస్మాత్తదుపదేష్టాఽసౌ తస్మాద్గురుతరో గురుః ॥**

**వరగురుకరుణాలేశైః పరిణతవిద్యా పరాకృతతమసా ।**
**పరసచ్చిత్సుఖరూపపరమసంవిత్ స్వయం ప్రజాగర్తి ॥**

శ్రీ సద్గురుపరమాత్మ నెట్లు ధ్యానించవలయునో ఈ భగవద్గీతా శ్లోకమును గాంచిన స్పష్ట మగును:

**మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు ।**
**మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః ॥**

శ్రీ సద్గురు పరమాత్మయందే మనస్సుంచవలయును. శ్రీ సద్గురు భగవంతుని భక్తుడు గావలయును. శ్రీ సద్గురువుయొక్క అజ్ఞానరూప సత్కర్మ యజ్ఞమునే చేయవలయును. శ్రీ సద్గురుదేవునికొఱకే నమస్కరించవలయును. అందుచే శ్రీ సద్గురుపరబ్రహ్మ తప్ప వేరు స్ఫురణము లేనివాడై స్వస్వరూప నిష్ఠాయోగముతో నిరంతర ముండుచు నాత్మను పరమాత్మనుగా దెలిసి ఏకమై అద్వితీయ బ్రహ్మమై శివమై యున్నాడు.

అవ: శ్రీగురుమంగళము:

**మంగళం గురుదేవాయ మహనీయగుణాత్మనే ।**
**సర్వలోకశరణ్యాయ సాధురూపాయ మంగళమ్ ॥**

శ్రీ గురుప్రపత్తి:

**సతతమహం భజామి గురువరపదపంకజం శివమ్ ।**
**మలయాళగురువరేణ్యం వినా కించిన్న మే విభాతి ॥**

ఇతి శ్రీస్కాన్దోత్తరఖండే ఉమామహేశ్వరసంవాదే శ్రీ గురు గీతాయాం కామ్యజపస్థాన గురుశిష్యలక్షణ జ్ఞానప్రదాన ప్రశంసనో నామ తృతీయోఽధ్యాయస్సమాప్తః.

మహర్షి శ్రీసద్గురుమలయాళస్వామివర్యాణాం గురుపుత్రవర్గప్రవిష్టేన శివచరణ నామధేయేన విదుషా లిఖితపదచ్ఛేదటీకాతాత్పర్యసహితః తృతీయోఽధ్యాయః సమాప్తః.

ఓం తత్ సత్.



ఓమ్

# పరిశిష్టభాగము

అవ: శ్రీగురు శబ్దార్థ వివరణ.

**గుకారో సిద్ధసంజ్ఞస్స్యాత్ రేఫః పాపస్య దాహకః ।**
**ఉకారో విష్ణురవ్యక్తస్త్రితయాత్మ గురుర్భవేత్ ॥ 1**

'గురు' అను మంత్రములో (1) గు, (2) ర, (3) ఉ అను మూడక్షరము లుంటున్నవి. వానియొక్క యర్థమును దెలుపుచున్నారు. గుకారము సిద్ధులయొక్క పేరుగా నున్నది. రేఫ (రకార)ము పాపము దహింపజేయునది. ఉకారము అవ్యక్తమగు విష్ణువు. ఇట్లు మూడగు స్వరూపములతో గూడిన మహాత్ముడు గురుదేవు డగును. అనగా సిద్ధపురుషుడై భక్తులయొక్క సర్వపాపములను నశింపజేయుచు నిన్ద్రియములకును గోచరముగాని విష్ణుస్వరూపుడై (పరమాత్మ స్వరూపుడై) యుండు దేవుడే గురుదేవుడు. ఇదియే "గురు" అను మన్త్రముయొక్క అర్థము.

అవ: గురుమన్త్రార్థమునే వివరించుచున్నారు.

**గణేశో వాగ్నినా యుక్తో విష్ణునా చ సమన్వితః ।**
**వర్ణద్వయాత్మకో మన్త్రశ్చతుర్ముక్తిప్రదాయకః ॥ 2**

గణేశబీజమగు గకారము, అగ్నిబీజమగు రకారముతో గూడినదై, విష్ణువాచకమగు ఉకారముతోను జేరినదై "గురు" అను రెండక్షరముల మన్త్ర మగుచున్నది. ~~ఈ~~ మహామన్త్రము భక్తులయొక్క ఉపాసనాక్రమము ననుసరించి సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములను చతుర్విధ మోక్షముల నొసంగునదిగా నున్నది. లేక ధర్మార్థకామ మోక్షములను పురుషార్థ చతుష్టయమును గోరినవారి కిచ్చు చున్నది. (1) 'గ' ఇది విఘ్నేశ్వరబీజము,, (2) 'ర' ఇది అగ్ని బీజము, (3) 'ఉ' ఇది విష్ణుబీజము. కావున నీ మూడగు బీజాక్షరములును జేరి 'గురు' అను మన్త్ర మేర్పడుచున్నది. ఫలితార్థము గణేశ, అగ్ని, విష్ణువులను

ముఫ్ఫురియొక్క స్వరూపము శ్రీ గురుదేవుడని యెరుంగవలయును.

అవ: శ్రీ సద్గురుమూర్తి యనుగ్రహము గలుగు విషయమును తేట పరచు చున్నారు.

**యదా మమ శివస్యాపి బ్రాహ్మణో బ్రాహ్మణస్య హి।**
**అనుగ్రహో భవేన్నూణాం సేవ్యతే సద్గురు స్తదా॥** **3**

భక్తులపైన విష్ణువగు నాయొక్కయు, పరమశివునియొక్కయు, బ్రహ్మదేవునియొక్కయు, బ్రహ్మజ్ఞానియొక్కయు (మహర్షులయొక్కయు) అనుగ్రహ మెప్పుడు గలుగుచున్నదో, ఆ సమయమందే శ్రీ సద్గురుమూర్తి సేవింపబడుచున్నాడు.

అనగా శ్రీ సద్గురుసేవ పైన తెల్పిన వారియొక్క యనుగ్రహముచేతనే లభించుచున్నదని భావము. బ్రహ్మవిష్ణ్వాదుల దయ గలిగి నప్పుడే భక్తునిపై శ్రీ గురుదేవుని కరుణ గలిగి, భక్తుడు గురుకరుణకు పాత్రుడగుచున్నాడు. జన్మను తరించు చున్నాడు.

సారాంశము: శ్రీ గురుమూర్తి త్రిమూర్తిస్వరూపుడై బ్రహ్మ జ్ఞానులయొక్క రూపుడై యుంటున్నాడు. కాన వారందఱి యనుగ్రహము లేక శ్రీ గురుదేవుని యనుగ్రహము గలుగదు. శ్రీగురుదేవుని కరుణను సంపాదించెనో సకల దేవతానుగ్రహము, మహర్షుల యనుగ్రహము, సర్వేశ్వరుని అపారమగు దయ -ఇవన్నియును గలిగిన వనియే తెలియవలెను. శ్రీసద్గురునిసేవ, శ్రీసద్గురూపదేశము, శ్రీసద్గురు కృప- ఇవన్నియు లభించుట బహుజన్మ సుకృతలభ్యమనియు సామాన్యము గాదనియు తెలియవలెను. భవతరణము శ్రీగురువువల్లనే గదా లభించు చున్నది?

అవ: శ్రీగురు ప్రసన్న మహిమ

**హరౌ ప్రసన్నేఽపి చ వైష్ణవా జనాః**
**సంప్రార్థయన్తో గురుభక్తిమవ్యయామ్ ।**
**గురౌ ప్రసన్నే జగదీశ్వరస్సదా**
**జనార్దనస్తుష్యతి సర్వసిద్ధిదః ॥** **4**

భగవంతుడగు శ్రీమన్నారాయణమూర్తి ప్రసన్నుడైనను, విష్ణుభక్తు లక్షయమైన గురుభక్తినే కోరుచుందురు. గురువు ప్రసన్ను డాయెనేని జగదీశ్వరుడగు శ్రీవిష్ణుదేవుడు భక్తున కెల్లప్పుడును సర్వసిద్ధుల నొసగుచు పరమానందభరితు డగుచున్నాడు. ఇందువల్ల గురుభక్తియే సంపూర్ణ ఫలమును గలిగించు నదిగ నున్నదని ఫలించుచున్నది.

అవ: శ్రీగురువేసర్వస్వము :

**గురుస్సదా దర్శయితా ప్రవృత్తిం**
**తీర్థం వ్రతం యోగతపాదిధర్మాన్ ।**
**ఆచారవర్ణాదివివేక యజ్ఞాన్**
**జ్ఞానం చ భక్తిం చ వివేకయుక్తమ్ ॥** 5

గురుదేవుడు వేదాంతతత్త్వ మార్గమందలి ప్రవృత్తిని, తీర్థమును, వ్రతము లును, యోగతపోధ్యానాదులను, సత్యశాంత్యాది ధర్మములను, సదాచార ములను, వర్ణాశ్రమాది ధర్మములను, జ్ఞానయజ్ఞములను, భక్తి ఆత్మానాత్మ విచారణలతో గూడుకొన్న శ్రేష్ఠజ్ఞానమును, మోక్షమునకు కావలసిన సకల ధర్మముల నెప్పుడును భక్తులకు బోధించుచున్నాడు. ఇవన్నియు శ్రీసద్గురు దేవుని పరమధర్మములని తెలియవలెను. జనులయొక్క జననమరణవ్యాధికి మహౌషధ ములని యెఱుంగవలయును.

అవ: గురువువలన శాస్త్రజ్ఞానలాభము:

**గురోర్వినా న శ్రవణం భవేత్కస్యాపి కస్యచిత్ ।**
**వినా కర్ణేన శాస్త్రస్య శ్రవణం తత్కుతో భవేత్ ॥** 6

చెవిటివానికి శాస్త్రశ్రవణము జేయ నెటుల సాధ్యము? సాధ్యము గానియట్లు శ్రీగురుదేవుడు లేకుండిన వేదాంతశ్రవణ మెవనికైన నెట్లు సిద్ధించును? సర్వదా అసిద్ధ మగుచున్నది. అనగా శ్రీగురురహితుడు బధిరునితో సమానుడని యర్థము.

అవ: పరమగురువరుడే సేవింపదగి యున్నాడని తెలుపుచున్నారు.

**న తీర్థయాత్రా న చ దేవయాత్రా**
**న దేహయాత్రా న చ గేహయాత్రా ।**
**అహర్నిశం బ్రహ్మ హరిస్సుబుద్ధో**
**గురుః ప్రసేవ్యో న హి సేవ్యమన్యత్ ॥ 7**

పరమగురువరుడే సేవింపదగియున్నాడని తెలుపుచున్నారు. మిగుల శ్రద్ధతో తీర్థములను సేవించుచున్నారు, దేవతలను దర్శించుచున్నారు, దేహసంరక్షణోపాయములను జేయుచున్నారు, కుటుంబయాత్రనుగూడ చక్కగా గడుపుచున్నారు. కాని తీర్థయాత్రలు, దేవయాత్రలు, దేహయాత్ర కుటుమ్బ యాత్రలు జ్ఞానమును గలిగింపజాలవు. కావున నాత్మజ్ఞానసిద్ధికై పరమశాశ్వత సుఖమునకై త్రిమూర్తి స్వరూపియు, సర్వపాపముల హరించు జ్ఞానమూర్తి, పరబ్రహ్మమును నయిన శ్రీగురుదేవుడే (రాత్రింబవళ్ళు) సదా సేవింపదగినవాడు, స్మరింపను ధ్యానింపను తగినవాడు. శ్రీ గురుపరమాత్మను సేవింపవలయును, స్మరింపవలయును, ధ్యానింపవలయును. అనిత్యములగు తీర్థయాత్ర లన్నియును ముఖ్యములు గావు.

అవ: గురుభక్తియే శివసాక్షాత్కారము.

**యత్ర యత్ర దృఢా భక్తి : యదా కస్య మహాత్మనః ।**
**తత్ర తత్ర మహాదేవః ప్రకాశముపగచ్ఛతి ॥ 8**

ఒకానొక పరమపుణ్యాత్ముని కెప్పుడు, ఎక్కడెక్కడ శ్రీగురుభక్తి జనించునో, అప్పుడే, అక్కడక్కడే మహాదేవుడు మూర్తీభవించుచున్నాడు. అట్టి భక్తుని జ్ఞానమొసగి రక్షించుచున్నాడు. గురుభక్తి గలవాడు సాక్షాచ్ఛివస్వరూపుడే యగు చున్నాడు.

అవ: గురు-శాస్త్రముల తారతమ్యము:

**చక్షుర్గమ్యం గురుం త్యక్త్వా శాస్త్రగమ్యం తు యస్స్మరేత్ ।**
**హస్తస్థముదకం త్యక్త్వా ఘనస్థమభివాంఛతి ॥ 9**

దృష్టికి పరమదేవుడై జ్ఞానస్వరూపియై సాక్షాత్తుగా గనుపించెడు శ్రీగురుదేవుని

పరిత్యజించి (శ్రీ గురుమూర్తి నుపాసింపక) నేత్రముల కగోచరమగు శాస్త్రమును చదివి జ్ఞానమును సంపాదింప దలంచువాడు చేతిలోగల జలమును త్యజించి మేఘములోగల జలమును పానము జేయఁదలంచువానివలె నగుచున్నాడు. వీర్దిఱు నవివేకులే. జ్ఞానామృతమును పానముజేయలేక మొదటివాడును, జలపానములేక రెండవవాడును తాపదాహములతో శాంతి నొందకున్నారని తాత్పర్యము. ప్రత్యక్ష గురుదేవునే సేవించి జ్ఞానామృతమును ద్రావిశాంతి నొందవలయును.

అవ: గురు-ధనముల తారతమ్యము:

**సులభన్తు గురుం త్యక్త్వా దుర్లభం య ఉపాసతే ।**
**లబ్ధం త్యక్త్వా ధనం మూఢో గుప్తమన్వేషతే క్షితౌ ॥ 10**

కన్నులకు గానబడు సాక్షాన్మహాదేవు డయిన శ్రీగురుమూర్తిని వదలి వారిమహిమను శ్రీగురుతత్త్వమును దెలిసికొనక, దుర్లభు డయిన దూరమున నున్న దేవతోపాసకు డయిన వానినిగాని, కేవల శాస్త్రజ్ఞానము గలవానినిగాని పొంది, దేవతోపానను గాని, శాస్త్రమునందలి నిగూఢజ్ఞానమును గాని పొందదలంచినవా డెట్టివాడనగా దగ్గఱనుండు తన ప్రత్యక్షమగు ధననిధిని తిరస్కరించి దానిని తెలియక, దూరములో భూమిలో నిక్షేప మున్నదని తలంచి త్రవ్వువానివలె మూఢు డుగ నున్నాడు. వీడెట్లు ధననిక్షేపము లభింపక సర్వదా దరిద్రుడై యుండునో, అట్లే దుర్లభగురువునకై వెదుకువాడు జ్ఞాననిధిని పొందక జ్ఞానదరిద్రుడై యున్నాడు. ఫలితార్థ మేమనగా, వివేకజ్ఞానము గలిగి సమ్యగ్దర్శన సమ్పన్నుడగు శ్రీగురుమూర్తినే సేవించి ధన్యాత్ముడు గావలయును.



ఓమ్

# మహానారాయణోపనిషత్

అవ: అంతఃకరణ శుద్ధికారణము:

**సకలవేదశాస్త్రసిద్ధాన్త రహస్యజన్మజన్మాభ్యస్తాత్యన్తో-**
**త్కృష్టసుకృతపరిపాకవశాత్సద్భిస్సంగో జాయతే ।**
**తస్మాద్విధినిషేధవివేకో భవతి।**

**సదాచారాదఖిలదురితక్షయో భవతి ।**
**తస్మాదన్తఃకరణమతివిమలం భవతి ॥** 1

అనేకములయిన వేదాదిశాస్త్రములయొక్క సిద్ధాన్తతత్త్వములను జన్మ జన్మమున నభ్యసించుటచేతను, మిక్కిలి ఉత్కృష్టములగు పుణ్యములయొక్క పరిపాక వశమువలనను సత్పురుషులతో సహవాసము గలుగునున్నది. అట్టి సత్సహవాసముచేత విధినిషేధములయొక్క జ్ఞానము గలుగుచున్నది. (ఈ కర్మ ఆచరించవలయును, ఈ కర్మ ఆచరింపగూడదను విషయము స్పష్టమగు చున్నది). అందువలన సదాచారములందు ప్రవృత్తి గలుగుచున్నది. సదాచారానుష్ఠానముల వలన సకల దురితములు నశించుచున్నవి. పాపక్షయముచే నన్తఃకరణము పరిశుద్ధ మగుచున్నది.

అవ: శ్రీగురు కటాక్షవిశిష్టత:

**తతస్సద్గురుకటాక్షమన్తఃకరణమాకాంక్షతి।**
**తస్మాత్సద్గురు కటాక్షలేశవిశేషేణ సర్వసిద్ధయస్సిద్ధ్యన్తి ।**
**సర్వబన్ధా ప్రవినశ్యన్తి । శ్రేయోవిఘ్నాస్సర్వే ప్రళయం యాన్తి**
**సర్వాణి శ్రేయాంసి స్వయమేవాయాన్తి ॥** 2

చిత్తము నిర్మల మగుటచేత నది శ్రీ సద్గురుదేవునియొక్క కటాక్ష పాతమును (అనుగ్రహమును) గోరుచున్నది. అట్లు కోరుటవలన శ్రీ సద్గురుదేవుని

యొక్క కటాక్షలేశ విశేషముచేత సకల సిద్ధులు సిద్ధించుచున్నవి. సకల ప్రతి బంధములు పూర్తిగా నశించుచున్నవి. మోక్షమునకున్న సర్వవిఘ్నములు నిశ్శేషముగ హరించుచున్నవి. సకల శ్రేయస్సులును స్వయముగ వచ్చిచేరుచున్నవి.

అవ: గురుకృపచే సద్యోజ్ఞానోపలబ్ధి

**యథా జాత్యన్ధస్య రూపజ్ఞానం న విద్యతే తథా గురూ**
**పదేశేన వినా కల్పకోటిభిస్తత్త్వజ్ఞానం న విద్యతే ।**
**తస్మాత్సద్గురుకటాక్షవిశేషేణ అచిరాదేవ తత్త్వజ్ఞానం భవతి ॥ 3**

ఏప్రకారము పుట్టు గ్రుడ్డిగా నున్న వానికి రూపజ్ఞానము గలుగదో, ఆ ప్రకారము శ్రీగురూపదేశము లేకపోయిన కోటి యుగములు గతించినను తత్త్వజ్ఞానము గలుగదు. అందువలన శ్రీ సద్గురుకటాక్షలేశ విశేషముచేత శీఘ్రకాలములోనే తత్త్వజ్ఞానము గలుగుచున్నది.

శ్రీసద్గురూపదేశము లేకపోయినచో నెన్ని ప్రయత్నములను జేసినను నంధునివలె జ్ఞాననేత్రము లేనివాడగుచు పరమాత్మ స్వరూపమును తెలియజాలడు. శ్రీసద్గురూపదేశముచే నేత్రములు గలవాడువలె పరబ్రహ్మతత్త్వమును నెఱింగి కృతార్థు డగుచున్నాడు.



ఓమ్

# బ్రహ్మవిద్యోపనిషత్

అవ: గురుసేవ నిర్వికల్పముగా చేయవలెను:

**తస్య దాస్యం సదా కుర్యాత్ప్రజ్ఞయా పరయా సహ ।**
**శుభం వాఽశుభమన్యద్వా యదుక్తం గురుణా భువి ॥ 1**

మిగుల ప్రజ్ఞతో గూడుకొని శ్రీగురువరుని సర్వదా సేవించవలయును. శ్రీగురువులవా రాజ్ఞాపించినది తన మతికి నశుభముగ దోచినను, దాని నంతయు తాను విచారింపకయే చేయుచుండవలయును.

అవ: గురుసేవచే హంసవిద్యాలాభము:

**తత్కుర్యానవిచారేణ శిష్యస్సన్తోషసంయుతః ।**
**హంసవిద్యామిమాం లబ్ధ్వా గురుశుశ్రూషయా నరః ॥ 2**

శ్రీగురుదేవునికి ననేకవిధములుగ పరిచర్యనుజేసి హంసవిద్య యనబడు పరమాత్మతత్త్వమును తెలుపు బ్రహ్మవిద్యను పొందిన శిష్యుడు శ్రీగురుదేవుని యొక్క ఆజ్ఞను సంతోషభరితుడై చేయుచుండవలయును.

అవ: హంసస్వరూప జ్ఞానముచే దేహద్యభిమానాది త్యాగము

**ఆత్మానమాత్మనా సాక్షాద్బ్రహ్మమబుద్ధ్వా సునిశ్చలమ్ ।**
**దేహజాత్యాదిసమ్బన్ధాన్ వర్ణాశ్రమసమన్వితాన్ ।**
**వేదశాస్త్రాణి చాన్యాని పాదపాంసుమివ త్యజేత్ ॥ 3**

శ్రీగురూపదేశముచే హంసస్వరూపమును దెలిసి తనను పరమాత్మనుగా సందేహము లేకుండ దెలిసికొని ఆత్మజ్ఞానసమ్పన్నుడై, వర్ణాశ్రమధర్మములు, దేహజాత్యాది అభిమానములు, ఆత్మబాహ్య విషయములను ప్రతిపాదించు వేదశాస్త్రములు- వీనన్నిటిని బ్రహ్మజ్ఞానమునకు ప్రతిబంధము లగుటచే పాదపరాగమునువలె వదలవలయును.

అవ: గురుభక్తి కలిగియుండవలసిన కారణము:

**గురుభక్తిం సదా కుర్యాచ్ఛ్రేయసే భూయసే నరః ।**
**గురురేవ హరిస్సాక్షాన్నాన్య ఇత్యబ్రవీచ్ఛ్రుతిః ॥** 4

మోక్షమును బడయుటకై శ్రీగురుదేవుని పరమాత్మనుగా భావించి సర్వదా సేవించుచుండవలయును. శ్రీ గురుదేవుడే సాక్షాత్ విష్ణుదేవుడు. ఈ ప్రకారము వేదమాత యుపదేశించుచున్నది.

---

## గ్రంథసమాప్తి శ్లోకాః

**యద్యద్భవేత్తచ్చ గురోః కృపైవ గురుర్మహేశస్సకలం హి విశ్వమ్ ।**
**న మే ప్రయత్నోఽత్ర న మే చ వాణీ హృది స్థితే భాసతి దేశికేన్ద్రే ॥**

**ప్రయత్నలేశభారో మే నైవ భాతి విచారతః ।**
**గురోః కృపా కాఽపి సిద్ధా సర్వకార్యవిధాయినీ ॥**

**గురురేవం పరం బ్రహ్మ గురురేవ దయానిధిః ।**
**తత్కృపాలేశమాత్రేణ సర్వం సిద్ధ్యతి నాన్యథా ॥**

**మలయాళస్వామిమూర్తేః ప్రజ్ఞానందఘనం శివమ్ ।**
**మద్గురోశ్చరణద్వన్ద్వం నమామ్యమృతసిద్ధయే ॥**

రచయితా
సాహిత్యశిరోమణి (సుధాకర) శివచరణః.



ఓమ్ శ్రీసద్గురుభ్యో నమః

# శ్రీసద్గురు పాదుకాస్తవమ్

నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్ ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి ॥ 1

శ్రీసమంచితమవ్యయం పరమప్రకాశమగోచరం
భేదవర్జితమప్రమేయమనంతమాద్యమకల్మషమ్ ।
నిర్మలం నిగమాంతమద్వయమప్రతర్క్యమబోధకం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 2

నాదబిందుకళాత్మకం దశనాదవినోదభేదకం
మంత్రరాజవిరాజితం నిజమండలాన్తర్భాసితమ్ ।
పంచవర్ణమఖండమద్భుతమాదికారణమచ్యుతం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 3

వ్యోమవద్బహిరంతరస్థితమక్షరం నిఖిలాత్మకం
కేవలం పరిశుద్ధమేకమజన్మ హి ప్రతిరూపకమ్ ।
బ్రహ్మతత్త్వవినిశ్చయం నిరతానుమోక్షసుబోధకం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 4

బుద్ధిరూపమబుద్ధికం త్రితయైకకూటనివాసినం
నిశ్చలం నిఖిలప్రకాశకనిర్మలం నిజమూలకమ్ ।
పశ్చిమాంతరఖేలనం నిజశుద్ధసంయమిగోచరం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 5

హృద్గతం విమలం మనోజ్ఞవిభాసితం పరమాణుకం
నీలమధ్యసునీలసన్నిభమాదిబిందునిజాంశుకమ్ ।
సూక్ష్మకర్ణికమధ్యమస్థితివిద్యుదాదివిభాసితం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 6

పంచపంచహృషీకదేహమనశ్చతుష్కపరస్పరం
పంచభౌతికకామషట్కసమీరశబ్దముఖేతరమ్ ।
పంచకోశగుణత్రయాదిసమస్తధర్మవిలక్షణం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 7

పంచముద్రసులక్ష్యదర్శనభావమాత్రనిరూపణం
విద్యుదాదిధగద్ధగిత్వరుచిర్వినోదవివర్ధనమ్ ।
చిన్మఖాంతరవర్తినం విలసద్విలాసమమాయకం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 8

పంచవర్ణరుచిర్విచిత్రవిశుద్ధతత్త్వవిచారణం
చంద్రసూర్యచిదగ్నిమండలమండితం ఘనచిన్మయమ్ ।
చిత్కళాపరిపూర్ణమంతరచిత్సమాధినిరీక్షణం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 9

హంసచారమఖండనాదమనేకవర్ణమరూపకం
శబ్దజాలమయం చరాచరజంతుదేహనివాసినమ్ ।
చక్రరాజమనాహతోద్భవమేకవర్ణమతఃపరం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 10

జన్మకర్మవిలీనకారణహేతుభూతమభూతకం
జన్మకర్మనివారకం రుచిపూరకం భవతారకమ్ ।
నామరూపవివర్జితం నిజనాయకం శుభదాయకం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 11

తప్తకాంచనదీప్యమానమహాణుమాత్రమరూపకం
చంద్రికాంతరతారకైరవముజ్జ్వలం పరమాస్పదమ్ ।
నీలనీరదమధ్యమస్థితవిద్యుదాదివిభాసితం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 12

స్థూలసూక్ష్మసకారణాంతరఖేలనం పరిపాలనం
విశ్వతైజసప్రాజ్ఞచేతసమంతరాత్మనిజాంశుకమ్ ।
సర్వకారణమీశ్వరం నిటలాంతరాళవిహారకం
ప్రాతరేవ హి మానసాంతర్భావయేద్గురుపాదుకామ్ ॥ 13

ఇతి శ్రీమచ్ఛంకరాచార్యవిరచితం శ్రీసద్గురు పాదుకాస్తవం సంపూర్ణమ్.

ఓం తత్ సత్ .



# గురువు అనగా బ్రహ్మవేత్త లక్షణములు

## పాట

1. అతడేరా గురుడు మనకందరి కతడేరా గురుడు - సతతాము
తన హంసగతిపై మానసముంచి; వెతలేమి లేక ఈవిశ్వమె
శివుడను ॥అతడేరా॥

2. కానున్నదంత దైవమువల్ల కాగలదంత నేను కర్తను గాను
నిజమానె - నిలుకడ బోనీక అహమానె బుద్ధిలేక తిరుగు ॥అతడేరా॥

3. కోరిక లేక ప్రకృతికి లోనై జారుడు గాక క్రూరబుద్ధియు
లేక - గురుముఖమున జగత్కారణము దెలిసియు కాయము రోసిన
॥అతడేరా॥

4. వెనుకాయు ముందు ఈదేహము కనుపడదెందు పనిబూని
ఈగుట్లు మనసున నిల్పి ఈతనువుగ నాది గాదని మోదమొందెడి
॥అతడేరా॥

5. పెక్కుదేహముల వెలిగెడి కళయొక్కటె మిగుల నిక్కమింతె
నని - నిశ్చయమున నుండి పెక్కుగలదనె చింత పెకలించి వేసిన
॥అతడేరా॥

6. కాసులాశకును లోబడి పెద్దమోస మొందకను - దోసాల
పొట్టకై దొడ్డవ్యవహారము లాసించకను దొరికినంతకె హర్షించు
॥అతడేరా॥

7. ధ్యానమె ముక్తి దాని మరచి పోనిదె భక్తి - ఏనాటికిని
శివధ్యానము జేయని మానవులకు ముక్తి లేనె లేదని పలుకు
॥అతడేరా॥

8. బొంకుల వీడి ఏవిధమైన శంకల నణచి మంకుబుద్ధుల
ద్రుంచి - మమతాతో నను గావు శంకర యనుచును సర్వకాలము గడుపు
॥అతడేరా॥

